# సంధిపరిచ్ఛేదము.

౧. పూర్వపర స్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధి.

౨. అత్తున కచ్చు పరమైనపుడు సంధి బహుళము.

౩. నామంబులతుది అకారమునకుఁ బరముగ శ్రేష్ఠార్థకంబులగు అన్నాదులును, ఆకును, బరమైనచో సంధి నిత్యము.

౪. స్త్రీవాచక, తత్సమ సంబోధ, నావధారణంబుల సంధి లేదు.

౫. ఇకారాంత నామవాచకంబులకు శ్రేష్ఠార్థంబులైన అన్నాదులు పరము లైనపుడు సంధి ప్రాయికంబు.

౬. తత్సమంబులకుఁ గొండొకచో సంధి చూపట్టెడి.

౭. మధ్యమపురుషమున ఇకారమునకు సంధి నిత్యము.

౮. ఏమాద్యుల ఇత్తునకు సంధి వైకల్పికము.

౯. క్త్వార్థకంబైన ఇత్తునకు సంధి లేదు.

౧౦. ఉత్తునకు సంధి నిత్యము.

౧౧. ప్రథమేతరవిభక్తి. శత్రర్థక చువర్ణంబులఁ గల ఉత్తునకు సంధి వైకల్పికము.

౧౨. రూపాంతరమందు ద్విత్వము గలిగినశబ్దముల 'ఉ' కారమున కచ్చు పరమైనపుడు సంధి లేదు.

౧౩. వాక్యవిరామంబున సంధి లేమి దోషంబు గాదు.

౧౪. అంద్వంతావగాగమంబులందప్పు నపదాది స్వరంబున కచ్చు పరఁ బగునపు డన్నియచ్చులకు సంధి నిత్యము.

౧౫. ఏని పరమైనపుడు సర్వప్రాణులకు సంధినిత్యము.

౧౬. దీర్ఘాచ్చునకు సంధి లేదు.

౧౭. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు.

౧౮. హల్లు పరమైనపుడు ఏని లోని ఇకారమునకు లోపము వైకల్పికము

౧౯. 'ను' వర్ణము కడపటఁ గలధాతువులకు శత్రర్థక 'చు' వర్ణము ప

మైనవు గా 'ను' వర్ణము లోని 'ఉ' కారమునకు వైక ముగ లోపము.

౨౦. అది అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబు

౨౧. అచ్చికంబులం బదమధ్య ను లు డు రు ల యుత్వంబు లోపంబు బహుళము.

౨౨. ఇట్టిలోపం బొకానొకచో నితరస్వరంబులకుం బ్రయోగంబు జూపట్టు.

౨౩. ఏ యక్షరంబు మీఁది యే స్వరంబునకైన లోపం బెందేని కవిప్రయోగంబులం గాన నయ్యెడు,

౨౪. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు.

౨౫. పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన ను లు రు ల త్వంబునకు లోపంబు బహుళంబుగ నగు, ఉ. ప్రాణపద మ్రాన్పడు.

౨౬. ప్రథమలమీఁది పరుషములకు గ స డ ద వ - లు బహుళంబుగ

౨౭. తెలుఁగులమీఁది తత్సమశబ్దంబుల, క చ ట త ప - లకు గ స ద వ - లు రావు.

౨౮. భిన్నపదప్రథమల మీఁది పకారమునకు 'వ' కారాదేశం ప్రాసంబున నిత్యంబు. యతిస్థానంబున నిషేధంబు. తక్కి యెడ వైకల్పికంబు.

౨౯. ద్రుతప్రకృతికమున కచ్చు పరంబగునపుడు లుక్సంశ్లేషంబులు లే

౩౦. ఇఁకాదుల కచ్చు పరంబగు నపుడు సంధి వైకల్పికము.

౩౧. ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగు.

౩౨. ఆదేశసరళంబులకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేష బులు విభాష నగు.

౩౩. వర్గయుక్సరళంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకు లోప స్వత్వ, పూర్ణబిందు, సంశ్లేషంబులు విభాష నగు.

౩౪. అనునాసి, కాంత, స్థోష్మంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకుఁ బూర్ణబిందువు దక్కఁ దక్కినవి యగు.

౩౫. అవసానంబున ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళము.

౩౬. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి.

౩౭. ఏను - నేను - తాను - పదంబుల ద్రుతంబునకుఁ బూర్ణబిందు సంశ్లేషంబులు లేవు.

౩౮. పరుషేతరంబులు పరంబు లగునపు డాద్రుతమునకు లోపస్వత్వంబులు మాత్రము గలవు.

౩౯. కుఱు - చిఱు - కడు - నడు - నిడు శబ్దంబుల ఱ - డ - ల కచ్చు పరమైనపుడు ద్విరుక్త టకారంబగు.

౪౦. ద్వంద్వసమాసంబునఁ బదంబుకంటెఁ బరంబయిన పరుషములకు గసడదవలు ప్రాయికంబుగ నగు.

౪౧. సమాసంబున ద్రుతంబునకు లోపంబగు.

౪౨. ద్విత్వయుక్తములయిన ను, లు, ఱ మొదలగు వర్ణములు కడపటఁ గలశబ్దములు పరమైన హలాది శబ్దములతోఁ గూడి సమాసమైనపుడు ద్విత్వము వైకల్పికముగ లోపించును.

౪౩. ఇట్టి ద్విత్వయుక్తములయిన శబ్దములకు ద్విత్వరహితంబుగ రూపాంతరము లుండెనేని యసమాసమున ద్విత్వరహితంబుగఁ బ్రయోగంబులు కలవు.

౪౪. కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁ బు - ంపు - లగు.

౪౫. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకును, పు - ంపు లకును బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు.

౪౬. సమాసంబులయందు ద్రుతంబునకు స్వత్వము లేదు.

౪౭. తలఁబ్రాలు లోనగు నలుక్సమాసంబుల ద్రుతంబునకు లోపము లేదు.

౪౮. ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణంబుల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు.

౪౯. షష్ఠీసమాసంబులం దుకార, ఋకారముల కచ్చు పరమైనపుడు నుగాగమం బగు.

౫౦. ఉదంత స్త్రీ సమంబులకును, ఋ - ంపులకును, అదంత గుణవాచకంబులకును దనంబు పరంబగు నపుడు నుగాగమం బగు.

౫౧. పట్టిప్రత్యయము పరమైనపుడు సర్వత్ర నుగాగమం బగు. ఉ. జ్ఞానముంబట్టి మోక్షము.

౫౨. సమాసమునఁ బ్రాఁతాదులఁ దొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబు.

౫౩. లుప్తశేషంబునకుఁ బరుషంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

౫౪. క్రొత్త, కెంపు, క్రిందు, శబ్దముల కాద్యక్షర శేషంబులకుం గొన్నియెడల నుగాగమంబును, గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబును బహుళంబుగ నగు.

౫౫. అచ్చులు పరంబులగుచో విశేషణంబు లయిన పెన్నాదుల కడ హల్లునకు ద్విత్వం బగు.

౫౬. సమాసంబుల లోపనుగాగమ, లోపద్విత్వంబు లన్యశబ్దంబుల మీఁదను గానఁబడెడి.

౫౭. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరమైనపుడు టుగాగమంబు బహుళంబుగ నగు.

౫౮. కర్మధారయంబున నదంతశబ్దముల కాలుశబ్దంబు పరంబగునపుడు నిత్యముగ, మదంతములమీఁద బహుళంబుగ రుగాగమం బగు.

౫౯. కర్మధారయమందుఁ దత్సమంబులఁ గాలుశబ్దము పరమగునపుడత్వమున కుత్వంబును, రుగాగమంబును నగు.

౬౦. హల్లు పరంబగుచో నను, కొను, చను లోనగు క్రియాజన్య విశేషణముల కడపటి యుత్తునకు లోపంబు వైకల్పికము.

౬౧. కర్మధారయంబునఁ బరంబైన పరుషములకు గసడదవలు వైకల్పికముగ నగు.

౧౨. షష్ఠీసమాసమందలి 'ని - ల' - ల మీఁది యచ్చులకు సెందేని లోపంబు వైకల్పికంబు.

౧౩. చేత, తోడ, వలన, ల కిత్వంబు సమాసంబులం దగు.

౧౪. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.

౧౫. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులఁ దొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతమగు ద్విరుక్త టకారంబగు.

౧౬. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు.

౧౭. అందందుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు.

౧౮. ఆమ్రేడితంబు పరంబగునపుడుకృత హ్రస్వంబునకు దీర్ఘంబును నగు.

౧౯. పద్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోప, పూర్ణ బిందువులు విభాష నగు.

౨౦. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగు నపుడు లోపము విభాష నగు.

౨౧. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

౨౨. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ము, ఁడు లకు లోపంబు విభాష నగు.

౨౩. ధ్వన్యనుకరణంబులు ద్వి, త్రి, చతురుక్తంబులు నగు.

౨౪. ధ్వన్యనుకరణంబులకు ననుధాతు వనుప్రయుక్తం బైనపుడు కొన్ని యెడల ముగాగమం బగు.

౨౫. అనుధాతు వనుప్రయుక్త మైనపుడు ధ్వన్యనుకరణంబులఁ దుది హల్లునకు ద్విత్వం బగు.

౨౬. ముగాగమం బగుచో ద్విత్వంబు విభాష నగు.

౨౭. సంస్కృత సు, ట్టి, జ్వా, తుమున్నంతము లిం దప్రయోక్త వ్యంబులు.

౨౮. భవచ్ఛత్రాదులు నిట్టివ.

౨౯. సదాద్యవ్యయంబులు గ్రాహ్యంబులు.

౩౦. యథాయథలు పృథాపృథలు.

౮౧. నిషిద్ధంబు లనుకరణపరకంబులై ప్రయోగార్హంబు లగు.

౮౨. అనుధాతువు పరంబగువో విసర్గమునకు లోపం బగు.

౮౩. అనుకరణంబున నమశ్శబ్దము కడపటి యత్తున కోత్వము విభాష నగు.

౮౪. ఊదంతనామంబునకు ననుకరణమందు వుగాగమం బగు.

౮౫. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.

౮౬. అనుకరణంబునం దహోమాదులు మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.

౮౭. అనుకరణంబున దీర్ఘంబు హ్రస్వంబు గాదు.

౮౮. ఆశ్చర్యసంతాపాద్యర్థంబుల ననుకరణంబులు రామి దోషంబుగాదు

౮౯. ద్విత్వయుక్తంబు మఱియొక హల్లుతో సంయుక్త మగునపుడు ద్విత్వమునకు లోపంబు.

౯౦. అపవాదంబులు విధులు కావు. ప్రమాణంబులు ప్రమాణంబులు గావు.

## సంస్కృత శబ్దసంధి ప్రకరణము.

౧. అ ఇ ఉ ణ్, ఋ ఌ క్, ఏ ఓ ఙ్, ఐ ఔ చ్, హ య వ ర ట్, లణ్, ఞ మ ఙ ణ న మ్, ఝ భ ఞ్, ఘ ఢ ధ ష్, జ బ గ డ ద శ్, ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్, క ప య్, శ ష స ర్, హ ల్.

౨. గుణములు ఏ-ఓ-అర్-అల్.

౩. వృద్ధులు ఐ-ఔ-ఆర్.

౪. అక్కులకు సవర్ణములైన అక్కులు పరంబు లగునపుడు పూర్వపరస్థానంబుల దీర్ఘం బేకాదేశం బగు.

౫. ఋక్కులకు హ్రస్వఋక్కులు పరమైనపుడు పూర్వపరస్థానంబుల హ్రస్వఋక్కులు వైకల్పికముగ నగు.

౬. అవర్ణమునకు ఇక్కులు పరమైనపుడు గుణం బగు.

౭. అవర్ణకమునకు ఏచ్చులు పరమైనచో వృద్ధియగు.

౮. ఓమ్ పరమగుచుండ అత్తునకు లోపం బగు.

౯. అత్తునకు నోత్వోష్ఠములు పరమగునపుడు వృద్ధి వైకల్పికము.

౧౦. సవర్ణము గాని యచ్చు పరమగుచుండ నిక్కులకు యణాదేశం బగు.

౧౧. అచ్చునకుం బరంబైన హకారేతర హల్లున కచ్చు పరంబుకానిచో ద్విత్వంబు వైకల్పికంబు.

౧౨. అచ్చుపరమైనచో ఏచ్చుల కయవాయావు లగు,

౧౩. శకంధ్వాదులంబరరూప మగు.

౧౪. పదాంతమైనగోశబ్దముయొక్క ఓకారమునకుఁ

i. బరమైన అవర్ణమునకు లోపము వైకల్పికము.

ii. అచ్చుపరమైనచో ఓకారమునకు అవఙాదేశము వైకల్పికము.

iii. ఇంద్ర - అక్షశబ్దములు పరమైనప్పుడు అవఙాదేశము.

౧౫. పదాంతములైన అక్కులకు హ్రస్వమగు ఋకారము పరంబగు నప్పుడు ప్రకృతిభావము వైకల్పికము. అసమాసంబున దీర్ఘంబు హ్రస్వం బగు.

౧౬. సకార తవర్గములు - శవర్గ చవర్ణములు పరస్పరము కదియునప్పుడు శ స - లకు శవర్ణమును, త చ వర్గములకుఁ జవర్గవర్ణములు నాదేశంబు లగు.

౧౭. సకార తవర్గాక్షరములు షకార టవర్గాక్షరములు పరస్పరము కదియునప్పుడు షకార టవర్గాక్షరంబు లాదేశంబు లగు.

౧౮. పదాంతములైన ఝల్లులకు జశ్శులాదేశమగును.

౧౯. అనునాసికములు పరములగుచోఁ బదాంతంబులైన యర్ప్రత్యాహార వర్ణంబుల కావర్గమందలి యనునాసికములు వికల్పముగ నాదేశమగును. అను నాసికములు కానిచో జశ్శు లగు.

౨౦. లకారము పరముగాఁగల తవర్గాక్షరములకు లకారాదేశంబగు.

౨౧. వర్గము తొలి నాలుగక్షరములకుఁ బరమైనహకారమునకు నావర్గ చతుర్థాక్షరము వైకల్పికముగ నగు.

౨౨. పూర్వమందు ఝయ్యులును బరమందు 'అమ్మ' లును గల శవర్ణము నకు ఛకారము వికల్పంబుగ నగు.

౨౩. కృధాతువువలనఁ గలిగిన శబ్దముపరమైనపుడు 'సమ్' లోని మవర్ణ మనుస్వారముగను (ం), విసర్గము (స్) గను మాఱును. అనుస్వారము వైకల్పికముగ ననునాసిక మగు.

౨౪. అచ్చులు - అంతస్థములు పరముగాఁగల వర్గప్రథమ ద్వితీయవర్ణములు పరములైనపుడు పుమ్ లోని మవర్ణమునకుఁ బైయట్లయగు.

౨౫. ఛవర్ణముపరమైనపుడు పూర్వస్వరమునకును ఛవర్ణమునకును నడుమ చ్ వర్ణమాగమం బగు.

౨౬. విసర్గములకు క ఖ లు-ప ఫలు పరములైనఁ గ్రమంబుగ జిహ్వామూలీయంబులు, ఉపధ్మానీయంబులునగు, ఒండె విసర్గములు నగు.

౨౭. సకారమునకు బదులుగ వచ్చిన (రకారమునకు బదులువచ్చినది కాదు) విసర్గమునకుఁ బూర్వము అప్లుతమై హ్రస్వమైన అకారముండి, పరంబుగ హ్రస్వమైన అకారము గాని వర్గముయొక్క ౩-౪-౫ అక్షరములుగాని య ర ల వ హ-లు గాని యుండినచో విసర్గము 'ఉ' కార మగు.

౨౮. హ్రస్వమైన అకారము పూర్వముగాఁగల విసర్గమునకు హ్రస్వమైన అకారమునకంటె నితరములైన అచ్చులు పరమైనపుడు లోపము వైకల్పికము. లోపముకానిచో యాగమం బగు.

౨౯. అ ఆలు తప్పఁ దక్కినయచ్చులు పూర్వమందుఁగల విసర్గమునకుఁ బరంబుగ అచ్చుగాని ప్రతివర్గముయొక్క కడపటి మూఁడక్షరములుగాని య ర ల వ హ-లు గాని పరమైనచో విసర్గము 'ర్' కారంబగు.

౩౦. ర ఢ-లు పరముగాఁగల ర్ ఢ్-లు లోపించు. వాని పూర్వమందు హ్రస్వములైన అ ఇ ఉ-లకు దీర్ఘము నగు.

Vidya Venkata Ramraju.
AYURVEDA PRACTIONER

శ్రీరామాయ నమః.

# సులభ వ్యాకరణము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

కం. శ్రీవిధి సోమరిమ్మై వి
ద్యావితతి న్మఱవ నసుర - హారియింపఁ బున
శ్శ్రీ విభవుఁ జేయుశ్రీపతి
వేవిధములఁ బ్రోచు నాంధ్ర - విద్యార్థితతిన్.

అపశబ్ద సుశబ్ద లక్షణమును దెలుపు శాస్త్రమునకు వ్యాకరణశాస్త్ర మని పేరు. దీనికే శబ్దశాస్త్రమని మఱియొక పేరు. శాస్త్రమనఁగా నేర్పునది శాసించునది. మనము చేయుపనులయందు ధర్మ మిట్టి దనియు, నధర్మ మిట్టి దనియు, నెట్లు ధర్మశాస్త్రము తెలియఁజేయునో, యట్టులే మన ముచ్చరించు మాటలయందును, వ్రాయు వ్రాఁతలయందును, నిటువంటి స్వరూపముగల మాట సరి (సుశబ్దము) యనియు, నిటువంటి స్వరూపముగల మాట (అపశబ్దము) సరిగాదనియు వ్యాకరణశాస్త్రము తెలియఁజేయును.

## ఆంధ్రభాషయందుఁగల మాటల తప్పొప్పులను దెలుపునది యాంధ్రవ్యాకరణము.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము, సంధిపరిచ్ఛేదము, తత్సమపరిచ్ఛేదము, ఆచ్ఛిక పరిచ్ఛేదము, కారకపరిచ్ఛేదము, సమాసపరిచ్ఛేదము, తద్ధితపరిచ్ఛేదము, క్రియాపరిచ్ఛేదము. కృదంతపరిచ్ఛేదము, ప్రకీర్ణకపరిచ్ఛేదము, వాక్యపరిచ్ఛేదము, వ్యాసపరిచ్ఛేదము అని ౧౨ భాగంబులు.

సంజ్ఞ యనఁగా గుఱుతు. పరిచ్ఛేదమనఁగా భాగము. ౯-వ సూత్రంబున 'అ' మొదలు 'ః' విసర్గమువఱకుఁ గల ౧౬ అక్షరములకు 'అచ్చు' లని పేరు. 'క' కారము మొదలు 'ళ' కారమువఱకుఁ గల ౩౮ అక్షరములకు హల్లు లని పేరు. ముందు చెప్పఁబోవు సూత్రంబులలో 'అచ్చు' లని చెప్పుచోట్లనన్నిట ౧౬ అక్షరములను, 'హల్లు' లని చెప్పుచోట్లనన్నిట ౩౮ అక్షరములను మాటిమాటికి వ్రాయవలయునన్నచోఁ గష్టముకదా. కావున సౌలభ్యమునిమిత్తమై యిట్టి సంజ్ఞ లేర్పఱుపఁబడినవి. అట్టి సంజ్ఞలనుగుఱించి తెలియఁజేయు భాగమునకు 'సంజ్ఞాపరిచ్ఛేద' మని పేరు. (2) సంధి యనఁగాఁ గూడిక. వేఱువేఱుగ నున్న కొన్ని యుంగరము లొకదానితో నొకటి చేరి గొలుసైనట్లు లొకమాట మఱియొకమాటతోఁ గలిసికొనిపోవుట సంధి. ఎట్లనఁగా 'అతఁడు అక్కడికి అరిగి అతని అడిగి అర అణా తెచ్చినాఁడు' అనుదానిని "అతఁ డక్కడి కరిగి యతని నడిగి యరణా తెచ్చినాఁడు" అని కలిపి వ్రాయుటయే సంధి కూర్చి వ్రాయుట. ఈ రెంటిలో నేది వర్ణోత్పత్తిస్థాన మెఱిఁగి చదువుటకు సులువో-వినుట కింపో-సంగ్రహముగ నున్నదో చూడుఁడు. ఇట్టి సంధులను గుఱించి తెలియఁజేయుభాగము సంధిపరిచ్ఛేదము. తక్కినవి యాయాపరిచ్ఛేదముల మొదటఁ దెలుపఁబడును.

ధర్మశాస్త్రము చదివినఁ బుణ్య మిట్టిది, పాప మిట్టిది, యని తెలిసికొని పాపము చేయక పుణ్యమును జేసి యీలోకమందును బరలోకమందును గీర్తిసౌఖ్యము సంపాదింపవచ్చును. ఈ వ్యాకరణశాస్త్రము చదువుటవలన నేమిఫలమని చాలు రడుగవచ్చును. కావ్యార్థగ్రహణము, సత్కావ్యరచనము, ఫలములు.

## ౧. కావ్యము విశ్వశ్రేయస్కరము.

అనఁగాఁ గావ్యము ప్రపంచమునకు శ్రేయస్కరము. కావ్యముచేత ధర్మార్థకామమోక్షము లనుపురుషార్థములను లోకులు సంపాదింపవచ్చును. కావ్యముచేతఁ గీర్తి, ధనము గలుగును. వ్యవహారములు తెలియును. అశుభములు

బోలఁగును. మనస్సున కాహ్లాదమును గలుగును. నన్నయభట్టాదు లనేక శతాబ్దములకు ముం దీలోకము విడిచిపోయినను వారికీర్తి లోకమున వ్యాపించియే యుండుటకు వారలు వ్రాసిన గ్రంథములే కదా కారణము. ఎవనికీర్తి లోకమున నెంతవఱకుండునో యంతవఱకు వాఁడు పరలోకసుఖము ననుభవించు నని ప్రమాణము. ధనము సంపాదించి యీలోకమున సుఖింపవచ్చును. సత్కావ్యము చదువునప్పు డంతయు నపరిమితానందము గలిగించును. కావ్య మనఁగా నేమి? కవిచేతఁ జెప్పఁబడిన గ్రంథము. అన్ని గ్రంథము లట్టిఫలముల నిచ్చునా? ఈయవు. ఎట్టికావ్యమువలన నట్టికీర్తి లోనగునవి కలుగును? సత్కావ్యమువలన.

## ౨. అది దోషరహితము, గుణసహితము నగు.

దోషములులేక, గుణములు గలిగి యుండు కావ్యమే యట్టి సత్ఫలముల నీయఁ గలుగును గాని శబ్దములందు దోషములు, అర్థములందు దోషములు గల యసద్గ్రంథము లట్టిఫలముల నీయఁజాలవు. కావున శ్రేయస్సు కోరువాఁడు సత్కావ్యమును రచింప నేరువవలయును. కావ్యము నెట్లు రచింపవలయును? నీమనస్సునఁ గలయభిప్రాయమునే యితరుల మనస్సులలోఁ గలిగించుటకై యాయభిప్రాయము దెలుపఁగల మెప్పు సుశబ్దముల నొక్కటిగఁ జేర్పవలయును. ఆమాటల నితరులు చదివి నీ యభిప్రాయ మిదిగదా యని గ్రహింతురు. లక్షణ మెఱిఁగి చక్కఁగఁ బ్రయుక్తమైన యొకశబ్దమైనను సర్వసుఖముల నుభయలోకములఁ గలిగించు నని ప్రమాణము. ఆ సుశబ్దములు మనకు వచ్చు నెట్లు?

## సూ॥ 3. శబ్దసిద్ధి లోకంబువలనఁ గలుగును.

శబ్ద - మాటలయొక్క, సిద్ధి - లాభము, లోకంబువలనన్ - ప్రపంచమందలి జనములవలన, కలుగును - లభించును.

మనము మాటలాడుమాట లన్నియుఁ బ్రపంచమువలన నేర్చుకొనుచున్నార మని యర్థము. అనఁగా వ్యాకరణమును చదువుటకుముందే నాన

మీభాష మాటలాడుచున్నారము గదా. చదువే రానివారును మాటలాడు చున్నారుకదా. వీరందఱు వ్యాకరణమును జదివియా మాటలు నేర్చుకొనిరి? కాదు. లోకులు మాటలాడుకొనుమాటలను విని వానిని జ్ఞప్తియం దుంచుకొని తా మాప్రకారమే మాటలాడుచున్నారు. వ్యాకరణశాస్త్రము మనకు మాటలను నేర్పదు.

సూ॥ ర. శాస్త్రము నియమముకొఱకు.

ఇచట 'శాస్త్రము' అనఁగా వ్యాకరణము, 'నియమముకొఱకు' ఇట్టిది మంచిమాట యిట్టిది సరిగానిమాట యను నేర్పాటు, లేక, కట్టుపాటుచేయుట కని యర్థము.

మనకుఁ గావలసిన మాటలన్నియు లోకులవలన నేర్చుకొనుచున్నారమే యిఁక వ్యాకరణముతో నేమిప్రయోజన మందు రేమో. అట్లుగాదు. ఆ మాటలలో నేది తప్పో యేది యొప్పో మనకుఁ దెలియునట్లు వ్యాకరణ మేర్పాటు చేయుచున్నది. కాఁబట్టి దానిని జదువవలయును. అది చదువని యెడలఁ బ్రతిశబ్దము మనకు సరిగానే తోఁచును. మనము వీథివెంటఁ బోవునప్పు డొకఁ డబద్ధము మాటలాడుచుండుటయు, మఱియొకఁడు సారాయి త్రాగుచుండుటయు, మఱియొకఁ డింకొకనిఁ గొట్టుచుండుటయు, మఱియొకఁ డన్నదానము చేయుటయు, నింకొకఁడు భజనము చేయుచుండుటయుఁ జూచి తిమేని లోకులు చేయుచున్నారుగదా యివి యన్నియు సరియే యని మనము తలఁచి యాప్రకారమే మనమును జేయవచ్చునా? కూడదు.

మనశ్శ్రేయస్సును గోరెదమేని యందేది మంచిదో యేది కాదో తెలిసికొని మంచిదాని నాచరింపవలయును. చెడుదానిని విడువవలయును. అంగడియందు నన్నిరకముల పదార్థము లుండును. వానిలో మంచివానినేకదా మనము కోరుదుము. ఆప్రకారమే మనము వినుమాటలలో శబ్దశాస్త్రము సరి యని చెప్పినమాటల నుపయోగింపవలయును. తక్కినవాని నుపయోగింపరాదు. కావునఁ బ్రతిభాషకును వ్యాకరణము ముఖ్యము. భాషవలనఁ గీర్తి

ప్రతిష్ఠలు కోరువాఁడును జ్ఞానము సంపాదించి బాగుపడఁ గోరువాఁడును దానిని నేరువవలయును.

### సూ॥ ౫. ఆంధ్రదేశము ఆంధ్రభాష.

తెలుఁగు మాటలాడుజనుల స్వస్థాన మగుదేశమునకే ఆంధ్రదేశమని పేరు. ఇట్టిదేశము తమదేశ మని యభిమానము గలవారు మాటలాడు స్వభాషకు ఆంధ్రభాష యనిపేరు. ఇది యనాదినుండి లోకవ్యవహారమునఁ గలది గాని నిన్న నేఁడు వచ్చినది గాదు. కావుననే దీనిని స్వదేశ స్వవేష స్వభాషాభిమానము గలధీమంతు లెల్లరుఁ దల్లివలె గౌరవించుచు నన్యదేశ భాషాకావ్యముల వ్యవహారోపయోగ మగునంతమాత్రము నేర్చుచున్నారు. ద్రావిడభాష కగస్త్యునివలె నాంధ్రభాషకు వాల్మీకి ఆదివ్యాకరణకర్త యని గ్రంథములు వచించుచున్నవి. కణ్వాగులును ఆంధ్రవ్యాకరణముల రచించిరి.

### సూ॥ ౬. సంస్కృతం బాద్యప్రకృతి.

తెలుఁగునకు మొదటి యుత్పత్తిస్థానము సంస్కృతము.

### సూ॥ ౭. ప్రాకృతము ద్వితీయప్రకృతి.

తెలుఁగునకు రెండవ యుత్పత్తిస్థానము ప్రాకృత మనుభాష.

ఆంధ్రభాషలోఁ గొన్ని శబ్దములు సంస్కృతమువలనఁ బుట్టినవి. మఱికొన్ని ప్రాకృత మను భాషవలనఁ గలిగినవి. (ప్రాకృతభాష సంస్కృతము వలనఁ గలిగినదే) కావునఁ గొన్ని యాంధ్రశబ్దములకు సంస్కృతము తల్లి మఱికొన్ని శబ్దములకుఁ బ్రాకృతము తల్లి. సంస్కృత మనఁగాఁ జక్కఁగఁ బరిష్కరింపఁబడినదని యర్థము.*

---

*ఆంగ్లేయుల (English) యక్షరములయందుఁ బెక్కులు లోపములు గలవు. ఒక యక్షరము రెండువిధములగు ధ్వనుల కుపయోగింపఁబడును. ఉదా. (Accent) ఇక్కడ మొదటి 'c' 'k' యొక్క ధ్వనిగలది. రెండవ 'c,' 's' యొక్క ధ్వనిగలది. ఒక ధ్వనికి రెండక్షరము లుండుట యిటువంటి యనేక లోపములు సంస్కృతమందును దాని ననుసరించిన తెలుఁగునందును లేవు.

సూ॥ ౮. ఆంధ్రభాష వికృతి.

వికృతి - మాఱుపాటు చెందినది.

అనఁగా పాలు తన స్వరూపము చెడి పెరుఁగయినట్లుగా సంస్కృత ప్రాకృత శబ్దములు తమ స్వరూపము చెడి యాంధ్రశబ్దము లగుచున్నవి. 'త్రిలింగమ్' అనునది 'తెలుఁగు' అని మాఱెను. ఆంధ్రదేశమందు నాంధ్రులచే మాటలాడఁబడుభాష "ఆంధ్రము." దీనికే తెనుఁగు, తెలుఁగనియుఁ బేర్లు.

తేనె+అగు=తెనుఁగు అని కొందఱందురు. అనఁగా తేనెవలె మృదువై మధురమై మనోహరమైనదని యర్థము. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

## అక్షరప్రకరణము.

దూరదేశమం దుండువారికిఁ గాని, మనకు నెన్ని సంవత్సరములో వెనుక వచ్చువారికిఁ గాని మనయభిప్రాయము నోటిమాటలచేఁ జెప్పఁజాలము. మనపెద్దలు మనకు వ్రాసిపెట్టినట్లు మనము వ్రాసి యుంచవలయును. వ్రాయుట యనఁగా నేమి? మననోటిమాటలు కన్నులకుఁ గనఁబడవు. వాని కొకరూపము గలిగించినఁ గన్నులఁ జూడఁగలము. కావున నోటిధ్వని కన్నులకుఁ గనఁబడఁ జేయు నుపాయమే వ్రాయుట. ఆయుపాయ మేదనఁగా "నిజము చెప్పుట మేలు" అని చెప్పినప్పు డొక్కొక్క యక్షరమున్ను కొక్కొక విధమైనధ్వని మననోటినుండి వెడలుచున్నది. ఒక్కొక ధ్వనికి నొక్కొక విధమైన గుర్తుంచి యాధ్వనిని సూచింపవలసినప్పు డంతయు నా గుర్తులే వ్రాసిన యెడల నాగుర్తు తెలిసినవారందఱు నావిధముగా నుచ్చరించి యవి తామేయర్థమం దట్టిధ్వని కలిగించెదరో యవి వ్రాసినవాని యభిప్రాయ మదే కదా యని గ్రహింతురు. ఇట్లు ధ్వనుల సూచించు గుర్తులకే యక్షరములు - వర్ణములు - అక్కరము లనిపేర్లు. ఒక్కొక్కధ్వనికి నొక్కొక్క తెగవా రొక్కొక్క గుర్తుంచుకొనియున్నారు. తకారము సంస్కృతమున त యనియుఁ, దెనుఁగున త యనియుఁ, అఱవమున ○ యనియుఁ, గన్నడమున ಥ యనియు వ్రాయఁబడును. ఒకరియభిప్రాయము మఱియొకరికి

వాక్యములచేఁ దెలుపుచున్నారు. వాక్యములు మాటలకూర్పువలన నగును. మాట లక్షరసమూహముచే నేర్పడును. కావున మనము తొలుత నక్షరముల నేరువవలయును. తరువాత మాటల నేరువవలయును. తరువాత వాక్యములు వ్రాయ నేర్వవలయును. ఒక భాషయందలి యక్షరము లొక్కొక రొక్కొక విధముగ వ్రాయరాదు. ఆంధ్రులంద ఱేకవిధముగ వ్రాయవలయును. ఒక యాంధ్రుఁడు వ్రాసినది యే దేశమందుండు నాంధ్రుఁడైనఁ జదువ వలసు పడున ట్లుండవలయును. ఒకఁడు నభమని వ్రాసిన మఱియొకఁడు సఖమని చదువు నట్లుండరాదు. ఒకఁడు గుజ్జుపురూప మని వ్రాసినదానిని దక్కినవారు గాడిదరూప మనుకొనున ట్లుండరాదు కదా. అట్టులే మనము వ్రాయుగ్రంథములును ఎన్నితరములవెనుక వచ్చువారికైన బోధపడుచుండవలయును.

సంస్కృతభాషనుండి ప్రాకృతము పుట్టినదనియు నా రెండుభాషలనుండి యనేకపదములు తెలుఁగున నేర్పడినవనియు మీఁదఁ జెప్పఁబడెను. అనేకపదములు వచ్చినవే గాని యన్నిపదములు రాలేదు. ఆరెంటిసంబంధములేని శుద్ధాంధ్రపదములు పెక్కులు గలవు. ఒక్కొక్కభాష కొక్కొకవిధమైన యక్షరసమూహ మున్నదనియు మీఁదఁ జెప్పఁబడెను. కావున సంస్కృతమునకుఁ బ్రాకృతమునకు శుద్ధాంధ్రమునకు మూఁడువిధములైనయక్షరములున్నవి. సంస్కృతప్రాకృతశబ్దములు మాఱుపాటును బొంది తెలుఁగయినట్లే యాభాషాక్షరములు మాఱుపాటు చెంది తెలుఁ గక్షరము లయ్యెను. సంస్కృతమున ग తెలుఁగున 'గ' యయ్యెను. సంస్కృతాక్షరములమీఁది యడ్డగీఁతలు తెలుఁగున ˘ తలకట్టు లయ్యెను. ఇట్టులే కొన్నికొన్ని యక్షరములందుఁ బోలిక కనవచ్చును. అనేక శతాబ్దములు గడచుటచే నన్నియక్షరములకుఁ బోలిక చెప్ప వలనుపడదు.

సూ॥ ౯. సంస్కృతమునకు వర్ణంబు లేఁబది.

వర్ణంబులు=అక్షరములు. ఏఁబది=ఐదుపదులు ౫౦

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ ం ః ॥ ౧౬.

కఖ గఘ ఙ, చఛ జఝ ఞ, టఠ డఢ ణ, తథ దధ న, పఫ బభ మ, య ర ల వ, శ ష స హ, ళ. ౩౮.

సూ॥ ౧౦. ప్రాకృతమునకు వర్ణములు నలువది. ౪౦.

సంస్కృతమున నుండునక్షరములలో ఋౠ ఌౡ ఐ ఔ ఙ ఞ శ ష లను ౧౦ యక్షరములు తప్పఁ దక్కిన వన్నియుఁ బ్రాకృతమునఁ గలవు. సంస్కృతమునలేక, ప్రాకృతమున నెక్కువగనుండు నక్షరములు లేవు.

సూ॥ ౧౧. తెలుఁగునకు వర్ణములు ముప్పదియేడు. ౩౭.

అఆ ఇఈ ఉఊ ఎఏఐ ఒఓఔ ఁ ం. ౧౪.

క గ చ చ̄ జ జ̄ ట డ ణ త ద న ప బ మ య ర ఱ ల వ స హ ళ. ౨౩.

సంస్కృతాక్షరము లయిన ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష-లు (౧౯) అచ్చ తెలుఁగున లేవు గాని యాభాషలో లేని ఎ ఒ ఁ చ̄ జ̄ ఱ అను ౬ అక్షరము లీభాషయం దెక్కువ గలవు.

సూ॥ ౧౨. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియాఱు. ౫౬.

అఆ ఇఈ ఉఊ ఋౠ ఌౡ ఎఏఐ ఒఓఔ ఁ ం ః. ౧౯.

క ఖ గ ఘ ఙ, చ చ̄ ఛ జ జ̄ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ఱ ల వ, శ ష స హ, ళ. ౩౭.

దీనివలన సంస్కృతమునందలి ౫౦ అక్షరములును, ఆభాషయందు లేక యచ్చతెలుఁగున నెక్కువగ నుండు ౬ ఆ అక్షరములు గలసి ౫౬ ఆంధ్ర భాషావర్ణంబు లయ్యె. సంస్కృతమునకు దేవభాష - ఆద్యము - ఆదిభాష యనుపేర్లు గలవు. ఇన్నిభాషలయందును అకారము మొదలుకొని యుండు వర్ణములు అచ్చు లనియు, కకారము మొదలుకొని యుండువర్ణములు హల్లు

లనియుఁ జెప్పఁబడును. సంస్కృతమునకు ౧౬ అచ్చులు, ౩౮ హల్లులు. అచ్చ తెలుఁగునకు ౧౪ అచ్చులు, ౨౩ హల్లులు. ఆంధ్రభాషకు ౧౯ అచ్చులు, ౩౭ హల్లులు. అచ్చులకు స్వరములు ప్రాణము లనియుఁ బేర్లు. హల్లులకు వ్యంజనములు ప్రాణి లనియుఁ బేర్లు. వర్ణనిర్దేశమందు 'కార' ప్రత్యయము చేర్చి 'అకారము' 'ఇకారమని' చెప్పఁబడును. రకారమును రేఫమనియు నం .దురు. 'కార'ముచేర్పనపుడు హ్రస్వము దీర్ఘమగు. ఉ. పాఫా బాభా మావా యనునవి ఔష్ఠ్యములు. బాకు వాకు నభేదము.

సూ॥ ౧౩. 'ఎఏ ఒఓ' లకు వక్రము లని పేరు.

సూ॥ ౧౪. 'ఐఔ' లకు వక్రతమము లని పేరు.

హ్రస్వములు - కుఱుచలు. అ ఇ ఉ ఋ ౠ.

దీర్ఘములు - నిడుదయక్షరములు. ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ.

ఉభయములు. { ం అనుస్వారము. ః విసర్గము. }

క ఖ గ ఘ యీ మొదలయినవి హల్లు లని యిఁక ముందు చెప్పినను నిజమైన హల్లులు క్, ఖ్, గ్, ఘ్ ఇటువంటి హల్లులుమాత్రమే. ఇవియుచ్చ రించుట కష్టముగావున నచ్చులతోఁ జేర్చి క్ + అ=క, గ్ + అ = గ అవి సులభముగఁ బలుకఁబడుచున్నవి. చ్ + అ = చ ఇచ్చట 'అ' హ్రస్వము గనుక 'చ' హ్రస్వహల్లనియు, చ్+ఆ=చా ఇచట 'ఆ' దీర్ఘము గనుక 'చా' దీర్ఘహల్లనియుఁ దెలియునది. ఇట్లే తక్కిన హల్లులు.

## గుణితప్రకరణము.

సూ॥ ౧౫. ఖ జ ఙ ఞ ఝ ట ణ బ ఱ ల.

ఈ ౧౦ అక్షరములకుఁ దలకట్టులు లేవు. కావున వీనికిఁ దలకట్టిచ్చి వ్రాయరాదు.

ఖ ఘ ఇట్టి యొత్తక్షరములలో (వర్గయుక్కులలో) తకారమునకు మాత్రము గ్రింప నొత్తుగీఁత లేదు.

కొమ్ములేని హల్లులకు ఆకారమును దెలుపు దీర్ఘముగుర్తు వ్రాయవలసి వచ్చినప్పుడు తలకట్టునకు మాఱుగా ా వంటి గుర్తు వ్రాయవలయును. క కా.

కొమ్ముగల, తలకట్టు లేని యక్షరములకు ఆకార(దీర్ఘ)చిహ్నము వ్రాయవలసియున్నయెడల నక్షరముకడపటికొననుండి ా యిట్టిచిహ్నముల వ్రాయవలయును. మా. యా. ఖఖా, జజా, ఙఙా, ఝఝా, బబా, టటా, లలా.

సుడితో నక్షరము ముగియునేని, యక్షరమున కడుగుభాగమున నాసుడి యున్నయెడ నాయక్షరముపైన ా యని వ్రాయవలయును. ణణా.

అక్షరమునకుఁ బైభాగమున నున్నసుడికిఁ బైన ి అని వ్రాసినఁ జాలు. షా షి.

అక్షరముయొక్క కడపటికొన యా యక్షరములో నేభాగముతో నైనఁ గలసిపోవునేని మీఁదిభాగమున ా యీయవలయును. ఱా.

ి ఇది ఇకారమును దెలుపును. దీనికి గుడి యని పేరు. దీనిని దలకట్టు గాని ా గాని వ్రాయుచోట వ్రాయవలయును. కి ఝి జి జి టి టి ణి. కొమ్మునకు గుడి యిచ్చుట సరిగాదు.

ీ ఇది ఈ గుడిదీర్ఘమును దెలుపును. కీ, టీ, జీ. ఝీ.

ు ఇది ఉకార చిహ్నము. దీనిని కొమ్ము అందురు. ఇవి పకార షకారముల కడుగుభాగమునను దక్కిన యక్షరములకుఁ బ్రక్కన యీయఁబడును. కు. జు. హు. ణు. ఱు. ము. యు. వు. పు. ఇత్యాదులు.

ూ ఇది ఊకార చిహ్నము. కొమ్మునదీర్ఘము. కూ జూ హూ వూ పూ.

ృ ఋకార చిహ్నము. దీనిని వట్రువసుడి వట్రసుడి యందురు. ఇది యక్షరమున కంటకుండునట్టు లడుగున వ్రాయవలయును. కృ. హృ. పృ.

ౄ ౠకార చిహ్నము. వట్రసుడికి దీర్ఘము. కౄ, హౄ, పౄ.

ె ఎత్వచిహ్నము. ఇది తలకట్టునకు మాఱుగఁ గాని తలకట్టు లేని యక్షరములకు ా స్థానమునఁ గాని వ్రాయఁబడును. కె, జె, ణె, ఝె, ఇత్యాదులు.

ే ఏత్వచిహ్నము. కే జే డే ఠే ఇత్యాదులు.

ై ఐత్వచిహ్నము. ఎత్వచిహ్నమిచ్చి వ్రాయఁబడిన యక్షరమునకు నడుగుభాగమున నక్షరమునకుఁ దగులకుండునట్లు ై వ్రాయవలయును. పై-మై-నై-జై-హై-బై. తొలుత ఎత్వచిహ్నము 'ై' కలసి యేకముగనుండెను. ఇది జిలుగు వ్రాఁతయం దిప్పటికిఁ గాననగు.

ొ ఒత్వచిహ్నము. ప్రక్కకొమ్ములుగల ఘ ఝ మ య లకును హాకారమునకును దప్పఁ దక్కినయక్షరములకుఁ దలకట్టు లున్నవానికిఁ దలకట్టు స్థానమందును, దలకట్టులులేనివానికి ా స్థానమందును దీనిని వ్రాయవలయును. ప్రక్కకొమ్ములు గల ఘ ఝ మ య లకు ఎత్వచిహ్న మిచ్చి కొమ్మునకుఁ గొమ్మిచ్చిన ఒత్వమగును. మొ. యొ. ముద్రాక్షరములయందు ా స్థానంబున ొ ఒత్వము ఘ ఝ లఁ గాననయ్యెడి. ఘొ. ఝొ. హాకారమున కెత్వమును కుడికిఁ గొమ్మియ్యవలెను. ా స్థానంబున ొ ఒత్వమిచ్చుట ముద్రాక్షరములఁ గననగు, హొ.

ో ఓత్వచిహ్నము.

ౌ ఔత్వచిహ్నము. ఇది తలకట్టు గలవానికి తలకట్టు మాఱుగను, తలకట్టులేనివానికిని కొమ్ములుగల మ, య, లోనగువానికి 'ఆ' ా స్థానములో వ్రాయవలయును. హాకారమునకు ఆకారస్థానమున దీని వ్రాయవలయును. హౌ.

్క కావత్తు. ్త తావత్తు. ్న నావత్తు. ్మ మావత్తు, మాముడి.

్ర కియ కియ్య క్యావడి ్ర క్రావడి. ఱ వలపలగిలక. ్ల లావత్తు.

్వ వావత్తు. ఙ ఞ నకారముపొల్లులు. తక్కిన హల్లులు హల్లుల క్రింద వ్రాయునపుడు తలకట్టులు మాత్రము లేక వ్రాయఁబడును ఖు ఙ ఛ ఝు ళ. ఖ జ ఝ జ ణ ఱ. పూర్ణాక్షరములు వ్రాయఁబడును. కొందఱు శకారమునకు మాఱు ్ల కారమును వ్రాయుదురు. పెళ్లలు

సంస్కృతమునుండి వచ్చిన దగుటను, కర్ణాట భాషయందునుండుటను ఱ వలపలగిలక సాధువే యగు. ఉ. స్వర్గము—స్వగఱ్ఱము అని రెండ

విధముల వ్రాయవచ్చును. సంస్కృతమునను स्वर्ग స్వ వ్రాసి తరువాత గకారముపై ౯ వ్రాయఁబడును. దానినే యాంధ్రులు '౯' అని యక్షరము ప్రక్కనే వ్రాయుచున్నారు.

3-వ భాగమున వ్యాసవిషయము నక్షరవైరూప్య మనుశీర్షిక క్రింద నిప్పటివిద్యార్థులు వ్రాయువికారాకారములు వ్రాయఁబడినవి. అని యసాధు రూపము లని యెఱుంగునది.

ఆంగ్లపదము లయిన మాప్ (Map) ఆక్సెంట్ (Accent) బాచిలర్ (Bachelor) ప్లాన్ (Plan) మైల్ (Mail) డైలీ (Daily) యిట్టి పదములు తెలుఁగక్షరములతో వ్రాయవలసివచ్చినపుడు ఆయక్షరములపై ‾ యిట్టిచిహ్న మియ్యవలయును. లేనియెడ నుచ్చారణము సుష్టువుగాదు. ఇట్టులే France-Fever ఇట్టివి ఫ్రాన్స్ - ఫీవర్ అని వ్రాయనగు. అక్షరముపై ‾ నీగుర్తు అచ్చతెలుఁగని ‾ గుర్తు పాశ్చాత్యపదమని తెలుపును.

నక్షత్రము క్షాత్రము అనునప్పుడు క్ష యిట్లు వ్రాయఁబడును. ఇది కకార షకారముల కూడికఁ దెలుపదు. నక్షా రిక్షా యనునప్పుడును కకార షకారముల కూడిక గలదే గాని నక్షత్రక్షాత్రములలోని క్షకారము నుచ్చారణమునకు, నక్షారిక్షాలలోని క్షా యుచ్చారణమునకును భేదము గలదు. కావున నిచ్చోట ్ష యని పొత్తియ్యవలయును. హర్షము లోనగు శబ్దముల నటులే వ్రాయుచున్నాము గదా. సెక్షన్ సెక్షన్ ఎంత భేదమో చూడుఁడు.

## వర్ణవిభాగ ప్రకరణము.

| 1 | 2 | 3 | 4 | 5 | |
|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ—క వర్గము. | |
| చ | ఛ | జ | ఝ | ఞ—చ వర్గము. | |
| ట | ఠ | డ | ఢ | ణ—ట వర్గము. | |
| త | థ | ద | ధ | న—త వర్గము. | |
| ప | ఫ | బ | భ | మ—ప వర్గము. | |

అయిదయిదక్షరము లొక్కొక్క వర్గము. 'క' మొదలుగాఁగల 5 అక్షరములు 'క' వర్గము. ఇట్టులే తక్కినవి.

ఈ ౨౫ అక్షరములకు 'స్పర్శము' లని పేరు.

1-వ నిలువువరుసలోనుండు 'క, చ, ట, త, ప' యీ ౫ అక్షరములు 'పరుషము' లనఁబడు. 3-వ నిలువువరుసలోనుండు 'గ, జ, డ, ద, బ' లు 'సరళము' లనఁబడును. 2, 4 వరుసలలోనుండు 'ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ' యీ పదియక్షరములకు 'వర్గయుక్కులు' అనియు 5-వ వరుసలోని 'ఙ, ఞ, ణ, న, మ, వీనికి 'అనునాసికము' లనియుఁ బేర్లు. వర్గయుక్కు లనఁగాఁ బ్రతివర్గములోని సరియక్షరములు.

య, ర, ల, వ వీనికి 'అంతస్థము' లని పేరు.

శ, ష, స, హ వీనికి 'ఊష్మము' లని పేరు.

స్పర్శములు 25, అంతస్థములు 4, ఊష్మములు 4, ళ 1. ఈ 34-లో పరుషములు 5, సరళములు 5. యీ 10 యక్షరములు పోను మిగిలిన 24 యక్షరములకు "స్థిరము" లని పేరు. 'న' కారము స్థిరములలోఁ జేరినను దానికి ద్రుతమని మఱియొక పేరును గలదు.

౩౪ హల్లు లెన్నిభాగము లనఁగా.

౨౪ స్థిరములు.
౫ పరుషములు.
౫ సరళములు.
౩౪

అని మూఁడువిధము లనియైనను

లేక

స్పర్శములు. ౨౫
అంతస్థములు. ౪
ఊష్మములు. ౪
౧
౩౪

అనికాని చెప్పవచ్చును. ఆంధ్రవర్ణములకుఁ జెప్పినప్పుడు ఎక్కువయక్షరము లా యా తరగతుల లోఁ జేర్పవలయును.

## వర్ణోత్పత్తిస్థానములు.

సూ॥ ౧౬.

కంఠ్యములు ...... అ ఆ క ఖ గ ఘ ఙ హ ః
తాలవ్యములు ...... ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ.
మూర్ధన్యములు...... ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష.
దంత్యములు ...... ఌ ౡ త థ ద ధ న ల స.
ఓష్ఠ్యములు ...... ఉ ఊ ప ఫ బ భ మ.
అనునాసికములు ... ఙ ఞ ణ న మ.
కంఠతాలువులఁ బుట్టినవి. ఏ ఐ.
కంఠోష్ఠములఁ బుట్టినవి. ఓ ఔ
దంతోష్ఠములఁ బుట్టినది. వ.
నాసికయందుఁ బుట్టినది. ం.

ఆంధ్రవర్ణములకుఁ జెప్పునప్పుడు ఎ-ఒ చ జ చేర్పవలయును.

| | |
|---|---|
| కంఠము—కుత్తుక. | దీనియందుఁ బుట్టినయక్షరములు కంఠ్యములు. |
| తాలువులు—దవడలు. | వీనియందుఁ బుట్టినయక్షరములు తాలవ్యములు. |
| మూర్ధము—తల. | దీనియందుఁ బుట్టినయక్షరములు మూర్ధన్యములు. |
| దంతములు—నోటిపండ్లు. | వీనియందుఁ బుట్టినయక్షరములు దంత్యములు. |
| ఓష్ఠములు—పెదవులు. | వీనియందుఁ బుట్టినయక్షరములు ఓష్ఠ్యములు. |
| నాసిక—ముక్కు. | దీనియందుఁ బుట్టినయక్షరములు అనునాసికములు. |

పెదవులందుఁ బుట్టినవి, నాసికయందుఁ బుట్టినవి, యనఁగా వాని సాహాయ్యముతో నుచ్చరింపఁబడునవి యని యర్థము. ఎట్లనఁగా "ం" కు నుత్పత్తిస్థానము నాసిక యని వ్రాయఁబడినదిగదా. ముక్కరములు గట్టిగా మూసికొని పండు-చెండు మొదలగు నిటువంటి సున్న లుండుమాటలు చక్కఁగాఁ జెప్పుటకు సాధ్యమగునేమో చూడుఁడు. 'బావా మీపాప మావు వేఁప పూవు తినియె' అనువాక్యములో 'తినియె' అనుమాట పెదవులు కదలింపక పలికినట్లు తక్కినవి పలుకుటకు సాధ్యమగునేమో యాలోచింపుఁడు. ఇట్లే తక్కినవి గ్రహించునది.

సూ॥ ౧౭. ఋౠ ఌౡ విసర్గ వర్గయుగ్ఙ ఞ శ ష లు తత్సమాన్యదేశ్యానుకరణంబులఁ గూడి యాంధ్రభాషం జొచ్చు.

వర్గయుక్కు లనఁగా ఖఘ ఛఝ ఠఢ థధ ఫభ లని మున్నె చెప్పఁబడియె. ఈ యక్షరములు ఋౠ ఌౡ ఙ ఞ శ షః లనుజేరి ౧౯ అక్షరములును తత్సమపదంబులును, అన్యదేశ్యపదంబులును, ధ్వన్యనుకరణపదంబులును గలసి యాంధ్రభాషాపదంబులుగ వాడంబడెడు ననియర్థము. ధ్వన్యనుకరణ మనఁగా నేధ్వని యెట్లువినవచ్చునో యట్లె వ్రాయుట. ధ్వని పెద్దదియు పరుషమునైనపుడు ఒత్తక్షరములును సౌమ్యము మృదువైనపుడు ఒత్తులులేని యాక్షరములు వ్రాయఁబడును. ఉ. ఋషి-పితౄణము. క్లృప్తము-ఌకారము, నిః భేదము. ఖట్వాంగము, ఘంట-ఛాగము. ఝంకారము-శఠుఁడు-దృఢము-వ్యథ-బాధ-కఫము-భేదము-శార్ఙ్గము* ప్రజ్ఞ. శశి-షండుఁడు. ఇవి తత్సమపదములు, తవర-తావు-అన్యదేశ్యములు. ఫిరంగి 'ఢా'మ్మనియెను. నగారా 'భా'మ్మనియెను. ఇవి ధ్వన్యనుకరణపదములు.

---

* బాలవ్యాకరణంబున ఙకారము తత్సమమునఁ గలసి యాంధ్రంబునఁ జొచ్చినందునకు పఙ్క్తి యుదాహరణముగ నీయఁబడినది. సంస్కృత సంయుక్తాక్షరంబుల ననునాసికంబు లున్నచో నా యనునాసికములకు మాఱు పూర్ణానుస్వారమే వ్రాయుట సర్వమహాకవి సంప్రదాయము. పూర్ణబిందు ప్రాసముగ నన్నయ్య 'నిండుమనంబు' అనుపద్యములో 'నిండు' 'ఆఖండల' యను శబ్దములు ప్రాసస్థానములఁ గూర్చెను. సింగం బాఁకటితోనను పద్యములోఁ దిక్కన మాతం'గ' యని ప్రాసముఁ గూర్చెను. ఈ నియమమే యందఱు కవులయందు నియతంబుగఁ గానవయ్యెడి. ఏతద్భిన్నంబొకఁడైన లక్ష్యంబు గానరాదు. మహాకవిసంప్రదాయ మిట్టులుండ నొక పఙ్క్తిమాత్రము అంకితమువలె పంక్తి యని వ్రాయుటకుఁ గారణము విచార్యము.

## అనుస్వారప్రకరణము.

**సూ॥ ౧౭. అనుస్వారము సున్న.**

సున్నకు అనుస్వార మని పేరు.

సున్న యెప్పుడును, అచ్చునకు వెనుకనే యుంటి వచ్చుచుండును గనుక దాని కనుస్వార మని పేరు కలిగెను. ఉ. పండు. దీనిని విభజించి వ్రాసిన యెడల ప్+అ, ం, డ్+ఉ, అని యగును. వీనిలో నిజమైన హల్లులు ప్—డ్ అనునవి. కావున 'పండు' అనుమాటలోని సున్న అచ్చయిన అకారమునకు వెనుకనే యున్నది. అనుస్వారమునకు బిందు వనియుఁ బేరు.

**సూ॥ ౧౮. అది పూర్ణము ఖండ మని ద్వివిధము.**

అనుస్వారము పూర్ణానుస్వార మని ఖండానుస్వార మని రెండువిధములు. పూర్ణానుస్వార మనఁగా నిండుసున్న 'ం' ఇట్లు వ్రాయఁబడునది. ఖండానుస్వార మనఁగా అరసున్న 'ఁ' ఇట్లు వ్రాయఁబడునది.

**సూ॥ ౨౦. పూర్ణానుస్వారము సిద్ధ మని సాధ్య మని ద్వివిధము.**

పూర్ణానుస్వారము సిద్ధపూర్ణానుస్వారము సాధ్యపూర్ణానుస్వారము అని రెండు విధములు.

సిద్ధము సహజము. అనఁగా శబ్దముతోడనే పుట్టినది. ఉ. చెండు పండు. వంక - డొంక. ఈ శబ్దములయందు నిండుసున్నలు శబ్దములు పుట్టినప్పుడు పుట్టినవే కాని నడుమ వచ్చినవి కావు.

సాధ్యము సూత్రలబ్ధము. వ్యాకరణసూత్రములచే లభించినది సాధ్యము.

ఉ. చెన్ను-తోవ యను రెండుశబ్దములయందు నిండుసున్నలు లేవు. అయినను సంధి కలిసినపుడు సంధిపరిచ్ఛేదము నందలి ౫౨-వ సూత్రము

చొప్పున చెందొవ యగుచున్నది. ఇందలి పూర్ణబిందువు సూత్రమువలన వచ్చినది గనుక సాధ్యపూర్ణానుస్వారము.

## ఖండానుస్వారము సిద్ధమని సాధ్య మని ద్వివిధము.

కాఁక - వీఁక - ఈఁక - తోఁక - ఇత్యాదులందలి యరసున్న సిద్ధఖండానుస్వారము.

వచ్చెఁ కమలాక్షుఁడు - అనునది సంధియందు 'వచ్చెఁగమలాక్షుఁ'డని యగును-ఇందలిది సాధ్యఖండానుస్వారము. చూ. సంధి సూత్రము ౩౨.




## సూ॥ ౨౧. వికృతిబిందువు పరుషసరళపరకంబు.

వికృతి బిందువు=తెలుఁగుమాటలయందుండు నరసున్న గాని నిండుసున్న గాని, పరుషసరళపరకంబు = పరుష = కచటతప, సరళ = గజడదబ - పరకంబు=(ఈ ౧౦ యక్షరములనే) ప్రక్కన గలదిగా నుండును. అనఁగాఁ దద్భవ దేశ్యపదము లయిన అచ్చతెలుఁగుమాటలందు కచటతప గజడదబ యను పదియక్షరములకు ముందే సున్న యుండును గాని మఱి యే యక్షరమునకు ముందుగ నుండదు. తత్సమమందు నేయక్షరమునకైనను ముందు నిండుసున్న యుండవచ్చును. ఉ. శృంఖలము - సంభారము - సంయమి - సంరక్ష-సంవత్సరము - సంశయము - సంసక్తము సంహారము లోనగునవి తత్సమ

పదంబులు. చురుయి - కుంయి యివి యనుకరణములు గావునఁ బరుష సరళములుగాని యక్షరమునకు ముందు అనునాసికోచ్చారణము సూచించుచు బిందువున్నది. "స్వర్ణకారాభిధ పరఁగుఁ బారసి యగసాలి సొన్నారి కంసాలి యనఁగ." ఆంధ్రభాషార్ణవము. ఇందు కంసాలి యనురూపము చింత్యము - కమసాలి సాధురూపము.

సూ॥ ౨౨. అసమాసంబున సంయుక్తాక్షరమునకుఁగాని ద్విత్వాక్షరమునకుఁ గాని ముందర బిందు వుండదు.

ఉ. ముడుఁగు - మాఁడుచు - వేఁడుకొను - ఇవి యర్ధబిందువు గల శబ్దములయ్యెనవి ముడ్గు-మాడ్చు-వేడ్కొను అని మాఱినపుడు అర్ధబిందువులు లోపించును.

తలఁబ్రాలు - ఇది సమాసము గావున సంయుక్తాక్షరమునకు ముందర సున్న యున్నది.

అంక్కుఁడు - అంన్న - అంమ్మ - బ్రంహ్మ జింహ్వాయిత్యాదు లసాధువులు.

సూ॥ ౨౩. పంక్త్యాది ననుస్వారము పొల్లులు లేవు.

అనఁగా వ్రాయునపుడు బంతికి మొదట 'ం' గాని, 'ఁ' గాని ౯ ల్ ఇట్టి పొల్లులుగాని నిలిపి వ్రాయరాదు - దానిని బూర్వపంక్తి కడపట నుంచవలయును.

సూ॥ ౨౪. అఁటాదులఁ దప్పఁ బదంబున నాద్య హ్రస్వముపై నరసున్న లేదు.

మాటయొక్క మొదటియక్షరము హ్రస్వముగా నుండి దానిమీఁద నరసున్న అఁట - ఇఁక - చుఁడు - అను మాటలలో మాత్రమే యుండును. ఇవి తప్ప మాటయొక్క మొదటి హ్రస్వముమీఁద నరసున్న యుండుశబ్దములు లేవు. 'ఇఁగ' యనునది 'ఇఁక' యొక్క రూపాంతరము కావున దాని

iii. మధ్యమపురుష బహువచనమున. ఉ. చూడుఁడు - చేయుఁడు మొదలైనవి.

iv. ఆఁడు - ఆఁడుది - దీనికి రూపాంతరము ఆఁడది. చూడు వ్యాసపరిచ్ఛేదము పీఠిక xxxvi. ఏఁడు=సంవత్సరకాలము-రోదనసంఖ్యార్థం బుల నరసున్న లేదు. ఏడు. చూఁడు=కాల్చు. మధ్యమ పురుషము ఏకవచనం బైన చూడునందు లేదు. తేఁడు = పండుకొను - తూఁడు = తామరకాఁడ. తోఁడు=పెల్లగించు. నాఁడు=కాలము దినము. దేశమను నర్థంబున లేదు. తూర్పునాడు-పొత్తపినాడు లోనైనవి. పేఁడు=పేనుట. చెక్కపేడు ఈయర్థమున 'ఁ' లేదు. వేఁడు=కోరు. పూఁడులు=పెక్కులు - ఏఁడులు పూఁడులు.

ఆనంతర్య తద్ధర్మాశీరర్థకాదుల డు వర్ణకంబునకు ముం దరసున్న లేదు. అనవుడు - నావుడు - చేసెడు - మేలయ్యెడు. ఆదిశబ్దముచే అపుడు - ఇపుడు ఎపుడు - అమహదర్థకములైన చెవుడు - తవుడు - జెముడు ఇత్యాదులం దరసున్న లేదు.

సూ॥ ౨౬. మహత్త్వార్థక బోధకంబగు 'ఆఁడి' యందు 'డి' వర్ణకంబునకు ముం దరసున్నయుండు.

మహత్త్వార్థకము స్త్రీలను బోధించునది. ఉ. మాయలాఁడి-వగలాఁడి-వన్నెలాఁడి-కులుకులాఁడి.

సూ॥ ౨౭. యకారము కడపటఁగల ధాతువుల కృదంత రూపంబులందలి త వర్ణకంబునకు ముం దరసున్నయుండును.

| | |
|---|---|
| అలయు-అలఁత | మాయు-మాఁత |
| కూయు-కూఁత | మేయు-మేఁత |
| కోయు-కోఁత | మోయు-మోఁత |
| గీయు-గీఁత | మ్రోయు-మ్రోఁత |
| చేయు-చేఁత | రోయు-రోఁత |

| | |
|---|---|
| నవయు-నవఁత | లాయు-లాఁత |
| నేయు-నేఁత | వేయు-వేఁత |
| పూయు-పూఁత | వ్రాయు-వ్రాఁత |
| పోయు-పోఁత | వ్రేయు-వ్రేఁత |

సూ॥ ౨౮. దీర్ఘాక్షరము ముందుగాఁగల 'ము'వర్ణకము నకు నౌపవిభక్తికమైన 'ప' యాదేశమైనపుడు దానికి ముందుగ 'ఁ' నరసున్నయుండును. ఉ.

నాము - నాఁపచేను; వేము - వేఁపచెట్టు; పాము - పాఁప కేఁడు; ప్రేము - ప్రేఁప బెత్తము.

'దీర్ఘాక్షరము ముందుగాఁ గల' యనుటచే ఇనుపకుండ - మినుప పప్పు - జనుపనార యిత్యాదుల పవర్ణకంబునకు ముం దరసున్న లేదు.

సూ॥ ౨౯. 'ను' వర్ణము కడపటఁగల విశేష్యములకు రూపాంతరమున 'ను' కు మాఱుగా 'కు' వర్ణకముగాని 'గు' వర్ణకముగాని వచ్చినపుడు వానిముం దరసున్న యుండును.

| | |
|---|---|
| కలను-కలఁకు | గోను-గోఁగు. |
| కెలను-కెలఁకు | నెఱను-నెఱఁకు; |
| కొఱను-కొఱఁకు; | మ్రాను-మ్రాఁకు |
| కొలను-కొలఁకు | రేను-రేఁగు |
| గవను-గవఁకు. | [illegible] |
| | [illegible] |



సూ॥ 3౦. లేమిని దెలుపు, 'ఇఁడి' ప్రత్యయంబున 'డి' వర్ణ మునకు ముం దరసున్న యుండును.

ముక్కిఁడి = ముక్కులేనిది. ఇట్లు వాలిఁడి - సిగ్గిఁడి - వెరవిఁడి - కట్టిఁడి-ఒఱపిఁడి-ప్రాయిఁడి-జేటిఁడి-వీటిఁడి, ఉప్పిఁడి, తరమిఁడి.

సూ॥ ౩౧. అనునాసికాక్షరము గల ప్రకృతిశబ్దము తద్భవరూపమున ననునాసిక స్థానంబున నిండునున్న యేని యఱనున్న యేని వచ్చును.

| | |
|---|---|
| కపిఞ్జలః=కముఁజు-కౌఁజు-కవుఁజు, | పరఞ్జః=పరుఁజు |
| కళఞ్జః=కలఁక | పింఠా=పేఁట |
| కాణ్డః=కాఁడ | పిఞ్ఛమ్=పీఁచము |
| కురణ్టకః=గోరఁట | ప్రాఞ్చ్=ప్రాఁచి-ప్రాఁత |
| కున్తాలీ=కోఁదాడు | బ్రాహ్మణః=బాఁపఁడు |
| గళన్తికా=గళంతియ | భుజఙ్గః=బొజుఁగు |
| గన్థోలీ=కడుఁదురు-కణుఁదురు | భ్రాన్తిః=బ్రాఁతి |
| గోణ్డః=గవుఁడు | మణ్డకః=మండెఁగ |
| గ్రన్థిః=కడఁతి-కణఁతి | యన్త్రమ్=ఏఁతము-ఏఁతాము |
| ఘీఙ్కారః=గీఁక | లఙ్ఘా=లాఁగు |
| ఘూఙ్కారః=కూఁక | లాఙ్గలమ్=నాఁగేలు |
| ఘోణీ=గూఁటి | హిన్తాలః=ఈఁదాడు |
| తరఙ్గః=తరఁగ | హుంకారః=ఊఁకర |
| త్రిలిఙ్గః=తెలుఁగు | హుమ్=ఊఁ |
| నాణకమ్=నాఁడెము | అమ్=అఁ ఇత్యాదులు. |

సూ॥ ౩౨. వికృతిహ్రస్వంబులకు ననునాసికములు పరములగుచో రూపాంతరంబున హ్రస్వంబునకు దీర్ఘంబును, ననునాసికస్థానంబున నర్ధబిందువు నగు.

| | |
|---|---|
| ఇంకు=ఈఁకు | పించము=పీఁచము |
| ఇంజేటి=ఈఁజేటి | పెంట=పేఁట |
| ఊమక=ఊఁక | పెండ=పేఁడ |
| కుంకటి=కూఁకటి | మండు=మాఁడు |
| చిందఱ=చీఁదఱ | మండెము=మాఁడెము |
| చింపిరి=చీఁపిరి | రెంటెము=రేఁటెము |
| చుండు=చూఁడు | రొంజాడు=రోఁజాడు |
| తలయంపి=తలాఁపి | లొంగు=లోఁగు |
| తుంట=తూఁట | వంక=వాఁక |
| దనుక=దాఁక | వెంగి=వేఁగి |
| దుముకు=దూఁకుడు-దూఁకు | వెంట=వేఁట |

ఇవిగాక మఱియుఁ గొన్ని సార్ధబిందుక శబ్దములు గలవు. ఎచ్చట అర్ధానుస్వారము వచ్చినను అది నకారాదులకు మాఱుగ వచ్చినదే యని గ్రహింపుఁడు—కావుననే దానిని విడువరాదు. ఇంగ్లీషుభాషాపదంబుల "Silent Letters" నుచ్చారణమునకు రాని యక్షరముల నేర్చుకొనునట్లు దీనిని జ్ఞప్తియం దుంచుకొనవలయు. అర్ధానుస్వారములుగల శబ్దముల పట్టిక యీ గ్రంథము కడపట నీయంబడినది. కొన్ని చోటుల సూత్రానుసారముగను అనునాసికోచ్చారణమును బట్టియు వచ్చును.

సూ॥ 33. హ్రస్వఖండంబు వైకల్పికంబుగఁ బూర్ణంబగు.

కుఱుచలమీఁది యఱసున్నకు నిండుసున్న వైకల్పికముగ నగు. ఉ. కలఁగి ఈ శబ్దమునం దుండు నరసున్న 'ల' యను కుఱుచ యక్షరముమీఁద నున్నది కావున నీ యరసున్న నిండుసున్న చేసి 'కలంగి' యని వ్రాసినను వ్రాయవచ్చును. కలఁగి యని యరసున్నగానే యుంచిన నుంచవచ్చును.

ఇట్లు రెండురూపములు కలుగుటకే వైకల్పిక మని పేరు. ఇట్టితే రాముఁడు—రాముండు మొదలైనవి.

సూ॥ ౩౮. దీర్ఘముమీఁది ఖండంబు ఖండంబ.

ఈ యరసున్నకు ముందుండు నక్షరము మీఁదఁజెప్పినట్లు కుఱుచ (హ్రస్వము) గాక నిడుద (దీర్ఘము)గా నుండెనేని యరసున్నగానె యుండును గాని నిండుసున్నగా మాఱదు. వాఁడు—వాండు అని చెప్పరాదు. ఏలన 'వాఁడు' అను మాటలో 'ఁ' అరసున్నకు ముందు 'వా' యను దీర్ఘాక్షర మున్నది కావున. కావున 'తాం జెప్పె' 'నేం జదివితి' తప్పని తెలియునది తాఁజెప్పె—నేఁజదివితి ననునవి సరియైనరూపములు. బహువచనమున అరసున్న నిండుసున్నగామాఱును. ఉ. వాండ్రు-వీండ్రు-ఏండ్లు-పీండ్లు—వ్రాండ్లు—బోంట్లు లోనగునవి.

## దంతతాలవ్య ప్రకరణము.

సూ॥ ౩౯. 'ఇ ఈ ఎ ఏ' లం గూడిన చ జ-లు తాలవ్యంబులు

చిగురు - చీటి - చెమట - చేఁత - జింక - జీడి - జెట్టి - జేన. చిగురు-ఇందు 'చ'కారము ఇకారముతోఁ గూడియున్నది కావున నిది తాలవ్య చకారము. ఇట్లే తక్కినవి. ఇ ఈ ఎ ఏ-లు తాలుసంబంధములు.

సూ॥ ౩౧౦. 'అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ'-లం గూడిన చ జ-లు దంత్యంబులు.

చవి—చాగ—చుట్టము — చూరు — చొప్పు— చోటు — చౌకము—జన్నము—జాజి — జువ్వి — జూఁక — జొన్న — జోజో — జౌరు. చవి — ఇక్కడ 'చ' ఆకారముతోఁ గూడుటచే దంత్యము. ఇట్లే తక్కినవి.

సూ॥ ౩౭. చై జై-లు తెలుఁగుమాటలందు మొదట లేవ

తెలుఁగుమాటలయందు లే వని చెప్పుటచేఁ దత్సమంబునఁ గలవని భా
ము. ఉ. చైత్రము-జైత్రుఁడు. చెద్దము చెయ్యిలు అను వానిని చైదము చై
లని వ్రాయుట తప్పు. "చైవులసాకిరి చాయమగఁడు" "చెయియనఁ జైనాఁగ
జెయ్యిచే నా హస్తాభిధానంబులు" అను ఆంధ్రనామసంగ్రహమునందలి
చైవు లనునవి యసాధువులు—

సూ॥ ౩౮. దంత్యతాలవ్యంబులయిన చ జ-లు మిత్రములు

అనఁగాఁ దాలవ్యచకారము దంత్యచకారమునకుఁ దాలవ్యజకార
దంత్యజకారంబునకు యతి ప్రాసంబులఁ జెల్లును.

సూ॥ ౩౯. సంస్కృత సమంబులందు దంత్యములు లేవు

తత్సమంబులందుండు చ జ-లు చ జ-లుగా నుచ్చరింపరాదని భావ
ఉ. చవి—చంద్రుఁడు. వీనిలో చవి తెనుఁగుశబ్దము గావునను
రము అకారముతోఁ గూడి యగుటను చ దంత్యము. చంద్రుఁ డను
టలో చకారము 'అ' తోఁగూడియుండినను నది తత్సమ శబ్దము గా
దంత్య మని చెప్పరాదు. తాలవ్య మనియే చెప్పవలయు. జగత్ అను
మునకుఁ దత్సమము జగము. తద్భవము జగము. కాంచనమ్—తత్సమము కా
నము—తద్భవము కాంచనము. ఇట్టులే తత్సమంబున 'రాజు' అనియుఁ దద
బున 'రాజు' అనియు నగునని తోఁచెడి. రారాజు. "హ్రదాదిస్వర
పరంబగుచో దంత్యతాలవ్యంబులు తొల్లింటి యట్ల య
నగును. ఉదా. 'రాజితఁడు' రాజు అను నది ఉకారాంత తద్భవము
జు దంత్యము—దీనికి 'ఇతఁడు' పరము కాఁగా 'రాజితఁ' డని య
ఇప్పుడు 'జ' ఇకారముతోఁ గూడియున్నది గనుకఁ దాలవ్యముగ నుచ

## య

సూ॥ ౪౧. సిద్ధయకార మలఘువు.

శబ్దముతోనే పుట్టిన 'య' కార మలఘువు. ఉ. చాయ. దీనియందు 'య' కారము చాయ యను శబ్దము పుట్టినపుడే పుట్టినదిగాని నడుమ వచ్చినది కాదు.

సూ॥ ౪౨. సాధ్యము లఘువు.

శబ్దము పుట్టినపు డేదైన నొక యచ్చుండి యా యచ్చు 'య' కారముతోఁగూడి మాటినయెడల నట్లు మాటివచ్చిన 'య' కారము లఘువు. ఉ. మేన+అత్త. ఇచట 'అత్త' అనుశబ్దములో యకారము లేదు. అయినను నీ రెండుశబ్దములు సంధి గలిసినపుడు సంధిసూత్రము ప్రకారము 'అ' 'య' అయి 'అత్త' 'యత్త' యగుచున్నది. మేనయత్త. ఈ యకారము తొలుతలేక నడుమ సూత్రము ప్రకారము వచ్చినది కాఁబట్టి యిది లఘుయకారము, దీనికి యశ్రుతి యనియుఁబేరు. ఇట్టులే వచ్చి యిచ్చెను.

## ర-ఱ

సూ॥ ౪౩. సంయుక్తాక్షర క్రియాంతములం దలఘు రేఫము, ద్విత్వాక్షరమందు లఘు రేఫము లేదు.

ర. ఈ విధముగ వ్రాయఁబడు నక్షరము లఘు రేఫము.

ఱ. ఇది యలఘురేఫము. దీనినే శకటరేఫము, బండి ఱా, పెద్ద ఱా, గురు రేఫము అందురు.

ఉ. గుఱుతు–గుర్తు, కాఱుకొను=కొర్కొను, కట్టి–కెట్టి మొ. గుఱుతు అనునపుడు రేఫము గురువుగాఁ బలికినను దానియందలి యచ్చు తొలఁగించి నపుడు గురుత్వము పోయి లఘువుగానే యుచ్చరింపఁబడుచున్నది. కావున గుఱ్తు అని వ్రాయుట సరిగాదు.

సమాపకక్రియల కడపట లఘురేఫమేకాని యలఘురేఫము లేదు. ఉ. వచ్చిరి-పోయిరి-రూపజేరి-ఇత్యాదులు. శ్రుద్రులు ఖుద్రులు ఇవి తెలుఁగులు గావు. టర్ +అని=టర్రని. గుజ్ +అని=గుజ్జనిచూడుము. సంధి ౭౪.

ల

సూ॥ ౭౮. సిద్ధలకారము లఘువు.

ల. ఈ ప్రకారము వ్రాయఁబడిన ల కారము శబ్దముతోనే పుట్టిన యెడల నది లఘువు. ఉ. కలువ-విలువ, నలఁవ, చెలువ.

సూ॥ ౭౯. సాధ్యలకారం బలఘువు.

అటుగాక శబ్దముకడపట అ, ర, ల, డ, వీనిలో నేదైననుండి యా శబ్దమునకు బహువచనరూపమున నీ నాలుగక్షరములలో దేనికిఁ గాని బదులుగా 'ళ' వచ్చినయెడల నది యలఘువు. ఉ. ఏఱు దీనిలో కడపట 'అ' యున్నది. ఈశబ్దము బహువచనమందు ఏఱులు, ఏళులు, ఏళ్లు అని మాఱును. అప్పుడు అకార మున్నస్థలమున 'ళ' కారము వచ్చెను గనుక నది యలఘువు. ఇట్లే గోరు—గోరులు—గోళ్లు; పాలు—పాలులు—పాళ్లు; త్రాడు—త్రాడులు, త్రాళ్లు మొదలైనవి.

కూళ, బాళి ఇత్యాదులయం దున్న 'ళ' కారము లఘువా యలఘువా యని యడిగిరేని వీనియం దుండు 'ళ' కారములు బహువచనమున అ, ర, ల, డ, వీనికి బదులు వచ్చినవి గావు గనుకను, 'ళ' కారము య, ర, ల, వ, వీనిలోఁ జేరిన యక్షరముగాక (స, హ, వీనివలె) ప్రత్యేకాక్షర మగుటచేతను లఘువులు అలఘువు లనుభేదము య, ర, ల, వ, లకుఁ దప్ప మఱి యేహల్లు నకు లేకుండుటచేతను లఘువులు కావు, అలఘువులును గావని చెప్పవలయును. సంస్కృతమున వేదోక్తులఁ దప్ప 'ళ' లేదందురు. అయినను దెనుఁగునఁ గొన్నియెడల 'ళ' వ్రాయుటే బాగు. ఉ. ఆయింతికయ్యాపరిమళభరితము. దీనిని 'మలభరిత' మనిన నాంధ్రులు నవ్వుదురు. ఇట్లే కాళిదాసుఁడు. ఈతఁడు మాళవంబున కధిపతి మంగళము, మంగళవారము. ఇత్యాదులు.

## వ.

సూ॥ ౪౬. ఆదేశవకారాగము లఘువు. సిద్ధవకార మలఘువు.

సంధిపరిచ్ఛేదము ౨౬-వ సూత్రము ప్రకారము 'ప' కారమునకు బదులు వచ్చిన 'వ' లఘువు. శబ్దములోనే పుట్టెనేని యాలఘువు. ఉ. రాముఁడు+పలికె' నన్నచోటఁ బై సంధసూత్రము చొప్పున 'ప' కు బదులు 'వ' వచ్చి రాముఁడు వలికెనని యాయెను గనుక నింవలి వకారము లఘువు.

ఆదేశ మనఁగా నొక యక్షర మున్నస్థలమున నుండి దానిని నెట్టివేసి దానికి బదులు మఱియొక యక్షరము వచ్చుట. ఉ. రాముఁడు+పలికె. ఇచట 'ప' తీసివేయఁబడి దానిబదులు 'వ' వ్రాయఁబడెను. ఇట్లే త్రాడు-త్రాళ్లు మొదలైనవి.

ఆగమమనఁగా నెక్కువగా నొక యక్షరము వచ్చుట. ఉ. మేన+అత్త యని యుండఁగా సంధి ౨-౯ సూత్రముల ప్రకారము 'య్' యెక్కువగా వచ్చి 'మేన+య్+అత్త' అని యేర్పడి 'య్+అ=య' అయి మేన+యత్త యని యాయెను. కాఁబట్టి యిచట 'య్' ఆగమము.

## యె

సూ॥ ౪౭-౪౮.

రెండు సూత్రంబులయందును 'యె' యను నక్షరము సంధివలనఁగా మాట నడుమ నెచ్చటెచ్చట నుండునో యది చెప్పఁబడినది.

సూ॥ ౪౭.

i. భూతార్థక క్రియాపదములు. అనఁగాఁ గడచిపోయిన కాలమును దెలియంజేసెడు క్రియలు. ఉ. కనియెను, చనియెను—పోయెను. ఇవి భూతకాలమును దెలియఁజేయును గావున నిట్టివానియందు 'యె' వ్రాయవలయునుగాని 'కనియను' చనియను, పోయును.' అని 'య' వ్రాయరాదు.

సుతు గ్రద్ద దన్నుకొనిపోయెఁ బంచ. ఇది యసాధువు. 'చెలియా సీతోఁ బోండు చింతకాయ' ఇతదు రెండవ యర్థమున "అయ" యసాధువు.

ii. తద్ధర్మార్థకక్రియలు. ఇవి మూఁడు కాలములయందు నుపయోగింపఁబడును. ఉ. కనియెడుఁ—చనియెడుఁ—వినియెదఁ—మనియెదఁ. వీని యందలి యకార మెత్వము గలది.

సూ॥ ౪౭.

iii. ఉయ్యెల, పయ్యెద, తాయెతులు, ఈ మూఁడు శబ్దంబులను 'యె' కారము నడుమఁ గలవి. ఉయ్యెలకు 'ఉయ్యాల' 'ఉయ్యాల' యనియును, పయ్యెదకు 'పయ్యాద' యనియు 'య' కారము గల రూపాంతరములును గలవు.

మీఁదఁ జెప్పిన మూఁడుచోటులను దప్ప మాటనడుమ నెం కెక్కడను యె వ్రాయరాదు. 'హరియెక్కడ్.' ఇది తొలుతే 'హరి+ఎక్కడ్' అని యుండఁగా 'యె' కారము సంధివలన వచ్చినది.

## పదాది నిషిద్ధవర్ణములు.

**సూ. ౪౮. ణ, య, ళ, ఫు, ఫూ, వో, వో యనునక్షరములు తెనుఁగుమాటలకు మొదట నుండవు.**

యకారమాదినిగల యాతి, యముఁడు మొదలగు శబ్దములు తత్సమములే కాని తెలుఁగులు కావు. 'య' యనుటచే యి—యు—యె—యో లును దీర్ఘములును గూడఁ దెలుఁగుమాటలకు మొదట నుండవు. వూరు—వుంగము—వోగిరము—వొకఁడు లోనయినవి సాధువులు కావు. ఊరు—ఉంగరము ఓగిరము—ఒకఁడు అనునవి సాధురూపములు. ఇట్టులే పదాదిని 'వు' వూ, వో, లుచ్చరించునట్లు తోఁచిన యన్ని తెలుఁగులందును ఉ ఊ—ఒ-లు గ్రహింపనగు. సంధియందు వుకారాదులు వచ్చిన వచ్చును ఉ. నీ కఁడు. నీ వూరకయుండుము. మొ. సంస్కృతమున యకారాది శబ్దములు

పండిగఁగలవు. ఘోష్య—ఘోషవ్యాది సంస్కృత శబ్దములందు 'ఘో' యను నక్ష రము పదాదిఁ గాన నయ్యెడి. వ్యుత్పత్తి—వ్యూహము—వ్యోమము. ఇట్టి సంయుక్తాక్షరంబులు తొలుతఁ గల శబ్దంబులు సంస్కృతభాషయందుఁ గలవు.

వర్గయుక్కులు వర్గయుక్కులతో ద్విత్వము లయిన యక్షర ములును, ఱ్ఱ యును, నేమాటలలో నెచ్చోటనైన నుండవు. ద్విత్వాక్షరములును మాటలకు మొదట నుండవు. అబ్భంగి తుక్కారము అని యుండునుగాని 'అభ్భంగి' తుఖ్ఖారము ఇట్టి యక్షరము లుండవు. లెఖ్ఖ యట్టి రూపములు నుండవు. ణ, ళ, లు సంస్కృత శబ్దం బుల మొదటనుగూడ లేవు. గుఱ్ఱము అని వ్రాయవలయును. గుఱ్రము గుఱ్ఱ్రి అని వ్రాయరాదు. చూడు సూ. ౪౩!

క్రావడితోఁ దప్ప నే యితర హల్లుతోను సంయుక్తమైన హల్లును దెలుఁగుమాటకు మొదట లేదు. ఉ. వ్రాలు, ప్రోలు, క్రాలు, ఇవి తెనుఁగుమాటలు. స్కందుఁడు, చ్యుతము, ప్లవగము, స్మరుఁడు, ఇవి తత్సమములు. ఏలన నీమాటలలో మొదటనుండు స్క, చ్యు, ప్ల, స్మ ఇవి రేఫముగాని హల్లులతోఁ గూడియున్నవి. రేఫసంయుక్తాక్షరములు తత్సమ శబ్దంబుల మొదటను నుండును. ఉ. ప్రాణము.

వ్యాఖ్యేయము. ఈయొకశబ్దము మొదటమాత్రము తెలుఁగున రేఫము గాని హల్లుతో సంయుక్తమైన యక్షరము గనంబడుచున్నది.

## సంజ్ఞా ప్రకరణము.

### సూ॥ ౫౦. ప్రాతిపదికము నామము.

(నామము) పేరునకుఁ బ్రాతిపదిక మని సంజ్ఞ. ఉ. రాము—కృష్ణ మొ. ధాతువు గాక, ప్రత్యయము గాక, ప్రత్యయముతోఁ గూడిన శబ్దమును గాక, యర్థము గల శబ్దమునకుఁ బ్రాతిపదిక మని పేరు. రామ—ఇది ధాతువు గాదు. (రమ్ అనునది ధాతువు—దానివలనఁ బుట్టినది రామ) డు—ము—

వు–లు–ని–ను లోనైనవి ప్రత్యయములు. 'రామ' యనునది వానిలోఁ జేరినది కాదు.

రాముఁడు అనునది ప్రత్యయముతోఁ గూడినశబ్దము కావున రామ యనునది ప్రత్యయముతోఁ గూడినదికాదు. అయినను "రామ" యనుదానికి నర్థము గలదు కావున దానిని ప్రాతిపదిక మందురు. ఇట్లే తక్కినవి.

సూ॥ ౫౧. ప్రత్యయము వర్ణకము. డు ము వు లు ఇత్యాదులు. అక్షరములు వర్ణములు అకారాదులు.

సూ॥ ౫౨. ధాతువు క్రియ.

సూ॥ ౫3. 'న' కారము ద్రుతము.

ద్రుతమనఁగా నక్కఱలేనప్పుడు కనఁబడకపోవునది యని యర్థము. నకారమునకు ద్రుత మని పే రుండినను నిజమైన ద్రుతము 'ను' అను నక్షరమని యెఱుంగవలయును. ఈ ద్రుతము ప్రత్యయముతోఁ జేరి వచ్చును. తాను గుఱ్ఱమును గొనెను. ఇం దుండు 'ను' కారములు ప్రత్యయములు. హరిచేతను గిరిచేతను. ఇందు 'ను' లు ఆగమములు. రాముఁడును, లక్ష్మణుఁడును. ఇట 'ను' లు సముచ్చయార్థమును దెల్పు నవ్యయములు. వీనిలో 'ను' లోపించినను దోషములేదు. ఇట్టి 'ను' కారములు ద్రుతములగుఁ గాని చేను-పేను-మీను-బోను ఇత్యాది ప్రథమావిభక్తులయందుండు 'ను' కారములు గావు.*

సూ॥ ౫౪. అదర్శనము లోపము.

అక్షరము కనఁబడక పోవుట లోప మనఁబడును.

---

* ఉన్నాను, ఇట్టిచోట్ల ద్రుతమునకు లోపములేదు. వానిగుఱ్ఱము. ఇచట 'ని' వర్ణము ప్రత్యయాత్మకము గాదు గనుక ద్రుతము కాదు. వాఁడు తినిన యన్నము, పలికిన పలుకులు, చేయని చేష్టలు. ఇచ్చట 'న, వ, ని,' యివి క్రియావిశేషణాత్మకములు గావున ద్రుతములు గావు.

సూ॥ ౫౫. ఏకవిధ మైనహల్లుల కూడిక ద్విత్వము. ఉ. అమ్మ-అక్క-. మొ॥

సూ॥ ౫౬. భిన్నహల్లులసంయోగము సంశ్లేషము. ఉ. లక్ష-రక్ష్యము. మొ॥

అమ్మ యనుమాటయందు మకారమునకు పై నకారమే వత్తుగా నీయఁబడినది. ఇట్టి కూడిక ద్విత్వము. లక్ష యనుచోట కకారమునకుఁ దద్భిన్నమైన షకారము వత్తిగా వ్రాయఁబడినది. ఇట్టి కూడిక సంశ్లేషము - సంయోగ మనఁబడును. ఇట్లు కూడునపుడు హల్లులకు నడుమ అచ్చు రాఁగూడదు. అమ్+మ-అనునప్పుడు 'మ్+మ'-నడుమ అచ్చులేదు. లక్ష లక్+ష అనునపుడును క్+షకు నడుమ అచ్చులేదు. కమ్మ అనునపుడు కకారమకారములకు సంయుక్త మని చెప్పరాదు-క్+అ+మ్+మ. క్॥ మ్ నడుమ 'అ'కారము అచ్చువచ్చినది-ఇట్టిచోటుల 'క'కారమునకు 'మ'కారము పరమైన దని చెప్పఁబడును. సంయుక్తాక్షరముల నుచ్చారణక్రమము ననుసరించి వ్రాయవలయును. స్త్రీ యని వ్రాయవలయును కాని స్త్రీయని జ్యోత్స్న యనుదానిని జ్యోత్స్నయని వ్రాయరాదు. సంయుక్తాక్షరములు వ్రాయుటయందు సంస్కృతమునకు ఆంధ్రమునకు భేదము గలదు. స్వర్గము అనుపదమును మన ముచ్చరించునపుడు అచ్చు వకారముమీఁద గకారముమీఁద నూనుచున్నాము. అట్టి యుచ్చారణ క్రమము ననుసరించియే సంస్కృతమున స్ వ+ర్ గ అని వ్రాయఁబడుచున్నది. ద్రావిడమున నిట్టియాచారమే కలదు గాని తెలుఁగున స+వ్+ర+గ+ము అని అచ్చులు సకార, రకారములకుఁ గూర్చుచున్నాము. కర్ణాటక భాషయం దీయాచారమే కలదు-అనాది సంప్రదాయము దుష్టముగాదు.

సూ॥ ౫౭. క చ ట త ప-లు పరుషములు.

సూ॥ ౫౮. గ జ డ ద బ-లు సరళములు.

సూ॥ ౪౯. ఖఘ ఛఝ ఠఢ థధ ఫభ-లు వర్గయుక్కులు.

సూ॥ ౫౦. కాది మాంతములు స్పర్శములు.

కకారము మొదలు మకారమువఱకుఁ గల యక్షరములకు స్పర్శములని పేరు.

సూ॥ ౫౧. పరుషసరళేతర హల్లులు స్థిరములు.

కచటతప, గజడదబ యీ ౧౦ యక్షరములుగాక మిగిలిన హల్లులకు స్థిరములనిపేరు.

సూ॥ ౫౨. య ర ల వ-లు అంతస్థములు.

సూ॥ ౫౩. శ ష స హ-లు ఊష్మములు.

సూ॥ ౫౪. వర్ణాధిక్యం బాగమంబు.

సూ॥ ౫౫. స్థానాక్రమణం బాదేశంబు.

ఒక యక్షరముయొక్క స్థానమును మఱియొక యక్షర మాక్రమించుట యాదేశము. సంజ్ఞ-సూ ౪౬ చూడుఁడు.

సూ॥ ౫౬. నిషేధ వైకల్పికములు విభాషయగు.

సూ॥ ౫౭. సుబంతము తిజంతము పదము.

## కళాప్రకరణము.

తెనుఁగుశబ్దము లన్నియుఁ గళ లని ద్రుతప్రకృతికము లని రెండువిధంబులు.

సూ॥ ౫౮. ద్రుత మంతమందు లేనిశబ్దములు కళలు.

i. విభక్తులలో డు, ము, వు, లు, కూర్చి, కై, పట్టి, యొక్క సంబోధనములు కళలు.

ii. సమాపక క్రియలలోఁ బ్రథమోత్తమ పురుష బహువచనంబును, మధ్యమపురుషంబునం దుభయవచనంబులును, భూతార్థక బహువచనము కళలు.

ద్రుతమనఁగా నకారమని ముందే చెప్పఁబడెను. డు—ము—వు—లు—కూర్చి - కై - పట్టి - యొక్క- సంబోధనములు కళలనఁగా ఆప్రత్యయములు కడపటఁగల శబ్దముల తుదయందు నకారము లేదని యర్థము. ఉ. రాముఁడు, వనము, ధేనువు, రాములు, రాముఁగూర్చి, రామునకై, జ్ఞానముఁబట్టి, జ్ఞానము యొక్క, రాముఁడా, రాములారా, రామా, వీనికి నకారముఁ జేర్చి వ్రాయ రాదు.

తనను గుఱించి చెప్పు క్రియ యుత్తమపురుషక్రియ. ఉ. ఏకవచనము. వచ్చితిని. బహువచనము. వచ్చితిమి.

ఎదుటివాని గుఱించి చెప్పునది మధ్యమపురుషక్రియ. ఉ. ఏకవచనము. వచ్చితివి. బహువచనము. వచ్చితిరి.

ఈ యిరువురను గాక మఱియెవరినో తెలుపునది ప్రథమ పురుషక్రియ. ఉ. ఏకవచనము. వచ్చెను. బహువచనము. వచ్చిరి.

ఈ యుదాహరణములఁ జూడఁగా వచ్చితిని వచ్చెను అను రెంటియందు మాత్రమే నకారము కనఁబడుచున్నది. ఇవి యుత్తమపురుషమున ఏకవచనము, ప్రథమ పురుషమున ఏకవచనము. ఇవిగాక మిగిలిన

ఉత్తమపురుషమున బహువచనము. ఉ. వచ్చితిమి, వచ్చుచున్నాము, రాఁగలము.

మధ్యమపురుషంబున ఏకవచన బహువచనములు. ఉ. వచ్చితివి - వచ్చితిరి.

ప్రథమపురుష బహువచనము. వచ్చిరి, వచ్చుచున్నారు, రాఁగలరు. అనునవి కళలు. (వచ్చితిని, వచ్చెను ద్రుతప్రకృతికములు).

అర్థవిశేషంబునఁ గళలు ద్రుతప్రకృతికములట్లు యగు.

ఉ. వాఁడుసత్యముఁ గనఁడుఁ వినఁడుఁ. నగి నగియేనియుఁ విను జనార్దన. ఓటయొకంతయేనియు. మఱిఁ-అంతనుండిఁ.

భూతార్థక బహువచనములు. ఉ. వచ్చిరి-చేసిరి.

iii. అసమాపక క్రియలలోఁ గ్త్వార్థకములు కళలు. ఉ. వచ్చి, రాక, చేసి, చేయక, చూచి, చూడక మొదలైనవి.

iv. అర్థకములందుఁ గళలు.

కించిదర్థకము. ఇంచుక, కొంచెము, గోరంత మొ.

ప్రశంసార్థకము అయ్యారే, బళి, బళీ, బాపురె. బాపు, వహ్వా మొ.

ఆశ్చర్యాద్యర్థకము. ఔర, ఆహా, అద్దిర, ఓహో.

సంతాపార్థకము. కటకట - కట్టా - అక్కట - అయ్యో - అకట - అకట - అకటా - మొ.

యదార్థకము. ఎప్పుడు.

తదార్థకము. అప్పుడు.

సంప్రత్యర్థకము. ఇప్పుడు.

ఆశీరాద్యర్థకము. కాక. ఉ. రక్షించుఁగాక.

కిమర్థకము. ఏమి - ఏది - ఎది మొ.

ఏవార్థకము. దీనికే అవధారణార్థక మనియుఁ బేరు. అ. ఎ, ఏ.

ఉ. రాముఁడె, రాముఁడే మొ. ఇది నిశ్చయముఁ దెలుపును.

భావార్థకము. ఉ. వచ్చుట.

ప్రశ్నార్థకము ఏల, ఏలా మొ.

తూష్ణీమర్థకము, ఊరక, మిన్నక.

కిలార్థకము. కద, కదా, కాదె, కాదే, అఁట, కా.

చుమ్ము, చుమీ, ఏని, వే, అంత, ఇంత, ఎంత-అట్టె-అట్టులు-ఇట్టులు-ఎట్టులు - కాని - నెట్టన - మొదలైన శబ్దములును కళలు. అంతసొమ్ము, గంపంత, వాని సంపద యంత యింతని చెప్పరాదు, అంతకంటె, వాఁడు వచ్చునంతకు, ఇత్యాదులందు అంత ఇంత కళలు. పురే ప్రశంసార్థకముగాదు.

గూను, మేను, నాను, మీను, పేను, బోను, చేను, మ్రాను, అన్ను, పొన్ను, తెన్ను, కన్ను, చెన్ను, మన్ను, ఎన్ను, పన్ను, మిన్ను, వెన్ను, విన్ను, మున్ను, ఇత్యాదిశబ్దముల కడపట 'ను' కార ముండినను నివి ప్రథమావిభక్తి లగుటచేతఁ గళలేగాని ద్రుతప్రకృతికములు గావు. లోచవి-లోమాపు-లోచెయి-లోకడుపు-లోపడు-లోతక్కువ - లోచేసికొను-చేపడు-తోపాటు - పైపడు - పైపాటు-పైపై-ఈ శబ్దములయందలి 'లో-చే-తో-పై' యివి ద్రుతప్రకృతికములు గావు. ఇవి యేకపదములు.

## ద్రుత ప్రకృతికములు.

సూ॥ ౬౯. ద్రుత మంతమందుఁ గలశబ్దములు ద్రుత ప్రకృతికములు.

i. డు ము వు లు, కూర్చి, కై, పట్టి, యొక్క, సంబోధన ప్రత్యయములుగాక తక్కిన యన్ని ప్రత్యయంబులును,

ii. ఏను, నేను, తాను, పదంబులును,

iii. ఉత్తమ పురుషైక వచనంబులును,

iv. భూత, తద్ధర్మార్థక ప్రథమపురుషైక వచనంబులును

v. శతృ, తుము, క్త్వానంతర్య, చేదాద్యర్థకంబులును-ఆశీరాద్యర్థకంబులయిన ఎడు-త వర్ణకంబులును,

vi. సముచ్చయార్థకంబులైన 'యు' 'ను' లును,

vii. ఎల్లాదులును,

ద్రుతప్రకృతికములు.

i. డు - ము - వు - లు కూర్చి - కై - పట్టి - యొక్క - సంబోధన ప్రత్యయములుగాక తక్కిన ప్రత్యయము లనఁగా ని, ను, ల, చేత, చే, తోడ, తో, కొఱకు, వలన, కంటె, కి - కు - లో - లోపల - అందు, ఇందు - న - ఎందు - ఇవి యన్నియు ద్రుతాంతములు. అనఁగా రామునిన్ - వనమున్ - రాముని చేతన్ - రాముచేన్ - రామునితోడన్ - రాముతోన్ - రాముని కొఱకున్ - రామునివలనన్ - రామునికంటెన్ - రామునికిన్ - రామునకున్ - రాములలోన్ - రాముల లోపలన్ - రామునియందున్ - వనమునన్ - ఇందున్ - ఎందున్ అని రూపంబులు.

ii. ఏను - నేను - తాను. ఇవి ప్రథమావిభక్తులైనను ద్రుతప్రకృతికములు. 'ఏనువిడవ' దిగెవ ననుపాఠ మసాధువు. 'ఏనువెనుక' ననుట సాధువు.

iii, కళలవిషయములోఁ జెప్పినట్లు ఉత్తమపురుషము ఏకవచ. వచ్చితిని.

iv. భూతార్థకము - ప్రథమపురుషము ఏకవచనము - ఉ. వచ్చెను. తద్ధర్మాద్యర్థకము - ఉ. వచ్చెడున్ - చేసెడిన్. వచ్చున్.

v. శత్రర్థకము - ఉ. వచ్చుచున్.

తుమున్నర్థకము - ఉ. రాన్.

ఆనంతర్యార్థకము. ఉ. వచ్చుడున్ - చేయుడున్ - అనుడున్ - నావుడున్ - అనవుడున్ - రాఁగన్ - చేయఁగన్ - అనఁగన్.

చేదాద్యర్థకము. ఉ. వచ్చినన్.

ఆశీరాద్యర్థకము - ఉ. ఎడున్ - తన్ పర్యాయములు. మిమ్ము దైవము రక్షించెడున్ - మిమ్ము దైవము రక్షించుఁగాతన్. ఈ క్రియల లక్షణములఁ గ్రియాపరిచ్ఛేదంబునఁ జూచునది. ఇత్యర్థకమైన 'కా' ప్రత

ప్రకృతికము. ఉ. అపాయంబు సేయునకాఁదలంచి. ఇవిగాక కొన్ని శబ్దములు ద్రుతప్రకృతికములు గలవు.

vi. ఎల్ల - ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - చాల - కూడ - మీఁద - ఎడ - ఎడల - పయి - పై - వఱకు - కనుక - లప్ప - తక్క - కావున - కాన - మిగుల - కడు - దనుక - దాఁక - పోలె - మాడ్కి - బలె వలె - కైవడి - అయ్యు - ఐన - ఒండె - ఒగి - మొగి - అయిన - కోలె - కొలె - అవల - ఆవల - అవుల - తరువాత - అంతట - అంత (తరువాత ననునర్థమున) మొదలైనవి యన్నియు నకార మంతమందుఁ గలవి.

ఈ ద్రుతప్రయోజనము సంధిపరిచ్ఛేదంబునఁ దెలియఁగలదు-ద్రుత ప్రకృతిక జ్ఞానములేనివాని వ్రాఁత సలక్షణమనఁబడదు-కావున విద్యార్థులు వీనినెక్కువ శ్రద్ధతో ముఖస్థములఁ జేయవల్లయు. అటులన్-ఇటులన్-లేకన్-ఇత్యాదులు ద్రుతప్రకృతికములు గావు కావున నసాధువులు. వ్యాసపరిచ్ఛేదంబున దోషప్రకరణముఁజూడుఁడు.

vii. సముచ్చయంబులైన 'యు' 'ను'.

హరియున్-గిరియున్. రాముఁడును లక్ష్మణుఁడును. నేనును జూచి తిని-ఇందువాస్తవమైన సముచ్చయము 'ఉ'త్తుగాఁ గానంబడుచున్నది.

ఈ 'ఉ' ఉదంత శబ్దములకును, ద్రుతప్రకృతికములకుఁ బరమైనపుడు 'న్' ఆగమంబగు. (న్+ఉ) రాముఁడును లక్ష్మణుఁడును వచ్చిరి. అప్పుడును నిపుడును. అ-ఇ-ఎ లు కడపటఁ గలశబ్దములకుఁ బరమైనపుడు 'య్' ఆగమంబగు. (య్+ఉ) పడకయుఁ బుడకయు, హరియు సిరియు, వదినెయు మఱందియు. ఏనియు-ఏనిని-ఏనిన్ అనుతిక్కనప్రయోగంబులందు 'ఏనియును' అని తొలుతటి రూపము-ఇందు 'ఉన్' లోపింపఁగా 'ఏనిన్' నై 'ఏనిని' యని యయ్యె-ఇట్లు వెండిన్-మఱిన్-ఉండిన్-ఏమున్-ఇత్యాదులు. ఈ

ద్రుత మర్థవిశేషమందును, వాక్యాలంకారమందును గూడఁ బ్రయోగింపఁ బడును.*

సమాసంబుల ద్రుతాంతంబులును గళలయట్లు యగు చూ-సంధి. ౪౭.
ఉ. తినిన యన్నము-చేసిన కార్యము-ఎల్లపాపములు. ఎల్లవలన. భా. అను.

సూ॥ ౭౦. ఆంధ్రభాష చతుర్విధము.

ఆంధ్రభాష నాలుగువిధములు. తద్భవము-తత్సమము - దేశ్యము - గ్రామ్యము.

సూ॥ ౭౧. వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచేఁ దద్భవంబు లగు.

---

*ఆ. తొలివిభక్తియందుఁ గల ప్రత్యయంబులు
కూర్చి, పట్టి, యొక్క, గుఱిచి, కైలుఁ
గాక పెక్కువిభక్తిఁ గల ప్రత్యయంబులు
చను ద్రుతప్రకృతికసంజ్ఞ రామ.

క. అర్థకముల నానంత, ర్యార్థక భూతార్థకములు నాశీస్సును జే
వర్థక తద్ధర్మతయు, న్నర్థకళ త్రర్థకములు నగు సద్రుతముల్.

తే. ఇఁగను, గావున, మీఁదఁ బై, నింక, నంత
నెట్టకేలకుఁ, గడుఁ, దక్క, నెల్లఁ, గాన,
నెడలఁ, గూడను, మీఁదను, నెడను, జాల,
వఱకుఁ దప్పను నివి ద్రుతప్రకృతికములు.

క. వలె, మాఱ్కిఁ, బోలె, డాఁకను
బలె, నైనన్ గనుక, నొండెఁ, బయిఁ, గోలె, నాగిన్
గొలె, మొగి, దనుక, సముచ్చయ
ములును ద్రుతప్రకృతికములు బుధసమ్మతిచేన్.

సంస్కృతశబ్దమునందును, ప్రాకృతశబ్దమునందును గలయక్షరములు విడుచుటచేనైనను (దీనికే వర్ణలోప మని పేరు.) క్రొత్త యక్షరము లెక్కువగఁ జేర్చుట (వర్ణాగమము) చేనైనను, ముందక్షరము వెనుక, వెనుకటి యక్షరము ముందుగా మార్చుటచే (వర్ణవ్యత్యయము) నైనను, గలిగిన తెనుఁగు శబ్దములు తద్భవములు. సంస్కృతమువలనఁ బుట్టినశబ్దములు సంస్కృతభవములు. ప్రాకృతమువలనఁ బుట్టినవి ప్రాకృతభవములు.

వర్ణలోపమున కుదాహరణములు. భోజనమ్-బోనము. ఇట జకారమునకు లోపము. తామరసమ్=తామర-సకారమునకు లోపము. ఇట్టులే కాళహస్తి=కాళాస్తి. ఉజ్జయని=ఉజ్జేని, ఉజ్జని. జయః=జా-జే.

వర్ణాగమము. ఉ. రథః-అరదము. ఇచట 'అ' యాగమము. దేవః-దేవర, ఇట 'ర' యాగమము.

వర్ణవ్యత్యయము. ఉ. శుచిః-చిచ్చు; కక్షః-చంక.

చంద్రః - చందురుఁడు; సముద్రః - సంద్రము. ఇవి సంస్కృతభవములు.

ప్రవాళమ్-పవడము; కాంస్యమ్-కంచు. ఇవి ప్రాకృతభవములు.

సూ॥ ౭౨. సంస్కృతశబ్దముతోను ప్రాకృతశబ్దముతోను సమానమైన రూపముగలది తత్సమము.

సంస్కృత ప్రాకృత శబ్దముల కడపట నుండు విసర్గమునుగాని, హల్లునుగాని, దీర్ఘమునుగాని త్రోసివేసి వలసిన చోట డు, ము, వు ప్రత్యయములఁ జేర్చినఁ దత్సమము లగును. ఉ. రామః. ఇది సంస్కృత శబ్దము. తెనుఁగున విసర్గము లేదు. కాఁబట్టి విసర్గము విడిచి దానిబదులు ప్రథమావిభక్తి ప్రత్యయము 'డు' చేర్చిన రాముఁడు అని యయ్యెను గనుక

తత్సమము. ఇట్లు విష్ణుః=విష్ణువు (ఉకారాంతము గాన 'వు' వచ్చెను.) హరిః=హరి; వనమ్=వనము; వనితా=వనిత; లక్ష్మీః=లక్ష్మి ఇత్యాదులు సంస్కృతసమములు.

సంస్కృత సంయుక్తానునాసికంబుల పొల్లులకు సర్వత్ర తత్సమంబులం బూర్ణబిందువగు. ఉ. కాఞ్చనమ్-కాంచనము. కూశ్మాణ్డః-కూశ్మాండము. ఖణ్డమ్-ఖండము-పఙ్క్తిః-పంక్తి. ఇత్యాదులు.—సంస్కృతమున కాఞ్ చనమ్ అని కూశ్మాణ్ డః అని ఖణ్ డము అని వ్రాయఁబడును. ఇందు ఞ్, ణ్, ఙ్ ఇవి పొల్లులు.

ఈ శబ్దములను దెలుఁగున వ్రాయునపుడు ఈ పొల్లులకు బదులు నిండు సున్నలు వ్రాయఁబడును.

## తత్సమ శబ్దములను దెలిసికొను విధములు.

i. సంస్కృతముననుండి తెనుఁగునలేని ౧౫ యక్షరములలో నేయక్షరమైనఁ గలశబ్దములును. ఉ. రాక్షసుఁడు. అవధారు-వసనాభి-జలభి యను మూఁడు పదంబులఁ దెనుఁగున వర్గయుక్కులు కానఁబడియెడి.

ii. యకారము - చై - జై - వు - వూ - వొ - వో - యనునక్షరములు మొదటఁ గలశబ్దములును. ఉ. యతి - చైత్రము - జైత్రుఁడు - వోఢ - వోఢవ్యము మొ.

iii. అనుస్వారమునకుఁ బ్రక్కఁ బరుషసరళములుగాక యిఁక నే యక్షరములుకాని కలశబ్దములును. ఉ. శృంఖలము మొదలైనవి.

iv. వ్యాజ్యమనుశబ్దము తప్ప రేఫేతరహల్లుతో సంయుక్తమైన వర్ణము మొదియందుఁ గలశబ్దములును. ఉ. స్యందనము.

v. రెంటికిమించి హల్లులు సంయుక్తములైన శబ్దంబులును. ఉ. మత్స్యము; నిర్వ్యాపారము మొదలైనవి. ముత్రోవ - ఇది సమాసము.

తత్సమము లని యెఱుంగనగు. వసనాభి సంస్కృతముగఁ గొందఱు వాడియున్నారు.

శ్రీయను సంస్కృతపదము సిరీ రాజ్ఞీయనునది రాణీ యని ప్రాకృతమునఁ గాఁగా వీనిలోఁ గడపటనుండు దీర్ఘములు పోఁగా సిరి-రాణి యని ప్రాకృతసమము లేర్పడెను. శ్రీరంగము-సిరంగము; శ్రీరామునేన-సీరామునేన.

## సూ॥ ౨౩. దేశమున వాడఁబడునది దేశ్యము.

ఆంధ్రదేశ్యము. ఆంధ్రదేశమునఁ బుట్టి యాంధ్రజనులచే వాడఁబడునన్న తెలుఁగు.

అన్యదేశ్యములు. ఆంధ్రు లితరభాషలలోని పదములను దమభాషలోఁ గలుపుకొనినవి. ఉ. పురే ఇది మహారాష్ట్రపదము. చాలు నని యర్థము. ఇది ప్రశంసార్థకమైన బాపురే నుండి యైనదికాదు.

తల్లి - తండ్రి - పురే - వీనియందలి యక్షరములు తెనుఁగుభాషలో నుండునవి గనుక నివి యాంధ్రవర్ణయుక్తములు.

రావు, శవర, వీనిలో నుండు ఱకారములు తెనుఁగక్షరములలో లేవు గనుక నివి యనాంధ్రవర్ణయుక్తములు. (అనాంధ్రవర్ణము=ఆంధ్రవర్ణము కానిది.)

## సూ॥ ౨౪. శాస్త్రనిషిద్ధము గ్రామ్యము.

లోకములోని జనులు మాటలాడుశబ్దములలో వ్యాకరణశాస్త్రవిరుద్ధమైనది గ్రామ్యము. ఉ. మావూరికి నీ వెప్పు డొచ్చావు. వాండు వస్తాఁడా ఇత్యాదులు. ఇట్టిపదములు ప్రయోగమునకు యోగ్యములు కావు గనుక నింద్య గ్రామ్యము లని పేరు. గ్రామ్యభాష నిషిద్ధమైనచో దాని నేల చేర్చి యాంధ్రభాష నాలుగువిధము లని చెప్పవలయునని కొందఱు బాలురు సందేహింతురు. ప్రతిశాస్త్రమందును గుణలక్షణము దోషలక్షణము గూడఁ జెప్పుట యాచారము. అటు చెప్పి సదోష మగ్రామ్యా మని వెంటనే యందుఁ జెప్పఁబడియుండును. గుణవర్ణనముచేతనే దోషలక్షణము చక్కఁగ బోధపడదు. అన్యభాషావ్యాకరణములందు నిదియే సంప్రదాయము. గుణములు మూఁడు విధ

ములు - సత్త్వము - రజస్సు - తమస్సు - అనిచెప్పి తమోగుణము కలవార లధోలోకమునకుఁ బోదు రని వెంటనే చెప్పఁబడి యుండలేదా. వాకుక యందు గ్రామ్యము కన నగును గావున దాని నొకభాగముగ గ్రహించి దాని ప్రయోగము గ్రంథముల నిషేధింపఁబడినది.

గ్రామ్యములుగా నుండినను బెద్ద లిదివఱకే గ్రంథముల నుపయోగించినమాట లనింద్యగ్రామ్యములు. ఉ. కఱకంఠుఁడు - ప్రాణగొడ్డము.

గరకంఠభవము కఱకంఠుఁడు - ప్రాణకుట్టకభవము ప్రాణగొడ్డము. ఇవి గ్రామ్యములే కావనియుఁ దద్భవములనియుఁ గొందఱ యభిప్రాయము.

చిన్నయసూరిగారు కపిలగడ్డము - కపిలజడ లుదాహరించుట ప్రమాద ముననే. కవిలగడ్డము-కవిలజడ లనియే భారతమునందుఁ బ్రయోగింపఁబడెను.

## సూ॥ ౭౫. నామబిరుదంబులు లక్షణాతీతంబులు.

నామంబులు బిరుదులు లక్షణవిరుద్ధంబులుగ నున్నను వానిని సవరించి వ్రాయక యున్నదున్నట్లు వ్రాయవలయును. రామారెడ్డి - సీతారావు చూఱకారుఁడు. సుబ్బారాయుఁడు. కృష్ణదేవరాయలు. వేంకటరామశాస్త్రి.

## సూ॥ ౭౬. నిందానుకరణంబుల గ్రామ్యంబు దుష్టంబు గాదు. అయ్యది కావ్యంబుల ననుచితంబు.

నిందయందును, అనుకరణమందును వినోదార్థము గ్రామ్యంబు ప్రయోగింప నగును గాని యది యుత్తమకావ్యంబుల నుండఁదగినది కాదు. అధమ కావ్యంబుల నుండుటొప్పు. చూ. వ్యాసపరిచ్ఛేదము. చంద్రశేఖర శతకము వేణుగోపాల శతకము, భాషీయదండకము సారంగపాణిపదములు లోనైన విట్టివి.

## సూ॥ ౭౭. కవిసంకేతితసుప్రసిద్ధ పదంబె ప్రయోక్తవ్యంబు.

మహాకవు లేర్పాటు చేసికొనిన ప్రసిద్ధమైన మాటలనే గ్రంథముల

నుపయోగింపవలయునుగాని వారివారి యిష్టప్రకారము కొందఱు కర్తలు పెట్టు కొన్న పదము లుపయోగింపఁగూడదు.

ఉత్తమగ్రంథంబుల వ్రాయఁబడు పదము లంధ్రప్రపంచమునఁ గల యెల్ల యాంధ్రులకు నెల్లకాలము దెలియునవియై యుండవలయును. (చూ. వ్యాసపరిచ్ఛేదము.)

సూ॥ ౭౮. అదోషంబున కప్రయుక్తమను దోషంబు లేదు.

వ్యాకరణనిషిద్ధముగాని పదము పూర్వకవి ప్రయోగము గానరా కున్నను బ్రయోగింపవచ్చును.

# సంధిపరిచ్ఛేదము.

సంధిపరిచ్ఛేదమనుట కర్థము. సంజ్ఞాపరిచ్ఛేదము మొదటఁ జెప్పఁబడినది. (చూ. ౨వ పుట.)

## సంధిలక్షణము.

సూ॥ ౧. పూర్వపర స్వరంబులకుఁ బరస్వరం బేకాదేశం బగుట సంధి.

రెండుమాటలొకటిగాఁ జేయునపుడు మొదటి మాటలోఁ గడపట నుండు అచ్చు పోయి దానికిబదులు రెండవ మాటయొక్క మొదట నుండు అచ్చు నిలుచుట సంధి యనఁబడును. ఉ. మేన + అత్త. న్ + అ = న, గనుక మేన+అత్త = "మే+న్అ+అత్త." దీనిలో మొదటి మాట కడపట నుండు 'అ' కారము పోయి మే + న్ + అత్త యని యుండఁగా, లోపించిన అకారము స్థలములో రెండవ మాటయైన - అత్త యనుదానిలో మొదటి అక్షరమైన 'అ' వచ్చి మే + న్ అ + త్త యని యేర్పడి న్ + అ = న అయి, మేనత్తయయ్యె. రాముఁడు + అతఁడు = రాముఁడ్ ఉ + అతఁడు.' మొదటిశబ్దములోఁ గడపటి యచ్చు 'ఉ' పోఁగా రాముఁడ్ + అతఁడు. ఆ 'ఉ' యున్న స్థలములో 'అతఁడు' అనుదానిలోని మొదటి 'అ' రాఁగా, రాముఁడ్ అ+తఁడు = రాముఁ డతఁ డని యాయెను. ఇట్లే పక్కనవాట్ల గ్రహించునది. రాముఁడు+కలఁ డనువాట రాముఁడ్ ఉ+క్ అ+లఁడు' అని యుండుటవలన ఉ అ అను రెండచ్చులకు నడుమ క్ అనుహల్లు వచ్చుటచే సంధిలేదు. వచ్చెన్ + అతఁడు = వచ్చె+న్ అ + తఁడు = వచ్చె+నతఁడు. ఇచ్చట న్ అ = న అయ్యెను గనుక సంధి కలిసెనని చెప్పుదుము. ఒక అచ్చుపోయి వేఱొక యచ్చువచ్చినదే సంధి.

తెలుఁగునందు అ, ఇ, ఉ అను మూఁ డచ్చులమీఁద నచ్చులు వచ్చిన మాత్రమే సంధి కలయును గాని తక్కిన యచ్చులమీఁద నచ్చులు వచ్చిన సంధి కలియదు.



## అచ్సంధి ప్రకరణము.

### అ

సూ॥ ౨. *అత్తున కచ్చు పరమైనపుడు సంధి బహుళము.

మొదటిశబ్దము కడపట అకార ముండి దానికిఁ బరముగ (అనఁగా ప్రక్కగ అనుకొని) తెనుఁగునందుఁ గల యేయచ్చు వచ్చినను సంధి బహుళముగఁ గలియును.

బహుళ సంధి యనఁగా నిత్య నిషేధ, వైకల్పికములును అన్యవిధములును గలవి. (చూ. సంధి సూ. ౫౭ కడపట) నిత్యమనఁగాఁ దప్పక కలియుట; నిషేధ మనఁగాఁ గలియకయే పోవుట. వైకల్పిక మనఁగా సంధి కలసి యొక రూపము, కలయక యొకరూపము రెండు రూపములు గలిగియుండుట.

సూ॥ 3. నామంబులతుది అకారమునకుఁ బరముగ శ్లేష్టార్థకంబులగు అన్నాదులును, ఆకును, బరమైనచో సంధి నిత్యము.

---

*అత్తు - ఇత్తు–ఉత్తు అనఁగా హ్రస్వమైన అకారము - హ్రస్వమైన ఇకారము - హ్రస్వమైన ఉకార మని యర్థము. ఒక యక్షరమునకు 'త' కారమును జేర్చుట తపరకరణ మనఁబడును. అట్లు తకారమును జేర్చినచో దానికి ముందుండు నక్షరము హ్రస్వమైనచో నామాత్ర మాహ్రస్వాక్షరము నకే యుపయోగించును. దీర్ఘమైన దీర్ఘమునకే. అత్తు అన్నందున హ్రస్వమైన అకార మని యర్థము. ఈ సూత్రము దీర్ఘమైన 'ఆ' కారమున కన్వయింపదు.

అన్న - అయ్య - అక్క - అమ్మ - అప్ప-ఆయి-అవ్వ-అరుసు ఇవి యన్నాదులు. ఉ. రామన్న, సోమయ్య, భీమక్క, రంగమ్మ, రామప్ప, సీతాయి, చింతాకు, పొన్నాకు ఇత్యాదులు. చింతయాకని యొకఁడు పలికెఁ గాని యది మనోజ్ఞముగాదు.

సూ॥ ౭. స్త్రీవాచక, తత్సమ, సంబోధ, నావధారణంబులకు సంధి లేదు.

మొదటిశబ్దము కడపట అకార ముండినను, ఆశబ్దము స్త్రీవాచకముగానో, తత్సమముగానో, సంబోధనాంతముగానో, అవధారణార్థకముగానో (ఏవార్థకము చూ. సంజ్ఞ సూ. ౩౮ - కళలు.) యుండిన సంధి లేదు.

సంధి లేనిచో యడాగమం బగు.

యడాగమము=యట్ + ఆగమము='య్' ఆగమము గా వచ్చు నని యర్థము. యట్ అన్నందున 'య్'అనునది రెండవ శబ్దము మొదట వచ్చునని యర్థము.

ఉ. స్త్రీవాచకము-అమ్మ+ఎక్కడ=అమ్మ యెక్కడ. (అమ్మ+య్ఎక్కడ)
తత్సమము - హంస+ఏది=హంస యేది. (హంస+య్ఏది)
సంబోధనము - చెలువుఁడ+ఇటరమ్ము=చెలువుఁడ యిటరమ్ము.
అవధారణము—రాముఁడ+అతఁడు=రాముఁడ యతఁడు.

వెల+ఆలు=వెలయాలు. ఇచ్చట వెల యనుశబ్దము స్త్రీవాచకము-తత్సమము - సంబోధనాంతము - అవధారణార్థకము గాకున్నను సంధి లేమికిఁ గారణము బహుళ మని మీఁది ౨-వ సూత్రమునందుఁ జెప్పుటయే. బహుళ మని చెప్పినచోట మఱికొన్ని మాఱుపాటులు గలుగును.

అన్యత్ర సంధి వైకల్పికము.

అనఁగా నిత్యసంధి సంధి నిషేధము గల చోటులఁ గాక తక్కినస్థలముల రెండు రూపము లుండును.

ఉ. మేన + అత్త =మేనయత్త (సంధిగలయక)-మేనత్త (సంధిగలసి)
పుట్టిన +ఇల్లు =పుట్టినయిల్లు - పుట్టినిల్లు.
ఉండిన +అతఁడు =ఉండినయతఁడు - ఉండినతఁడు.
చేయక +అనియె =చేయకయనియె - చేయకనియె.
నూట +ఒక్కటి =నూటయొక్కటి - నూటొక్కటి.
వెల్ల +ఏనుఁగు =వెల్లయేనుఁగు - వెల్లేనుఁగు.

ఇ

సూ॥ ౫. ఇకారాంత నామవాచకంబులకు శ్రేష్ఠార్థకంబులైన అమ్మాదులు పరములైనపుడు సంధి ప్రాయికంబు.

ఉ. లక్ష్మి + అమ్మ=లక్ష్మమ్మ; రుక్మిణి + అమ్మ=రుక్మిణమ్మ; జానకి + అమ్మ=జానకమ్మ; దాసరి+అయ్య=దాసరయ్య, కోమటి + అక్క=కోమటక్క. రెడ్డి=అయ్య=రెడ్డయ్య. అమ్మాజి+అమ్మ=అమ్మాజమ్మ ఇత్యాదులు.

ప్రాయిక మనుటచే అమ్మాజియమ్మ యనియు రూపంబు గలదు.

సూ॥ ౬. తత్సమంబులకుఁ గొండొకచో సంధి చూపట్టెడి.

పరమాత్మందురు. (వరాహపురాణము). గంగనుకానె. (ఆముక్తమాల్యద.) పుటార్చిడఁగరాదు. వసు. భారతాది ప్రామాణిక గ్రంథంబుల నిట్టివి లేవు.

ఇకారమునకు నిత్య, నిషేధ, వైకల్పికసంధులు గల సందర్భములు ౭ మొదలు ౯ వఱకుఁ గల సూత్రంబులఁ జెప్పఁబడినవి.

సూ॥ ౭. మధ్యమపురుషమున ఇకారమునకు సంధి నిత్యము.

ఉ. సేవించితివి+అచ్యుతుని=సేవించితి వచ్యుతుని, సేవించితిరి+అచ్యుతుని=సేవించితి రచ్యుతుని. సేవించితివి ఇది మధ్యమ పురుషక్రియ. కడపట 'ఇ' గలది. దానికి 'అచ్యుతుని' లోని 'అ' పరమగుటచే సంధి నిత్యము. సేవించితివి యచ్యుతుని' ననుట తప్పు.

మధ్యమపురుష మనుటచే

ప్రథమోత్తమపురుష బహువచనంబుల సంధి వైకల్పికము.

'అచ్చుపరంబగునపు' డనునది యధ్యాహార్యము.

i. ప్రథమపురుషము బహువచనము. ఉ. వచ్చిరి+అసురులు=వచ్చి రసురులు - వచ్చిరి యసురులు.

ii. ఉత్తమపురుషము బహువచనము. ఉ. వచ్చితిమి+ఇచటికి=వచ్చితి మిచటికి, వచ్చితిమి యిచటికి. (చూడు సంజ్ఞ సూ. ౬౮.)

సూ॥ ౮. ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికము.*

ఏమి మఱి, కిషష్ఠి, (షష్ఠీవిభక్తి 'కి' వర్ణకము.) అది, అవి, ఇది, ఇవి, ఎది, ఎవి, ఏది, ఏవి, ఇవి ఏమ్యాదులు - ఇది యాకృతి గణము.

---

*ఏమ్యాదులు = ఏమి మొదలైనవి. ఆకృతిగణము = ఇక్కడఁ జెప్పఁ బడిన యేమ్యాదులే గాక యిట్లు వైకల్పికసంధి గల ఇకారాంతపదములు మఱి కొన్ని యిందుఁ జేర్చుచున్న వని యర్థము. అవి యేవన.

అనతి+ఇచ్చు=అనతిచ్చు. ఇట్లు మగనాలు - బండెద్దు - పెండ్లాడి - వెండుంగరము - పైఁడందెలు - అఱువదాఱు - మనవేటికి - ఇత్యాదులు - అరఁటి+ఆకు=అరఁటాకు-ఇట్లు మామిడాకు - అవిసాకు - మొగలాకు - వావిలాకు-రావాకు-మఱ్ఱాకు - ఇత్యాదులు సంధి గలసినచోటుల శుద్ధమైన ఆకారస్వరముగాక యశ్రుతి ధ్వనిచ్ఛాయ దోఁచెడి - అట్టి యత్వరస్వర మాంధ్ర భాషయందు లేమి నట్టిసంధులు నిషేధింపఁబడియె - అట్టు లుండియు మఱ్ఱాకు మొగలాకు-తాటాకు అని ప్రయోగంబులఁగనంబడెడి. ఇట్టి భిన్నస్వరము పుట్టమిచేఁ గాఁబోలు రామరాజభూషణుఁడు "పల్లవపుటాగ్రపోఁగరాదు" అని తత్సమంబుల మీఁది ఇకారమునకు సంధి గల్పెను - కొంద ఱిట్టి సంధులఁ గొనియాడరు.

ఉ. అది + ఎవతె = అదెవతె - అది యెవతె. ఏమి + అంటివి = ఏమంటివి - ఏమి యంటివి. వానికిన్ + ఇచ్చె = వానికి నిచ్చె నిత్యాదులు.

సూ॥ ౯. క్త్వార్థకంబైన ఇత్తునకు సంధిలేదు.*

క్త్వార్థకముయొక్క కడపటనుండు 'ఇ' కారమునకు సంధిలేదు. సంధిలేనిచో యడాగమం బగు. చూ. సంధి. సూ. ౪.

చూచి + ఆడెను = చూచి + య్ ఆడెను = చూచియాడెను. చూచాడెను అనుట తప్పు.

సూ॥ ౧౦. ఉత్తునకు సంధి నిత్యము.

ప్రథమావిభక్తి, సమాపకక్రియ మొదలగువాని కడపటి ఉకారమున కచ్చు పరం బగునపుడు సంధి నిత్యము. ఉ. రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు. రాఁడు + అతఁడు = రాఁడతఁడు. కూరుచు + ఉండు = కూరుచుండు -

సూ॥ ౧౧. ప్రథమేతరవిభక్తి, శత్రర్థక చువర్ణంబులం గల ఉత్తునకు సంధివైకల్పికము.

i. ప్రథమావిభక్తిగాక మిగిలిన విభక్తులయందు 'ఉ' కడపటఁ గల ప్రత్యయములు అనఁగా, ను, కొఱకు, కు, అందు, ఇందు, ఎందు, వీని కడపటి

---

*అందిమ్ము - తూఁగాడు - చెప్పించఁడే! ఇవి క్త్వార్థకేత్తునకు సంధి గల దనుటకు లక్ష్యములుగఁ గొందఱు చెప్పెదరు. అందు + ఇమ్ము = అందిమ్ము. ఇది శబ్దపల్లవము. తూఁగు + ఆడు = తూఁగాడు ఇదియును శబ్దపల్లవమే. చెప్పింపఁడే సరియైన పాఠము. ఇట్టులే 'వెలిచిట్లు' సరి కాదు. వెలినిట్లు అని సరియైన పాఠము.

నిలుచున్నవాఁ డి త్యాదుల నిలుచు + ఉన్నవాఁడనియే పదవిభాగము - నిలిచి + ఉన్నవాఁ డని సంధి విచ్ఛేదించ వలను పడదు. నిలిచున్నవాఁడని రూపములేదు. అంతనుండపుడు - ఇచ్చట 'ఉండి' క్త్వార్థకముగాదు. అవ్యయము - కళ; పండున్న పుట - పండు + ఉన్న = పండున్నయని పదచ్ఛేదము.

ఉకారమునకును ఉ.నన్నుఁ + అడిగె=నన్నడిగె-నన్నునడిగె. నాకొఱకుఁ + ఇచ్చె=నాకొఱకిచ్చె-నాకొఱకునిచ్చె.

ii. శత్రర్థక 'చు' వర్ణకమునం దుండు 'ఉ' కారమునకును సంధివైకల్పికము. శత్రర్థక 'చు' వర్ణమునకే వర్తమానార్థక 'చు' వర్ణమనియుఁ బేరు. ఉ పోవుచుఁ+ఉన్నాఁడు=పోవుచున్నాఁడు,పోవుచునున్నాఁడు. అచ్చుతో అచ్చు కలియునపుడు నడుమనున్న ద్రుతంబునకు లోపంబు.

సూ॥ ౧౨. రూపాంతరమందు ద్విత్వము గలిగినశబ్దముల 'ఉ' కారమున కచ్చు పరమైనపుడు సంధిలేదు. ఉ. కను - కన్ను; మిను - మిన్ను; మును - మున్ను; ననుఁ - నన్నుఁ; మముఁ - మమ్ముఁ; అని రూపాంతరములు. కావున కన్ను + అదరె = కన్నదరె యని చెప్పవచ్చునుగాని కను + అదరె = కనదరె అని చెప్పరాదు.

సూ॥ ౧౩. వాక్యవిరామంబున సంధి లేమి దోషంబుగాదు.

వాక్యము విరామము (=ముగియక) అయినపిమ్మట వెనుకటియచ్చుతో సంధి గలుపకుండినను దప్పుగాదు. వాక్య మనఁగాఁ గర్త, సమాపకక్రియ, గలిగి సంపూర్ణమైన యర్థముగల శబ్దసమూహమునకును, పద్యములయందొక్కొక్కపాదమునకును బేరు. ఉ. రాముఁడు మంచివాఁడు. అతని నమ్మిన వారికి మేలిచ్చును. ఇచ్చట ''రాముఁడు మంచివాఁడు'' అనునది కర్త లోనైనవి గల శబ్దసమూహము. అర్థము సంపూర్ణముగఁ గలదైయున్నది. కావున దీనికి వాక్య మని పేరు. ఈవాక్యమునఁ గడపటిశబ్దమైన 'వాఁడు' ఉకారాంతము. దానికి 'అతని' అను మాటలోని 'అ' పరమైనది. అయినను సంధి కలుపక వ్రాయఁబడినది. వాక్యము కడపటఁ గావున నిది తప్పుగాదు.

'రాముఁ గొల్చినంత రాజిల్లు సుఖములు । అతఁడు భక్తతాపహారి యగుట.' ఇది సగము పద్యము. అందు 'రాముఁ గొల్చినంత రాజిల్లు సుఖములు' అనునది యొకపాదము. దీనికి వాక్య మని పేరు. కావున దానికి 'అ' పరమైనను సంధి కలియలేదు. ఈ రెండుసందర్భములయందు సంధి కలిపినను గలుపకున్నను సరియె. సంధి కలియనప్పు డితరమైన యచ్చులకువలె 'య' రాదు.* ఆవలిపాద మచ్చుతోనే ప్రారంభింపవలయును.

*వెం. వ్యాకరణమున 'ఉకారమునకు' అనునది యనావశ్యకము. ఏ యచ్చునకుఁగాని, హల్లునకుఁగాని యచ్చు పరమైనను వాక్యావసానంబున సంధి కలుపకుండుట తప్పుగాదు.

ఎఱ్ఱాప్రెగడవారి నృసింహపురాణమున

చం. పొలుపుగ నెల్లనాఁడు నుడి వోవక పెల్లుగఁబూచు తీవెలన్, దెలువులు మీఱి తోయనిధితీరవనంబులు చూడ్కి కెప్పుడున్, ఎలమి యొనర్చు వేల్పు లచలేంద్రునిఁ గవ్వముచేసి తెచ్చుచో ఆ. ౧. ప. ౩౫.

అందే ఉ. ఎందును బుష్పసౌరభము, యెందును మంపమరాళి ఝుంకృతుల్, ఎందును సాంద్రపల్లవము......ఆ ౨. ప. ౬౨.

విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణి.

తే. ఇట్టి యుద్దీపనవిభావహిత వినోద । విభవములఁబొందుఁ జాళుక్య విశ్వభుఁడు । అలుపువిల్తునిభంగి జయంతు లీల. ౧-ఉల్లాసము ప. ౨౭.

తే. తనరు శృంగార హాస్యశాంతములుఁ గృపయుఁ, బొనరు మాధుర్యమునకుఁ జెప్పాట గుణంబు, అద్భుతము రౌద్ర వీరభయానకములు.

తే. అర్థి సేవించి రొకకొంద అప్సరసలు, అపుడు రెండవ కైలాస మనఁగఁ బరఁగె. భీమఖండము. ఆ. ౫. ౪౭-ప.

కం. అర్ధకపాలము గేలను, నర్ధనిశాసార్వభౌముఁ - డౌదల నెడమన్ - అర్ధాంగలక్ష్మి గొంతయుఁ. భీమఖండము. ౫-ఆ. ౧౩౦ ప.

ఈ పరిచ్ఛేదమునను మొదట అ, ఇ, ఉ అను నచ్చులకుఁ దప్ప నితరము లైన యచ్చులకు సంధి లేదని చెప్పఁబడినది. ౧౪-౧౫ సూత్రములు దాని కపవాదములు.

సూ॥ ౧౪. అంద్వంతావగాగమంబులం దప్ప నపదాది స్వరంబున కచ్చు పరంబగునపు డన్ని యచ్చులకు సంధి నిత్యము.

అందు+అంత+అవక్+ఆగమంబులు=అంద్వంతావ గాగమంబులు - 'అవ' యని చెప్పక 'అవక్' అని చెప్పుట 'అవ' యనునది యొకశబ్దమునకుఁ గడపటఁ జేర్పఁబడు నని సూచించుటకే. ఎనిమిది+అవ=ఎనిమిదవ. ఇట్టులే 'క్', అనునది నుగాగమము టుగాగమము ముగాగమము లోనగువానివంటిదిఁ గాన నగు. అప్పుడును నీరీతినే యర్థము గ్రహించునది. అపద మనఁగా నామవాచకము క్రియ గానిదై యర్థము లేనిమాట. ఎఁదు-

కం. అవ్విబుధజగతిలోపలఁ, గ్రొవ్వుదఱిఁగి సురగణంబు క్షోభము నొందెక్, ఇవ్విధమున నుత్పాతము. అని నాచనసోముని. ఉ. హరి. ౭, ఆ. ౧౫౯-ప.

తే. అనలుఁ డర్కుఁడుఁ డసురేశుఁ డబ్ధిరాజు | అనిలుఁ డర్థేశుఁ డలిక లోచనుఁడు గొలువ. వసు. 3-ఆ. ౫౭ ప.

ఇత్యాది ప్రయోగములఁబట్టి యర్థము ముగిసినను ముగియకున్నను పాదాంతమైనచో విసంధిదోషము లేదనియు 'ఈ కవ్వడి యుత్తరవేషము దాల్చి యున్నాఁడు ఇదిగో' యనునట్లు లర్థము ముగిసినను పాదమధ్యమున విసంధిగ న్రాయ రాదనియు నేర్పడుచున్నది. కందమున నగుమధ్యము సీసపద్యంబున నెనిమిదిగణములు గల పెద్దపాదము పాదమనఁబడును గాని ౪ గణములు గల మొదటిపదము పాదమనిపించుకొనఁబడదు. 'పసిబాలకుల పాలి పంచాననంబవు, ఎలుక పిల్లవు వైరు లెదురునపుడు' అని చెప్పరాదు.

ఇల్లు-ఇత్యాదులు. అందు-అంత-అవ యనునవి పరంబులైనప్పుడు తప్ప దక్కిన యపసంబులు పరంబు లైనప్పుడు సంధి నిత్యముగ నగు.

బార+ఎఁడు=బారెఁడు - తూము+ఎఁడు=తూమెఁడు, గోనె+ఎఁడు=గోనెఁడు; అర్థ+ఇంచు=అర్థించు; నిర్జి+ఇంచు=నిర్జించు. ఇట్లు వంజిల్లు - చేసెడు - చేసెడి ఇత్యాదులు.

రాముల+అందు = రాములందు - రాములయందు. (సూ. సంధి ౨)
ఎనిమిది+అవ = ఎనిమిదవ - ఎనిమిదియవ. (సూ. సంధి ౮)
గంప +అంత = గంపంత - గంపయంత. (సూ. సంధి ౨)

ఇట్లు అందు - అంత - అవ పరమైనపుడు రూపంబులు గ్రహించునది.

సూ॥ ౧౫. ఏసి పరమైనపుడు సర్వప్రాణులకు సంధి నిత్యము.

ఉ. గంపెఁడేసి-నాలుగేసి-పదేసి-ఎంతేసి-ఇత్యాదులు. పదియేసియను శ్రీనాథప్రయోగము ఛందో నిర్బంధమునవైన ప్రౌఢప్రయోగము.

ఏసి యనునది పరిమాణార్థంబున వచ్చును.

సూ॥ ౧౬. దీర్ఘాచ్చునకు సంధి లేదు.

దీర్ఘమైనయచ్చునకు అచ్చుపరంబగునపుడు సంధి లేదు. సంధి లేనపుడు ''య్''కార మాగమముగ వచ్చును. (చూ. సూ. ౨)

మా+ఊరు=ఇచట మా=మ్+ఆ - ఆకారము దీర్ఘాచ్చు. (సంజ్ఞ. ౯ సూ. చూడు.) కావున సంధి లేదు. సంధి లేకపోఁగా 'మా + య్ ఊరు అని య్ ఆగమము వచ్చెను. య్+ఊ='యూ' అనియాయెను. 'మాయూరు.' అని రూప మేర్పడెను. ఇట్లు మాయిల్లు లోనైనవి.

సూ॥ ౧౭. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి బహుళముగ నగు.

ఒకమాటను రెండుమాఱు లుచ్చరించినచో రెండవసారి యుచ్చరించిన శబ్దమునకు ఆమ్రేడిత మని వ్యాకరణమున సంజ్ఞ, వ్యాకరణమున సంజ్ఞ యనుటచే వ్యాకరణమునఁగాక తక్కినచోటులఁ జెప్పినపు డొకమాట ౨-3 మాఱు లుచ్చరించినయెడల మొదటిదానికిఁ గాక తక్కిన ప్రతిశబ్దమునకు, ఆమ్రేడిత మని పేరు గలదు. ఉ. ఔర+ఔర. రెండవ 'ఔర'కు ఆమ్రేడిత మనిపేరు. కొందఱు 'ఔరౌర' యామ్రేడిత మందురు. అది సరిగాదు. ఔర +ఔర యనునపుడు 'ఔర' యను మాట రెండుసారు లుచ్చరింపఁబడినది. రెండవ 'ఔర' మొదటి 'ఔర'లోని కడపటియక్షరమైన రకారము మీఁద నుండు 'అ' అను అచ్చునకుఁ బరమైనది. కాఁబట్టి సంధి గలసి 'ఔరౌర' యని యయ్యెను. సంధి ౧ సూ. ప్రకారము 'ఔర యౌర. గానేరదు.' ఇట్టులే.

ఓహో+ఓహో=ఓహోహో; ఆహా+ఆహా=ఆహాహా:

ఎట్టూ+ఎట్టూ=ఎట్టెట్టూ; ఔర + ఔర = ఔరౌర.

సూత్రమునందు నిత్యమని చెప్పక తఱచుగనని చెప్పుట చేత ఏమి + ఏమి=ఏమేమి - ఏమియేమి యనియు నగును. ఏమి ఏమ్యాదులలోఁ జేరినది కావున. ఏగి+ఏగి=ఏగియేగి యనియే యగును. క్త్వార్థకముగావున సంధి సూ. ౯ ప్రకారము సంధి లేదు.*

## స్వరలోప ప్రకరణము.

సూ॥ ౧౮. హల్లు పరమైనపుడు ఏని లోని ఇకారమునకు లోపము వైకల్పికము.

---

*సూత్రము తక్కిన అచ్సంధి నిషేధ సూత్రముల కపవాదమైనట్టు క్త్వార్థకేకారసంధి సూత్రమునకు నపవాదమని యందురు. ఎఱింగెఱింగి యని భాగవతమునఁ బ్రయోగము. ఎఱిఁగి యెఱిఁగి యని భారతము.

ఉ. వచ్చెనేని చూచెద. ఇకారము లోపించినపుడు వచ్చెనేన్ జూచెద-వచ్చెనేఁజూచెద. పరుషముగాక యితర హల్లు పరమైనను 'ని' వైకల్పికముగ లోపించును. ఉ. ఎందేని డెందము—ఎందే డెందము-ఎందేన్ డెందము

సూ॥ ౧౯. 'ను' వర్ణము కడపటఁ గలధాతువులకు శత్రర్థక 'చు' వర్ణము పరమైనపు డా 'ను' వర్ణము లోని 'ఉ' కారమునకు వైకల్పికముగ లోపము.

ఉ. అను, విను, ఇట్టివి 'ను' కడపటఁ గల ధాతువులు. వీనికి శత్రర్థక 'చు' వర్ణము పరము గాఁగా అనుచున్ వినుచున్ అని రూపము లేర్పడెను. అప్పుడు 'ను' (న్ ఉ) లో నుండు 'ఉ' పోఁగా 'న్' మిగిలి అన్చు, విన్చు, అని యేర్పడి అన్చు, విన్చు అని యాయెను. ఇట్టికొన్నిశబ్దంబులలో నుండు 'న్' బదులు నిండుసున్న వైకల్పికముగ వచ్చును. అన్చు, అంచు—విన్చు, వించు. చనుచు, చంచు అని లేదుగాని పూనుచు, పూన్చు, పూంచు అని కలదు.

సూ॥ ౨౦. అది అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబు.

ఏశబ్దమునకైనను అది, అవి యనుశబ్దములు పరములై సమాసములు కాఁగా అది, అవి లోని మొదటి అకారము బహుళముగ లోపించును. ఉ. చిన్న + అవి. దీనిలో 'అది' లోని అకారము పోఁగా చిన్న + ది మిగిలి 'చిన్నది' యయ్యెను. అకారము లోపింపనపుడు సంధి ౨-వ సూత్రము ప్రకారము చిన్నయది యని యగును. ఇట్లే నా + అవి-నావి, నాయవి మొ. (చూ. సంధి. సూ. ౧౨.)

ఉకారాంత తద్ధర్మవిశేషణములమీఁద లోపంబు లేదు. ఉ. వచ్చునది-వచ్చునవి. ఇకారాంత తద్ధర్మవిశేషణముమీఁద లోపము నిత్యము. ఉ. వచ్చెడిది-వచ్చెడివి.

సూ॥ ౨౧. అచ్చికంబులఁ బదమధ్య ను - లు - డు - రు - ళు యుత్వంబునకు లోపంబు బహుళంబు.

అచ్చతెనుఁగు పదంబుల నడుమ—ను—లు—డు—రు—ళు—లున్నయెడల వానియం దుండు 'ఉ' కారమునకు బహుళముగ లోపము. ఉ. మినుకు= మిన్+ఉ+కు=మిన్+కు=మిన్కు. ఇట్లు—కినుక కిన్క; కానుక - కాన్క; చిలుక=చిల్క; కాలువ=కాల్వ; అడుగు-అడ్గు; కడుపు-కడ్పు; పెరుఁగు-పెర్గు; గాడుపు-గాడ్పు; కూరుకు-కూర్కు; పునుక - పున్క; చిలుకు-చిల్కు. మురువు—ముర్వు: దొరువు-దొర్వు; తెలుఁగు—తెల్గు; తెనుఁగు—తెన్గు; చలుఁపు-చల్పు; మడుఁగు-మడ్గు. అడుగు—మడుఁగు-శబ్దంబుల నిలోపములేదని కొంద అనిరి కాని "అడుగడ్గునకు మాధవానుచింతనసుధా" యని భాగవతంబునను "ముమ్మడ్గు పుష్కరంబునకు" నని పాండురంగ మాహాత్మ్యంబునను బ్రయోగంబులు గలవు.

సూ॥ ౨౨. ఇట్టిలోపం బొకానొకచో నితరస్వరంబులకుఁ బ్రయోగంబులఁ జూపట్టు.

ఇట్టిలోప మనఁగా నచ్చతెలుఁగు పదంబుల నడుమనుండు అచ్చు లోపించుట. ఒకానొకచో = ఎందేని—ఇతరస్వరంబులకు = మీఁదఁ జెప్పఁబడిన ఉకారమునకుఁ గాక తక్కిన—అ—ఇ—యచ్చులకు—చూపట్టు=కనఁబడు. అనఁగా-చూడికి-ఇచ్చటఁ బదమధ్యంబుననుండు 'డి' వర్ణము మీఁద ఇ (డ్+ఇ) లోపించి చూడ్కి యని యగును. ఇట్లు కోరికి—కోర్కి; ఉనికి=ఉన్కి; అగడిత-అగడ్త; కలికి-కల్కి; ములికి-ముల్కి; బుడిపి-బుడ్పి; పొలఁతి-పొల్తి మెలఁత—మెల్త—ఇత్యాదులు. కోరికె కోర్కె. యను శబ్దములు లేవు.

సూ॥ ౨౩. ఏ యక్షరంబు మీఁది యే స్వరంబునకైన లోపం బెందేని మహాకవి ప్రయోగంబులఁ గానరాదు.

ఎయిదికొనుము = ఎయ్దికొనుము; చెయిది = చెయ్దు; చెయువులు = చెయ్వులు; ఉంగరము-ఉంగ్రము; అదురుచు-అద్రుచు; ఎదురుచు-ఎద్రుచు; పదురుచు-పద్రుచు; విదురుచు-విద్రుచు; చిదురుపలు-చిద్రుపలు; కదురుచు-కద్రుచు; కుదురుచు-కుద్రుచు; ఇగురుచు-ఇగ్రుచు; ఇందు అద్రుచు మొదలుగాఁగలశబ్దంబులందు సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరము గురువు కాదు.

సూ॥ ౨౮. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు.

అబ్బురము-అబ్రము. ఇచ్చట అబ్+బ్+ఉ+రము. ఇచ్చట ఉత్వము లోపింపఁగా అబ్+బ్+రము అని మిగిలె. అబ్బ్రమని రూపము లేదు గాన ఉకారమునకు ముందుండు, బ్, లోపించిన అబ్రమయ్యె. అనఁగా ఉత్వముతోడి హల్లునకే లోప మని యర్థము. ఇట్లు అప్పుడు-అప్డు; ఇప్పుడు-ఇప్డు; ఎప్పుడు-ఎప్డు; కప్పురము-కప్రము; చప్పుడు-చప్డు; నెత్తురు-నెత్రు.

సూ॥ ౨౯. పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన ను-లు-రు-ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.
ఉ. మ్రానుపడు-మ్రాన్పడు.

పదములకొన నుండుసంయుక్తములు గానట్టి ను-లు-రు-లను హల్లులు, అవసానములు పరమైనప్పుడు, అందలి ఉత్వమునకు లోపము బహుళంబుగ నగు. ఉ. మ్రాను అనుశబ్దముకడపట 'ను' ఉన్నది. దీనికి "పడు" పరమయ్యెను. ప-హల్లుకావున మ్రానుపడె=మ్రాన్+ఉ+పడె. ఉకారము లోపించి మ్రాన్ పడె-మ్రాన్పడె నని యయ్యె. ఇట్లు వత్తురు వారు-వత్తుర్వారు; కారు కొనియె-కార్కొనియె; కనుమొఱఁగు-కన్మొఱఁగు; మును కొను-మున్కొను-అవసానమందు మునుముక్-చేతుల్-వత్తుర్-ఇత్యాది.

కనుఁగొను-వెనుఁబడు-వెనుఁబాటు ఇత్యాదులందు కన్గొను-వెన్బడు-వెన్బాటు-అనిరూపంబులు. కనఁబడు-కన్బడు అనియుఁ గలదు.

## కళాసంధి ప్రకరణము.

కళల కచ్చులు పరమైనపుడు సంధి గలయువిధ మింతవఱకుఁ జెప్పఁబడినది. ఇఁకఁ గళలకు హల్లులు పరమైనపు డగుమార్పులు చెప్పఁబడును.

సూ॥ ౨౯. ప్రథమలమీఁది పరుషములకు గ-స-డ-ద-వలు బహుళంబుగ నగు.

| | | |
|---|---|---|
| వాఁడు | కొట్టె | వాఁడు కొట్టె-వాఁడు గొట్టె. |
| మనము | చూచితిమి | మనము చూచితిమి. |
| | | మనము సూచితిమి. |
| నీవు | టక్కరివి | నీవు టక్కరివి - నీవు డక్కరివి. |
| పాలు | త్రాగుము | పాలుత్రాగుము-పాలుద్రాగుము. |
| అతఁడు | పలికె | అతఁడుపలికె-అతఁడు వలికె. |

ఇత్యాదులు.

'ప్రథమ' యని చెప్పక 'ప్రథమల' యని చెప్పుటచేతఁ బ్రథమావిభక్తి మీఁదనే గాక కళలుగానుండు నవ్యయంబులు మీఁదను, కళలుగానుండు క్రియలమీఁదను పరుషములు గ - స - డ - ద - వ - లగునని భావము.

అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - నిత్యైకవచనాంతంబు లగునవ్యయంబులు. ఏమి యనునదియును అవ్యయము.

అప్పుడు + కదలె = అప్పుడు కదలె - అప్పుడు గదలె. ఏమి చెప్పితివి = ఏమిచెప్పితివి - ఏమిసెప్పితివి - ఇత్యాదులు. రావు - ఇది కళయగు క్రియ - రావు + కదా = రావుకదా - రావుగదా. బహుళ మని చెప్పుటచేఁ గొన్నియెడల నీమార్పు లేదు. రాకొమరుఁడు - ఇత్యాదులం దప్పనేకాక్షరంబుమీఁది పరుషములు గ స డ ద వ-లగు.

సూ॥ ౩౦. తెలుఁగులమీఁది తత్సమశబ్దంబుల క - చ - ట - త - ప - లకు గ - స - డ - ద - వ - లు రావు.

దేశ్యములు - తద్భవము లగుశబ్దములకుఁ దత్సమశబ్దములలోని కచట తపలు పరములైనపుడు వానికి మాఱుగ గసడదవలు రావు. ఉ. అతఁడు + కరుణించె - అతఁడు కరుణించె నని చెప్పవలయును. అతఁడు గరుణించె నని చెప్పరాదు.

| | | | |
|---|---|---|---|
| వాఁడు | చతురుఁడు | = | వాఁడు చతురుఁడు. |
| అది | టంకృతి | = | అది టంకృతి. |
| ఇది | తథ్యము | = | ఇది తథ్యము. |
| ఏది | పథ్యము | = | ఏది పథ్యము. |

ఈ సూత్రముల సారాంశ మేమన.

| మొదటి శబ్దము. | రెండవ శబ్దము. | |
|---|---|---|
| తత్సమము. | తత్సమము. | గానుండిన కచటతపలు గసడదవలుగా బహుళముగా మాఱును. |
| తత్సమము. | తెలుఁగు. | |
| తెలుఁగు | తెలుఁగు. | |
| తెలుఁగు | తత్సమము. | మాఱదు. |

సూ॥ ౨౮. భిన్నపదప్రథమల మీఁది పకారమునకు 'వ' కారాదేశంబు ప్రాసంబున నిత్యంబు. యతిస్థానంబున నిషేధంబు. తక్కినయెడ వైకల్పికంబు.

ఉ. పెంపు + పరీక్షింపవె = పెంపు వరీక్షింపవె - నిత్యమనుటచేఁ దెలుఁగుపదంబు మీఁది తత్సమ 'ప' కారము వకారముగఁ బ్రాసస్థానంబున మారెను. సూత్రము 'ప' కారము గుఱించి మాత్రము చెప్పినను దక్కిన పరుషంబులును గసడదవలుగ మాఱును. ఉ. ఇట్లు దపంబుచేయుచుండుదు-నీరల్గోపించిన. భూనుతకీర్తి బ్రొష్ఠాణుఁడు పుట్టినతోడనపుట్టు అని సాధు పాఠము. పనిలేని సెలఁసులు పుట్టఁబోడఁగె. హరి. ద్వి.

## ద్రుతసంధి ప్రకరణము.

సూ॥ ౨౯. ద్రుతప్రకృతికమున కచ్చు పరంబగునపుడు లుక్సంశ్లేషంబులు లేవు.

చూచెన్ + అతఁడు-ఇచ్చట 'చూచెన్' అనునది భూతార్థకక్రియా - ఏకవచనమునందుండుటచేత ద్రుతప్రకృతికము. దీనికి అచ్చు పరమైనది, దీనియందు నకారము లోపింపఁజేసి చూచె+అతఁడు=చూచతఁడు అనికాని జూచె యతఁ డనికాని వ్రాయరాదు.

చూచెన్నతఁ డనియు వ్రాయరాదు. ఇట్టి ప్రయోగము పూర్వకవి గ్రంథముల నెందేని కలదుకాని యది యనుసరణీయముగఁ దోఁపదు.

సూ॥ ౩౦. ఇఁకాదుల కచ్చు పరంబగు నపుడు సంధి వైకల్పికము.

ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - ఇవి ఇఁకాదులు. ఇవి ద్రుతప్రకృతికము లని సంజ్ఞాప్రకరణంబునఁ జెప్పఁబడెను. (సూ-సంజ్ఞ-సూ. ౬౯ vii) ఈమూఁడు శబ్దములకు అచ్చుపరంబగునపుడు సంధి వైకల్పికము — ఇఁకన్ + ఏమి=ఇఁకనేమి (సంధిరానిరూపము. చూ—సంధి — సూ. ౨౯.) ఇంకేమి = సంధికలసినరూపము. (సంధి సూ. ౨.) ప్రథమేతరవిభక్తి శత్రర్థక సూత్రము చొప్పునను ద్రుతప్రకృతికములకు వైకల్పికసంధి గలదు. ఈ రెంటను ౧౭ ౨౯-వ సూత్రమున కపవాదములు.

ఇఁక ద్రుతప్రకృతికములకు హల్లులు పరమైనప్పు డగుమార్పులు చెప్పఁబడును.

సూ॥ ౩౧. ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగు.

ద్రుతప్రకృతికమునకు క, చ, ట, త, ప, లు పరమైనచో వరుసగా వానికి గ, జ, డ, ద, బ, లు నిత్యముగ నాదేశము లగును. ఉ. చూచెను + కంజాత్ముఁడు - చూచెను అను ద్రుతప్రకృతికములోని 'ను' అను ద్రుతము నకు 'క' యను పరుషము పరమైనందున నీ సూత్రము ప్రకారము 'క' కు బదులుగ 'గ' ఆదేశమయి 'చూచెను + గంజాత్ముఁడు' అని యేర్పడెను. ఇట్లులే

| | | | |
|---|---|---|---|
| కాసెను | చంద్రిక | = | కాసెను జంద్రిక |
| చేసెను | టక్కులు | = | చేసెను డక్కులు |
| కోసెను | తలిరులు | = | కోసెను దలిరులు |
| కూసెను | పక్షులు | = | కూసెను బక్షులు |

సూ॥ 3౨. ఆదేశసరళంబులకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులు విభాష నగు.

ఆదేశసరళములు లనఁగా క - చ - ట - త - ప - లకు మాఱుగా వచ్చిన గ - జ - డ - ద - బ - లు. నిషేధ–వైకల్పికములకు విభాష యని పేరు - పైసూత్రము చెప్పిన చూచెను కంజాత్ముఁ డనునది చూచెను గంజాత్ముఁ డని యేర్పడఁగాఁ దరువాత కకారమునకు బదులువచ్చిన గకార మునకు ముందుండు ద్రుతమైన 'ను' స్థానముతో

i. అరసున్నగాని నిండుసున్నగాని వచ్చును. ఉ. చూచెఁ గంజాత్ముఁడు. చూచెం గంజాత్ముఁడు.

లేదా ii. 'న' (న్) మీఁదిహల్లులతోఁ గూడికొనును. దీనికే సంశ్లేషమని పేరు. చూచె న్గంజాత్ముఁడు.

కాదేని iii. 'ను' ఉన్నట్లే యుండును. ఇట్లుండుటకే స్వస్వ మని పేరు. ఉ. చూచెను గంజాత్ముఁడు.

ఈ రూపములలో నేదైన వైకల్పికముగ వచ్చును.

పైప్రకారము హల్లులలోఁ బరుషములు పోఁగా సరళములు, స్థిరములు, ద్రుతప్రకృతికమునకుఁ బరమైనప్పుడు జరుగు మాఱుపాటులు ౩౩, ౩౪-వ సూత్రంబులఁ జెప్పఁబడినవి.

సూ॥ ౩౩. వర్గయుక్సరళంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు లోప, స్వత్వ, పూర్ణబిందు, సంశ్లేషంబులు విభాషనగు.

సరళములైన గ, జ, డ, ద, బ, లును వర్గయుక్కులును బరములైనచో ద్రుతమునకు.

| | | సరళములు.* | వర్గయుక్కులు. |
|---|---|---|---|
| i. | లోపము. | ఉ. వచ్చె జలజాక్షుఁడు. | వచ్చె ఖరుఁడు. |
| ii. | స్వత్వము. | ఉ. వచ్చెను జలజాక్షుఁడు | వచ్చెను ఖరుఁడు. |
| iii. | పూర్ణబిందువు. | ఉ. వచ్చెం జలజాక్షుఁడు. | వచ్చెం ఖరుఁడు. |
| iv. | సంశ్లేషము. | ఉ. వచ్చె జ్జలజాక్షుఁడు. | వచ్చె ఖ్ఖరుఁడు. |

ఈ నాలుగింటిలో నేదైన వైకల్పికముగా వచ్చును.

సూ॥ ౩౪. అనునాసి, కాంత, స్థోష్మంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకుఁ బూర్ణబిందువు దక్కఁ దక్కినవి యగు.

| | | అనునాసికములు. | అంతస్థములు. | ఊష్మములు. |
|---|---|---|---|---|
| i. | లోపము. ఉ. | కొలిచెదఁ నారాయణుని. | మ్రొక్కెదఁ రాముని. | సేవింతుఁ హరిని. |
| ii. | స్వత్వము. ఉ. | కొలిచెదను నారాయణుని. | మ్రొక్కెదను రాముని. | సేవింతును హరిని. |
| iii. | సంశ్లేషము. ఉ. | కొలిచెద న్నారాయణుని. | మ్రొక్కెద ర్రాముని. | సేవింతు హ్హరిని |

---

*మీఁది సూత్రమునందలి సరళములకు వీనికిఁ గల భేదము పైనసూచనలుపుఁడు. ఇవి స్పృష్టములు - అవి సాస్యములు.

కొలిచెదం నారాయణుని. మ్రొక్కెదం రాముని. సేవింతుం హరిని. ఇట్టి పూర్ణబిందువుగల రూపంబు లసాధువులు.

సూ॥ ౩౫. అవసానంబున ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబు.

ఉ. వాఁడు వచ్చెను - వాఁడు వచ్చెన్ - వాఁడు వచ్చె. అవసానమనఁగా ముగియుట. 'వచ్చెను' ఇందు 'ను' వర్ణకమునకుఁ దరువాతి నక్షరములు లేవు. కనుక ఆ 'ను' కారముమీఁద నుండు అచ్చునకు లోపము వచ్చి వచ్చెన్ అని యయిన నగును. నువర్ణకమే లోపించి 'వచ్చె' అని యయిన నగును. వచనములం దెట్లైన వ్రాయవచ్చును గాని పద్యములందు గణనియమము చెడకుండు నట్లే వ్రాయవలయును. గురువు కడపట నుండవలసిన పద్యంబులందు ద్రుతంబునకు స్వత్వముగాని లోపంబుగాని లేదు. స్వరమాత్రము లోపించు. ఉదా. జనకసుతాధవుఁడు భక్తజనముం బ్రోచున్.

ఇచ్చటఁ బ్రోచును అని వ్రాయరాదు. ఆ. నరసఖుండు ప్రోచు నన్నుఁ గరుణ. ఇచ్చటఁ 'గరుణన్' అని వ్రాయరాదు. 'కరుణ'కు మారు 'దయను' అనిన గణభంగము లేదుగనుక స్వత్వముంచి వ్రాయవచ్చును.

సూ॥ ౩౬. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి,

ఉ. అద్రియునుస్తోక - దివంబునుంబోలె. పద్యగద్యకావ్యములందెందేని యిట్టివియున్న నుండ నగుఁగాని సామాన్య గద్యంబులం దిట్టివి యుండరాదు. వానిని జూచెను- (సంధి సూ. ౩౨) వానిఁ జూచెను. వానిం జూచెను. అని వ్రాయవచ్చును. మితిమించి ద్రుతంబులఁ గూర్పరాదు. ఒకటిన్నర - రెండున్నర - ఇత్యాదుల ద్రుతంబుమీఁద ద్రుతంబు వచ్చుటే సాధువు. ఒకటి + యున్ + అర. ఒకటి యున్ + ను + అర = (యులోపించిన) ఒక

టిఁ + ను + అర = ఒకటిన్నరయని యని యయ్యె చూ. సంజ్ఞ సూ. ౭౯.
vii. రెండుఁ + ను + అర = రెండున్నర.

సూ॥ 32. ఏను - నేను - తాను పదంబుల ద్రుతంబునకుఁ బూర్ణబిందు సంశ్లేషంబులు లేవు.

ఈ మూఁడు పదంబులు ప్రథమావిభక్తులైనను ద్రుతప్రకృతికంబులు (చూ. సంజ్ఞ. ౭౯. ద్రుతప్రకృతికములు.) కావున నీ శబ్దములపట్ల సంధి సూ. ౨౭. అన్వయింపదు-సంధి, సూ. ౩౧. యన్వయించును. అట్లన్వయించు నపుడు 3౨ వ సూత్రముప్రకారము రావలసిన పూర్ణబిందు - సంశ్లేషంబులు రావు.

ఏను - పలికితి - ఏను బలికితి.
ఏఁ బలికితి.
అనియే యగును గాని 'ఏం బలికితి' ననికాని
(ఏన్బలికితి) ననికాని రూపములు రావు.

సూ॥ 3౮. పరుషేతరంబులు పరంబు లగునపు డా ద్రుతమునకు లోప స్వత్వంబులు మాత్రము గలవు.

ఉ. తాను + వినె - తా వినె, తాను వినె. పరుషేతరంబులు = పరుషములుగాక తక్కిన సరళస్థిరములు. ఆద్రుతము = ఏను - నేను - తాను పదములలోని 'ను' వర్ణము.

## సమాసగతపదసంధి ప్రకరణము.

ఇంతవఱకు వ్యస్తపదములకు (విడిమాటలకు) అచ్చులు హల్లులు పరము లైనపు డగుసంధి విధంబు వివరింపఁబడియె. ఇఁక రెండుపదంబులు సమాసముగఁ జేరునపు డగు మాఱుపాటులు వివరింపఁబడును.

వేఱువేఱు అర్థములు గల రెండు శబ్దములు లోక్యార్థ మిచ్చునట్లొక టిగాఁ జేరిన సమాస మనిపించుకొనును. ఉ. కఱకు-అనఁగా పదును; బాణ మనఁగా అమ్ము. ఇవి రెండు వేఱువేఱు అర్థములు గలవి. ఈ రెంటి నొకటిగా మీఁదఁ జెప్పినట్లు చేర్చిన 'కఱకుబాణ' మని యయ్యెను. దీనికిఁ గేవలము 'పదును' అని యర్థము గాదు. అమ్ము అని యర్థము గాదు. పదునైనయ మ్మని యర్థము. పదార్థ మొక్కటే. కావున నిది సమాసము.

కఱకు + అయిన + బాణము = కఱకుబాణము.

రాజు + యొక్క + కొడుకు = రాజుకొడుకు.

హరి + యందు + భక్తి = హరిభక్తి.

ఇట్టివోట్ల నర్థము విశదమగుటకుఁగాను విభక్తి మొదలగుపదములు చేర్చ చెప్పుటకు బదులు వానిని విడిచి సంగ్రహించి చెప్పినయెడల సమాస మగును. సమాసము = సంగ్రహము.

కావునఁ 'కఱకుబాణ' మనునది యొకసమాసము. దీనియందు లోపిం చినపదములు పూర్తిచేయఁగా కఱకు+అయిన+బాణ మని యేర్పడును (ఇట్లు లోపించినమాటలను బూర్తిసేసి వ్రాయుటకే విగ్రహమని పేరు) ఇప్పుడు 'కఱకు' అనునది 'బాణ' మనునది రెండును ఒక విభక్తియందు నున్నవి. ఇట్లు విగ్రహమున రెండుపదము లొక్కవిభక్తియందే యుండిన దానిని సమానాధికరణ మందురు.

రాజుకొడుకు, హరిభక్తి యనుసమాసములకు విగ్రహములు వ్రాయఁగా రాజుయొక్క కొడుకు; హరియందు భక్తి యని యేర్పడును. అప్పుడు 'రాజు యొక్క' అనునది షష్ఠీవిభక్తి. 'కొడుకు' అనునది ప్రథమ. కాఁబట్టి వేఱువేఱు విభక్తులు. ఇట్లు విగ్రహమున వేఱువేఱు విభక్తులుండెనేని అసమా నాధికరణ మనఁబడును. మొదటిశబ్ద మేవిభక్తియం దుండిన నావిభక్తితత్పు రుష సమాసమగు. ఉ. రాజుకొడుకు=రాజుయొక్క కొడుకు షష్ఠీతత్పురుష

సమాసము. హరిభక్తి షష్ఠీతత్పురుషసమాసము. అసమానాధికరణమనఁగా వ్యధికరణ మనియుఁ జెప్పు.

సూ॥ ౩౯. కుఱు - చిఱు - కడు - నడు - నిడు శబ్దంబుల ఱ - డ - ల కచ్చుపరమైనపుడు ద్విరుక్త టకారంబగు.

కుఱు + ఉసురు = కుట్టుసురు

ఇందు 'కుఱు' శబ్దములోని ఱకారమునకు అచ్చైన ఉ పరముకాఁగా ఱకు మాఱు 'ట్ట్' కారము వచ్చి ఱు - 'ట్టు', అయి

కుఱు + ఉసురు = కుట్టుసురు అగును. (సూ. సంధి. ౧౦.)

చిఱు + ఎలుక = చిట్టెలుక.

కడు + ఎదురు = కట్టెదురు.

నడు + ఇల్లు = నట్టిల్లు.

నిడు + ఊరుపు = నిట్టూర్పు.

చిట్టెలుక - ఇత్యాదులందుఁ దొలిశబ్దము చిట్టి యని కొందఱ యభిప్రాయము. ఈ సూత్రము సమాసమునందే వర్తించును గనుక కడున్ + ఎండ = కడునెండ యనునదియు సాధువు.

సూ॥ ౪౦. ద్వంద్వసమాసంబునఁ బదంబుకంటెఁ బరంబయిన పరుషములకు గసడదవలు ప్రాయికముగ నగు.

ద్వంద్వసమాసము. ద్వంద్వ మనఁగా జంట. రెండువస్తువులైనను లేక జంట కానేరదు. కాఁబట్టి రెండువస్తువుల పేరు లొకసమాసముగాఁ గలిపి చెప్పుట ద్వంద్వసమాసము. ఉ. తల్లి యును + తండ్రి యును = తల్లిదండ్రులు. ఇక్కడ 'యు-ను' అనునవి సముచ్చయములు. ఈ సముచ్చయములు లోపించిన తల్లి + తండ్రి యని యుండును. ఇప్పుడు మనుష్యు లిద్దఱయిరి గనుక బహువచనమునఁ జెప్పవలయును. బహువచనమున దెలుఫు

ప్రత్యయము 'లు'. అది చేర్పఁగా 'తల్లితండ్రిలు' అయ్యెను. ఇకారము కడపటఁ గల శబ్దములకు బహువచనప్రత్యయమైన 'లు' చేర్చినపుడు ఇకారము ఉకార మగును. కావున తల్లితండ్రులు అయ్యెను. ఇది ద్వంద్వసమాసము. దీనిలో మొదటిపదము 'తల్లి'. దీనికి తండ్రి అను మాటలోని పరుషమైన 'త' పరమైనది. కాఁబట్టి యీ సూత్రప్రకారము అది 'ద' గా మాఱి తల్లిదండ్రు లయ్యెను.

ఇట్లు అరి + కోరు = అరిగోరులు. కాలు + చేయి=కాలు సేతులు. టక్కు + టెక్కు = టక్కు + డెక్కులు. ఊరు + పల్లె + ఊరు వల్లెలు. కూర + కాయ = కూరగాయలు - కాయ + కసురు = కాయ గసురులు.

ప్రాయికముగ ననుటచే అంపచంపములు - కందెతుండెములు - రాకపోకలు - మిఱ్ఱుపల్లములు - ఆటపాటలు - విడుపుకట్టులు - పెట్టుపోతలు - ఎక్కువతక్కువలు - చుట్టుపక్కములు - చుట్టుప్రక్కలు మొదలగు గసడవ వాదేశంబులేదు. (చూ. రెండవభాగము. సమాసపరిచ్ఛేదము. ద్వంద్వసమాసము.) అక్క చెల్లెండ్రు - అన్నదమ్ములు = ఇట్టిచోట వాచ్యులు [illegible] మగు. అన్నాదమ్ములు, అక్కాచెల్లెండ్రు. [illegible]

సూ॥ ౪౧. సమాసంబున ద్రుతంబునకు లోపంబగు.

ఉ. ఎల్లప్పుడు - ఎల్లయర్థము [illegible] ఎల్లన్ అనునది ద్రుత మంతమందుఁ గలయవ్యయము. (చూ. [illegible] ౮౯.) సర్వ మని యర్థము. ఎల్లన్ + అప్పుడు, ఎల్లన్ + అర్థములు సమాసములగుఁ జేరుచో ద్రుతము లోపించి ఎల్ల + అప్పుడు - ఎల్ల + అర్థములు అని నిలిచి సంధి సూ. వి ప్రకారము 'ఎల్లప్పుడు' 'ఎల్లయర్థము' లని యయ్యె-

ఉదంత తద్ధర్మార్థక విశేషణముదప్ప నెట్టి ద్రుతప్రకృతికమైనను

విశేషణమైనచోఁ గళయట్లగు. అట్టులే ఎల్లక్ + పాపములు ఎల్లఁబాపము లని కాక 'ఎల్లపాపము' లనియయ్యె. కడుక్ + కావరము = కడుకావరము. కడుక్ లోనగునవి సమాసమునఁ గాక వ్యస్తముగఁ బ్రయోగించినపుడు విశేష్యమునకు ముందుండిన నుండవచ్చును. కడుక్ గావరము - ఎల్లక్ శబ్దముమాత్రము సమాసము నందే విశేష్యమునకు ముందుండును గాని సమాసము కానప్పుడు విశేష్యమునకుఁ బరంబుగనే యుండును. పాపములెల్లక్. ఎల్లక్ శిష్యులఁ గొంచువత్తునో యనునది ప్రాసప్రయోగము. ఎల్లక్ అనునది యవ్యయమైనను దానికి సప్తమిప్రత్యయము "అందు" చేరుట గలదు. ఎల్లయందు. అవ్యయము కావుననే 'ఎల్లతెఱఁగు', 'ఎల్లవాఁడు', ఎల్లవారు', అని ప్రయోగంబులు.

సూ॥ ౪౨. ద్విత్వయుక్తములయిన ను, లు, ఱ మొదలగు వర్ణములు కడపటఁ గలశబ్దములు పరమైన హలాది శబ్దములతోఁ గూడి సమాసమైనపుడు ద్విత్వము వైకల్పికముగ లోపించును.

ఉ. మిన్ను + వాఁక = మిన్నువాఁక: మిన్ను = మి + న్ను, (న్ + ను = న్ను) ద్విత్వాక్షరములలో మొదటియక్షరము న్ లోపింపఁగా 'మి ను' మిగిలి మినువాఁక యయ్యెను. ఇట్లే కల్లు + కుండ = కల్లుకుండ, కలుకుండ; ముక్కు + చాయ = ముక్కుచాయ, ముకుచాయ, గొఱ్ఱె + తోలు, గొఱ్ఱెతోలు - గొఱెతోలు. చిట్టిచాప - చిటిచాప.

సూ॥ ౪౩. ఇట్టి ద్విత్వయుక్తములయిన శబ్దములకు ద్విత్వరహితంబులుగ రూపాంతరము లుండెనేని యసమాసమునను ద్విత్వరహితంబుగఁ బ్రయోగంబులు కలవు.

ఉ. కన్నుదెఱచె - కనుదెఱచె మొ. ఇట్టి శబ్దములకు నచ్చు పరమైనపుడు ద్విత్వము లోపముగాదు (చూ. సూ. సంధి, ౧౨)

సూ॥ ౭౭. కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁ బు - ంపు - లగు.

కర్మధారయసమాసములందు మొదటిశబ్దంబునఁ గల 'ము' వర్ణకంబునకు బదులు 'పు' 'ంపు' ఈ రెంటిలో నేదైనను వచ్చును. ఉ. సరసము+పలుకు అను దానికి 'సరసము+అయిన+పలుకు' అని విగ్రహము. ఇచట పలుకు అను విశేష్యమునకు సరస మనునది విశేషణముగా నున్నది. ఇట్లు మొదటిది విశేషణము రెండవది విశేష్యముగా నుండు సమాసమునకు కర్మధారయ మని పేరు. ఇది యొకవిధమైన కర్మధారయము. ఇట్టి కర్మధారయ మందు సరసములోని 'ము' ప్రథమావిభక్తి ప్రత్యయము కావున నీ ము వర్ణకమునకు బదులు పు వర్ణకము వచ్చి సరసపుపలుకు అనియు 'ంపు' వచ్చి సరసంపు పలుకు అనియు నగును. కర్మధారయసమాసములందు' అని చెప్పుటచే నీ పు, ంపు లు కర్మధారయసమాసముననే గాక యితర సమాసమందైనను వచ్చునందురు. 'సరసఁపు' అని వ్రాయుట తప్పు.

నుగాగమ ప్రకరణము.

సూ॥ ౭౫. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకును, పు - ంపు లకును బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు.

ఉత్ + అంతము = ఉదంతము. స్త్రీసమము లన = డు - ము - వు - ప్రత్యయములులేక ప్రథమావిభక్తి యందున్న శబ్దములు. (చూ. తత్సమ. సూ. ౨౨.) అనఁగా నొక శబ్దము స్త్రీసమమై, కడపట హ్రస్వమైన ఉకారము గల దయ్యేనేని దానికిని సంధి సూ. ౭౭ చొప్పున వచ్చిన పు-ంపు లకును పరుషములు గాని, సరళములు గాని, పరంబు లైనపుడు నుగామంబగు (చూ. అవక్ సంధి. సూ. ౧౭.).

మంచు + కొండ ఈ రెండుశబ్దములు సమాసముగఁ గూడునపుడు తొలిపదము మంచు అనునది ఉదంతముగాను స్త్రీసమముగాను నున్నది. దీనికిఁ బరుషమైన 'కొ' పరమైనది. కాఁగా 'ను' ఆగమముగ వచ్చి 'మంచును + కొండ' అని యేర్పడిరెను. ఈ 'ను' వర్ణము ద్రుతము కావున

సంధి. సూ. ౩౧ ప్రకారము మంచును గొండ.

| | | |
|---|---|---|
| ,, ,, | ౩౨ ప్రకారము | మంచుఁ గొండ. |
| | | మంచుం గొండ. |
| | | మంచు న్గొండ. |

యని మూఁడు రూపంబు లేర్పడిరెను. ఇట్టులే పు - ంపు లకుఁ బరుషములు పరమైనపుడును మూఁడురూపంబులు.

సరసపు + పలుకులు సరసంపు + పలుకులు.

సరసపును + పలుకులు సరసంపును + పలుకులు.

సంధి. సూ. ౩౧. సరసపును + బలుకులు సరసంపును + బలుకులు.

అర్ధబిందువు. ఉ. i. సరసపుఁ బలుకులు i. సరసంపుఁ బలుకులు.

పూర్ణబిందువు. ఉ. ii. సరసపుం బలుకులు ii. సరసంపుం బలుకులు.

సంశ్లేషము. ఉ. iii. సరసపు న్బలుకులు iii. సరసంపు న్బలుకులు.

ఉదంత స్త్రీసమములకు సరళములు పరములైనపుడు ఉదా.

అలరు + జొంపములు అలరును జొంపములు.

అనియయి సంధి. సూ. ౩౩ ప్రకారము.

i. లోపము ఉ. అలరు జొంపములు. ii. పూర్ణబిందువు. ఉ. అలరుం జొంపములు, iii. సంశ్లేషము. ఉ. అలరు న్జొంపములు అని మూఁడు రూపంబులు కలుగు. పు - ంపులు పరములైనపుడు

| | | |
|---|---|---|
| లోపము. | ఉ. ఉన్నతపు గొడుగు | ఉన్నతంపు గొడుగు. |
| పూర్ణబిందువు. | ఉ. ఉన్నతపుం గొడుగు | ఉన్నతంపుం గొడుగు. |
| సంశ్లేషము. | ఉ. ఉన్నతపు న్గొడుగు | ఉన్నతంపు న్గొడుగు. |

సూ. ౩౮ ప్రకారము వచ్చిన 'వు' వర్ణమునకే గాక సిద్ధ 'వు'వర్ణమునకును నీ సూత్ర మన్వయించును. ఉ. పాలుపుష్ఠాలు - తలుపుం జెక్కలు. లోనైనవి.

సరసపుఁ బలుకులు అలరుజొంపములులోనగు రూపములందు సూ. ౪౧ ప్రకారము బిందువుగాని సంశ్లేషంబున ద్రుతంబుగాని లోపింపదు. ఆ సూత్రము ద్రుతప్రకృతముగ నుండు వ్యస్తపదము మఱియొక శబ్దముతోఁ గలసి సమాస మగునపుడే యన్వయించునని యెఱుంగవలయును.

ఆగమసూత్ర మనిత్యమగుటచే నలుగడ - నలువది-ఆఱువదియిత్యాదులందు నుగాగమే రాదు. నలుఁగిడ - నలుంగడ - నల్గువడ ఇట్టి రూపములు లేవు. గురువపుస్వరువు లోనగు స్థలముల స్థిరవర్ణము పరమైనపుడును నుగాగమము గలదు. 'తెలుఁగు వ్యాకరణ' మిట్టిది.

సూ॥ ౪౬. సమాసంబులయందు ద్రుతంబునకు స్వాత్వము లేదు.

సంధి సూత్రము ౪౫ ప్రకారము పంచుసుగొండ - సరసపుసు బలుకులు - అలరుసుజొంపములు - ఉన్నతంపునుగొడుగు అను రూపంబులు ప్రాప్తింపఁగా నీ సూత్రమువలన నట్టిరూపములు నిషేధింపఁ బడుచున్నవి.

సూ॥ ౪౭. తలఁబ్రాలులోనగు నలుక్సమాసంబుల ద్రుతంబునకు లోపము లేదు.

సమాసమందు విభక్తి ప్రత్యయము లోపింపకుండిన అలుక్సమాస మగు. (లుక్కు=లోపము. అలుక్కు=లోపముకానిది.)

తలన్ + ప్రాలు = తలఁ బ్రాలు.
ఒడిన్ + ప్రాలు = ఒడిఁ బ్రాలు.
సేసన్ + ప్రాలు = సేసఁ బ్రాలు. (సేసయనఁ గాముందల).

| | | | | |
|---|---|---|---|---|
| ఊరన్ | + | పంది | = | ఊరఁ బంది. |
| ఊరన్ | + | పిచ్చిక | = | ఊరఁ బిచ్చిక. |
| తోడన్ | + | పుట్టువు | = | తోడఁ బుట్టువు. |
| తోన్ | + | పుట్టువు | = | తోఁ బుట్టువు. |
| ఒల్లన్ | + | పాటు | = | ఒల్లఁ బాటు. |
| ఒడన్ | + | పాటు | = | ఒడఁ బాటు. |
| ప్రేలన్ | + | పాలు | = | ప్రేఁ బ్రాలు. |

సంజ్ఞ. సూ. ౩౩. ప్రకారము-తలంబ్రాలు ఇట్టి రూపంబులు గలవు.

సూ॥ ౭౮. ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణంబుల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు.

ఉకారము కడపటఁ గల తద్ధర్మార్థక విశేషణమున కచ్చు పరం బగునపుడు 'ను' ఆగమముగ వచ్చును. ఉ. వచ్చు+అచ్యుతుఁడు. ఇచ్చట 'వచ్చు' ఉకారము కడపటఁ గల తద్ధర్మార్థక విశేషణము. వచ్చునట్టి యచ్యుతుఁ డని యర్థము. దీనికి 'అ' పరమయినది కాఁబట్టి వచ్చు అను పదమునకుఁ గడపట నుకారము ఆగమముగా వచ్చిన "వచ్చును+అచ్యుతుఁడు" అనియయి (న+అ=న) వచ్చు నచ్యుతుఁ డని యాయెను. అవు + అప్పుడు=అవునప్పుడు- 'అవు' అనునది 'ఔ' యనియు నగును. కావున ఔ + అప్పుడు అనుదానిని ఔనప్పు డని వ్రాయవలయును. సూత్రమున 'ఉదంత' మనియే యున్నదని 'ఔ యప్పుడు' అని వ్రాయరాదు. 'అవు నప్పుడు' అనునదే ఔనప్పుడైన దని యెంచవలయు.

సూ॥ ౭౯. షష్ఠీసమాసంబునం దుకార ఋకారముల కచ్చు పరమైనపుడు నుగాగమం బగు.

షష్ఠీసమాసమునందు ఉ, ఋ, అను రెండక్షరముల కచ్చు పరమైనపుడు నుగాగమము వచ్చును. ఉ. రాజు + ఆజ్ఞ = రాజుయొక్క ఆజ్ఞ, రాజు +

ఆజ్ఞ = రాజును + ఆజ్ఞ = రాజునాజ్ఞ, విధాత్ర + ఆనతి = విధాత్రను+ ఆనతి = విధాత్రనానతి. ఆగమసూత్ర మనిత్యమగుట బచ్చు + ఇంట = బచ్చింట. శిరసు + అంచము — శిరసంచము - 'ఇసుమంతే' లో నగు మహా కవి ప్రయోగంబు లెందేని కానంబడెడి.

సూ॥ ౫౦. ఉదంత స్త్రీ సమంబులకును, పుంపులకును, అదంత గుణవాచకంబులకును దనంబు పరంబగు నపుడు నుగాగమం బగు.

ఉదంత స్త్రీసమంబులకు ఉదా.
సొగసుతనము.
సంధి సూ - ౭౫ ప్రకారము.

సొగసుఁ దనము.
సొగసుం దనము.
సొగసు న్దనము.

పుం - ౦పుల కుదాహరణము.
సరసపు తనము.

సరసపుఁ దనము.
సరసపుం దనము.
సరసపు న్దనము.

ఇట్లులే 'సరసంపు+తనము'నకును రూపములు గ్రహించునది.

అదంత గుణవాచకమునకు ఉదా. గుణవాచక మనఁగా గుణమును దెలుపు పదము.

చక్క తనము.

చక్కఁదనము.
చక్కందనము.
చక్కన్దనము,

సూ॥ ౫౧ పట్టిప్రత్యయము పరమైనపుడు సర్వత్ర నుగాగమం బగు. ఉ. జ్ఞానముంబట్టి మోక్షము.

సూ॥ ౫౨. సమాసమునఁ బ్రాఁతాదులఁ దొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబు.

అనఁగా 'ప్రాఁత' లోనగు శబ్దములకు మఱియొక శబ్దము పరమై సమా

సమగునెడ 'ప్రాఁత' మొదలగువానిలోని మొదటి యచ్చునఁగా 'ప్రా' లోని 'ఆ' కుఁ దరువాత నుండు 'ఁత' వర్ణములు బహుళముగ లోపించును. ఉదా.

ప్రాఁత+ఇల్లు- ప్రా+ఇల్లు అని అయి (సంధి సూ. ౧౬.) ప్రాయిల్లు అనియగు. ఈ లోపము బహుళము గావున "ప్రాఁతయిల్లు" అనియు నగు.

ఇట్లు లేఁత దూడ లేఁత దూడ లే దూడ (ఁత లోపము)
పూవు బంతి పూవు బంతి పూ బంతి (వు లోపము)

సూ॥ ౫౩. లుప్తశేషంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.

పై సూత్రము చొప్పునఁ బరమైన శబ్దము మొదటఁ బరుష ముండినఁ దొలి పదంబునందలి తొలియచ్చు మీఁద వర్ణంబులెల్ల లోపించినచోఁ నుగామును వచ్చును. ఉ. ప్రాఁత - పలుకు. ఇది పై సూత్రము ప్రకారము 'ప్రా+పలుకు' అయ్యెను. 'ప్రా'కుఁ బరుషాక్షరమైన 'ప' పరమైనది. కావున నుగాగమము వచ్చి ప్రా ను+పలుకు అయ్యెను. 'ను' ద్రుతము కావున ప్రాను బలుకు అయ్యెను.

ఐనను సంధి సూ. ౪౬ చొప్పున 'ప్రాను బలుకు' అనరాదు. కావున సంధి సూ. ౩౭ ప్రకారము 'ప్రాఁబలుకు' అని యేర్పడియె.; సంజ్ఞ సూ. ౩౪ ప్రకారము 'ప్రాంబలుకు' అనికాదు. సూ. ౩౭ లో విభాష యని యుండుటచే నిచ్చట సంశ్లేషము నిషేధింపఁబడినది. కావున 'ప్రాన్బలుకు' అనరాదు. ఇట్లులే.

| | | |
|---|---|---|
| ప్రాఁత | కెంపు | ప్రాఁ గెంపు |
| | | ప్రాఁత కెంపు |
| లేఁత | కొమ్మ | లేఁ గొమ్మ |
| | | లేఁత కొమ్మ |

| | | |
|---|---|---|
| పూవు | తోఁట | పూఁదోఁట |
| | | పూవుతోఁట |
| కాను | తీఁగ | కాఁదీఁగ |
| | | కానుదీఁగ |
| ఆవు | తోఁక | ఆఁదోఁక |
| | | ఆవుతోఁక |
| వేగు | పోక | వేగుఁబోక |
| | | వేఁబోక |

సూత్రమున బహుళ మని యుండుటచేఁ గొన్నియెడల నుగాగమంబు నిత్యంబు,

| | | |
|---|---|---|
| మీఁగు | కడ | మీఁగడ |
| చెన్ను | తోవ | చెందోవ |
| ముంగు | కురులు | ముంగురులు |
| సాము | పాలు | సాఁబాలు |

ఇత్యాదులు.

సమాసంబున 'చెన్ను' శబ్దమునకు "ఎఱ్ఱ" యని యర్థము.

సాము = సగము.

ముంగురులు-చెందోవ. ఇత్యాదులందు అర్ధబిందువు లేదు. (సంజ్ఞా. సూ. ౨౮.)

మీఁదు గడ్డ అని మీఁగడను వ్యుత్పత్త్యర్థము చెప్ప నగు. అప్పుడు మీగడ యనియే నిర్బిందుక రూపంబగు. పరమైనశబ్దము తత్సమమైనపుడును నీ సూత్ర మొక్కెడ ప్రవర్తించెడు. ఉ. ముంగోపము.

సూ॥ ౫౮. క్రొత్త, కెంపు, క్రిందు, శబ్దముల కాద్యక్షర శేషంబునకుఁ గొన్నియెడల నుగాగమంబును, గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబును బహుళంబుగ నగు.

అన్యాక్షరశేషము = మొదటి యక్షరముగాక మిగిలినది. అనఁగా క్రొత్తయందు 'త్త' సమాసమున 'క్రొత్త' లోని 'త్త' లోపించి దాని స్థానంబునఁ గొన్నిచోట్లఁ బూర్ణబిందువు వచ్చును. ఉ. క్రొత్త+చాయ= క్రొంజాయ. క్రొంజెమట - క్రొంబమ్మి- క్రొందలిరు-క్రొంబంట-క్రొంబులక-క్రొంబసిఁడి-క్రొంబసిమి-క్రొంబుట్టము-క్రొంబువ్వు-క్రొంబోఁగ-క్రొంబొగడ. క్రొత్తజిగి యని తిక్కన ప్రయోగించుటకుఁ గారణము సూత్రమున బహుళమని యుండుటచేతనే.

కొన్నిచోట్ల 'త్త' లోపించి దానికిఁ బరముగ నున్న హల్లునకు ద్విత్వము. ఉ. క్రొత్త+కారు= క్రొక్కారు-క్రొత్తావి-క్రొగ్గండి-క్రొమ్మావి-క్రొన్నెల-క్రొవ్వాఁడి-క్రొక్కన్ను-క్రొత్తఱఁగ - క్రొత్తలిరు - క్రొన్నన-క్రొన్నలువు-క్రొన్నురువు- క్రొన్నెత్తురు- క్రొన్నేయి - క్రొమ్మంచు - క్రొమ్మడుఁగు-క్రొమ్ముడి-క్రొమ్మెఱుఁగు - క్రొమ్మొన - క్రొమ్మొలక - క్రొమ్మొగడ - క్రొవ్విరి-క్రొవ్వెర-క్రొవ్వేఁడి, ఇత్యాదులు.

ఇట్టి ద్విత్వము తత్సమ శబ్దములు పరమైనపుడును గొన్నియెడల నగు. ఉ. క్రొమ్మేఘము.

కొన్నియెడల 'త్త' లోపింపదు. ఉ. క్రొత్తకుంప-క్రొత్తముత్తెము - క్రొత్తముట్టు లోనగునవి. క్రొత్తముట్టు అనఁగా ఏఁపనుండి తీసిన పురిలేని దారపుఁబోగు.

కెంపులోని 'ంపు' లోపించి దానిస్థానంబునఁ గొన్ని యెడలఁ బూర్ణబిందు వగు. ఉ. కెంగేలు - కెంజెడ - కెంజాయ. కెంజిగి - కెంజిగురు- కెందలిరు - కెందూళి - కెందళుకు - కెందామర - కెంబోవి - కెంబట్టు - కెంబువ్వ - కెంబెదవి - కెందమ్మి.

కొన్నియెడల మీఁది వర్ణమునకు ద్విత్వము. ఉ. కెన్నురువు-కెమ్మొక్క-కెమ్మోవి, ఇత్యాదులు.

కొన్ని చోటుల 'ంపు' నకు లోపము లేదు. ఉ. కెంపుకంటి-కెంపు గాము మొ॥

'క్రిందు' శబ్దమున 'ందు' లోపించి దాని స్థానంబునఁ గొన్నియెడల బూర్ణబిందు వగు. ఉ. క్రిందల.

కొన్నియెడలఁ బరుషంబులు పరంబులగుచో లుప్తశేషంబునకు దీర్ఘంబును ఖండబిందువు నగు. లుప్త శేషమనఁగా లోపించినది పోఁగా మిగిలినదని యర్థము. ఉ. క్రీఁ గడుపు - క్రీఁదోఁట - క్రీఁగాలు. పరుషేతరంబులు పరంబు లగునప్పుడు దీర్ఘంబు మాత్రము యగు. ఉ. క్రీ నీడ. క్రీయూట. బహుళ గ్రహణముచే నిట్టిరూపంబులు సాధ్యంబులు. సంధి ౨ వ సూత్రంబున బహుళసంధి లక్షణము చెప్పునపుడు "అన్యవిధములు" అని వ్రాయఁబడినది. ఇట్లు ఉన్నయక్షరము పోవుట - యొక యక్షరము మఱియొక యక్షరముగ మాఱుట లోనగునవి యన్యవిధము లని యెఱుఁగునది.

సూ॥ ౫౫. అచ్చులు పరంబులగుచో విశేషణంబు లయిన పెన్నాదుల కడహల్లునకు ద్విత్వం బగు.

ఉ. పెను + ఊరము = పెన్నూరము
పెను + ఉద్ది = పెన్నుద్ది
పెను + ఊఁత = పెన్నూఁత
పెను + అదరులు = పెన్నదరులు
పెను + అరవము = పెన్నరవము
పెను + ఒడలు = పెన్నొడలు
పలు + అఱపులు = పల్లఱపులు
కను + ఆకు = కన్నాకు

సూ॥ ౫౬. సమాసంబుల లోపనుగాగమ, లోపద్విత్వంబు లన్యశబ్దంబుల మీఁదను గానంబడెడి.

| | | |
|---|---|---|
| పది | తొమ్మిది | పందొమ్మిది |
| తొమ్మిది | పది | తొంబది |
| వంక | చెఱఁగు | వంజెఱఁగు |
| సగము | కోరు | సంగోరు |

ఇవి లోప సంగాగముల కుదాహరణంబులు.

| | | |
|---|---|---|
| ఉబ్బు | పొంగు | ఉప్పొంగు |
| కవ | వడి | కవ్వడి |
| కొన్ని | నాళ్లు | కొన్నాళ్లు |
| చల్ల | నీళ్లు | చన్నీళ్లు |
| నిండు | వెఱ | నివ్వెఱ |
| నిండు | వెఱఁగు | నివ్వెఱఁగు |
| నెఱ | తఱులు | నెత్తఱులు |
| నెఱ | మది | నెమ్మది |
| నెఱ | వడి | నెవ్వడి |
| నెఱ | మనము | నెమ్మనము |
| నెఱి | నడుము | నెన్నడుము |
| నెఱి | మొగము | నెమ్మొగము |
| నెఱి | నడ | నెన్నడ |
| పువ్వు | పొడి | పుప్పొడి |
| పెద్ద | పులి | బెబ్బులి |
| పేఁడ | నీళ్లు | పేన్నీళ్లు |
| మూఁడు | నాళ్లు | మూన్నాళ్లు |
| రెండు | నాళ్లు | రెన్నాళ్లు |
| వేఁడి | నీళ్లు | వేన్నీళ్లు |

ఇవి లోపద్విత్వంబుల కుదాహరణంబులు.

## టుగాగమసంధి ప్రకరణము.

సూ॥ ౫౭. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరమై నపుడు టుగాగమంబు బహుళంబుగ నగు.

'కర్మధారయంబులందు' అనుటచే సమానాధికరణమందును గొన్ని యెడల నసమానాధి కరణంబులందును ఉకారాంతపదముల మీఁద నచ్చు పరమైనపుడు టుగాగమము వచ్చును. ఉ. కఱకు + అమ్ము=కఱకు + టు + అమ్ము = కఱకుటమ్ము.

ముద్దు + ఉంగరము = ముద్దుటుంగరము
నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము
ఇల్లటపు + అల్లుఁడు = ఇల్లటపుటల్లుఁడు
గెల్పు + ఉత్సవము = గెల్పుటుత్సవము
మదము + ఏనుఁగు = మదపుటేనుఁగు

వేలుపులయొక్క ఆవు = వేలుపు + ఆవు = వేలుపు + టు + ఆవు = వేలుపుటావు. ఇది అసమానాధికరణము. సమానాధికరణమునియుఁ జెప్పనగు.

పేర్వాదుల టుగాగమము విభాష నగు. ఉ. పేరు+ఉరము= పేరుటురము - పేరురము. తప్పు + అడుగు = తప్పుటడుగు - తప్పడుగు చిగురు + ఆకు = చిగురుటాకు - చిగురాకు. నిలువు + అద్దము = నిలువుటద్దము - నిలువద్దము. అలరు + అమ్ము = అలరమ్ము - అలరుటమ్ము. పొదరు + ఇల్లు = పొదరిల్లు - పొదరుటిల్లు. పేరాస - వాలమ్ము - వాలురమ్ము. ఇందు టుగామము లేదు.

ఉకారాంతము గాకున్నను గొన్నిచోటుల టుగాగమము వచ్చుట కలదు. ఉ. దుక్కిటెద్దు - మిద్దెటిల్లు - తేనెటీఁగ - పల్లెటూరు - పంచటరుగు - పడుకటిల్లు.

తమలము + ఆకు = తమలపాకు. బొమ్మ + ఇల్లు = బొమ్మరిల్లు
పాము + అమ్మ = పాఁపరమ్మ
తామర + ఆకు = తామరాకు - తామరపాకు
గంగి + ఎద్దు = గంగెద్దు - గంగిరెద్దు. ఇట్టి రూపంబులు గలవు.

**సూ॥ ౫౮. కర్మధారయంబున నదంతశబ్దముల కాలు శబ్దంబు పరంబగునపుడు నిత్యముగ, నుదంతములమీఁద బహుళంబుగ రుగాగమం బగు.**

కర్మధారయ సమాసమందుఁ దెనుఁగు శబ్దములమీఁద 'ఆలు' అను శబ్దము పరమైనపుడు 'రు'కారంబు బహుళంబుగ నాగమం బగు. ఇచ్చట 'ఆలు' అనఁగా స్త్రీయని యే యర్థము కాని భార్యయని యర్థము కాదు.

అకారాంతశబ్దములకు 'ఆలు' పరమైనపుడు ఉ. పేద + ఆలు = పేద + రు + ఆలు = పేదరాలు. పేదస్త్రీ యని యర్థము.

ఇట్లే బీద - ముద్ద - బాలెంత - కోమ - ఐదువ - మనుమ - జవ - వీనికి 'ఆలు' శబ్దము పరమైనపుడు నిత్యముగ రుగాగమంబగు. ఆలుశబ్దము పరమైనపుడు జవ్వని 'జవ' అని యయి జవ + ఆలు = 'జవరాలు' అగును.

ఉకారాంత శబ్దములకు ఆలు పరమైనపుడు ఉ.

పాము + ఆలు = పాఁపరాలు. ముద్దు + ఆలు = ముద్దురాలు
వియ్యంకు + ఆలు = వియ్యంకురాలు. గొడ్డు + ఆలు = గొడ్డురాలు
వియ్యము + ఆలు = వియ్యపురాలు. జోగు + ఆలు = జోగురాలు
రుగాగమము రామికి ఉ.

ఇల్లు + ఆలు = ఇల్లాలు. ప్రోలు + ఆలు = ప్రోయాలు.
చూలు + ఆలు = చూలాలు. పేరంటము + ఆలు = పేరంటాలు.
పురుడు + ఆలు = పురుటాలు - పురుటియాలు.

రేఫమురాక 'టు'గాగమము వచ్చుటకు ఉ. అంకు + ఆలు = అంకుటాలు. ఈలువు + ఆలు = ఈలువుటాలు.

సూ॥ ౫౯. కర్మధారయమందుఁ దత్సమంబుల కాలు శబ్దము పరమగునపు డత్వంబున కుత్వంబును, రుగాగమంబును నగు.

కర్మధారయమందుఁ దత్సమములమీఁద 'ఆలు' శబ్దము పరమైనపుడు కడపటి 'అ'కారము ఉకారముగా మాఱును. తరువాత 'రు' ఆగమముగా వచ్చును. ఉ. ధీర-ఇది తత్సమ శబ్దము. దీనికి 'ఆ' పరము కాఁగా ధీర+ఆలు అయ్యెను.

'ధీర'లోని అకారము ఉకారముకాఁగా ధీరు అనియై రుగాగమము రాఁగా ధీరు+రు+ఆలు అనియై ధీరురాలు అని రూప మేర్పడియె. ఇట్టులే గుణవంత + ఆలు = గుణవంతురాలు - నాయక + ఆలు + నాయకురాలు.

ఉకారాంతముగ నున్నచో రుగాగమము మాత్రమే వచ్చును. ఉ. ప్రభు + ఆలు = ప్రభురాలు.

సూ॥ ౬౦. హల్లు పరంబగుచో నను, కొను, చను లోనగు క్రియాజన్యవిశేషణముల కడపటి యుత్తునకు లోపంబు వైకల్పికము.

ఉ. గరుడుఁ డన్ పక్షిరాజు - పెనగొన్ లజ్జాభీతులు - ఒకఁడు చన్ తెరువు - ఇత్యాదులు. ఇందు 'అను' 'కొను' 'చను' అనునవి ఉకారలోపముచే అన్ - కొన్ - చన్ అని యయ్యె - వీనికిఁ బరమైన పరుషములు సరళములు గావు. 'లోనగు' ననుటచే లులంతవిశేషణంబులందును నిట్టి లోపంబు గలదు. ఉ. తారసిల్ జోదులు. నిర్వహింపఁ జాల్ సమర్థులు.

సూ॥ ౬౧. కర్మధారయంబునఁ బరంబైన పరుషములకు గసడదవలు వైకల్పికము నగు.

ఏచుట్టంబులు - ఏసుట్టంబులు - ఇది త్రికపూర్వక కర్మధారయము కావున 'చు' 'సు'గా వైకల్పికముగ మాఱెను. పెద్దకాలము-పెద్దగాలము. ఇట్లు కాలము తత్సమశబ్దమై తెలుఁగుశబ్దమునకుఁ బరమైనను సమాసము గనుక దానిలోని 'కా' 'గా' యయ్యెను, సూ. ౨౭ వ్యస్తపదములందే కాని సమస్త పదంబులందు ప్రవర్తింపదు.

సూ॥ ౬౨. షష్ఠీసమాసమందలి 'ని - ల' - ల మీఁది యచ్చులకు నెందేని లోపంబు వైకల్పికంబు.

ఉ. ఇంద్రునివలె - ఇంద్రున్వలె; బింబముల రుచుల్ = బింబముల్ రుచుల్.

సూ॥ ౬౩. చేత, తోడ, వలన, ల కిత్వంబు సమాసంబులం దగు.

సమాసమందుఁ దృతీయావిభక్తి ప్రత్యయములైనచేత, తోడ, పంచమీ విభక్తి ప్రత్యయమైన 'వలన' వీనిలోఁ గడపటి నుండు అకారమునకు బదులు ఇకార మాదేశముగా వచ్చును. అనఁగా 'చేత' అనునది 'చేతి' యనియు, 'తోడ' అనునది 'తోడి' యనియు, 'వలన' అనునది 'వలని' యనియు మాఱును. ఉ. వానిచేతి యన్నము. నీతోడి కలహము. అతనివలని నేరము. ఇచట 'వానిచేత' 'నీతోడ' అనునవి 'వానిచేతి' 'నీతోడి' యనిమాఱి యితరశబ్దము లతో సమాసములైనవి - ఈయుదాహరణములందు (తృతీయా) విభక్తి ప్రత్యయ ములు లోపము కాలేదు గనుక నివి అలుక్సమాసములు, ఇట్లె 'అతనివలని నేరము' అనునదియు అలుక్సమాసమే. (పంచమీ) విభక్తి ప్రత్యయము లోపింప లేదు.

సూ॥ ౬౪. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.

అందు - ఇందు - ఎందు - అనునవి సమాసంబునఁ గలియుచో 'అలి' యనునది యాగమముగ వచ్చును.

అందు - అందలి యనియు, ఇందు - ఇందలి యనియు, ఎందు - ఎందలి యనియు నగు. ఉ. అందలి జనులు. ఇందలి తోఁటలు. ఎందలివారు. ఎందున కలిగామంబు కొందఱు లేదంద్రు. ఎందులవారు.

## ఆమ్రేడిత ప్రకరణము.

అచ్చు మొదటఁగల యామ్రేడితము పూర్వపదముతో సంధికలయు విధము సంధి. సూ. ౧౭ నఁ జెప్పఁబడినది.

సూ॥ ౬౫. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులఁ దొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్ల నదంత మగు ద్విరుక్త టకారం బగు.

ఈసూత్రము ప్రకారము మిక్కిలి యను నర్థమునందే ద్విత్వటకారము వచ్చును గాని యొకదాని వెనుక నొకటి (వీప్స) యను నర్థమందు రాదు. కడ + కడ = ఇక్కడ మొదటిపదమున మొదటి యచ్చునకుఁ దరువాతనుండు నన్ని యక్షరములకు మాఱుగా అనఁగా డకారమునకు మాఱుగా అకారాంతమైన 'ట్ట' కారము వచ్చి కట్టకడ యని యగు. మిక్కిలి కడ యని యర్థము. ఇట్లులే.

| | | |
|---|---|---|
| ఎదురు | ఎదురు | ఎట్టయెదురు |
| చివర | చివర | చిట్టచివర |
| కొన | కొన | కొట్టకొన |

| | | |
|---|---|---|
| తుద | తుద | తుట్టతుద |
| తెన్ను | తెన్ను | తెట్టతెన్ను |
| తెరువు | తెరువు | తెట్టతెరువు |
| నడుము | నడుము | నట్టనడుము |
| పగలు | పగలు | పట్టపగలు |
| పిడుగు | పిడుగు | పిట్టపిడుగు |
| బయలు | బయలు | బట్టబయలు |
| మొదలు | మొదలు | మొట్టమొదలు |
| మిట్టు | మిట్టు | మిట్టమిట్టు |

ఇత్యాదులు కడాదులు.

తొలుత + తొలుత = తొలుదొలుత యని యగునే కాని తొట్టతొలుత యని కాదు. ఇట్టులే తొలితొలి - మిటుమిటు - మిడిమిడి - లోనైనవి. తుట్టంతుద. (భా॥ రా.) ప్రౌఢప్రయోగమని యెఱుఁగునది. నిట్టనిలువు - ఇందు 'నిట్ట' శబ్దంబు. మట్ట మధ్యాహ్న మనుచోఁ దొలిశబ్దము సాధ్యము. మధ్యాహ్నము + మధ్యాహ్నము = మట్టమధ్యాహ్న మని కాలేదు. 'ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదురని యెఱుఁగఁడకట నాయెదు రెదురన్' అని తిక్కన, ద్విత్వటకారము లేకుండఁ బ్రయోగించెను. రాపు - త్రోపులఁ గడపర్గంబు లోపించు - రాపు + రాపు = రారాపు; త్రోపు + త్రోపు = త్రోద్రోపు.

'వాఁడు చెట్టుచెట్టు గుట్టగుట్ట పల్లెపల్లె యూరూరు కొండకొండ గుడిసెగుడిసె యిల్లిల్లు వెదకి విఫల ప్రయత్నుఁ డయ్యెను.' ఇచ్చట 'చెటు చెట్టనఁగా నొక చెట్టయిన పిమ్మట మఱియొకచెట్టు వెదకి యని యర్థము కావున 'ట్ట' రాదు.

సూ॥ ౭౭. ఆమ్రేడితంబు పరం బగునప్పుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు.

అప్పటికిన్ + అప్పటికిన్ - రెండవశబ్ద మామ్రేడితము పరము కాఁగా మొదటిశబ్దమునందలివిభక్తి బహుళంబుగ లోపించు.

| | | |
|---|---|---|
| అప్పటికిన్ | అప్పటికిన్ | అప్పటవప్పటికిన్ |
| | | అప్పటికప్పటికిన్. |

షష్ఠీవిభక్తిప్రత్యయము 'కిన్' లోపించి యొకరూపము లోపింపక యొకరూపము.

| | | |
|---|---|---|
| అక్కడన్ | అక్కడన్ | అక్కడక్కడన్ |
| | | అక్కడనక్కడన్ |
| ఇంటన్ | ఇంటన్ | ఇంటింటన్ |
| | | ఇంటనింటన్ |
| ఊరన్ | ఊరన్ | ఊరూరన్ |
| | | ఊరనూరన్ |

ఈ విభక్తిలోపము తత్సమశబ్దంబులందును నగు.

| | | |
|---|---|---|
| యుగమున | యుగమున | యుగయుగమున |
| దినము | దినము | దినదినము |

ఇంచుక, నాఁ డిత్యాదులందు నంతిమాక్షరలోపంబు సూత్రమున బహుళ మని చెప్పుటచే నగు.

| | | |
|---|---|---|
| ఇంచుక | ఇంచుక | ఇంచించుక |
| | | ఇంచుకించుక |
| | | ఇంచుక యించుక (ఇది శ్రీనాథ ప్రయోగము) |
| నాఁడు | నాఁడు | నానాఁడు |
| | | నాఁడు నాఁడు |
| లోపలన్ | లోపలన్ | లోలోపలన్ |
| లోనన్ | లోనన్ | లోలోనన్. |

సూ॥ ౬౭. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

| | | |
|---|---|---|
| అదుకు | అదుకు | అందదుకు |
| ఇంకులు | ఇంకులు | ఇల్లింకులు |
| ఆఁక | ఆఁక | అట్టాఁక |
| ఆఁకలి | ఆఁకలి | అట్టాఁకలి |
| ఆడు | ఆడు | అట్టాడు |
| బిగియు | బిగియు | బిఱ్ఱబిగియు |
| ఇగ్గులు | ఇగ్గులు | ఇల్లిగ్గులు. |
| కదలు | కదలు | గ్రక్కదలు |
| చవుకము | చవుకము | చచ్చవుకము |
| చెదరు | చెదరు | చెల్లచెదరు<br>చెల్లాచెదరు |
| తునియలు | తునియలు | తుత్తునియలు |
| తుమురు | తుమురు | తుత్తుమురు |
| త్రాగు | త్రాగు | తప్పత్రాగు |
| మిట్లు | మిట్లు | మిఱుమిట్లు |
| ముడుఁగు | ముడుఁగు | ముచ్చముడుఁగు |
| విరియు | విరియు | విక్కవిరియు |

ఈ శబ్దములకెల్ల నేకసూత్రవిధానము సాధ్యము గాదు. కావున భాషయం దున్నట్లు గ్రహింపనగు.

సూ॥ ౬౮. ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబును నగు.

లేచు ధాతువునకుఁ బ్రార్థనార్థకరూపము లెమ్ము. దీర్ఘమైన 'లే' హ్రస్వమైన 'లె' యయ్యెను. దీని కామ్రేడితము పరమైనపుడు

లెమ్ము + లెమ్ము    లెమ్ము లెమ్ము - లేలెమ్ము - లేలే
రమ్ము + రమ్ము    రమ్ము రమ్ము - రారమ్ము - రారా
పొమ్ము + పొమ్ము    పొమ్ము పొమ్ము - పోపొమ్ము - పోపో

## మువర్ణక ప్రకరణము.

సూ॥ ౬౯. పడ్వాదులు పరంబు లగునపుడు ము వర్ణకం బునకు లోప, పూర్ణబిందువులు విభాషనగు.

పడు, పఱచు, పట్టి శబ్దములు ప్రథమావిభక్తి ప్రత్యయమైన 'ము' వర్ణకమునకుఁ బరముగా వచ్చినపు డా 'ము' వర్ణకమునకు మాఱు నిండుసున్న యైన వచ్చును. లేక యా ము వర్ణకము లోపించినను లోపింపవచ్చును. లేక మువర్ణకమే యుండిన నుండవచ్చును. ఉ. శ్రమము+పడు - ఇచ్చట శ్రమ ములోని 'ము' వర్ణకము ప్రథమావిభక్తి ప్రత్యయము. దానికి 'పడు' పరమైనది. కావున నా ము వర్ణకమునకు బదులు నిండుసున్న రాఁగా శ్రమంపడు అనియు ము వర్ణకము లోపించి శ్రమపడు అనియు, లేక యథాస్థితిగ శ్రమ ముపడు అనియు నీ మూఁటిలో నేదైన వైకల్పికముగ వచ్చును. ఇట్లు భయము పఱుచు, భయంపఱుచు, భయపఱుచు, సూత్రముపట్టు, సూత్రంపట్టు, సూత్ర పట్టు మొ. శ్రమంపడు అన్నప్పుడు 'శ్రమం' ద్రుతప్రకృతికము గాదు గనుక శ్రమంబడు అనికాదు. నిండుసున్న వచ్చునేకాని యరసున్న రాదు. 'శ్రమఁపడు' అనుట తప్పు. ఈ ప్రథమావిభక్తిలో నుండు శబ్దము పడు మొద లగువానికిఁ గర్తగా నుండెనేని యీ రూపములు రావు. ఉ. గుఱ్ఱముపడియె. ఇచ్చట 'గుఱ్ఱము' కర్త. 'పడియె' క్రియ. కావున గుఱ్ఱ పడియె, గుఱ్ఱం పడియెనని చెప్పరాదు. 'పడు' పరమైనపుడు 'త్రోవ' నఁ గడయక్షరము

వైకల్పికముగ లోపించు. ఉ. త్రోపు + పడు = త్రోపడు, త్రోపుపడు. ఇత్లే. రాఁడు + పడు = రాపడు, రాయిపడు = రాపడు. చేటుపడు = చేడ్పడు

తత్సమము. సూ. ౨౮. ప్ర. ఈ మువర్ణమునకు మాఱుగ 'ంబు' వచ్చుటయుఁగలదు. ఉ. సంతసంబుపడి. భా. ఆదిప - ౮ ఆ.

సూ॥ ౭౦. మధ్యపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు.

హల్ + అవసానము = హలవసానంబులు. చూడుము ఇందలి 'ము' వర్ణకము మధ్యమపురుషంబును సూచించునది. ఈ 'ము' వర్ణకంబునకు హల్లు పర మైనను, మువర్ణకముతోనే యా వాక్యము ముగిసినను దానిలోపము విభాషగ నగు (విభాష చూ సంధి. సూ. ౩౩.) చూడుము + నన్ను ఇందు మువర్ణకమునకు హల్లైన నకారము పర మయ్యెను. కాఁబట్టి 'ము' లోపించిన 'చూడు నన్ను' అని యగును. మువర్ణకము లోపింపకున్న 'చూడుము నన్ను' అని యగును.

ఇటు చూడు } ఈ యుదాహరణమందు వాక్యము ముగియుటచే ము
ఇటు చూడుము } వర్ణకమున కావల నక్షరములు లేవు. కాఁబట్టి మువర్ణకము లోపించిన 'ఇటుచూడు' అని, లోపింపకుండిన 'ఇటుచూడుము' అని, యగును. సూత్రమునందు హల్లనియే యున్నది గావున అచ్చు పరమైనపుడు 'ము' వర్ణకంబునకు లోపము లేదు. చూడుము + అనియె. ఇచ్చట మువర్ణకమునకు అచ్చైన 'అ' పరమైనది గనుక సంధి. సూ. ౧౦ ప్రకారము 'చూడుమనియె' ననియే చెప్పవలయుఁ గాని 'చూడనియె' నని చెప్పరాదు.

'ఆడిరె నీదుపంతెము' ఇది అపపాఠము. ఆడుటె నీదు పంతెము అని యుండవలయు. భవచ్చిత్తేప్సితంబెద్ది "చెప్పనినన్" అనునదియు అపపాఠమే. భవచ్చిత్తేప్సితంబెద్ది చెప్పు నినున్ సంతత" అని సరియైన పాఠము. "కావు

కావను" అనునది వసుచరిత్ర పాండురంగ మాహాత్మ్యములందుంగాన నయ్యెడి. ఇది శ్లేష నియమము వలనఁ గలిగిన నిర్బంధము. కావునఁ బ్రమాణముగాదు.

సూ॥ ౭౧. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

మీఁది సూత్రమునందుఁ జెప్పఁబడిన మధ్యమపురుషమువర్ణకము వ్యతిరేకార్థము నిచ్చుపదమునకుఁ గూర్పఁబడినయెడల దానికిఁ బరముగ అచ్చు వచ్చినను హల్లు వచ్చినను విభాషగ నా మువర్ణకము లోపించును.

నమ్మకము ఇట. నమ్మకిట-నమ్మకు మిట.

ఇచ్చట 'నమ్మకుము' వ్యతిరేకప్రార్థనార్థకము గనుక దానికి అచ్చు పరమైనను మువర్ణకమునకు లోపము వచ్చెను.

సూ॥ ౭౨. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ 'ము' 'ఁడు' లకు లోపంబు విభాష నగు.

ఆమ్రేడితము. (చూ. సంధి. సూ. ౧౭) ప్రార్థనాద్యర్థకమున మధ్యమ పురుషంబున నేకవచనమున 'ము', బహువచనంబున 'ఁడు' వచ్చును.

ఆమ్రేడితము పరంబగునపు డీ 'ము, ఁడు' లకు లోపము విభాషనగు. ఉదా.

ఉండుము ఉండుము ఉండుండుము. (ము లోపము.)
ఉండుముండుము. (ము లోపింపక)
కొట్టుఁడు కొట్టుఁడు కొట్టుకొట్టుఁడు
కొట్టుఁడు కొట్టుఁడు

ఇట్లు నిలునిలుము. పట్టుపట్టుఁడు లోనైనవి.

## ధ్వన్యనుకరణ ప్రకరణము.

సూ॥ 23. ధ్వన్యనుకరణంబులు ద్వి, త్రి, చతురుక్తంబులు నగు.

ఉ. గడగడ, వడవడ, తళతళ, ఫెళఫెళ, ధణ, ధణ, ఘులుఘులు, భుగభుగ, భగభగ, ఇత్యాదులు ధ్వన్యనుకరణంబులు. వీనిని మూఁడు నాలుగుమాఱు లైనను జెప్పవచ్చును.

భుగభుగ, భుగ యనుచుం గాలఁజొచ్చెఁ బురిమందిరముల్.

ఘుల్లుర ఘుల్లు ఘుల్లురని ఘుల్లని మ్రోయఁగ భీతి గుండియల్ ఝల్లుర ఝల్లు ఝల్లురని ఝల్లన.

రథవేతండతురంగ సైనికగణారావం బుదాత్త శ్రుతివ్యథ విస్ఫారణధణం ధణం ధణ ధణ ధ్వానంబులో, ఇత్యాదులు.

సూ॥ ౭౮. ధ్వన్యనుకరణంబులకు ననుధాతు వనుప్రయుక్తం బైనపుడు కొన్నియెడల ముగాగమం బగు.

ఉ. సలసల + అని = సలసల + ము + అని = సలసల మని.
కనకన + అని = కనకన + ము + అని = కనకనమని.

ఇత్యాదులు.

సూ॥ ౭౯. అనుధాతు వనుప్రయుక్త మైనపుడు ధ్వన్యనుకరణంబులఁ దుది హల్లునకు ద్విత్వం బగు.

భామ్ + అని = భామ్మని - పటిల్ + అని పటిల్లని - త్రుప్ + అని త్రుప్పని - కజ్జని, గుజ్జని, ఇత్యాదులు. ఇతరమైన యజాది శబ్దము పరంబైనపుడును ద్విత్వంబగుట కలదు. ఉ. త్రుప్పఁట. అఁట = అనుట.

సూ॥ ౮౦. ముగాగమంబగుచో ద్విత్వంబు విభాషనగు.

ఉ. పటిల్లని. "అను ధాతు వనుప్రయుక్తమైనపుడు ధ్వన్యనుకరణంబుల" ననునది పై సూత్రమునుండి గ్రహింపవలయును.

## సంస్కృతశబ్దప్రయోగ ప్రకరణము.

సూ॥ ౮౧. సంస్కృత సు, త్వి, క్త్వా, తుమున్నంతము లిం దప్రయోక్తవ్యంబులు.

సంస్కృతమునందు సుబంతములు=విభక్తి. ప్రత్యయములతోఁ గూడి నవి. రామః. హరిః. రామమ్. ఇత్యాదులు.

తిజంతములు క్రియలు. భవతి - యాతి - గచ్ఛతి - నయామి మొద లైనవి.

క్త్వాంతములు - (క్త్వాకడపటఁగలవి.) క్త్వార్థకములు. ఉదా. భుక్త్వా - త్యక్త్వా - మొదలైనవి.

తుమున్నంతములు - తుమ్ కడపటఁగలవి. ఉదా. గంతుమ్. భోక్తుమ్ పాతుమ్. లోనైనవి.

ఇట్టి శబ్దము లీయాంధ్రభాషయందుఁ బ్రయోగింప రాదు. అనఁగా 'వాఁడు రాముఁడు' అనుటకు "వాఁడు రామః" అనరాదు. వాఁడు నన్ను విడిచి విందు భుజించి యింటికిఁ బోవుటకు బ్రయత్నించె ననుటకు మాఱుగా వాఁడు నన్నుఁ ద్యక్త్వా విందు భుక్త్వా యింటికి గంతుమ్ ప్రయ త్నించెను' అని చెప్పరాదు.

## సూ॥ ౭౮. భవచ్ఛత్రాదులు నిట్టివ.

భవత్ - భవిష్యత్ - జీవత్ - చరత్ - ఇట్టి శత్రర్థకములును ధూర్ ప్రాదుర్ ఇట్టి రేఫాంతకంబులును ఆంధ్రభాషయందుఁ బ్రయోగింపరాదు. వీనిని సంస్కృతసమాసములఁ దొలుతటిపదంబులఁగఁ జేసి ప్రయోగింప వచ్చును. ఉ.

భవదాజ్ఞ - యుష్మత్కార్యము - అస్మచ్ఛాసనము - మదభీష్టము - త్వద్ధితము. లసత్తేజము - భవిష్యద్బ్రహ్మ - జీవత్కవి - చరన్మృగము. ప్రాదుర్భావము - ధూర్వహము - ధూర్జటి. లోనైనవి.

## సూ॥ ౭౯. సదాద్యవ్యయంబులు గ్రాహ్యంబులు.

సదా - సర్వత్ర - సర్వదా - సర్వథా - నహి - నాస్తి - స్వస్తి - అహహా - ఆహోహో - ఊహా - ప్రతి - ఈ శబ్దములకు స్వతంత్రప్రయోగము కలదు. ఒక్కఁడు అథవా

యనియుఁ బ్రయోగించెను. ఎందేని సకృత్తుగ వీనిఁ బ్రయోగింపవచ్చును. మా మా వలువలు ముట్టకు-భాగ. మా మా = వలదు వలదు.

సూ॥ ౮౦. యథాయథలు వృథావృథలు.

యథాయథ మ్మనుసంస్కృతావ్యయము తెలుఁగున యథాయథలు అనియు వృథా యనునది వృథా వృథ యనియుఁ బ్రయోగంబులఁ గానంబడి యెడి. వృథలు అనియుఁ గలదు.

సూ॥ ౮౧. నిషిద్ధంబు లనుకరణపరకంబులై ప్రయోగార్హంబు లగు.

౭౭—౭౮ సూత్రములచే నిషేధింపఁబడిన శబ్దములకు అనుధాతువు పరముగ వచ్చినచో నవి యాంధ్రంబునఁ బ్రయోగంబున కర్హము లగు. అను కరణపరకము లనఁగా 'అను' ధాతువు పరమందుఁ గలవి. ఇట్లు అనుధాతువు చేర్చునపుడు సంస్కృతశబ్దములందుఁ గొన్ని మార్పులు గలుగును. అవి యేవనఁగా.

సూ॥ ౮౨. అనుధాతువు పరంబగుచో విసర్గమునకు లోపం బగు.

ఉ. వాఁడు రామః అనియె = వాఁడు రామ యనియె ఇచ్చట రామః అనునది సంస్కృతము. దీనికి అనుధాతువు యొక్క భూతార్థకరూపము 'అనియె' పరమయ్యెను. పరము కాఁగా విసర్గము లోపించి రామయని నిలిచి సంధి. సూ. ౪ ప్రకారము 'రామయనియె' నని యయ్యె. ఇట్టులే త్వమేవగతిః+అనియె=త్వమేవగతి యనియె నని యయ్యె. ఈ అను ధాతువు 'అటు' తోఁ జేరివచ్చినను నిట్టి రూపములే కలుగును. త్వమేవ గతి యటంచుఁ బలికె.' ఇత్యాదులు.

సూ॥ ౮౩. అనుకరణంబున నమశ్శబ్దము కడపటి య త్తున కోత్వము విభాష నగు.

ఉ. రామాయ నమో యనియె. రామాయ నమ యనియె.

ఇచ్చట 'నమః' అనుశబ్దమునకు 'అను' ధాతువు పరముకాఁగా విసర్గము లోపించి 'నమ యనియె' నని యగుటయే గాక మకారముమీఁది అకారము ఓకారమై 'నమో యనియె' ననియు నయ్యె - నమశ్శబ్దముగాక యితరశబ్ద మైనను నొక్కెడ నిట్టులే విసర్గమునకు లోపము అకారమునకు ఓత్వము వచ్చును. ఉ. 'గతానుగతికో లోకో' యటంచుౝ.

సూ॥ ౮౪. ఉదంతనామంబునకు ననుకరణమందు వుగా గమం బగు.

ఉదా. ఇయంధేనుః + అనియె = ఇయంధేను వనియె 'ధేనుః' ఉకా రము కడపటఁగల నామవాచకంబు. దీనికి 'అనియెఁ' బరమయ్యెను. కాఁగా సూ. ౮౨ ప్ర॥ విసర్గము లోపించి 'ఇయంధేను + అనియె' అయి 'వు' ఆగమముగ వచ్చి 'ఇయంధేను వనియె' నని రూప మేర్పడియె.

నామవాచక మనుటచే ధర్మోజయతు + అనియె. ధర్మోజయతనియె- శుభమస్తు + అనియె = శుభమస్తనియె నని యగును. జయతు - అస్తు క్రియలు గావున వుగాగమము లేదు.

సూ॥ ౮౫. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.

| | | |
|---|---|---|
| కిం తత్ | + అనియె | కిం త త్తనియె |
| క స్త్వమ్ | + అనియె | క స్త్వ మ్మనియె |
| కిమ్ | + అనియె | కి మ్మనియె |
| జగత్ | + అనియె | జగ త్తనియె |
| దిక్ | + అనియె | ది క్కనియె |

కావ్యాలంకారచూడామణియందు 'కాగుహా రనునట్టి పలుకు' (కాగుహార్ + అనునట్టి.)

'సా తేక్వ దనుడుఁ దగణము' (సా తేక్వత్ + అనుడు)

'కింవద భన నది భగణంబు' (కింవదభ్ + అన)

'సహాస నని పలుక సగణంబు' (సహాసన్ + అని)

ఇట్టి ద్విత్వరహిత ప్రయోగంబులు కానవయ్యెడి.

సూ॥ ౮౬. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.

| | |
|---|---|
| దాసోఽహమ్ + అనె | దాసోఽహ మ్మనె |
| | దాసోఽహ మనె |
| భోక్తవ్యమ్ + అనె | భోక్తవ్య మ్మనె |
| | భోక్తవ్య మనె |

అహ మాదు లనఁగా అహమ్ మొదలైన మకారాంత శబ్దములు. ఇట్టి మాంతశబ్దములం దొకయచ్చుమాత్ర ముండిన మీఁది సూత్రము ప్రకారము మ్ నకు ద్విత్వము వచ్చును. ఒక స్వరమునకుఁ బైపడి యుండిన ద్విత్వము వైకల్పికము. మకారమునకు 'ంబు' రాదు. భోక్తవ్యమ్+అనుపలుకు-భోక్తవ్యంబను పలుకు అని చెప్పరాదు.

సూ॥ ౮౭. అనుకరణంబున దీర్ఘంబు హ్రస్వంబు గాదు.

ఉ. దుర్బలస్య బలం రాజా యన విన వే.మను-చ. యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృ, శీ యనువాక్యంబు సిద్ధమయ్యె - వరాహ.

ఇంద్రాయ స్వాహా యనఁ జేయి సాఁచి. జై - భా.

ఇచ్చట రాజా-తాదృశీ-స్వాహా యనునవి హ్రస్వాంతములు కాలేదు.

సూ॥ ౮౮. ఆశ్చర్యసంతాపాద్యర్థంబుల ననుకరణంబు లేమి దోషంబు గాదు.

అంటితి 'నమశ్శివాయ' పాపాత్మురాలి. జయజయ శంకర.

మనుజాశన లఁట బలు లఁట, మును లఁట యాగంబు లఁట 'నమో విశ్వసృజే' విన మెన్నఁడు మున్నిట్టివి. ఉ. హరి. లింగనివాస మేమియును లేమికిఁ జొక్కి 'నమశ్శివాయ' చేయంగల కార్య మెద్ది యొకో. కాళ. మా. ఆరగింపుఁడు లెండు మీ 'కమృతమస్తు' - శ్రీనాథుఁడు. కర్తు మకర్తు మన్యథా కర్తు ముదారశక్తివి - రామభద్రుఁడు. ఇట్టి ప్రయోగవిశేషంబులు ప్రయోగంబుల నెఱుంగునది.

సూ॥ ౮౯. ద్విత్వయుక్తంబు మఱియొక హల్లుతో సంయుక్త మగునపుడు ద్విత్వమునకు లోపంబు.

ఉ. గొడ్డురాలు-గొడ్రాలు. అంబళ్లు కాఁచి = అంబళ్గాఁచి - పందిళ్వేసి ఇత్యాదులు.

సూ॥ ౯౦. అపవాదంబులు విధులు కావు. ప్రమాదంబులు ప్రమాణంబులు గావు.

అనఁగా క్వాచిత్కంబుగఁ బ్రయోగింప నర్హమగునవి యిచ్చలవిడి ప్రయోగింపరాదు. ప్రామాణిక గ్రంథములందైనను నిర్బంధకారణంబునఁ గాని ప్రమాదంబునఁ గాని ప్రయోగింపఁబడినవి ప్రమాణంబుగఁ గొనరాదు.

నీ విప్ప్రభావము - ఈ ప్రభావము - ఇప్ప్రభావము కానేరదు. శ్లేష నిర్బంధమున విధిలేక చెప్పవలసి వచ్చెను. కావున నిది మహాకవిప్రయోగ మని త్రికంబు మీఁది సంయుక్తాక్షరంబుల కెల్ల ద్విత్వంబు కల్పింపరాదు. 'నుయి వాఁడే వానికిఁ' అనునది కవియే ప్రయోగించియుండినఁ బ్రమాద

పతితము. కవిహృదయమైనచో నా గ్రంథమున నెన్నిస్థలంబులందో ప్రయోగములను కానవచ్చెడుండు. కావున నిట్టివి ప్రమాణంబులు గావు. ఎట్టి వానికిని బ్రమాదంబు స్వభావము. నిష్పన్న శబ్దములకు శాస్త్రము బలీయము. అనిష్పన్నశబ్దములకుఁ బ్రయోగము బలీయము.

## సార్ధబిందుక శబ్దముల పట్టి.

### ఏకాక్షరము.

ఆఁ — ఆఁ ఆఁ యను.

ఊఁ — ఊఁ యను - ఊఁ కొట్టు - ఊఁకొను - ఊఁకగ.

గీఁ — గీఁ యను. గీఁక.

సైఁ

హైఁ

### ఁక

### రెండక్షరముల శబ్దములు.

ఆఁక — ఆఁకకట్టు, ఆఁకట్టు (చూ. ఆఁగు.)

ఇఁక — ఇఁగ, (ఇవి + కాఁ)

ఈఁక — బొద్దీఁక.

ఊఁక — (చూ. ఊఁగు)

ఓఁక

కాఁక — క్రాఁక - (చూ. క్రాఁగు)

ఘూఁక — (ఘూంకారము)

గీఁక — (చూ. గీఁ) ఘీంకారము

తోఁక

డాఁక

నూఁక

పోఁక

మూఁక మూఁగు.

మేఁక

లేఁక (లెంక)

వీఁక

బోఁకి

వేఁకి - వేఁకరము - వెరవేఁకి.

ఊఁకు ఊఁకువ - ఊఁకించు. (ఊను + కు)

గీఁకు

గోఁకు

చీఁకు చీఁకటి - చీఁకటితప్పు - చీఁకొరించు. చీఁకుటాలు.

చేఁకు తేఁకు.

డోఁకు

తాఁకు తాఁచు.

దేఁకు

దోఁకు దోఁకిస - దోఁకు + పాఱు.

పీఁకు

పోఁకు

ప్రాఁకు ప్రాఁకుకొను - ప్రాఁకొను.

బాఁకు

మాఁకు మ్రాఁకు.

సాఁకు కాపాడుట యని యర్థము. సెపమను నర్థమున దీం గుడు లేదు.

సోఁకు సోఁకుఁడు.

పీఁకె

బోఁకె

మూఁడక్షరముల శబ్దములు

ఆఁకలి ఆఁకొను - ఆఁకలికొను.

దూఁకలి

రోఁకలి (సం. ఉలూఖలః. ద్రా. ఉరోజ్జల్)

ఓఁకిలి

చీఁకిలి

ఓఁకర

కాఁకర ఆఁగాఁకర.

ఏఁకరి

ఏఁకరు ఏఁకారు - ఏఁకట. (ఏఁకారుట)

చీఁకటి (చూ. చీఁకు) దీనిని ద్రావిడులు 'చీంకటి' యని యుచ్చరించెదరు.

వేఁకటి వ్రేఁకన - వ్రేఁకము. వ్రేఁగు.

మోఁకాలు- (చూడుఁడు మోఁదు.)

డ-ణ.

కడేఁక కణఁక.

పడఁకు పణఁకు.

బెడఁకు బెణఁకు.

వడఁకు వణఁకు. వడఁకాడు - వణఁకాడు.

కొలఁకు (సం. కూలంక శబ్దతద్భవము కొలఁకు అయి యుండ వచ్చును. అనఁగాఁ గూలము కలది యని యర్థము, కులము - కొల్లమైనట్టు కూలము - కొలమగును. కొలం+కు - కొలఁకు - ఆయె నన నగు. కొల మనునది కొలను - అనియు అఱవమున - కుళమ్ అనియు నన్యో)

తలఁకు

తోలఁకు తొలఁకాడు.

తొడఁకు

నడఁకు (అ. నడుగ్గు)

తొనఁకు

నలఁక (చూడు నలఁగు)

మలఁక

మడఁక

లోఁకువ లోఁగడ - లోఁగలి - లోఁగిలి. లోఁగొను - (చూడు లోఁగు.

నాఁకుడు

వెల్లఁకి

ఆఁకరము

ఓఁకలివె

దొరఁకోలు (దొరకుకోను)

నాయఁకుఁడు-నాయఁకురాలు.

## గ.

గఁ

ఈఁగ — తూనిఁగ - తూనీఁగ.

ఛాఁగ

తీఁగ — తీఁగె - తీఁగియ.

మూఁగ — (ద్రా - మూఙ్గ్ర సం - మూక)

లాఁగ

జాఁగ

లేఁగ — (చూ. లేఁత)

ఆఁగు — (అన + అగు = అనఁగు=ఆఁగు) ఆఁక-ఆఁకట్టు-ఆఁక కట్టు-ఆఁచు-ఆఁచికొను - ఆఁక త్రాళ్లు-ఆఁకపడు-ఆఁపు-ఎల్లాఁపి-తలాఁపి. (వ్యాసపరిచ్ఛేద పీఠిక చూడుము)

ఈఁగు — నీఁగు

ఊఁగు — (ఊఁగు + అడు) ఊఁగాడు. ఊఁక - ఊఁచు

ఔఁగు

కాఁగు — (కాయు + గు) క్రాఁగు, క్రాఁచు - కాఁపుడు- కాఁపడము - కాఁక - క్రాఁక

డాఁగు — దాఁగు-దాఁగుకొను-దాఁగుకొను-దాఁచు - డాఁచు- దాఁపు-దాఁగిలి మూఁతలు - డాఁగిలి మూఁతలు- దాఁగిలి ముచ్చులు, (అ. తఙ్గ)

తూఁగు — తూఁగాడు

తోఁగు — (ద్రా - తోయ్+అగు)

త్రోఁగు

దాఁగు

ఁగు.

నీఁగు  (అఱ - నీఙ్గు)

నూఁగు  నూఁగుడు.

పోఁగు

మూఁగు  (ద్రా. మూయ్+అగు) మూఁక

మేఁగు  మ్రేఁగు

మూఁగు  (మూయు+అగు)

మ్రాఁగు  (మ్రాను+అగు)

మ్రోఁగు  (మ్రోయు+గు)

రేఁగు  రేఁచు - రేఁపు

లోఁగు  (లోను + అగు = లోనగు)

వాఁగు

వీఁగు  (వీఁపు + అగు. ద్రా. వీఙ్గు)

వేఁగు  (వేయు + అగు వేయుధాతువునకు వెచ్చచేయు అని యర్థము. ఇది వేయించు అనుచోఁగననగు. ఈ ధాతువే అఱవమున వేయ్ యనుచోఁగననగు) వేఁచు - వేఁపుడు - వేఁకి - వేఁకరము - వెరవేఁకి - వేఁడి - వేఁడిమి.

వ్రేఁగు  (చూ. వేఁకటి)

సాఁగు  చాఁగు - చాఁచు - చాఁపు

సోఁగు

వేఁగి  (వెంగి)

ంగ.

డంగ.

సుండఁగి
జోడఁగి జోణఁగి (అ. శోణజ్గి)
గొడఁగు గొణఁగు
అడఁగు అణఁగు - అడఁకువ - అణఁకువ - అడఁగారు - అణఁగారు-అడఁచు. అణఁచు (అడక్ + అగు = క్రిందగు (ద్రా. అడగ్గు)
కడఁగు కణఁగు
తడిఁగి
తొడఁగు (ద్రా. తొడగ్గు)
జుడుఁగు జుణుఁగు
మడఁగు మణఁగు. మడఁచు. (ద్రా. మడగ్గు)
బెడఁగు
మడుఁగు మణుఁగు. మడుఁచు. (అ. మడగ్గు)
మిడుఁగు మిణుఁగు - మిడుఁగురు - మిణుఁగురు
ముడుఁగు ముడుఁచు
వెడఁగు
ఒదుఁగు (అ. ఒసుగ్గు)

ర - ంగ.

అరఁగు
కరఁగు కరఁచు
తొరఁగు
పొరఁగు

తరఁగ

అరుఁగు

చిరుఁగు

పెరుఁగు

సురుఁగు

సురుఁగు (అ. శురుఙ్గు)

ఎఱఁగు

చెఱఁగు

తెఱఁగు

తొఱఁగు

మొఱఁగు

వెఱఁగు

ఎఱుఁగు

తఱుఁగు

మఱుఁగు

మెఱుఁగు

నఁగ.

పీనుఁగు

గానుఁగు

ఏనుఁగు

తూనిఁగ తూనీఁగ (చూ. ఈఁగ)

పెనఁగు (పెనయు + అగు = పెనయునట్లు అ. పిణఙ్గు)

పెనఁకువ పెనఁగాడు - పెనఁగొను. పెనఁచు

చెనఁగి చెన్నఁగి

చినుఁగు
జినుఁగు
తునుఁగు
తెనుఁగు — తెలుఁగు
పినుఁగు
పునుఁగు
పానుఁగు
మునుఁగు
పులఁగ
వెలఁగ
అలఁగు — అలఁచు - అలఁత
కలఁగు — కలఁచు - కలఁత ( ద.అ - కలఙ్గు
చెలఁగు
తలఁగు
తొలఁగు — తొలఁచు
నలఁగు — నలఁక - నలఁకువ - నలంప
మలఁగు — మలఁచు
మెలఁగు — మెలఁకువ - మెలఁచు
బెళఁగు
అలుఁగు
ఎలుఁగు — ఎలుఁగించు
జిలుఁగు
పలుఁగు — (సం. స్ఫటికః. అఱ. పళిఙ్గు)
పిలుఁగు

పులుఁగు

మలుఁగు

వెలుఁగు (వెలన + అగు = వెలనగు = వెలుఁగు. ద్రా, కిళ్గు)

మెలఁగు మెలఁకువ - మెంలఁచు

సఁగ.

గోసఁగి

వేసఁగి

ప్రాసఁగు

ఎసఁగు

ఒసఁగు

దోసఁగు

పోసఁగు

మసఁగు

మెసఁగు

నిసుఁగు

నుసుఁగు

ముసుఁగు

విసుఁగు చూ విప్రనారాయణచరిత్ర

గేదఁగి

ఒదుఁగు

పొదుఁగు

గొజ్జఁగ గొజ్జెఁగ - గొజ్జఁగి

చాఁగలి

డాఁగర

చాఁగురె

చాఁగిల్లు — చాఁగిలింత

తాఁగలి

దోఁగాడు

దోఁగుడు

కౌఁగిలి — (కౌను+కలయు)

నాఁగలి — నాఁగెలు - నాఁగేలు (సం. లాంగలమ్)

వాఁ[illegible]రు

పాఁగము

మీఁగడ — (మీఁదు + కడ)

మ్రాఁగన్ను — (మ్రాను+కన్ను)

రేఁగుడు

లాఁగరి

వేఁగిస

సంపెఁగ — సంపఁగె, సంపఁ...

సివంగి — సివ్వఁగి (అ. శివఙ్గి)

ఎలనాఁగ — (ఎల+నాఁగ - ఎల=లేఁత - నాణెము గలది)

ఒడఁగూడు — (ఒడన్+కూడు)

కనుఁగొను — (కనున్+కొనున్)

కుప్పఁగూర — (కుప్ప అనన్+కూర=కుప్పనకూర-కుప్పఁగూర) కుప్పనఁగూర

కుఱుఁగలి — (కుఱున్+గలిగినది. కుఱుచదూరముఁ గలిగినది. కుఱుచ - కుఱుఅగుట ప్రసిద్ధము)

కోటానఁగోటులు (కోటి+అనన్+కోటులు)

| | |
|---|---|
| తుఱఁగలి | |
| కవుఁగిలి | (చూ. కౌఁగిలి) |
| పిల్లఁగ్రోలు | పిల్లఁగ్రోవి. పిల్లన+క్రోలు-పిల్లన+క్రోవి) |
| బలఁగము | (బలమును గలది) |
| బోయకలఁగు | |

## ఁచ.

| | |
|---|---|
| ఁచ, | |
| ఊఁచ | |
| పోఁచ | |
| కాఁచి | |
| గోఁచి | (కొంచియము=కోఁచియము. గోఁచి) |
| పాఁచి | ప్రాఁచి - ప్రాఁత - పాఁత |
| పోఁచి | |
| ఆఁచు | సాఁచు |
| ఊఁచు | ఊఁపు |
| ఏఁచు | ఏఁపు |
| కాఁచు | కాఁపడము, అంగడిదినుసు |
| కీఁచు | (ధ్వన్యనుకరణలబున ననునాసికోచ్చారణము) |
| గీఁచు | |
| తాఁచు | (తన్ను + చు) తాఁపు - తాఁకు |
| తూఁచు | (తూనికవైచు) |
| తోఁచు | తోఁపిక (అ. తోఁస్తు) |

త్రేఁచు — త్రేఁపు. (త్రేఁచు)

దోఁచు — దోఁపు-దోఁపిడి. (దొంగిలించు నుండి దోఁచు వచ్చి నట్లు. తోఁచెడి)

నాఁచు

నోఁచు — (నోముచు) నోఁత

పూఁచు — (పూనుచు) పూఁపు

రేఁచు

లాఁచు — (లాయుచు)

లోఁచు — (చూ. లోఁగు)

వాఁచు — వాఁపు

సైఁచు — (సహించు = సయించు) సైఁపు

కాఁచర

తలఁచు — తలఁపు. (తలఁ + పుట్టునది)

పోఁచీలు

పీఁచము — (తె. పించెము. సం. పిచ్ఛమ్)

తోఁచిగాఁడు

ఁజ.

కాఁజు

కొఁజు — (చూ. కముఁజు)

గోఁజు

పోఁజు

పాఁజు

బాఁజు

| | |
|---|---|
| బూఁజు | |
| రాఁజు | |
| రోఁజు | |
| ఈఁజేటి | ఇంజేటి. |
| కడఁజు | కణఁజు. |
| కముఁజు | కవుఁజు-కాఁజు (సం. కపిఞ్జలః) |
| కలుఁజు | |
| కురుఁజు | |
| గాఁజర | |
| తేఁజెట్టు | (తెంకి-టెంకి చిప్ప)గల కాయ తెంకాయ. ఆకాయలు ఫలించు చెట్టు తెం (కాయ) చెట్టు-సంక్షేపముగ తెంజెట్టు. అదే తేఁజెట్టు) దక్షిణదేశము నుండి వచ్చుటచే నీపేరు గలిగెనని యందురుగాని యీ చెట్లు భరతఖండమునందంతట ననాదిగఁ గలవు. |
| పిడుఁజు | |
| బీరాఁజు | |
| వెరఁజు | |
| కణఁజము | (కళఞ్జియమ్) |
| పాఁజేబులు | |

## ఁట.

| | |
|---|---|
| అఁట | (అనుట) |
| తాఁట | |
| తీఁట | |
| తూఁట | తూఁటరి. (తుంటరి) |

| | |
|---|---|
| తోఁట | తోఁటీఁడు |
| దూఁట | |
| పీఁట | |
| పూఁట | పూనుట. (ఒకరికిఁగాను మఱియొకఁడు పూనుట పూఁట యగును) |
| పేఁట | (పెంట - పింఠో) |
| పైఁట | చూ. పయఁట. |
| బీఁట | బీఁటిక - బీఁటగిల్లు - బీఁటలువాఱు. |
| ఆఁటు | |
| ఊఁటు | |
| క్రేఁటు | |
| గీఁటు | |
| గోఁటు | |
| దాఁటు | (సం. తాణ్డవమ్ అ. తాణ్డు) |
| దూఁటు | దూఁకొను. |
| ఱేఁటు | |
| బోఁటు | |
| మాఁటు | |
| గూఁటి | |
| తేఁటి | (తేనెటీఁగ) |
| దోఁటి | |
| బోఁటి | (పోలునట్టి చూ. పోఁడి) |
| ఈఁటె | ఈఁటిఱ. |

ఆఁటది — ఆఁడది - ఆఁడుది - ఆఁడుపడుచు - ఆఁడుబోఁడు - ఆఁడుపాప - ఆఁడుకట్టు.

గరిఁటె — (అ. కరణ్డి)

పరఁటె

చెనఁటి — చెన్నఁటి.

అనఁటి — అరఁటి.

పనఁటి

పరఁటి

సురఁటి — సురఁటీ.

పయాఁట — పయ్యాఁట(పయిన్ + అంటు = ఊర్ధ్వదేహమునంటి యుండునది)

పరఁట

పురఁట

పొరఁటు

గోరఁట — (సం. కుటణ్టకః)

మొరిఁటె

పేరఁటము — పేరఁటాలు (పేరంట్రము)

ఁడ.

కాఁడ — (సం. కాణ్డః)

ఏఁడి — ఏఁడీ.

గాఁడి

చూఁడి

తాఁడి — (తాండ్ర = అ. తాణ్డి)

తూఁడి

పాఁడి

| | |
|---|---|
| పూఁడి | చింతలపూఁడి - గుమ్మడిపూఁడి దీనికిఁ బ్రత్యేకప్రయోగములేదు. |
| పైఁడి | పయిఁడి - పసిఁడి. |
| పోఁడి | పోఁడిమి. (పోలునది. ఉ. పూఁబోఁడి - మగపోఁడిమి; పోలునది యే - 'పోనిది' యయి యదే యర్థము గలదయ్యె) |
| మేఁడి | |
| వాఁడి | వాఁడిమి. |
| వేఁడి | వేఁడిమి. (చూ. వేఁగు) |
| ఆఁడు | ఆఁడంగి. |
| ఏఁడు | ఏఁడాది. ఏఁడుడి. (కడపట 'వాఁడు' చూడు) |
| కాఁడు | |
| గాఁడు | |
| గూఁడు | (అ. కూణ్డు. తె. గుండు) |
| చుఁడు | (చూడుఁడు) |
| చూఁడు | |
| తేఁడు | |
| తోఁడు | |
| నాఁడు | ఎన్నఁడు. (కడపట 'వాఁడు' చూడు) |
| పేఁడు | |
| వేఁడు | (అ. వేణ్డు) |
| మూఁడు | కీడు మూఁడు. |
| తూఁడు | తూఁడరి. |
| నేఁడు | (ఈనాఁడు) (కడపట'వాఁడు' చూడు) |
| మూఁడు | (అ. మూన్ఱు - ఈ రెండుశబ్దములకు మూలపదము- మూన్ఱు) |

తాగాఁడి

తోఁడెలు తోఁడేలు,

పిల్లాఁడి

పూఁడులు

మగఁడు మగఁటిమి.

ముక్కాఁడి

ముక్కోఁడి ఇట్లు నాలిఁడి మొదలైనవి.

ముసిఁడి

కసిఁడి కసిండికోఁతగలదాయని ప్రయోగము.

పసిఁడి పయిఁడి. (తె. పసిమి + మిడి = పసిమిగలది. చలి
మిడి యనుచో చలిశబ్దంబున మువర్ణములేమి నర్ధ
బిందువు రాదయ్యె)

దీఁడిరించు దీండ్రించు.

### ఁత.

ప్రాఁత (సం. ప్రాక్ + తనము. ప్రాఁత - దీనినుండియే
యఱవమున పఱం వచ్చియుండును)

ఈఁత (ఈను+త) ఈఁదు

ఊఁత (ఊను + త)

కూఁత }
గీఁత } చూ. సంజ్ఞ. ౨౭-వ సూ.

మేఁత మేఁకరి.

లేఁత అ. ఇళస్టె. తె. ఎలనీరు - ఎలప్రాయము - ఎల
తోఁట ఇత్యాదులందు అగుపడమైన 'ఇళమ్

వలె త్రై. ఎల యనునాసికాంతమై ఎలనని యుండ వచ్చును. ఎలనీ రీత్యాదులు సమాసములుకాన ద్రుతంబు లోపించె. రూపాంతరంబున ఎలను + లేను అయి లేను+త–లేఁత యయి యుండవలయు. ఇట్టులే అల్ల(క) ఇల్లై (అ)=లేదు.

| | |
|---|---|
| నోఁత | |
| మాఁతు | |
| కోఁతి | క్రోఁతి. (తోఁకగలది. తకారకకారములకు వర్ణ వ్యత్యయము మతుబర్థంబున 'ఇ' వర్ణము) |
| భ్రాఁతి | (సం. భ్రాన్తి) |
| లాఁతి | |
| ఆఁతు | |
| లోఁతు | |
| సాఁతు | |
| పాఁతు | పాఁతఱ. |
| లాఁతు | |
| కలఁత | కలఁక-కలఁచు, చూ. సంజ్ఞ. సూ. ౩౧. |
| నెలఁత | నెలఁతుక. |
| మెలఁత | మెలఁతుక. |
| అలఁతి | |
| పొలఁతి | పొలఁతుక. |
| వలఁతి | |
| ఊఁతము | |
| ఏఁతము | |
| కడఁత | కణఁత. |

పడఁత

కడఁతి కఱఁతి.

కణఁతి

పడఁతి పఱఁతి-పడఁతుక.

మడఁతి మడఁతుక.

ఉచింత ఉచ్చింత.

మడఁత (అ. మడ్డై) మడఁచు. మడఁగు.

పాఁతఱ

మావఁతి

గోఁతిఁడి

గలఁతియ

చేఁతరాసి

చేఁతటికము

తూఁతకొమ్మ

## ఁద.

ఈఁద ఈఁదర - (తె. ఇవము - ఈము - ఈము+ద=ఈఁద అ. ఖీన్దల్)

ఊఁద ఊఁదర.

చీఁద

చేఁద

మోఁద

ఈఁదు ఈఁదాడు - (అ. నీన్దు)

ఉఁదు

గోఁదు

చాఁదు (అ. శాన్దు)

చీఁదు (అ. శీన్దు)

చేఁదు చేఁత్రాఁడు. (అ. శేన్దు)

పూఁదు

బూఁదు

మీఁదు మీఁగాలు - మీఁజేయి.

మోఁదు మోఁకాలు. మోఁచెయి - మోఁచేయి - మోఁకత్రిల్లు.
(మోఁద+కాలు. మోఁకాలు - మోఁద+చేయి= మోఁచేయి శబ్దరత్నాకరము. మొణగాలు-మొణకై అని యర్థానుస్వారతత్త్వము)

అలఁదు

ఎడఁద

ఊఁదర

ఏఁదర

కడిఁది

ఈఁవాడు

కోఁదాడు

గోఁదురు

వేఁదుఱు

చీఁదర

చెలఁది (అ: శిలన్ది)

వెల్లఁది వెలఁదుక (వెలస + అది = వెలసినది = వెలఁది)

తమిఁద

తవిఁద   తవ్వంద.

పిడుఁదు

పిఱుఁగు

పెడఁద

వెడఁద

మఱఁది   మఱఁదలు. (మఱఁది+ఆలు)

సైఁదము

కొలఁది   (కొలనిది-కొలను=ప్రమాణము కలది)

అలఁదుర

ఈఁడఁబోవు

కడుఁదురు

కాఁదారిమాఁగారి

ఁప.

చాఁప   (చాఁపుకలది. చాఁపు = దీర్ఘము - పడుగుకొలఁది వస్త్రము. మహా. చాంపె)

చేఁప

చాఁపు

తోఁప

ఆఁపు   తలాఁపి - తలయంపి.

తోఁపు

పోఁపు

మాఁపు   (మోయు+పు)

రేఁపు  చూ. రేఁగు.

వీఁపు  (వెను + ప్రక్క. వెను - వైపు. అ. పిన్బు)

సోఁపు

కాఁపు  కాఁపురము.

వాఁపు

ఎల్లాఁపి  (చూ. ఆఁగు)

చీఁపురు

[illegible]ఁప

పాఁపర

ప్రేఁపుడు

మాలఁపు

తలాఁపి  (తల+ఆఁపు+ఇ)

బాఁపఁడు  (సం. బ్రాహ్మణః. అపభ్రంశమున: బాఁబఁడు) ఇది అ. పార్ పాక్ నుండి వచ్చినదనుట భ్రాంతి.

తీఁపురము

డాఁపురము  డాఁపఁరీఁడు - దాఁపటికము. (చూ. డాఁగు)

దాఁపరము

నాఁపటాయి

ఁబ.

తాఁబేలు

దూఁబిడి

ఊఁడనిఁబాడు

ఊరఁబోవు

మూరిఁబోవు

వీన్నఁబోవు
వీటిఁబోవు
వెలవెలఁబోవు
ఎడఁబాయు
ఒడఁబడిక
ఒల్లఁబాటు
ఒల్లఁబోవు
కనుఁబాటు
కానఁబట్టు
కడఁబడు
చక్కఁబడు
తెడఁబడు
తొడిఁబడు
నకనకఁబడు
పెుత్తఁబడు
విన్నఁబడు
వెనుఁబడు
సరిఁబడు

వాఁడు.

తెనుఁగున 'ఆఁడు' అనుశబ్దము పురుషుని బోధించునదిగను-కాలమును బోధించునదిగను నున్నది. పురుషుని బోధించునపు డది సర్వనామమునగు. ఈ 'ఆఁడు' శబ్దమే మాయలాఁడు - బిరుదులాఁడు - ఉన్నాఁడు - చేసినాఁడు- పడ్డాఁడు - కలాఁడు లోనగు శబ్దములఁ గనవచ్చెడు - మగఁ డిత్యాదులందు 'వా' లోపము. వాస్తవమునఁ బురుషుని బోధించునది 'ఁడు',

ఈ యన్నిశబ్దంబుల 'ఆఁడు' పురుషుని బోధించును. ఇదియే సర్వనామమైనపుడు వకారపూర్వక మగును. వ+ఆఁడు=వాఁడు=అ ఈ ఏ లు సర్వనామములు. వ+ఈఁడు=వీఁడు. వ+ఏఁడు=వేఁడు-ఎవఁడు.

కాలవాచకమైనపుడు 'ఆఁడు' నకుఁ బూర్వము నకారాగమ మగు. న+ఆఁడు=నాఁడు. వాఁడు అనునది మాయలాఁడు లోనగు శబ్దంబులందు వలె సామాన్యముగఁ బురుషుని బోధించుటే కాక దూరమునందుండువానిని నిర్దేశించునటులే 'నాఁడు' దినమును గాలమును బోధించుటే కాక 'ఆ నాఁడు' అనునర్థము గలదియునగు ఉ. నాఁడు నృపాలపుత్రి వని నమ్మి వరించితిఁ గాక. యిప్పియిక్ నేఁ డొకకాలసర్ప మయి నీ విటు సేయుట నాకుఁ దోఁచెనే - భాస్క. రా.

ఈ నాఁడు=నా ఈఁడు=నేఁడు.

ఏఁడు అనుదానికి ముందు నకారాగమము లేదు - అది సంవత్సరకాలమును బోధించును.

కొందఱు తూఁగు - బ్రాఁతి - చీఁకటి శబ్దంబులు నిర్బిందుకము లని యెదరు గాని పూర్వకవి ప్రయోగంబుల నవి సార్థబిందుకములై కాన నయ్యెడి.

సీ. తూఁగుటుయ్యాలఁ దూఁగుచోఁ గొంత చెదరిన
యరవిరి వన్నెబా గట్లయుండ - గఙా ౨. ఆ.

క. నూఁతులు పదము లుకారము
ప్రాఁతిగఁ దాఁ జెడు విభక్తిఁ బై పెట్టినచోఁ
నూఁతులు నూఁతుం గనియెను
నూఁతులచేఁ నూఁతువలనఁ నూఁతులధనముల్. ఆంధ్ర భా. భూ.
ఇది భ్రాంతిశబ్దభవము గావున నర్థబిందువుకలిమి నిస్సందేహము.

ఉ. ప్రాఁతలు మీఁదఁ గప్పినఁ గృపామతి నోర్చితి నీచుసొత్తునన్
బ్రాఁతి మెసంగి తీవు మనుభర్తుఁడు కుంటెనఁ బంపఁ బోతి మై
పూఁత యొనర్చుకొంటి శవభూతిఁ గపాలమునన్ భుజించితీ
రోఁతలు పెక్కులుండ నిటరోయుదువే యిఁక భక్తవత్సలా. కాళహస్తి

ఉ. చీఁకటి కానచిచ్చు భవుచేలకుసుంభము తూర్పుకొండకున్
నూఁకటిరత్న మబ్జరమకూరిమిపంట చకోరరాజి పే
రాఁకటిమంట శోణకిరణావళిగంట రథాంగకేళికిన్.
దేఁకువ పెంటమింటఁ జను దెంచెదినేంద్రుఁడు కాలఘుంటయై. కాళహస్తి

శబ్దరత్నాకర నిఘంటు గ్రంథకర్తలైన శ్రీమత్ - బహుజనపల్లి - సీతా రామాచార్యులవారు తొలుత దీని నిర్బిందుకముగ వ్రాసి పదపడి చీఁకటియని సవరించుకొని 'చీఁకు' శబ్దమునొద్ద "చీఁకు-దే-గ్రుడ్డితనము - ఆంధ్యము - ఈ యర్థము నందిట్లు స బిందుకముగాఁ జెప్పుట చీఁకటి శబ్దమునకు వ్యుత్పత్తిని కల్పించుటకు అనుకూలముగా నున్నది. ఇట్లు చెప్పుటచే ప్రయోగములకు విరోధము కనఁబడదు" అని వ్రాసిరి. "చీఁకటి రేయొదవె" నిత్యాదులందు సబిందుక పాఠమే సాధువని వారి యభిప్రాయము. 'పూర్వ' లాక్షణికాభి

ప్రాయమును. తిక్కన సబిందుకనిర్బిందుకములకుఁ బ్రాసము కలిపినవాఁడు గావున సీతారామాచార్యులవారి యభిప్రాయము సరియ.

ఇదిగాక ద్రావిడులు దీర్ఘముమీఁద నిండుసున్నతోడ నుచ్చరించిన శబ్దంబులందెల్ల నియతముగఁ దత్స్థానంబునఁ దెలుఁగున నర్ధబిందువు కానంబడియెడి - దీనిని ద్రావిడులు చీంకటి యనుచున్నారు. మీటు నాటు శబ్దంబులందు నిష్పాదు గొందఱు ఖండబిందువు వ్రాయుటకుఁ గారణము మృగ్యము.

లోపడు - ఈ శబ్దమును సీతారామాచార్యులవారు - డోకారము పొచ్చు - అడఁగు - మస్తరించు లోనగు శబ్దంబులకడ లక్ష్యంబులో లోపడు అని వ్రాసియు వానిని మరల సవరింపకయు శబ్దమును లోఁబడు అనియే వ్రాసిరి. దీనికిఁ గారణము వారు తె. "కినిసి పాణినాళీకంబు సొనుపుటయును, నంతలోఁ బడకదియు" (అంతలోన్ + పడక, అంతన్ + లోఁబడక అని ఛేదము పా. ౨. ఆ.) అని వ్రాయుటగాఁ దోఁచెడి. రెండర్థములందును లోపడు శబ్దమే యేల గ్రహింపరాదో. లోను+పడు=లోపడు అని యయ్యెను. ఈలోను ద్రుతప్రకృతికము గాదు. ఇది దే - వి - అనియు విశేషణ మనియు వారే వ్రాసియున్నారు. భారత. విరాట ౧ అ. ౩౨౪ ప. లోనుపఱుపక యనియే ముద్రింపఁబడియున్నది. చిన్నయసూరిగారి నీతిచంద్రికయందు లోపడు అనియే ప్రయోగింపఁబడి యున్నది. లోచెయి - లోచూపు - లోకడుపు - లోచేసికొను - లోతక్కువ లోనగు శబ్దంబులం దరసున్న గానరాదు. పైన్+పడు - చేన్+పడు - పైపడు - చేపడు అని యేకశబ్దములగుచో ద్రుతములకే లోప మగుచుండ లోను + పడు = లోపడు ఏల కానేరదు? అట్లుతే యగును గాని మఱియొకవిధముగఁ గానేరదని తోఁచెడి. వాఁడు నీళ్లలోఁ బడెను - ఇచ్చట లోన్ షష్ఠీవిభక్తి ప్రత్యయము. ద్రుతాంతము - పడు ప్రత్యేకక్రియ. వాఁడు నాకు లోపడెననుచో

నట్టివిధములు గానరావు. నాపతులగు గంధర్వు౦ చేపడిః; ఒరు చేపడ వెన్నఁడును. ఇత్యాది తిక్కన ప్రయోగములఁ జూచిన నిట్టి శబ్దంబుల రూపనిష్పత్తియందు సందేహముండదు.

## సంస్కృత శబ్దసంధి ప్రకరణము.

సంస్కృతశబ్దము సంస్కృతశబ్దముతోఁ గలయునపు డింతవఱకుఁ జెప్పిన సూత్రంబు లన్వయింపవు. భాషలు రెండు వేఱువేఱు గాన వ్యాకరణములు వేఱువేఱు. సంప్రదాయములు వేఱువేఱు. కావున నింతవఱ కేలాక్షణికుఁడును సంస్కృతసంధులఁ గూర్చి యాంధ్రవ్యాకరణమున వ్రాయఁడయ్యె. ఆ సూత్రములు ఛాయామాత్రమైన నెఱుంగమి బాలుర వ్రాయు వ్యాసములందు నానాదోషములు గానవచ్చుచున్నవి. వానిని వారింపఁగోరి దిక్ప్రదర్శనముగ నాంధ్రభాషోపయోగి యగునంతమాత్రము సంస్కృతసంధివిషయ మిందు వివరింపఁబడు.

ఆంధ్రశబ్దమునకు సంస్కృతశబ్దము పరమైనయెడల నాంధ్రసంధి సూత్రములే యన్వయింపవలయును. ఉ. తెప్ప+ఉత్సవము=తెప్పయుత్సవము. తెప్పోత్సవమనరాదు. సంస్కృతశబ్దమునకుఁ బరముగ నాంధ్రశబ్దము రారాదు. అను కృతిని రావచ్చును.

సూ॥ ౧. అ ఇ ఉ ణ్, ఋ ఌ క్, ఏ ఓ ఙ్, ఐ ఔ చ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథచటతవ్, కపయ్, శషసర్, హల్.

ఈ ౧౪ సూత్రములకు మహేశ్వరసూత్రము లని పేరు. సూత్రములఁ గల్పించుటయందు సులువు నాలోచించి యక్షరము లిట్లు విభజింపఁబడినవి. మొదటి నాలుగుసూత్రము లచ్చులగుఱించినవి. తక్కినవి హల్లుల గుఱించినవి. ప్రతిసూత్రమందును గడపటనుండు ణ్,క్,ఙ్; ఇటువంటి హల్లులు అక్షర

సంఖ్యకుఁ జేరవు. అట్లైన వాని యుపయోగ మేమందురేమో. మొదటిసూత్రము అ-ఇ-ఉణ్ అని యున్నది. అణ్-(అణ్ణులు)అనఁగా అ-ఇ-ఉ-అక్షరములు లని యర్థము. అటులే అక్కులనఁగా అ-ఇ-ఉ-ఋ-ౠ. మొదటియక్షర మొక సూత్రముకడపటి యక్షరముహల్లుతోఁ గలిపి చెప్పినఁ బ్రత్యాహారమగును.

ఉఞ్జులనఁగా ఉ-ఋ-ౠ-ఏ-ఓ. ఇటులే హల్లులయందును గ్రహించు నది. వీనికిఁ బ్రత్యాహారములని పేరు. ఇఁక ముందు చెప్పఁబోవు సూత్రములు సులువుగ గ్రహింపఁజాలుటకై యాక్రింది ప్రత్యాహారములు విద్యార్థి తెలియఁగవలయు.

| | |
|---|---|
| అణ్ణులు | అ - ఇ - ఉ. |
| అక్కులు | అ - ఇ - ఉ - ఋ - ౠ. |
| ఋక్కులు | ఋ - ౠ. |
| ఇక్కులు | ఇ - ఉ - ఋ - ౠ. |
| ఏచ్చులు | ఏ - ఓ - ఐ - ఔ. |
| యణ్ణులు | యవరల (అంతస్థములు) |
| అచ్చులు | అ - ఇ - ఉ - ఋ - ౡ - ఏ - ఓ - ఐ - ఔ. |
| ఖరులు | ఖయ్యులు - శరులు. |
| ఖయ్యులు | వర్గప్రథమ ద్వితీయవర్ణములు. |
| శరులు | శ - ష - స. |
| జశ్శులు | జ - బ - గ - డ - ద. సరళములు. |
| ఝయ్యులు | వర్గము తొలి నాలుగక్షరములు. |
| హల్లులు | 33. ళకారము ప్రత్యేకవర్ణముగ గ్రహింపఁబడదయ్యె. |

సూ॥ ౨. గుణములు ఏ-ఓ-అర్-అల్.

సూ॥ 3. వృద్ధులు ఐ-ఔ-ఆర్.

ఈ గుణములు వృద్ధులు సంధివలన నగునవి. అ + ఇ = ఏ; అ + ఉ = ఓ; అ + ఋ = అర్; అ + ఌ = అల్. అ + ఏ = ఐ; అ + ఐ = ఐ; అ + ఓ = ఔ; అ + ఔ = ఔ.

## అచ్సంధి. సవర్ణదీర్ఘసంధి.

సూ॥ ౪. అక్కులకు సవర్ణములైన అక్కులు పరంబు లగునపుడు పూర్వపరస్థానంబుల దీర్ఘం బేకాదేశం బగు.

అక్కులనఁగా అ, ఇ, ఉ, ఋ, ౡ అను ౫ అక్షరము లని యీవఱకే చెప్పఁబడెను. ఈ యచ్చులకు సవర్ణములైన యీ యచ్చులే పరములైనపుడు ఆ రెండచ్చులకు మాఱుగ దాని దీర్ఘమైన యచ్చువచ్చును.

అ + అ = ఆ; ఆ + అ = ఆ; అ + ఆ = ఆ; ఆ + ఆ = ఆ. ఇట్టులే తక్కినయక్షరములకు గ్రహించునది.

ఉ. కుసుమ + అంజలి = కుసుమాంజలి.

ఇందు మొదటిశబ్దమైన 'కుసుమ' తుద అకారమున్నది. దానికి 'అంజలి' లో మొదటనుండు 'అ' పరమైనది. కాఁకా హ్రస్వములగు నీ రెండు అకారములకు మాఱుగ దీర్ఘమైన యొక ఆకారమువచ్చి 'కుసుమాంజలి'యని యయ్యె.

కుసుమ + అం + జలి = కుసుమ్ + అ + అం + జలి = కుసుమ్ + ఆం + జలి = కుసుమాంజలి.

ఇట్లు శత + అబ్దము = శతాబ్దము.
సత + ఆర్యుఁడు = సతార్యుఁడు.
ధరా + అధిపుఁడు = ధరాధిపుఁడు.
శంకా + ఆతంకము = శంకాతంకము.
ముని + ఇంద్రుఁడు = మునీంద్రుఁడు.
ఋషి + ఈశ్వరుఁడు = ఋషీశ్వరుఁడు.
సతీ + ఇష్టము = సతీష్టము.
విష్ణు + ఉదయము = విష్ణూదయము.
పితృ + ఋణము = పితౄణము.

ఇత్యాదులు.

సూ॥ ౫. ఋక్కులకు హ్రస్వఋక్కులు పరమైనపుడు పూర్వపరస్థానంబుల హ్రస్వఋక్కులు వైకల్పికముగ నగు.

ఉ. హోతృ+ఋకారము. (1) హోతృకారము.
(2) హోతౄకారము. (సూ. ౪)
(3) హోతృఋకారము. (సూ. ౧౫)

## గుణసంధి.

సూ॥ ౬. అవర్ణమునకు ఇక్కులు పరమైనపుడు గుణం బగు.

ఉ. అమర + ఇంద్రుఁడు = అమరేంద్రుఁడు. (ఏ)
భూసుర + ఉత్తముఁడు = భూసురోత్తముఁడు. (ఓ)
మహా + ఋషి = మహర్షి. (అర్)
తవ + ఌకారము = తవల్కారము. (అల్)
(చూ. సం. ౩)

ఈ యుదాహరణములందు ఆ అలకు - ఇక్కులైన ఇ - ఉ - ఋ - ఌ - పరముకాఁగా వరుసగ వానిగుణాక్షరములైన ఏ - ఓ - అర్ - అల్ పూర్వ పరస్థానముల నాదేశము లయ్యెను.

అపవాదములు. స్వ + ఈరిణి = స్వైరిణి.

స్వ + ఈరుఁడు= స్వైరుఁడు.

అక్ష + ఊహిని = అక్షౌహిణి.

అక్షోహిణి.

సుఖ + ఋతుఁడు= సుఖార్తుఁడు.

## వృద్ధిసంధి.

### సూ॥ ౭. అవర్ణమునకు ఏచ్చులు పరమైనచో వృద్ధియగు.

ఉ. భోగ + ఏకము భోగైకము. (అ + ఏ = ఐ)

దురిత + ఓఘము దురితౌఘము. (అ + ఓ = ఔ)

మహా + ఐశ్వర్యము మహైశ్వర్యము. (అ + ఐ = ఐ)

కృష్ణ + ఔత్కంఠ్యము కృష్ణౌత్కంఠ్యము. (అ + ఔ = ఔ)

ఇత్యాదులు (చూ. సూ. ౩)

### సూ॥ ౮. ఓమ్ పరమగుచుండ అత్తునకు లోపంబగు.

హ్రస్వమైన అకారమునకు ఓం పరముకాఁగా వృద్ధిలేదు.

ఉ. శివాయ + ఓం నమః = శివాయోన్నమః.

శివాయ+ఓంనమః=శివాయ్+అ+ఓం నమః=శివాయ్+ఓం నమః= శివాయోం నమః=శివాయోన్నమః.

### సూ॥ ౯. అత్తునకు నోతోష్ఠములు పరమగునపుడు వృద్ధి వైకల్పికము.

ఓతు+ఓష్ఠము=ఓతోష్ఠములు.

హ్రస్వమగు అకారమునకు ఓతువు-ఓష్ఠము పరమైనపుడు పరరూప సంధిగాని వృద్ధిసంధిగాని యగు. (ఓతువు=పిల్లి-ఓష్ఠము=పెదవి)

ఉ. స్థూల+ఓతువు=స్థూలోతువు-స్థూలౌతువు.
బింబ+ఓష్ఠము=బింబోష్ఠము-బింబౌష్ఠము.

## యణాదేశసంధి.

సూ॥ ౧౦. సవర్ణముగానియచ్చు పరమగుచుండ నిక్కులకు యణాదేశం బగు.

ఉ. ప్రతి+అర్థి=ప్రత్యర్థి.

ప్రత్ + ఇ + అర్థి = ప్రత్ + య్ + అర్థి = ప్రత్ + యర్థి= ప్రత్యర్థి - ఇచ్చట ఇకారమునకు మాఱుగ య్ కారము వచ్చి యది పరమైన అకారముతోఁ గలసి 'య' యయి ప్రత్ + య = ప్రత్యయని యయ్యె. (చూ. ౧ సూ.) ఇ+అ=య; ఉ + అ = వ; ఋ + అ = ర; ౡ+అ=ల

| | | |
|---|---|---|
| గిరి + అగ్రము | = గిర్యగ్రము. | (ఇ + అ = య) |
| అతి + ఆశ్చర్యము | = అత్యాశ్చర్యము. | (ఇ + ఆ = యా) |
| అతి + ఉగ్రము | = అత్యుగ్రము. | (ఇ + ఉ = యు) |
| మధు + అరి | = మధ్వరి. | (ఉ + అ = వ) |
| పితృ + అంశము | = పిత్రంశము. | (ఋ + అ = ర) |
| ౡ + ఆకృతి | = లాకృతి. | (ౡ + ఆ = లా) |

సవర్ణముగానియచ్చు పరమైనపుడే యీ సూత్రము ప్రవర్తించును.

సూ॥ ౧౧. అచ్చునకుఁ బరంబైన హాకారేతర హల్లున కచ్చు పరంబుగానిచో ద్విత్వంబు వైకల్పికంబు

విప్రభావము = (వ్ + ఇ + ప్ + ర్ + అ-భావము) ఇచ్చట 'వి' వర్ణములోని 'ఇ' యను అచ్చునకుఁ బరముగ పకారము వచ్చెను. దానికిఁ బరముగ రకార మున్నదిగాని యచ్చులేదు. కావున విప్పభావము అని వ్రాయ వచ్చును. ఇట్లు ఉద్ద్రేకము లోనైనవి.

## ఏచ్సంధి.

సూ॥ ౧౨. అచ్చుపరమైనచో ఏచ్చుల కయవాయావు లగు.

(అయ్ + అవ్ + ఆయ్ + ఆవ్ = అయవాయావులు) అనఁగా ఏ - ఓ - ఐ - ఔ లకు అచ్చు పరమైనయెడల వరుసగ అయ్ - అవ్ - ఆయ్ - ఆవ్ పూర్వపరస్థానంబుల నేకాదేశం బగు.

నై + అకుఁడు = నాయకుఁడు. న + ఐ + అకుఁడు = న్ + ఆయ్ + అకుఁడు = నాయకుఁడు.

పౌ + అకుఁడు = పావకుఁడు. (ఔ + అ = అవ్)

యూతిశబ్దము పరమైనపుడు గోశబ్దమునందలి ఓకారమునకు అవ అగు. గో + యూతి = గవ్యూతి. అనఁగా రెండు కోసులని యర్థము.

## పరరూపసంధి.

సూ॥ ౧౩. శంకధ్వాదులఁ బరరూప మగు.

(శకంధు + ఆదులు = శకంధ్వాదులు)

శకంధువు లోనగు శబ్దంబులఁ బరరూప సంధియగు. తెనుఁగు శబ్దంబుల సంధివలెఁ బూర్వాచ్చు లోపించి దానికి మాఱుగఁ బరమైన యచ్చునిలిచి యుండుటవలనఁ బరరూపసంధి యనఁబడు.

శక+అంధువు = శకంధువు. శక్ అ + అంధువు = శక్+అంధువు=శకంధువు. సవర్ణ దీర్ఘసంధి సూత్రము ప్రకారము శకాంధువు కాదు.

కు + ఉద్దాలము = కుద్దాలము (గుద్దలి) కుల + అట = కులట (అంకుటాలు) సీమ + అంతము = సీమంతము (పాపట) మనస్ + ఈష = మనీష (బుద్ధి) లాంగల + ఈష = లాంగలీష (నాఁగటి యేడికోల) పతత్ + అంజలి + పతంజలి (వ్యాకరణ భాష్యకర్త) సార + అంగము = సారంగము (జింక) ఇట్లు ఆలక్తము-పర్కటి-మార్తండుఁడు-వేదండము-లోనగునవి. ఇక్కడఁ జెప్పఁబడిన యర్థము లందే యీ రూపంబులు. సారమైన అంగమను నెడ సారాంగ మనియే చెప్పవలయు. పొలిమేర కడపల యను నెడ సీమాంత మనవలయు.

## అవఙాదేశసంధి.

సూ॥ ౧౮. పదాంతమైనగోశబ్దముయొక్క ఓకారమునకుఁ

i. బరమైన అవర్ణమునకు లోపము వైకల్పికము.

ii. అచ్చుపరమైనచో ఓకారమునకు అవఙాదేశము వైకల్పికము.

iii. ఇంద్ర-అక్షశబ్దములు పరమైనపుడు అవఙాదేశము నిత్యము.

i. గో + అగ్రము = గోఅగ్రము - గోగ్రము.

ii. గో + అగ్రము = గవాగ్రము.

గో + అధ్యక్షుఁడు = గవాధ్యక్షుఁడు.

iii. గో + ఇంద్రుఁడు = గవేంద్రుఁడు.

గో + అక్షి (అక్షము) = గవాక్షము.

## ప్రకృతిభావ సంధి.

సూ॥ ౧౫. పదాంతములైన అక్కులకు హ్రస్వమగు ఋకారము పరంబగునపుడు ప్రకృతిభావము వైకల్పికము. అసమాసంబున దీర్ఘంబు హ్రస్వం బగు.

బ్రహ్మ + ఋషి = బ్రహ్మఋషి - బ్రహ్మర్షి (సమాసము కాదు)
మహా + ఋషి = మహాఋషి - మహర్షి (సమాసము)
సప్త + ఋషులు = సప్తఋషులు - సప్తర్షులు (సమాసము)

అక్షర స్వరూపము మాఱక యథాస్థితినుండుట ప్రకృతిభావము. ఇదియే స్వత్వమని యాంధ్రసంధి ప్రకరణంబులఁ జెప్పఁబడెను.

## హల్సంధి ప్రకరణము.

సూ॥ ౧౬. సకారతవర్గములు - శవర్ణచవర్గములు పరస్పరము కదియునపుడు శ - స లకు శవర్ణమును, త - చ వర్గములకుఁ జవర్గవర్ణములు నాదేశంబు లగు.

స్ + శ = శ. మనస్ + శాంతి = మనశ్శాంతి.
స్ + చ = శ. మనస్ + చంచలత = మనశ్చంచలత.
త్ + చ = చ. ఉత్ + చలించు = ఉచ్చలించు.
త్ + జ = జ. మరుత్ + జాతి = మరుజ్జాతి.
త్ + ఛ = చ. భూభృత్ + ఛేత్త = భూభృచ్ఛేత్త.

సకారమునకు శవర్ణము - చవర్గాక్షరములు పరమైన శవర్ణమే యాదేశమగు.

శవర్ణ పరమైన తవర్గమునకు కిటులౌటు. ఉ. ప్రశ్నము.

తవర్గాక్షరములకు శవర్ణము - చవర్గాక్షరములు పరమైన చవర్గాక్షరమే యాదేశ మగును.

పరస్పర మనుటచే శవర్ణ చవర్గాక్షరములు సకారతవర్గములకుఁ బూర్వమందుండినను శకార చవర్గములే వచ్చును. క్రిందం జెప్పఁబడు ష్టుత్వసంధి యం దిట్లే యెఱుంగునది.

## ష్టుత్వసంధి.

సూ॥ ౧౭. సకారతవర్గాక్షరములు షకార టవర్గాక్షరములు పరస్పరము కదియునప్పుడు షకార టవర్గాక్షరంబు లాదేశంబు లగు.

ధనుస్ + టంకారము = ధనుష్టంకారము.

తత్ + టీక = తట్టీక.

## జశ్త్వసంధి.

సూ॥ ౧౮. పదాంతములైన ఝల్లులకు జశ్శులాదేశ మగును

చూ. ౧ సూ. ఉ. వాక్ + ఈశుఁడు = వాగీశుఁడు.

దిక్ + గజము = దిగ్గజము. చిత్ + రూపము = చిద్రూపము; వాక్ + ధర్మము = వాగ్ధర్మము; కకుప్ + అంతము = కకుబంతము; అప్ + భక్షణము = అబ్భక్షణము;

## అనునాసిక సంధి.

సూ॥ ౧౯. అనునాసికములు పరమగుచోఁ బదాంతము యర్ప్రత్యాహారవర్ణంబుల కావర్గమందలి యనునాసిక

# సులభ వ్యాకరణము

## ద్వితీయ భాగము.

తత్సమపరిచ్ఛేదము మొదలు వాక్యపరిచ్ఛేదము వఱకు.

---

వావిలికొలను సుబ్బరాయ

విరచితము.

---

Improved and Enlarged.

మూఁడవ కూర్పు. ౨౦౦౦ ప్రతులు.

---

చెన్నపురి:

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౨౫.

వెల, ౧౪ అణాలు.

శ్రీరామాయనమః.

# సులభవ్యాకరణము.

## తత్సమపరిచ్ఛేదము.

### అజంత ప్రకరణము.

సంస్కృతశబ్దంబులు తత్సమంబులుగ మాఱువిధము లోనగు విషయములఁ దెలుపు భాగమునకుఁ దత్సమపరిచ్ఛేదమని పేరు. అందు అచ్చు కడపటఁ గల శబ్దముల గుఱించి తెలుపునది అజంత ప్రకరణము.

| విభక్తుల పేరులు. | | ప్రత్యయములు. |
|---|---|---|
| సూ॥ ౧. ప్రథమా విభక్తి. | | ౘడు - ము - వు - లు. |
| ,, ౨. ద్వితీయా | ,, | ని - ను - ల. |
| ,, ౩. తృతీయా | ,, | చేత - చే - తోడ - తో. |
| ,, ౪. చతుర్థీ | ,, | కై - కొఱకు. |
| ,, ౫. పంచమీ | ,, | వలన - కంటె - పట్టి. |
| ,, ౬. షష్ఠీ | ,, | కి - కు - యొక్క - లోపల - లో. |
| ,, ౭. సప్తమీ | ,, | అందు - న. |
| ,, ౮. సంబోధన ప్రథమా | ,, | ఓ - ఓయి - ఓరి - ఓసి. |

'డు' మొదలయిన వానికే వర్ణకములు అని ప్రత్యయము లని పేరు. ఒక శబ్దమున కాయావిభక్తియందు రూపము చెప్పవలసివచ్చినపు డాయా విభక్తికి నెదురుగ నుండు ప్రత్యయములలో నొకటి చేర్పవలయును. ఉ. రామశబ్దమునకుఁ దృతీయావిభక్తి రూపము లేవనఁగా 'రాముచేత - రాముచే - రాముతోడ - రాముతో' నని చెప్పవలయును. ఏ యర్థమునం దే ప్రత్యయముఁ జేర్పవలయునో యది కారకపరిచ్ఛేదంబున వివరింపఁబడును. పై ప్రత్యయములలో రెండు విధములైన ప్రథమలును, 'కై - షష్ఠి - యొక్క' లును గాక, తక్కినవానికి నుగాగమంబగుఁ గాన ద్రుతప్రకృతికములు.

సూ॥ ౯. 'డు - ము - వు - న' లేకవచనంబులు.

వచన మనఁగా వస్తువుల సంఖ్యను దెలుపునది. ఒకటిని దెలియఁజేయునది యేకవచనము. ఉ. రాముఁడు గోవును వత్సమును వనమున మేపెను. ఇచ్చట, రాముఁడు-గోవు-వత్సము (దూడ) వనము-ఒక్కొక్క సంఖ్యనే తెలుపును. కావున నివి యేకవచనముల గున్నవి.

సూ॥ ౧౦. 'లు - ల' లు బహువచనంబులు.

ఒకటికంటె నెక్కువ సంఖ్య గల వస్తువులను దెలుపునది బహువచనము. ఉ. రామకృష్ణులు గోవులను వత్సములను వనముల మేపిరి.

సూ॥ ౧౧. తక్కినవి యుభయంబులు.

తక్కిన వనఁగా 'డు - ము - వు - న - లు - ల' యివి తప్ప మిగిలినవి. ఉభయంబు లనఁగా నేకవచనమునందును బహువచనమందును గూడ వాడఁబడునవి. ఉ. రామునియొక్క-రాములయొక్క, మొదలైనవి. మీఁదఁ జెప్పఁబడినవి ప్రత్యయము లైనప్పుడే యా యర్థవచనంబులు గ్రహింపవలయును గాని యా యక్షరములు వచ్చినచోట నెల్ల గ్రహింపరాదు. ఎట్లనఁగా, కాన (అడవి) యను శబ్దమునందుఁ గడపట 'న' యున్నదని సప్తమీవిభక్తి

యనరాదు. ఇచ్చట 'స' ప్రత్యయము గాదు. కాలు విఱిఁగె. ఇచ్చట 'కాలు' అనుదానిలో 'లు' బహువచనముఁ దెలుపదు. విఱిగినది యొక కాలనియే యర్థము. ఇట్లే నేల మొదలైనవి.

సూ॥ ౧౨. శబ్దములు మహదర్థకములు - అమహదర్థకములు-మహత్యర్థకములు - మహన్మహత్యర్థకములు - అవ్యయములని యయిదు విధంబులు.

సూ॥ ౧౩. పురుషులను దెలుపు శబ్దములును, వాని విశేషణములును మహదర్థకములు.

ఉ. రాముఁడు - భీముఁడు - సోముఁడు. రాముఁడు సుగుణాభిరాముఁడు మొదలైనవి.

సూ॥ ౧౪. స్త్రీలు-తిర్యక్కులు-జడములు వాని విశేషణములు అమహదర్థకములు.

ఉ. సీత - ద్రౌపది - పార్వతి. సీత లోకమాత.

తిర్యక్కులనఁగాఁ బశువులు - పక్షులు. ఉ. ఆవు - మేఁక - చిలుక - కాకి. జడము లనఁగాఁ బ్రాణము లేనివి. వీనికే అచేతనము లనిపేరు.

ఉ. చెట్టు - గుట్ట - ఇల్లు - ముల్లు మొదలైనవి.

సూ॥ ౧౫. స్త్రీలను మాత్రము దెలుపుశబ్దంబులు మహత్యర్థకంబులు.

రుక్మిణి - జానకి - లక్ష్మి - గౌరి - సరస్వతి లోనగునవి. మహతీ + అర్థకము = మహత్యర్థకము.

సూ॥ ౧౬. స్త్రీలను, బురుషులను దెలుపు శబ్దంబులు మహన్మహత్యర్థకంబులు.

ఉ. అందఱు - కొందఱు - నలుగురు మొదలైనవి.

సూ॥ ౧౭. లింగ, విభక్తి వచనములు లేనవి యవ్యయంబులు.

ఉ. ఔర - ఆహా - భళీ - బాపురె - కట్టా - అక్కట ఇత్యాదులు.

అవ్యయములు ప్రతిపదోక్తములు-లాక్షణికము లని రెండు విధంబులు.

పుట్టినవి పుట్టినట్లుండు అవ్యయములు ప్రతిపదోక్తములు.

ఉ. మఱి - మిక్కిలి - కడుఁ - ఎల్లన్ - బాపురె - ఇంచుక - అక్కట - ఔర - ఓహో - కద - అ - ఎ - ఏ మొదలైనవి.

ఎల్లన్ అనుదానికి మాత్రము అందు-వలన ప్రత్యయములు భారతంబునఁ గాననగు. ఎల్లయందు, ఎల్లవలన.

శాస్త్రనిష్పన్నములు లాక్షణికములు. ఉ. అట్లు - ఇట్లు - ఎట్లు - అడిగి - వేఁడక - చూచినన్ - చదువన్ - అనుచున్ లోనైనవి.

## విశేష్యము.

ఇంద్రియ గోచరము లగు ప్రాణముగల ప్రాణములేనివాని పేరులు విశేష్యము లనఁబడును.

ప్రాణము గలవైనను ప్రాణము లేనివైనను త్వక్కు (చర్మము) కన్నులు-చెవులు - ముక్కు - నాలుక - మనస్సు వీనిచేతఁ దెలిసికొనఁబడువాని నామములు విశేష్యము లనఁబడును.

త్వక్కుచేఁ దెలియఁబడునవి. వేఁడి - చలి - గాలి లోనైనవి.

కన్నులచేఁ దెలియఁబడునవి. బట్ట - గోడ - సూది - సూర్యుఁడు - పలక - కలము లోనైనవి.

చెవులచేఁ దెలియఁబడునవి. కూఁత - చప్పుడు లోనైనవి.

ముక్కుచేఁ దెలియఁబడునవి. వాసన - పరిమళము - గబ్బు - కంపు - గంధము లోనైనవి.

| | |
|---|---|
| నాలుకచేఁ దెలియఁబడునవి. | పులుసు - చేఁదు - ఒగరు - కారము - ఉప్పు - తీపు లోనైనవి. |
| మనస్సుచేఁ దెలియఁబడునవి. | కల - స్వప్నము - సత్యము - నిజము - అబద్ధము లోనైనవి. |

మనుష్యుఁడు - పర్వతము - చెట్టు - పట్టనము - పశువు - పక్షి - నది లోనైనవి జాతివిశేష్యములు. ఇవి యొక విధమైనజాతిని దెలుపును. మన వలె నుండు నెవరిని జూచినను మనుష్యులని యందుమేకాని పర్వతమని కాని చెట్టనికాని యనము కదా.

రాముఁడు - హిమవంతము - వేము - శ్రీరంగపట్టనము - దున్నపోతు - చిలుక - గంగ - లోనైనవి సంజ్ఞావిశేష్యములు - సంజ్ఞ యనఁగాఁ బేరు - చెట్టెక్కితి ననఁగా నేచెట్టో - వేఁపచెట్టు అనిన ఎక్కినచెట్టు పేరు తెలియును.

తెల్లన - పుల్లన - దొంగతనము - సోమఁతనము లోనైనవి గుణవిశేష్యములు.

క్రియలనుండి పుట్టిన విశేష్యములు కృదంతములు - క్రియావిశేష్యములు. ఆఁగు - ఆఁక; ఎఱుఁగు - ఎఱుక లోనైనవి. కృదంతపరిచ్ఛేదము చూడుము.

## విశేషణము.

విశేష్యముల ధర్మములఁ దెలుపు శబ్దములు విశేషణములు. ఇవి విశేష్యమునం దొక విశేషమును దెలుపును.

| | విశేషణము. | విశేష్యము. |
|---|---|---|
| జాతి | పులి | పిల్ల |
| | క్షత్రియ | బాలుఁడు |
| క్రియాజన్యవిశేషణము. | | |
| వర్తమానార్థకవిశేషణము. | చేయుచున్న | పని |
| భూతార్థకవిశేషణము. | చేసిన | పని |

| | | |
|---|---|---|
| భవిష్యదర్థకవిశేషణము. | చేయఁగల | పని |
| తద్ధర్మార్థకవిశేషణము. | చేయు | పని |
| | చేసెడు | పని |
| | చేసెడి | పని |
| వ్యతిరేకార్థవిశేషణము. | చేయని | పని |
| గుణము. | | |
| శబ్దము. | కఠోర | ధ్వని |
| స్పర్శము | వేఁడి | గాలి |
| రసము | తియ్యని | చెఱకు |
| గంధము | కమ్మని | వాసన |
| రూపము | తెల్లని | గుడ్డ |
| | ఎత్తు | చెట్టు |
| | వెడలుపు | తలుపు |
| | సోఁగ | కన్ను |
| స్వభావము. | సోమరి | పిల్లవాఁడు |
| | చెడు | గుఱ్ఱము |
| ద్రవ్యము. | శ్రీమంతుఁడు | రాజు |
| సంఖ్య. | | |
| సంఖ్యార్థకవిశేషణము. | నాలుగు | పండ్లు |
| సంఖ్యేయార్థకవిశేషణము | నలుగురు | మనుష్యులు |
| సంఖ్యాపూరణార్థకవిశేషణములు | ఐదవ | దినము |
| | ఏడవ | యేఁడు |
| | తొమ్మిదవ | గంట |

సంజ్ఞ.　　వేఁప　చెట్టు
　　రామ　రావు
　　పుష్పక　విమానము.

## అకారాంతములు.

### ప్రథమావిభక్తి. ఏకవచనము. ఁడు

సంస్కృతమునందలి అకారాంత పుంలింగ శబ్దములు తత్సమంబు లగు విధ మింకఁ జెప్పఁబడును. సంస్కృతశబ్దములు తత్సమము లగునపుడు విసర్గములు లోపించు నని సంజ్ఞాపరిచ్ఛేదంబునఁ (సూ. ౭౨.) జెప్పఁబడినది. కావున 'రామః' అనుదానిలో విసర్గము లోపింప 'రామ' యని మిగిలెను. ఇట్టి దానికే ప్రాతిపదికమని పేరు. ఇట్టి ప్రాతిపదికములకే ప్రత్యయములు చేర్పఁబడును. అట్లు చేర్చునపుడు ప్రాతిపదికము కొన్ని మాఱుపాట్లు చెందును.

సూ॥ ౧౮. అకారాంత పుంలింగ మహద్వాచకంబునకు డుఙ్గగు.*

*ఒక కార్యార్థమైవచ్చి యా కార్యము ముగియుటతోడనే లోపించి పోవు నక్షరమునకు 'ఇత్' అని పేరు. 'డుఙ్' అనుదానిలో 'ఙ్' ఇత్తు. అది చేయుకార్య మేమనఁగా, సూత్రము చొప్పున రాము అనుదానికి డుఙ్ చేర్పఁగా 'రాముడుఙ్' ఆయెను.

ఙిత్తు బిందుపూర్వకం బగు అను సూత్రముచే ఙ్ యే యక్షరమునకుఁ జేర్పఁబడునో యా యక్షరమునకు ముందు బిందువు వచ్చును. రాఁగా 'రాముఁ డుఙ్' అని యాయెను. బిందువును సూచించుటే 'ఙ్' యొక్క కార్యము గనుక నది చేర్పఁబడఁగనే 'ఙ్' లోపించును. రాముఁడు అని మిగులును. ఇట్లే క్రియాపరిచ్ఛేదంబున 'కలఙ్' 'పడుఙ్' లోనైనవి గలవు. అట్లు చెప్పినప్పు డవి 'ఁగల' 'ఁబడు' గా మాఱునని యెఱుంగునది.

అకారముగాని ఆకారముగాని కడపటఁ గల పుంలింగ మహద్వాచకం బులకు బిందుపూర్వక డు వర్ణకం బగు నని యర్థము. మీఁదఁ జెప్పఁబడిన చొప్పున 'రామ' యనునది అకారము కడపటఁగల ప్రాతిపదికము. 'హాహా' యనునది ఆకారము కడపటఁగల ప్రాతిపదికము. ఇవి పుంలింగ మహద్వాచకంబులు గావున వీనికి 'ఁడు' చేర్పఁగా రాముఁడు - హాహాఁడు అని యేర్పడెను. పురుషులను బోధించునది పుంలింగము.

సూ॥ ౧౫. డుఙ్ ప్రత్యయము పరమగునపుడు పుంలింగంబున మహద్వాచకమైన ప్రాతిపదికము తుదిఅత్వమునకు ఉత్వగు.

ఉ. రాముఁడు - హాహుఁడు. గంగాశబ్దము మహతీవాచకము కావున గంగఁడు అనియే రూపము.

ప్రాతిపదికములైన రామ - హాహా యనువానికిఁ బైసూత్రముచొప్పున 'ఁడు' పరమైనపుడు వానికడపటనున్న అ ఆ (రామ్ + అ; హాహ్ + ఆ) లకు బదులు హ్రస్వమైన 'ఉ' వచ్చును. రాఁగా రాము - హాహు అయి 'ఁడు' తోఁ జేరి రాముఁడు - హాహుఁడు అయ్యెను.

ఇట్లు డుఙ్ ప్రత్యయము దేనికిఁ జేరియుండునో దానికి డుమంత మని పేరు.

ఁడు అనునది రాము - హాహు అనువానికిఁ జేరి యున్నది గావున రాము - హాహు - డుమంతము లనఁబడు. సంజ్ఞాపరిచ్ఛేదము ౩౩-వ సూత్రము ప్రకారము రాముండు హాహుండు.

౧౫-వ సూత్రంబున అకారాంత మని చెప్పుటకుఁ గారణమేమన:— ఇకారాంతశబ్దములకు డుఙ్ రాదనియు, (ఉ. హరి - శౌరి.) ఉకార - ఋకారాంతశబ్దములకు డుఙ్ బహుళ మనియు (ఉ. బాహు - విధాత - ఇత్యాదులు) భావము. ఇవి యిఁక ముందు వివరింపఁబడును.

మహద్వాచక మన నేల యనిన ఆనందః. ఇది అకారాంతమైన

పుంలింగ శబ్దమైనను మహద్వాచకము కానందున మువర్ణకముఁ జేర్చి ఆనందము అని చెప్పవలయును గాని డుక్ చేర్పరాదు. (చూ. సూ. ౨౩.)

## అపవాద సూత్రములు.

సూ॥ ౨౦. నీచ, మూర్ఖ, ధూర్త, వృద్ధ, గృహస్థ, భ్రష్ట, చార్వాక శబ్దంబులకు ఉత్తగు. డుజ్ విభాష నగు.

ఈ నీచాదిశబ్దంబులకు 'ఉత్' అగు ననుటచే నీచు-మూర్ఖు-ధూర్తు-వృద్ధు - గృహస్థు - భ్రష్టు - చార్వాకు అని ప్రథమావిభక్తి - ఏకవచన రూపంబులు. (ఉత్ - హ్రస్వమైన ఉకారము.)

డుజ్ విభాష నగు ననుటచేన ఁడు చేర్చినఁ జేర్పవచ్చును. నీచుఁడు- మూర్ఖుఁడు - ధూర్తుఁడు - వృద్ధుఁడు - గృహస్థుఁడు - చార్వాకుఁడు అనియును రూపంబులు. నీచు సుయోధనుఁడు. నీచుఁడు సుయోధనుఁడు. మూర్ఖవు శిశుపాల - మూర్ఖుఁడవు శిశుపాల, ఒక్క గృహస్థు భూవరా - ఇట్లే తక్కినవి. (నీచశబ్దంబునకు డుజ్ వచ్చినపుడు 'నీచుఁడు' అనియు డుజ్ రానపుడు 'నీచ' యనియే రూప మని విద్యార్థులు సందేహింతురని సూత్ర మిట్లు వ్రాయఁబడియె.) రామదాసు - కాళిదాసు, ఇత్యాదులకు సాధుకవి ప్రయోగంబులు లేవు.

సూ॥ ౨౧. భట్టశబ్దం బుదంతమాత్రం బగు. ఉ. నన్నయభట్టు - నారాయణభట్టు - హరిభట్టు - కంకుభట్టు.

ఉదంతమాత్ర మనుటచే 'ఉ' మాత్రము వచ్చు ననియు 'ఁడు' రాదనియు నర్థము.

సూ॥ ౨౨. యోధాదులు బహుళంబుగ స్త్రీసమంబులగు. ఉ. యోధ - యోధుఁడు; శుంఠ - శుంఠుఁడు; ధూత - ధూతుఁడు.

స్త్రీసమంబు లనఁగా, ఁడు - ము - వు - ప్రత్యయములు రాకుండు నవి. స్త్రీసమము - చూడుు. సంధి. సూ. ౪౫. హనుమంతుఁడు రాముని దూత. హనుమంతుఁడు రాముని దూతుఁడు అని రెండువిధములఁ జెప్ప వచ్చును గాని యమహత్త్వమున స్త్రీసమరూపమే గ్రహింపనగు. ఉ. హంసల దూత చక్రవాకంబు. భట్టు ఇందలి 'ఉ' ఁడు నిమిత్తముగ వచ్చుటచే 'డు ము వు' లు లేకుండినను ఇది స్త్రీసమంబు గాదు.

## ప్రథమావిభక్తి-ము.

సూ॥ ౨౩. అదంతంబైన యమహన్నపుంసక శబ్దమునకుఁ ప్రథమైకవచనంబున మువర్ణకంబును, దదన్యంబున ముగాగమంబు* నగు.

అదంతమైన అమహత్తునకు ఉ. పర్వతము - పర్వతములు.
అదంతమైన నపుంసకమునకు ఉ. కళత్రము - అపత్యము. కళత్రములు - అపత్యములు.

పర్వతః ఇది అకారాంతము. ప్రాణము లేనిది కావున అమహద్వాచకము. ఇది తత్సమముగ వ్రాయవలసి వచ్చినపుడు విసర్గము లోపింపఁగా 'పర్వత' అని మిగిలి దీనికి 'ము' వర్ణకము చేర్పఁగా పర్వతము అని యేకవచనంబున రూపంబు. (మహద్వాచకమైనపుడు 'పర్వతుఁడు' ఇది యొక ఋషి పేరు.) 'పర్వత' అను ప్రాతిపదికమునకు బహువచన ప్రత్యయమైన 'లు' చేర్పఁగా 'పర్వతలు' అని యాయెను. ఈ 'లు' ప్రత్యయము ముప్రత్యయ

---

* ముగాగమము - ముక్ + ఆగమము. ముక్ అనువాఁగకారము ఇత్తు. దానివలని ప్రయోజన మేమనఁగా నది యే యక్షరమునకుఁ జేర్పఁబడునో యా యక్షరము మొదటిశబ్దమునకుఁ గడపటఁ గూర్పవలయును అట్లు చెప్పనియెడల మువర్ణము 'లు' కు ముందు చేర్పవలయునా వెనుకఁ జేర్పవలయునా యని సందేహము దోఁచును. చూ. సంధి. ౧౪ సూ.

మునకంతె వేశైనది కావున 'ము' అనునక్షరము ఆగమముగా వచ్చును. రాఁగా పర్వతములు అని ప్రథమాబహువచన రూపంబు. ఇట్లే తక్కినవి.

తదన్య మనఁగాఁ బ్రథమైకవచనముగాక తక్కిన ప్రథమా బహువచనము ద్వితీయైకవచనము మొదలగునవి.

సూ॥ ౨౪. మూలకు 'ద్విత్వ-ము, ంబు,' లు విభాష నగు.

ఉ. పర్వతము - పర్వతమ్ము - పర్వతంబు - పర్వతములు - పర్వతమ్ములు - పర్వతంబులు. 'మూ' ల కనఁగా మీఁదఁ జెప్పిన మువర్ణకమునకును ఆగమముగ వచ్చిన మువర్ణమునకు నని యర్థము. 'ద్విత్వ ము-ంబు' లనఁగా మ్ము - ంబు లనియర్థము.

## అపవాద సూత్రములు.

సూ॥ ౨౫. కుశాదులకు ము లోపంబు.

ఉ. కుశ - దర్భ - కుంఠ - పనస. కుశము దర్భము కుంఠము పనసము అని చెప్పరాదు. పనసశబ్దము వైకృతముంగలదు. అప్పుడును 'ము' లేదు.

సూ॥ ౨౬. చరిత్రాదులకు మువర్ణకలోపంబు విభాష నగు.

ఉ. చరిత్రము చరిత్ర. అభిలాష - అక్షత - అలక - ఆరాధన - ఆవాహన - అర్పణ - ఈక్షణ - ఆలోచన - గర్జన - గర్హా - ఘోష - చామర - చిహ్న - (తపస్) చరణ - చరిత - తోరణ - తరంగ - నటన - పారణ - ప్రార్థన - ప్రయాగ - ప్రశ్న - బోధ - బీభత్స - భ్రమ - లాలన - రంజన - వత్స వధ - విసర్జన - విజృంభణ - వర్తన - పాలణ - సంబోధన - స్ఫురణ హంస - సర్గ - పాత్ర (భాజనము) లోన యీ శబ్దములకు మువర్ణకము చేర్చియైనఁ జెప్పవచ్చును. చేర్పకయైనఁ జెప్పవచ్చును.

ప్రాసము - అంశము - మధ్యము - శ్రమము - వీని ము లోపంబునకు సాధు కవిప్రయోగంబులు లేవు.

సూ॥ ౨౭. ధర్మాదులకు వువర్ణకంబును నగు.

ఉ. ధర్మము-ధర్మువు; అర్థము-అర్థువు; వర్గము-వర్గువు; హితము-హితవు. వర్గు అని యుఁ గలదు. అహోబలపండితుఁడు 'కర్మువు' గలదని యిచ్చిన ప్రయోగము సాధుత్వము చింత్యము.

సూ॥ ౨౮. నపుంసకంబులగు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు.

ఉ. మిత్రుఁడు - మిత్రము; మిత్ర, శరణ, ప్రధాన, పాత్ర, కేవల సామాన్యాదులు మిత్రాగులు. ఇవి తెనుఁగున పుంలింగతుల్యంబులు. రాజ మాత్రుండె - కృష్ణాసోదరులు కేవలులే - అతఁడు సామాన్యుఁడే వేంకటాద్రి విభుఁడు. ఇతరుల్ నీ లీలకుం బాత్రముల్ ఇత్యాదులు. వీఁడు నాకు మిత్రుఁడు. వీఁడు నాకు మిత్రము. అని యిరుదెఱఁగులఁ జెప్పనగు. నపుంసక మనుటచే మిత్రుఁ డుదయించె నన వలయుఁ గాని మిత్రము నుదయించె నన రాదు. మహద్వాచక మగుటచే 'సింగంబు మిత్రునగు జంబుకంబు' అనవల యుఁ గాని మిత్రుఁడగు జంబుకం బనరాదు. ప్రకాంతశబ్దము సంస్కృతంబున పుం-నపుంసక లింగంబులు గలది.

సూ॥ ౨౯. మహద్వివక్షయందుఁ గొన్ని యమహచ్ఛబ్దములకు డుజ్జగు.

ఉ. సముద్రము - సముద్రుఁడు; మేఘము - మేఘుఁడు; వాయసము - వాయసుఁడు; పన్నగము-పన్నగుఁడు; వానరము-వానరుఁడు; ఉరగము - ఉరగుఁడు. ఒడ్డీఁడు - కత్తిశీఁడు-కోటఁడు (తె) బసవఁడు-ఇవి మహద్వాచకములు గాకున్నను 'ఁడు' గలవి. ఈ కడపటి నాలుగింటికి ముపర్ణకము రాదు.

ఇ.

సూ॥ 30. ఇదంతశబ్దములకుఁ బ్రథమైకవచన ప్రత్యయములు రావు.

ఉ. హరి - మతి.

ప్రథమైకవచన ప్రత్యయములైన "డు, ము, వు" లు ఇకారము కడపటఁగల శబ్దములకు రావు. హరిఁడు - మతిము అనరాదు. హరి - మతి యనియే యనవలయు.

## ఉ.

### సూ॥ ౩౧. ఉకారాంతశబ్దములకు సర్వత్ర వువర్ణకం బగు.

ఉ. గురువు-హూహువు (హూహూశబ్దము) జరత్కారువు-సాధువు - భ్రూవు-తరువు.

సర్వత్ర యనఁగా నన్నిలింగంబులయం దని యర్థము.

'గురు' ఇది ఉకారాంతము 'వు' చేరి గురువు అయ్యెను.

హూహూః ఇందు విసర్గము లోపించి హూహూ అని యై ౩౯-వ సూత్రము చొప్పున హూహు అనియై యీ సూత్రము ప్రకారము హూహువు అయ్యెను. భ్రూవు (చూ. సూ. ౪౨.)

### సూ॥ ౩౨. లువర్ణకాదిప్రత్యయములు పరములగుచో వుగాగమంబు బహుళంబుగ నగు.

ఉ. గురువులు - గురులు - ధేనువులు - ధేనులు - తరువున్ - తరున్ - రఘువున్ - రఘున్ - మేరువున్ - మేరున్ - లువర్ణకాది ప్రత్యయము లనఁగాఁ బ్రథమావిభక్తి 'లు' మొదలు తక్కిన యన్ని ప్రత్యయములు.

వుగాగమము. ౨౩-వ సూత్రంబున ముగాగమము చూడునది. బహుళ గ్రహణముచేత మను శబ్దంబున కన్నివిభక్తుల వుగాగమంబు నిత్యంబు. ఉ. మనువు - మనువులు - మనువులన్ - ఇత్యాదులు.

### సూ॥ ౩౩. గోశబ్దమునకు వు నిత్యంబు

ఉ. గోవు - గోవులు - గోవులన్. గోలు అని చెప్పరాదు.

## అపవాదసూత్రములు.

సూ॥ ౩౮. ఉవంత మహద్వాచకంబులకు డుజ్ఞు బహుళంబుగ నగు.

ఉ. గురుఁడు - గురువు; శంభుఁడు - శంభువు; విష్ణుఁడు - విష్ణువు; వటుఁడు - వటువు; వసుఁడు - వసువు. బహుళ మని చెప్పుటచే సానువు వాయువు ఇత్యాదులకు డుజ్ఞురాదు.

సూ॥ ౩౯. రాహ్వాదులకు వు లోపంబు వైకల్పికంబు.

ఉ. రాహు - రాహువు, బాహు - బాహువు; సాధు - సాధువు; శరత్తు - శరత్తువు.

సూ॥ ౩౬. కద్రూ, కద్రువ.

ఊకారాంత స్త్రీలింగమైన కద్రూశబ్దముయొక్క తత్సమరూపము కద్రువ. ఈమెయే పాములకుఁ దల్లి.

(కద్రువు అను శబ్దమునకు గోరోజనవర్ణమని యర్థము.)

ఋ.

సూ॥ ౩౭. ఋకారాంతంబు లదంతంబులు స్త్రీసమంబు లగు.

ఉ. పిత - మాత - స్వస - నప్త - హోత - పోత - ఉద్గాత - భ్రాత - జామాత - కర్త - భర్త - హర్త - గంత - హంత - నియంత మొదలైనవి. ఇవి యన్నియు ఋకారాంతములు. పితృ - మాతృ - అని యిట్లు రూపములుగలవి. ఇవి అదంతములు స్త్రీసమములు నగు.

## అపవాద సూత్రము.

సూ॥ ౩౮. మహత్తులగు విధాత్రాదులకు డుజ్ఞును నగు.

ఉ. విధాత - విధాతృఁడు; దాత - దాతృఁడు; ధాత - ధాతృఁడు; సవిత - సవితృఁడు; నేత - నేతృఁడు; ఇవి విధాత్రాదులు.

ఆ - ఈ - ఊ.

సూ॥ ౩౯. సామాంత్యదీర్ఘంబులకు హ్రస్వంబగు.

ఉ. సీతా - సీత; భామా - భామ; లతా - లత; రుక్మిణీ - రుక్మిణి; లక్ష్మీ - లక్ష్మి; జరత్కారూ - జరత్కారు. సంస్కృతశబ్దమునకుఁ గడపట దీర్ఘ ముండెనేని తత్సమమగు నపుడు ఆదీర్ఘము హ్రస్వ మగునని యర్థము. హాండా శబ్దము దీర్ఘాంతముగానే కన్పట్టు.

సూ॥ ౪౦. కృతహ్రస్వంబులు హ్రస్వంబు లట్టివ.

హ్రస్వంబులకుఁ గ నుండువాని కేయేవిభక్తు లెట్లెట్లు చేర్పవలయునో యట్లే దీర్ఘములుగానుండి హ్రస్వములుగాఁ జేయఁబడిన వానికిఁ జేర్పవలయునని యర్థము. ఉ. హాహూఁడు - లక్ష్ములు - హూహూవు. ఇత్యాదులు.

అపవాదసూత్రము.

సూ॥ ౪౧. సదా ద్వ్యేకవర్ణదేశ్యంబులకు హ్రస్వంబు లేదు.

ఉ. జ్యా - మా - శ్రీ - ధీ - భ్రూ - స్త్రీ - క్ష్మా సదా సర్వదా అండా అండీ మొదలైనవి వృథా నవలా, నేజా, లకోరీ - పల్లకీలను హ్రస్వ రూపంబులును గలవు.

సూ॥ ౪౨. అనూదంతంబులగు దీర్ఘైకవర్ణంబులు స్త్రీసమంబులు.

అనఁగా ఊకారాంతంబులకుఁ దప్ప దీర్ఘములగు నేకాక్షరములకు ప్రథమాప్రత్యయములు రావు. ఉ. భ్రూవు.

ద్వితీయావిభక్తి - ని.

సూ॥ ౪౩. ఈధాతు, యుష్మదర్థంబులమీఁదఁ దక్క నికారైకారాంతశబ్దములకు ద్వితీయాషష్ఠుల నిదంతవర్ణకము లగు.

ఉ. కరిని - కరికి; స్త్రీని - స్త్రీకి; లకోరీని - లకోరీకి; ఇవి ఇకారాంతములు. రైవి - రైకి; ఇది ఐకారాంతము. (ఇకార + ఐకారములు = ఇకారైకారములు) ఇదంతవర్ణకము లనఁగా ఇ కడపటనుండు ని - కి - అను ప్రత్యయములు, రై - పై - కై - మై ఇవి యైదంతంబులు.

ఈ ధాతువునకును - యుష్మద్వర్గకమునఁగా నీవు అనునర్థముగలది దీనికిని ‘కి - ని’ రావు. ఈరు - ఈవు - ఈను. ఇవి (ఇచ్చు) ఈధాతురూపంబులు. నీవు - నీకు; ఈవు - ఈకు; మీరు - మీకు; ఇవి యుష్మద్వర్గకములు. యుష్మద్వర్గకముల నజాదిరూపంబులు ప్రథమా షష్ఠులకు మాత్రము యగు.

సూ॥ ౭౭. డుజ్జున కాదేశంబుగ ద్వితీయ నివర్ణకం బగు.

ఉ. రాముఁడు - రాముని - గురుని - వటుని - ఉరగుని - యోధుని - విధాతృని.

అనఁగా ‘రాముఁడు’ అను దానిలోని ‘ఁడు’నకు బదులు ద్వితీయావిభక్తియందు ‘ని’ వర్ణకము వచ్చునని యర్థము.

ను.

సూ॥ ౭౮. అనికారాకాంతంబులకు, ‘ము-వు’ వర్ణకంబులకు ‘ను-కు’ వర్ణకంబు లాగమంబుగ నగు.

ఉ. ఇకారాంతములు కానివి అనికారాంతములు. వీనికి ద్వితీయయందు ఉ. యోధను - విధాతను - వనితను - నవలాను - చరిత్రను - త్ష్మను - కొడుకును - భట్టును - గ్లోను - గ్లాను అని రూపంబులు.

మువర్ణకంబునకు ఉ. చరిత్రమును - వనమును.

వువర్ణకంబునకు ఉ. గోవును - ధేనువును - గురువును - ధనువును.

అనికారాంతములకు షష్ఠిని. ఉ. యోధకు - వనితకు - నవలాకు - చరిత్రకు - శంభు(న)కు.

మువర్ణకంబునకు ఉ. చరిత్రము(న)కు - వనము(న)కు.
వువర్ణకంబునకు ఉ. గోవు(న)కు - గురువు(న)కు మొద.
వీనియందు నవర్ణ మెక్కువగ వచ్చుటకు ౪౭-వ సూత్రము చూడుము.

సూ॥ ౪౫. డుమంతమునకు ద్వితీయా ద్యేకవచనము పరంబగునపుడు నిగాగమంబు సర్వత్రవిభాష నగు.

ఉ. గురుని - గురునిని; గురుచే - గురునిచే; గురునికి - గురునకు.
డుమంతము చూ. సూ. ౧౯.

సర్వత్ర యనుటచే కిషష్ఠికి ముందు నిత్యంబనియు కువర్ణకంబునకు ముందు నగాగమంబనియు తెలియఁగునది. ౪౪-వ సూత్రముచే 'గురుని' యని రూపము సిద్ధింపఁగా ఈ నివర్ణకమునకు ముందు నివర్ణం బాగమంబయి గురునిని అని యేర్పడియె.

కు.

సూ॥ ౪౬. ఈధాతు యుష్మదర్థములఁ గువర్ణకంబ యగు.

ఉ. ఈకు - నీకు - మీకు. యుష్మదర్థ మనఁగా 'నీవు' అను నర్థము గలది. ' ఈకి - నీకి - మీకి యనుట తప్పు.

సూ॥ ౪౭. ఉకార ఋకారంబులకు 'కు' షష్ఠిపరమగుచో నగాగమంబు తఱచుగ నగు.

ఉ. రామునకు - గురువునకు; దాతృనకు - నేతృనకు. తఱచుగ ననుటచే బచ్చుకు - ఉత్సవముకు, వంతుకు ఇత్యాది మహాకవి ప్రయోగంబు లెక్కడ నేనిఁ గలవు.

అందు.

సూ॥ ౪౮. ఉకార ఋకారంబులకు నందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబును నగు.

ఉ. రామునందు - గురునందు - సవితృనందు. (రాము + ను + అందు = రామునందు, సవితృ + ను + అందు = సవితృనందు) నుగాగమంబును సనుటచే ౪౭-వ సూత్రముచొప్పున రామునియందు - సవితృనియందు - గురునియందు అనియును రూపంబులు.

సూ॥ ౫౦. అందువర్ణక మాగమంబులైన ము-వు వర్ణంబులకుఁ బరంబగుచో నుగాగమంబు విభాష నగు.

ఉ. తీరము + అందు = తీరమందు.

తీరము + ను + అందు = తీరమునందు.

తరువు + అందు = తరువందు.

తరువు + ను + అందు = తరువునందు.

సూ॥ ౫౧. ఉదంతంబు లైన యమహద్వాచకంబులకు 'కంటె' 'అందు' వర్ణకంబులు పరంబు లగునపుడు కొండొకచో నగాగమంబును నగు.

ఉ. శతంబుకంటె - శతంబునకంటె; వనమునయందు - వనమునందు - వనమందు.

న.

సూ॥ ౫౨. ఉదంతం బైనజడవాచకంబునకు సప్తమిని 'న' వర్ణకం బగు.

ఉ. వనమున-గృహమున, వనము-ఉదంతము-జడవాచకము. (ప్రాణములేనిది) కావున 'న' వర్ణకము వచ్చెను. ఉదంత మగుటచేఁ గాళిని నెత్తిని.

బహువచనము.

సూ॥ ౫౩. ప్రథమాబహువచనంబున డుజ్ఞున కాదేశం బుగను, ఉకారాంత, స్త్రీసమ, ము-వు-ల కాగమంబుగను 'లు' వరకం బగు.

| ఉదా. | ఏ. | బ. | |
|---|---|---|---|
| ప్ర. | రాముఁడు | రాములు | డుజ్జున కాదేశంబు. |
| | కొడుకు | కొడుకులు | ఉకారాంతము. |
| | యోధ | యోధలు | స్త్రీసమము. |
| | జ్యా - శ్రీ | జ్యాలు - శ్రీలు | స్త్రీసమము. |
| | వనము | వనములు | మువర్ణకము. |
| | తరువు | తరువులు | వువర్ణకము. |

సూ॥ ౫౪. ద్వితీయాదివిభక్తులు పరంబగుచో బహువచనంబున లడాగమం బగు.

ఉ. రాములను - రాములచేత - రాములకొఱకు - రాములకున్ - రాములయందు, (లట్ + ఆగమము = లడాగమము చూ. సంధి ౯. సూ.)

అపవాదము.

సూ॥ ౫౫. దీర్ఘపూర్వక లకారోపధ కాదంత సంస్కృత సమ మహచ్ఛబ్దంబులమీఁది 'లు-ల'లకు 'రు-ర' లగు.

ఉ. బాలురు - దయాశీలురు - మహీపాలురు - బాలురన్ - దయాశీలురన్ - మహీపాలురన్.

దీర్ఘాక్షరము ముందుగఁ గల లకారము నుపధగఁ గల అకారాంత తత్సమ మహచ్ఛబ్దమునకు బహువచనంబున 'లు'కు మాఱుగ 'రు', 'ల'కు మాఱుగ 'ర' వచ్చు నని యర్థము. బాలః - దీని ప్రాతిపదికము బాల ఇది తత్సమము మహచ్ఛబ్దము. కడపట అకారమున్నది. ఈ అకారమునకు ముందు 'ల్' యున్నది. (బాల్ + అ = బాల) ఈ లకారమునకు ముందు 'బా' యను దీర్ఘాక్షర మున్నది. కావున నీ 'బాల' శబ్దమునకు నేకవచనంబున బాలుఁడు కాఁగా బహువచనంబున బాలులు అని ౫౩-వ సూత్రముప్రకారము కావలసి యుండఁగా నటుగాక యీ సూత్రము ప్రకారము 'లు'కు బదులు 'రు' వచ్చి

బాలురు అని యయ్యెను. అట్లులే బాలులన్ బదులు బాలురన్ అని యగును. ఇట్లు బాలురచేతన్ - బాలురయొక్క. దయాళుశబ్దముమాత్రము అకారాంతము గాకపోయినను ఈ సూత్రము ప్రకారమే 'దయాళురు' అని బహువచనమున నేర్పడుచున్నది. 'దయాళువులు' అనియుఁ గలదు. మల్లశబ్దమున లకారమునకు ముందు దీర్ఘము లేకున్నను మల్లురు అనియు మల్లులు అనియు రెండు రూపంబు లోకప్రయోగంబునఁ గాన నయ్యెడి.

ఆదంత మన్నందున ఏక. కరుణాశాలి. బహు. కరుణాశాలులు.

ఏక. దృఢతాలుఁడు. బహు. దృఢతాలులు. ఇందు రు - రలు లేవు.

సూ॥ ౪౬. బహువచనంబు పరంబగునపు డిత్వంబున కుత్వం బగు.

ఉ. కరి + లు = కరులు; బలి + లు = బలులు; చెవి + లు = చెవులు; కర్ + ఇ + లు = కర్ + ఉ + లు = కరులు.

సూ॥ ౪౭. లు ల 'న' లు పరంబులగునపుడు గొండొకచో 'ము'గాగమంబునకు లోపంబును దత్పూర్వంబైన అకారంబునకు దీర్ఘంబును విభాష నగు.

ఉ. రత్నములు - రత్నాలు, రత్నాలను - రత్నాన, సవరములు - సవరాలు, సవరాలను - సవరాలచే. రత్నములు ఇందు 'ము' ఆగమము. చూ. సూ. ౨౩. ఈ 'ము' లోపింపఁగా 'రత్నలు'. ఆ 'ము' వరమునకు ముందున్న 'త్న' మీఁది 'అ' కారమునకు దీర్ఘము రాఁగా 'రత్నాలు'. పూర్వంబైన అకారమనుటచే నాణెములు - నాణేలు - నాణాలు అని కాని తుఱుము అనునది తుఱూలు అని కాని కానేరదు.

## సంబోధనము. ఏకవచనము.

సూ॥ ౪౮. ఆమంత్రణంబున విశిష్టాఽవిశిష్టసంబోధ్యవాచకంబునకు ముందు విభాషగ ఓ యగు.

ఉ. ఓ రాముఁడ - ఓ రాములార; ఓ భామ - ఓ భామలార; రాముఁడ - రాములార; భామ - భామలార. ఇవి యవిశిష్టసంబోధ్యవాచకంబునకు ముందు 'ఓ' వచ్చుట కుదాహరణములు. అవిశిష్ట మనఁగా విశేషణముతోఁ గూడనిది. ఆమంత్రణ మనఁగాఁ బిలుచుట. ఏది పిలువఁబడునో యది సంబోధ్యవాచకము.

ఉ. ఓ దయామయుండవైన రామా - దయామయుండవైన రామా. ఇచ్చట సంబోధ్యవాచకమైన రామా యనునది 'దయామయుండవైన' యను విశేషణముతోఁ గూడియున్నది. దయామయుండవైన యోరామా యనియుఁ జెప్పనగు. రాముఁడ ఓ! సీత ఓ అని సంబోధ్యవాచకమునకు వెనుక 'ఓ' చేర్పరాదు.

**సూ॥ ౫౯. ఓయి పురుషులఁ బిలుచుటయందును, నిందామైత్రులఁ బురుషునిఁ బిలుచుటయం దోరియు, స్త్రీఁ బిలుచుటయం దోసియు విభాష నగు.**

సంబోధ్యవాచకము ఓయి - ఓరి - ఓసి ఇవి లేకయుఁ బ్రయోగింపఁబడు. వీనికి దీర్ఘాంతరూపంబులును గలవు.

పురుషులఁ బిలుచుటయందు ఓయి. ఉ. ఓయి భీముఁడ - ఓయీ భీముఁడ.

నిందయందుఁ బురుషులఁ బిలుచుటయందు ఓరి. ఉ. ఓరి నీచుఁడ - ఓరీ నీచుఁడ.

మైత్రియందుఁ బురుషులఁ బిలుచుటయందు ఓరి. ఉ. ఓరి రామన్న - ఓరీ రామన్న.

నిందయందు స్త్రీలను బిలుచుటయందు ఓసి. ఉ. ఓసి పాపాత్మురాల - ఓసీ పాపాత్మురాల.

మైత్రి ,, ఓసి. ఉ. ఓసి కూఁతుర - ఓసీ కూఁతుర.

సూ॥ ౬౦. సంబోధనంబున ఉదంతప్రథమైకవచనంబు యుత్వంబునకు అకారంబును, అ ఇ ఎదంతంబులకు దీర్ఘం బును విభాష నగు.

| | | |
|---|---|---|
| ఉదంతము - కొడుకు | ఓ కొడుక | ఓ కొడుకా. |
| | ఓ రాముఁడ | ఓ రాముఁడా. |
| | ఓ వీడ | ఓ వీడా. |
| ము | ఓ ధనము | ఓ ధనమా. |
| | ఓ పాము | ఓ పామా. |
| వు | ఓ ధేనువ | ఓ ధేనువా. |
| అ | ఓ మగువ | ఓ మగువా. |
| | ఓ రంగ | ఓ రంగా. |
| ఇ | ఓ కలికి-ఓ శౌరి. | ఓ కలికీ-ఓ శౌరీ. |
| ఎ | ఓ వదినె | ఓ వదినే. |

సూ॥ ౬౧. రో-రోలు స్త్రీసంబోధ్యంబులకు పరంబుగనగు.

ఉ. చెలియరో - చెలియరో. అక్కరో - అక్కరో.

అన్నరో - ఏమంగురో. ఇవి సాధువులు గావు.

సూ॥ ౬౨. కృతోత్వంబగు సంస్కృతనామంబు సంబుద్ధి యుజ్జునకు లోపంబు విభాష నగు.

ఉ. ఓ రాము-ఓ రాముఁడా-నారాయణుఁడా యని సోమయాజిగారి ప్రయోగము. విభాష ననుటవలన ఓ రంగఁడా లింగఁడా యని కాదు. రంగ లింగశబ్దములు ౧౯-వ సూత్రమున కపవాదములు. రంగుడు - లింగుఁడు అని లేవు. సంస్కృతనామంబనుటచే అక్కజుఁడు ఇత్యాది తెలుఁగుల డుజ్ లోపంబులేదు. అక్కజుఁడాయనుటకు అక్కజా యనరాదు. కృతోత్వము= శాస్త్రప్రకారము వచ్చిన 'ఉ'కారము గలది. సంబుద్ధి=సంబోధనము.

సూ॥ ౬౩. సంబోధనంబున నుదంతసంస్కృత నామంబు మీఁద 'వు - ఁడు'ల కూకారప్లుతాదేశం బౌండె, వాని యుత్వంబున కత్వం బౌండె నగు.

ఉ. గురువ - గురువా³; గురుఁడ - గురుఁడా; మనూ - మనువ - మనువా. ఊకారము దీర్ఘమైన గురూ. వు - ఁడులలోని ఉకారము అకార మైన గురువా - గురుఁడా.

ఉదంత సంస్కృతనామంబు లనుటచే కొడుకూ - తమ్ముఁడూ. ఇత్యాదులు గ్రామ్యంబులు.

సూ॥ ౬౪. దేశ్యంబున నేకవచనంబున అల - అలా యను నవ్యయంబులు సంబోధ్యవాచకంబునకుఁ బరంబుగ నొండొకచో నగు.

ఉ. అక్కల - అన్నలా అనఁగా అక్కా అన్నా యని యర్థము. దీని నే వాడుకయందు 'అల్ల' అమ్మల్లా యని యందురు.

సూ॥ ౬౫. సంబోధ్యవాచకంబునకుఁ బరంబుగ 'కాన' యు నగు.

తల్లికాన - సామికాన - అనఁగా ఓతల్లి - ఓసామి యని యర్థము. తత్సమంబులందును బహువచనంబున నిది ఆరగాగమంబున కను ప్రయుక్తంబు గను నగు. ఉ. దురాచారులారకాన, వ్యభిచారులారకాన యని ప్రయోగంబులు.

## సంబోధనము. బహువచనము.

సూ॥ ౬౬. సంబోధనంబున బహువచనంబున కారగాగమం బగు.

ఉ. తల్లులార - తమ్ములార - రాములారా.

అర దీర్ఘాంతంబును గలుగు. తల్లులారా - తమ్ములారా, (అరక్ + ఆగమము = అర గాగమము.)

అపవాదము.

సూ॥ ౬౭. మధ్యమపురుష బహువచనయోగంబున నారగాగమంబు విభాష నగు.

ఉ. చెప్పకుఁడీ బుధులు - చెప్పకుఁడీ బుధులార. ఇచ్చటఁ జెప్పకుఁడీ యనునది మధ్యమపురుషక్రియ గావున బుధులని బుధులారయని రెండు విధములఁ జెప్పవచ్చును. జనులార నాయభిప్రాయముఁ జెప్పెద. ఇచ్చటఁ జెప్పెద అనునది ఉత్తమపురుషక్రియ గావున, జనులార యనియే చెప్పవలయును. 'జనులు' అనరాదు.

సూ॥ ౬౮. స్వర్గివాచి దేవశబ్దంబు నిత్యైకవచనంబు. సురశబ్దంబు నిత్యబహువచనంబు స్త్రీసమంబు.

ఉ. దేవుఁడు - సురలు. స్వర్గివాచి యన్నందున మహీదేవుఁడు-మహీసురులు అని చెప్పవచ్చును. ముప్పది మూఁడుకోట్లదేవు లనికాని ఇంద్రుఁడొక సురఁడు-సురుఁడు అని కాని చెప్పరాదు. స్వర్గివాచి=స్వర్గమునందుండువారిని జెప్పునది.

సూ॥ ౬౯. అసురశబ్దంబు వైకల్పికంబుగ స్త్రీసమంబు.

ఉ. అసుర - అసురుఁడు; అసురలు - అసురులు.

సూ॥ ౭౦. సిద్ధసమాసంబున సురాఽసురశబ్దములు పుంలింగంబులు.

ఉ. సకలసురులు - సకలాసురులు. సిద్ధసమాస మన్నందున ఎల్లసురలు - ఎల్లయసురలు-ఎల్లయసురులు. సిద్ధసమాసమనఁగాఁ గేవలసంస్కృతశబ్దములతోనైన సమాసము. ఎల్లసురలు - విశ్రసమాసము. (చూ. సమాసపరి - సూ. ౩.)

## విశేషరూపంబులు.

**సూ॥ ౭౧. భూ భువి; నౌ నావ.**

అనఁగా భూశబ్దమునకు భువి యనియు, నౌశబ్దమునకు నావయనియుఁ దత్సమరూపంబులు.

**సూ॥ ౭౨. రై రోలు - గ్లౌ గ్లోలు - శరణు శరణములు.**

అనఁగా నాంధ్రంబున నీ రెండువిధముల రూపంబులును గలవని యర్థము.

**సూ॥ ౭౩. కంధరాదులకు మువర్ణకంబును బహుళంబుగ నగు.**

ఉ. కంధర - కంధరము. అర్చన - ఉల్క - కల్పన - కంధర - గ్రీవ- ఘట్టన - పాలన - సంభావన - నాసిక - పాదుక - భిక్ష - దంష్ట్ర - మాయ - మిష లోనైనవి కంధరాదులు. మాత్రాశబ్దమునకు మాత్ర - మాత్రము - మాత్రు ఁడనియు రూపంబులు. విధాశబ్దమునకు విధయని రూపము రాదు.

ఈ శబ్దములు దీర్ఘాంతము లగుటచే ౬౯-వ సూత్రముచొప్పున దీర్ఘంబులు హ్రస్వంబు లగుటయేగాక నపుంసకశబ్దంబులవలె మువర్ణకమును గలవియు నగును.

**సూ॥ ౭౪. ఇదంతంబునకు బహువచన ప్రత్యయంబులు పరంబు లగునపు డుపధాశవర్ణంబు సవర్ణం బగు.**

ఉ. రాశి - రాసులు, పరదేశి - పరదేసులు, పేశి - పేసులు.

**సూ॥ ౭౫. ప్రభవాదులు స్త్రీసమంబులు.**

ఉ. ప్రభవ - విభవ - శుక్ల-మొ. సంవత్సరముల పేళ్లైన ప్రభవ- విభవ లోనగునవి స్త్రీసమంబులు.

**సూ॥ ౭౬. చైత్రాదులు నపుంసకములు.**

ఉ. చైత్రము - వైశాఖము మొదలగునవి.

## హలంత ప్రకరణము.

ఇందు హల్లు లంతమందుఁ గల సంస్కృతశబ్దంబులు తత్సమంబు లగు విధము చెప్పఁబడును.

సూ॥ ౭౭. ప్రాతిపదికంబు సంస్కృత ప్రథమైకవచన తుల్యంబు.

ఉ. దిక్ - దృక్ - కకుప్ - ప్రేమన్ - లలామన్.

సూ॥ ౭౮. శ్వశబ్దంబు తప్ప నాంతంబులు ప్రథమైకవచన సమంబులు.

ఉ. కర్మము - ప్రేమము - జన్మము - వర్మము - నామము - అర్యముఁడు - మఘువుఁడు. నాంతంబులనఁగా నకార మంతమందుఁ గలవి కర్మన్ - జన్మన్ - వర్మన్ - నామన్ - అర్యమన్ - మఘువన్. ఇందు మొదటి యయిదు అమ హాత్తు లౌట 'ము' వర్ణకమును, తక్కిన రెండు మహాత్తులైనందున డుఙ్ను గల వయ్యెను. శ్వశబ్దమునకు ద్వితీయైకవచనము ప్రాతిపదిక మగుటచే 'శ్వానము' అని యగును. కర్మ-జన్మ యని మువర్ణక విరహితంబుగ వ్రాయుట సాధువు గాదు. లలామ శబ్దమునకు లలామ - లలామము అని రెండు రూపంబులు. ఇట్టులే సీమ - సీమము, ప్రేమ - ప్రేమము అనియు సంస్కృతము ననుసరించి రెండు రూపంబులు.

సూ॥ ౭౯. హ్రస్వంబుమీఁది హల్లుల కుత్వ ద్విత్వంబు లగు.

ఉ. దిక్-దిక్కు; దృక్-దృక్కు; కకుప్-కకుప్పు. కించిత్-కించిత్తు.

దిక్ అను శబ్దమునందు 'క్' అను హల్లునకు ముందు హ్రస్వమున్నది గాన నీ 'క్' హల్లునకు 'ఉ' గాగము వచ్చి 'దికు' అని యయి ద్విత్వము వచ్చి 'దిక్కు' అని యయ్యె. ఇట్లే తక్కినవి. కించిత్తు నల్లిక అచిన.

సూ॥ ౮౦. దీర్ఘపూర్వకహల్లునకు ద్విత్వంబు బహుళంబు.

ఉ. వాక్-వాకు-వాక్కు; సమ్రాట్-సమ్రాటు-సమ్రాట్టు. ద్విత్వము బహుళ మనుటచే ఉత్వము నిత్యము. వాక్ = ఇందు హల్లు 'క్'. దీనికి పూర్వముననున్న 'వా' దీర్ఘాక్షరము గావున 'క్' అనునది దీర్ఘపూర్వకహల్లు.

సూ॥ ౮౧. ఉగాగమాంతంబులకుఁ బ్రథమైకవచనలోపం బగు.

ఇల్లనుటచే దిక్కు - వాక్కు. వీనికి డు, ము, వు అను ప్రత్యయములు రావు.

సూ॥ ౮౨. గుణవద్గణము ద్వితీయైకవచనతుల్యము.

౭౭-వ సూత్రంబునఁ గొన్ని హలంతశబ్దములకుఁ బ్రథమైకవచనతుల్యంబులు ప్రాతిపదికంబులని చెప్పంబడియె. అవి గాక మఱికొన్ని హలంతములకు ద్వితీయైకవచన తుల్యములు ప్రాతిపదికములు. ఇట్టిశబ్దము లన్నియు గుణవద్గణ మనుతెగలోఁ జేరుచున్నవి. అనగా శ్వన్ శబ్దముయొక్క ప్రథమా విభక్తి ఏకవచనము శ్వానమ్. ద్వితీయ ఏకవచనము శ్వా. ఈ 'శ్వానమ్' తెత్సమమున 'శ్వానము' అయ్యెను. ఇట్లులే 'గుణవత్' శబ్దము. ప్ర. ఏ. గుణవాన్. ద్వి. ఏ. గుణవంతమ్.

గుణవంత ప్రాతిపదికము. ఇదియే 'గుణవంతుఁడు' అని యేర్పడియె. 'కల' యనునర్థము గల 'మత్' అనుదాని 'వత్'గా మార్చి 'గుణ' శబ్దమునకుఁ జేర్పఁగా 'గుణవత్' అని యేర్పడియె. గుణవంతుఁడనఁగాఁ గుణము గలవాఁడని యర్థము. బుద్ధిగలవాఁడు బుద్ధిమంతుఁడు. ఇట్లు 'మత్' 'వత్' కడపటఁ గల వానికే మతుబంతము లని పేరు. మతుబంతంబులును మకారాంతములైన మఱికొన్నిశబ్దంబులు గుణవద్గణంబునఁ జేరుచున్నవి. ఉ. గుణవంతమ్-ధీమంతమ్ - ఋత్విజమ్ - సుహృదమ్ - వేదవిదమ్ - విద్వాంసమ్ - శ్వానమ్ - అనడ్వాహమ్ - అప్సరసమ్.

సూ॥ ౮౩. గుణవద్గణంబుల యంత్యమకారంబునకు లోపంబును నజంతములకుం బోలెఁ బ్రత్యయములు నగు.

ఉ. గుణవంతుఁడు - ధీమంతుఁడు - ఋత్విజుఁడు సుహృదుఁడు - వేదవిదుఁడు - విద్వాంసుఁడు. శ్వానము - అనడ్వాహము (అనుహాత్తు). అప్సరస (స్త్రీలింగము గావున.)

'గుణవంతమ్' అనుదానిలోఁ గడపటి మకారము లోపింపఁగా 'గుణవంత' యని మిగిలి 'రాముఁడు'వలె 'గుణవంతుఁ'డనియు, అనుహాద్వాచకమైనపుడు 'వృక్షము'వలె గుణవంతము అనియు నగు.

సూ॥ ౮౪. ఋత్విగాదులు గుణవర్ణంబు విభాషనగు.

ఉ. ఋత్విక్ - ఋత్విజుఁడు - ఋత్విక్కు, వణిక్ - వణిజుఁడు - వణిక్కు, నీవృత్ - నీవృతము - నీవృత్తు, మరుతుఁడు - మరుత్తు, పరిక్షితుఁడు - పరిక్షిత్తు, భూభుక్కు - భూభుజుఁడు, ఇంద్రజిత్తు - ఇంద్రజితుఁడు, సత్రాజిత్తు - సత్రాజితుఁడు. ఋత్విగాదికం బాకృతిగణంబు. (చూ. సంధి. సూ.౮)

## నాంతంబులు.

సూ॥ ౮౫. ఒకానొకచో మహాత్త్వంబునందు మతుప్తకారమున కానాదేశంబు విభాష నగు.

ఉ. హనుమంతుఁడు - హనుమానుఁడు, భగవంతుఁడు - భగవానుఁడు. ఇత్యాది.

హనుమత్ - హనుమంతుఁడయ్యెను. ఇందు 'మత్' లోని 'త్' కారమునకు 'అన్' ఆదేశముగ రాఁగా 'హనుమాన'యై 'హనుమానుఁడు' అయ్యె.

సూ॥ ౮౬. యువాదులు స్త్రీసమంబులు.

ఉ. యువ - యజ్వ - అశ్వత్థామ - కృష్ణవర్త్మ ఇప్పటివారు ప్రాయము 'యువానుఁడు - యువానులు అను రూపంబులు గ్రామ్యంబులు.

సూ॥ ౮౭. బ్రహ్మము పుంలింగమహాద్వాచకము బ్రహ్మ.

బ్రహ్మము అనఁగా పరమాత్మ - వేదము - తపము - గ్రహయోగము. బ్రహ్మ=నలువ - విష్ణువు - బ్రాహ్మణుఁడు - ఋత్విజుఁడు.

సూ॥ ౮౮. విశ్వకర్మాత్మశబ్దంబులు, ఇమనిజంతంబులు, నకారాంత మనుష్యాభిధానంబులు, బహుళంబుగ స్త్రీసమంబులు.

ఉ. విశ్వకర్మ - విశ్వకర్ముఁడు, ఆత్మ - ఆత్మను - ఆత్ముఁడు.

ఇమనిజంతంబు లనఁగా 'ఇమ' అను ప్రత్యయము కడపటఁ గలవి. ఉ. అణిమ - అణిమము, (అణు+ఇమ=అణిమ) మహిమ - మహిమము, లఘిమ - లఘిమము, గరిమ - గరిమము, పాండిమ - పాండిమము, మధురిమ - మధురిమము ఇత్యాదులు. ఇమనిచ్+అంతములు=ఇమనిజంతంబులు.

నకారాంత మనుష్యాభిధానంబులు. అనగా నకారము గడపటఁగల మనుష్యులపేర్లు. ఉ. చండవర్మ - చండవర్ముఁడు, కృతవర్మ - కృతవర్ముఁడు, విష్ణుశర్మ - విష్ణుశర్ముఁడు. 'విశ్వకర్మునికూఁతు విశదలావణ్యసముజ్జ్వల' యను పాఠమే సాధువు. విశ్వకర్మకూఁతు ననిన గణభంగము.

సూ॥ ౮౯. విశేషార్థంబు రాజశబ్దము మహాదర్థకంబున రాజు అమహాదర్థకంబున రాజము. బహువ్రీహిని రాజుఁడు.

ఉ. పుష్పకం బను విమానరాజమున నధివసించి పరిపాలిత రాజుఁడైన రామరాజు నన్ను రక్షించుఁ గాక. పరిపాలితరాజుఁడు. ఇది బహువ్రీహి. విశేషణము.

తకారాంతంబులు.

సూ॥ ౯౦. జరజ్జరుఁడు.

జరత్ శబ్ద తత్సమము జరుఁడు.

సూ॥ ౯౧. జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాష నగు.

జగత్ = జగము - జగత్తు, ఇంద్రజిత్ = ఇంద్రజి - ఇంద్రజిత్తు. (చూ. సూ. ౮౪.)

## సకారాంతంబులు.

సూ॥ ౯౨. పయఃప్రభృతుల సకారంబున కుగాగమ ద్విత్వంబులు నిత్యంబు.

పయస్సు - వయస్సు - సరస్సు - అంభస్సు - అంహస్సు - మేదస్సు - పీనస్సు - అయస్సు - అహస్సు - వర్చస్సు. (పయస్ + స్ + ఉ = పయస్సు)

సూ॥ ౯౩. యశఃప్రభృతుల యంత్యసకారంబునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. యశము - యశస్సు, తేజము - తేజస్సు, సదము - సదస్సు, ఉరము - ఉరస్సు, వక్షము - వక్షస్సు, అర్చి - అర్చిస్సు, రోచి - రోచిస్సు, ధనువు - ధనుస్సు, మనము - మనస్సు, శిరము - శిరస్సు, చక్షువు - చక్షుస్సు, ఆయువు - ఆయుస్సు.

సూ॥ ౯౪. మనఃప్రభృతుల సకారంబునకు వైకల్పికంబుగ ద్విత్వంబు.

ఉ. మనసు - మనస్సు, శిరము - శిరస్సు, సదసు - సదస్సు.

సూ॥ ౯౫. వేధ పురోధ పురోధసుఁడు.

వేధస్ - శబ్దమునకు వేధయుని, పురోధస్ శబ్దమునకు పురోధ. పురోధసుఁడు అని రూపంబులు.

సూ॥ ౯౬. సకారాంత మహద్వాచకంబులకు నంత లోపం బొండె గుణవద్గణత్వ మొండె నగు.

అంతలోపము = కడపటి యక్షరము (స్) లోపము.

ఉ. విశ్రవుఁడు (సకారము లోపము) విశ్రవసుఁడు. అంగిరుఁడు అంగిరసుఁడు, భూరిశ్రవసుఁడు - భూరిశ్రవుఁడు, ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు, ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు. దుర్వాసుఁడని మాత్రము ప్రయోగంబులఁ గానఁబడెడి.

సూ॥ ౯౭ దివి - హ్రాది - సమిధలు.

అనఁగా 'ద్యు' శబ్దమునకు దివి యనియు, 'హ్రాద్' శబ్దమునకు హ్రాది యనియు, సమిధ్ శబ్దమునకు సమిధ యనియు, రూపంబులు.

సూ॥ ౯౮. ముదాదులకుఁ బ్రథమైకవచన లోపంబు లేదు.

ఉ. ముదము - ఉపానహము - స్రజము.

సూ॥ ౯౯. స్త్రీలింగశబ్దంబులు నియత స్వస్త్రీ ప్రత్యయంబులు.

అనఁగా సంస్కృతశబ్దంబులెల్ల స్త్రీలింగరూపంబు లగుట కేయే ప్రత్యయంబులు పొందునో యా స్త్రీ ప్రత్యయంబులు పొందియే తత్సమంబున వ్యవహరింపఁబడు.

| నామము. | స్త్రీప్రత్యయాంతము. | తత్సమము. |
|---|---|---|
| రాజన్ | రాజ్ఞీ | రాజ్ఞి. |
| శ్వన్ | శునీ | శుని. |
| విద్వస్ | విదుషీ | విదుషి. |
| బాలః | బాలా | బాల. |
| బాలకః | బాలికా | బాలిక. * |
| శూద్రః | శూద్రీ - శూద్రా | శూద్రి - శూద్ర. |
| శ్రీమత్ | శ్రీమతీ | శ్రీమతి. |
| యువన్ | యువతిః | యువతి. |
| పతిః | పత్నీ | పత్ని. |

*'బాలకి' యను ననంతామాత్య ప్రయోగసాధుత్వంబు చింత్యంబు.

| | | |
|---|---|---|
| కృశోదరః | కృశోదరా* | కృశోదర. |
| | కృశోదరీ | కృశోదరి. |
| మతిమత్ | మతిమతీ | మతిమతి. |
| దయావాన్ | దయావతీ | దయావతి |
| కర్తృ | కర్త్రీ | కర్త్రి. |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి. |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని. |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని. |

సూ॥ ౧౦౦. అమహతీవాచకంబుల విశేషణంబు లుభయవిధంబులు.

ఉ. మనోహర యైనచంద్రిక - మనోహర మైనచంద్రిక.

అమహతి=మహతి గానిది. అనఁగా స్త్రీలను బోధించని స్త్రీలింగ రూపంబులు. ఉ. చంద్రిక - (వెన్నెల) విద్య - బుద్ధి - మతి ఇత్యాది. (చూ. సూ. ౭౫)

సూ॥ ౧౦౧. మాలవసానంబులు పరంబు లగు నపుడు లు - రు ప్రత్యయంబుల విూఁది యుత్వమునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. జనముల్ - చూచెదర్.

---

*నాసికా - ఉదర - ఓష్ఠ - జంఘా - దంత - కర్ణ - శృంగ - అంగ - గాత్ర - కంఠ - పుచ్ఛ శబ్దంబులు కడపటఁ గలవానికి నిట్లే రెండు రూపంబులు. అవయవములను దెలుపు శబ్దంబులలో వీనికిఁ దప్పఁ దక్కిన వానికి 'ఈ'కార మంతమందుఁ గల స్త్రీలింగరూపంబులు లేవు గావున కమలనేత్రి మొదలైనవి యసాధువులు. ఇట్లే బింబాధరి - మీనలోచని లోనైనవి సాధువులు గావు. చంద్రమతి మతుబంతము గాదు.

ఉ. జనముల్ — చూచెదర్.

సూ॥ ౧౦౨. మహాత్సమూహార్థకశబ్దం బమహాద్రూపం బను బొంది యుండెనేని దాని విశేషణక్రియలకు వైకల్పికం బుగ మహాద్రూపం బగు.

ఉ. పడ నడతురు నిన్నుఁ గన్నఁ బ్రమథగణంబుల్; కడుదయాళురు దేవతాగణము లెల్ల.

సూ॥ ౧౦౩. భవచ్ఛత్రాదులకు రేఫాంతంబులకు ద్వ్యాద్యల్ప సంఖ్యలకుఁ దదాదులకు నిందు యోగంబు లేదు.

సంధి ౭౮-వ సూత్రంబునఁ జెప్పిన శబ్దములకు, ద్వి, త్రిలోనగు నల్ప సంఖ్యలకు తత్ లోనగు వానికిఁ దత్సమరూపంబులు లేవు.

ఏకః అనునది ఏకమనియగునుగాని యేకుఁడు అని కాదు.



## అచ్ఛికపరిచ్ఛేదము.

అచ్ఛికమనఁగా నచ్చతెనుఁగు. దేశ్యము తద్భవముమాత్రము గలసినది.

సూ॥ ౧. ఏకాదులుతప్ప వికృతిశబ్దంబులు స్త్రీసమంబులు క్లీబసమంబులు.

ఉ. స్త్రీసమంబులు:—బల్ల - పిల్ల - సేరు - గోరు - పేను - మీను - తావి - బావి - నవలా - లకోరీ - పల్లకీ ఇత్యాదులు.

క్లీబసమంబులు:—(క్లీబము = నపుంసకము) కయ్యము - నెయ్యము - కారము - బేరము - అల్లము - పల్లము.

ఏకాదిగణములలోఁ జేరిన ఒక్కఁడు - వాఁడు - వీఁడు - పొఱుఁడు - మగఁడు మొదలగు శబ్దములు తప్పఁ దక్కిన యచ్చతెనుఁగు శబ్దంబులన్నియు స్త్రీసమంబులు గానో క్లీబసమంబులు గానో యుండును. తద్భవములయందలి చందురుఁడు లోనగు పుంలింగరూపంబులు ఏకాదిగణములోఁ జేరుచున్నవి.

### ఁడు.

సూ॥ ౨. అక్కజాదులు సంస్కృత తుల్యంబులు.

ఉ. అక్కజ - అక్కజాఁడు - అక్కజము. అక్కజ - కావల - బల్లిద - బెట్టిద - బెడిద - మిసిమింత - మొక్కల - పదిల - ప్రల్లద - నెయ్య - ఉక్కివ - కుచ్చిత లోనైనవి యక్కజాదులు. అక్కజ శబ్దము మహద్వాచకమైనపుడు (రామశబ్దము రాముఁడు అయినట్టు) 'అక్కజాఁడు' అనియు, అమహద్వాచక మైనపుడు (వనము - వలె) 'అక్కజము' అనియు, స్త్రీవాచకమైనపుడు (ధీరురాలువలె) అక్కజురాలు అనియు రూపంబులు. ఇట్లే తక్కినవి. పదిలుఁడవై యోరుము. భార.

సూ॥ ౩. మహన్మహత్యర్థకంబులఁ బగతశబ్దంబు సంస్కృత తుల్యంబు.

ఉ. పగత - పగతుఁడు - పగతురాలు. మహదర్థకమందును మహత్యర్థకమందునని యర్థము. దీనికిఁ బగతము అను రూపంబులేదు.

సూ॥ ౪. మహత్తులగు మగాదులకుం, గయిరాదులకును, డుజ్ఞగు ఉత్వంబు గాదు.

ఉ. మగఁడు - కయిరఁడు. మగ - మనుమ - రాయ - పాప - బాఁప - నాయ - ద్రే - తే - ఈ - కా ప్రత్యయంబులు మొదలగునవి మగాదులు.

కయిఁరడు - కత్తళఁడు - జన్నఁడు - నీలఁడు - కడవఁడు-పులియఁడు-కోటఁడు - బసవఁడు ఇత్యాదులు కయిరాదులు.

ఈ శబ్దములకు మహదర్థకమందు 'ఁడు' మాత్రమువచ్చును గాని ఉత్వమురాదు. అనఁగా మగుఁడు నాయుఁడు కయిరుఁడు అని రూపమేర్పడదు.

సూ॥ ౫. బిడ్డాదులకు డుజ్ఞును విభాష నగు.

ఉ. బిడ్డఁడు - బిడ్డ. బిడ్డ - మాల - బోయ - కొడుకు - ముదుక - కూళ - ఇత్యాదులు బిడ్డాదులు. డుజ్ఞగుచో ఉత్వంబునకు అత్వంబు. కొడుకఁడు - చెడుగఁడు - దుడుకఁడు.

సూ॥ ౬. అక్కజాదులకును మగాదులకును సంబోధనంబున డుజ్లోపంబు లేదు.

ఉ. అక్కజుఁడా - ఓ మగఁడా. రాయశబ్దంబునకుఁ గర్మధారయంబున డుజ్లోపంబు గాననయ్యెడి. ఉ. కృష్ణరాయ! కృష్ణరాయని - కృష్ణరాయలు. రాయుఁడు - రాయులు అపశబ్దంబులు.

ము.

సూ॥ ౭. నెట్టనాదులు స్త్రీ క్లీబసమంబులు.

ఉ. నెట్టన - నెట్టనము. నెట్టన - అక్కటిక - అగ్గలిక - ఈరస - అచ్చిక - అటమట - అరమర - ఇత్యాదులు. నెట్టనాదులు వీనికి మువర్ణకము తోడ నొక రూపము. మువర్ణకము లేక యొకరూపము.

వు

సూ॥ ౮. అకర్వాదుల వులోపంబు వైకల్పికంబు.

ఉ. అకరువు - అకరు, అత్తరువు - అత్తరు, పుట్టువు - పుట్టు, తట్టువు-తట్టు.

సూ॥ ౯. ఉదంతడుమంతములకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు విభాష నగు.

ఉ. పగతుని - పగతునిని, పగతుచేత - పగతునిచేత, పగతునకు - పగతునికి.

సూ॥ ౧౦. ఉదంతము కాని డుమంతమునకు నిగాగమము నిత్యము.

ఉ. మనుమనిని - మనుమనిచేత, మనుమనికై - మనుమనికి, ఇట్లు మగనిచేత - పాపనిచే - తేనియొక్క - త్రేనికి - మన్నినికి - విలుకానికి ఇత్యాదులు.

బహువచనము.

సూ॥ ౧౧. పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు.

ఉ. పగతుఁడు - పగతురు. 'పగతుఁడు' లోని 'ఁడు'నకు 'లు' ఆదేశముగావచ్చి 'పగతులు' కాఁగా నీ సూత్రము చెప్పిన రేఫ మాదేశమయి 'పగతురు' ఆయెను.

పగతుఁడు - అల్లుఁడు - నెయ్యుఁడు - బలియుఁడు-మార్తుఁడు. ఇత్యాదులు పగతారులు.

సూ॥ ౧౨. బహువచనమ్మునఁ గొన్ని డుమంతంబుల మీఁది 'లు' వర్ణంబునకును, అల్వాదులలోని 'లు' వర్ణంబునకును, బూర్ణబిందు పూర్వక ద్రు కారం బాదేశం బగు.

ఉ. గండంద్రు - మిండంద్రు - వేడుక కాండ్రు.

అలు - అంద్రు, చెలియలు - చెలియంద్రు అలు-చెలియాలు-కోడలు-పేరాలు - మఱఁదలు - చెల్లెలు - వెలయాలు. ఇవి యాల్వాదులు. గండఁడు. బహు. గండలు. గండంద్రు అనియగు. అలులు కావలసినది. అంద్రు అగు.

సూ॥ ౧౩ కాఁడు లోనిడుజ్జునకు బహువచనంబున శకటరేఫం బొండెఁ, బూర్ణబిందుపూర్వక ద్రువర్ణం బొండె నాదేశంబగు.

ఉ విలుకాంద్రు - విలుకాఱు, వేఁటకాంద్రు - వేఁటకాఱు.

సూ॥ ౧౪. ఱేఁడు ప్రభృతులకు 'లు' వర్ణకం బాగమంబుగ నగు.

ఉ. ఱేఁడు - ఱేఁడులు.

సూ॥ ౧౫. కూఁతురు శబ్దంబునకు 'లు' మొదలగు ప్రత్యయంబులు పరంబగుచో రేఫంబునకు లోపంబు.

ఉ. కూఁతురు - కూఁతులు - కూఁతులను, కూఁతులచే కూఁతుల తోడ కూఁతులందు మొ. 'లు' మొదలగు ప్రత్యయము లనఁగాఁ బ్రథమా బహువచనము ద్వితీయాది యన్ని విభక్తుల యన్నివచనములు.

సూ॥ ౧౫. చెయువు మీఁది లువర్ణకంబునకు శకట రేఫంబు విభాష నగు.

ఉ. చెయువులు - చెయువుఱు.

సూ॥ ౧౬. అచ్ఛికంబుల నిదు పోత్తమోత్తమంబులకు బహువచనము పరంబగునపు డుపోత్తమోత్వం బుత్వం బగు.

ఉ. కలిమి - కలుములు, బలిమి - బలుములు, చెలిమి - చెలుములు. కలికి - కొలికి - మనికి - వినికి - కోరికె - ప్రూనికి - పోలికి-నేరిమి-కూరిమి- పేరిమి - ఇత్యాదులు. ఇత్ + ఉపోత్తమ + ఉత్తమంబులు.

ఇత్ = హ్రస్వఇకారము, ఉపోత్తమము = మూఁడక్షరములలోఁ కడ యక్షరమునకు ముందక్షరము. ఉత్తమము=కడయక్షరము. మూఁడక్షరములు గల యొక శబ్దమునకుఁ గడపటియక్షరము దాని ముందక్షరము రెండును 'ఇ' వర్ణములు గలవయ్యేనేని 'లు' వర్ణకము పరమైనపుడు ఉపోత్తమమైన ఇకారము గూడ ఉకారముగ మాఱును. ఈ కలిమిశబ్దమునఁ గడపటియక్షరము మి దానిముందక్షరము 'లి' రెండు ఇకారములుగలవి. దీనికి 'లు' వర్ణకము పరము కాఁగా (కలిమి+లు) తత్సను. ౫౭-వ సూత్రముప్రకారము కలిములు, అయి యీ సూత్రముప్రకారము కలుములు అని యయ్యెను. విరి - ఇందు నుపోత్తమమైన 'వి' మొదటి యక్షరమైనందున నది 'వు' గాదు. విరులు - ఇట్లు జిగి - జిగులు, నిసి - నిసులు, గిలి - గిలులు, పిడి - పిడులు, ఇత్యాదులు. రెండక్షరములు గలవగుటచే నీ సూత్రమునకు లక్ష్యములు గావు.

## అపవాదము.

సూ॥ ౧౭. తొమ్మిది మొనిమిటి శబ్దంబులయు, 'ర ల డ' లుపధలుగాఁ గల శబ్దంబులయు నుపోత్తమంబైన యుత్వం బుత్వంబు గాదు.

తొమ్మిది - తొమ్మిదులు, పెనిమిటి - పెనిమిటిలు, పందిరి - పందిరులు, ఎంగిలి - ఎంగిళులు, దోపిడి - దోపిడులు, కడయాక్షరమునకు ముందక్షరము ఉపధ. తొమ్మి+ద్+ఇ - ఇచ్చట ద్ - ఉపధ. ఇచ్చటి మ్మి = మ్మ గాదు.

సూ॥ ౧౯. లువర్ణకమునకు ముందున్న డ ల ట రల మీఁది యుత్వంబునకు బహుళంబుగ లోపంబు

ఉ. పండులు - పండ్లు, బండులు - బండ్లు.
అంబలులు - అంబల్లు, పాలులు - పాల్లు.
చెట్టులు - చెట్లు, జెట్టులు - జెట్లు
గోరులు - గోర్లు. ఏఱులు - ఏర్లు.

ఉ. ఏఱు. ఇది యేకవచనము. బహువచన 'లు'వర్ణకము పరము కాఁగా 'ఏఱులు'. లువర్ణకమునకు ముందున్న 'ఱు' మీఁది 'ఉ' లోపింపఁగా ఏఱ్‌లు = ఏఱ్లు అయి సంయుక్తమున నలఘురేఫములేని కారణముచే నదీ లఘురేఫముగా మాఱి 'ఏర్లు' అయ్యెను. ఇట్లే బండులు-బండ్లు. తెలుఁగున ద్విత్వాక్షరముమీఁది యచ్చు లోపించి నపుడు ద్విత్వమును లోపించుఁ గావున చెట్టులు-చెట్‌లు, (చూ. సూ. సంధి. ౮౮.) చెట్లు. ఇట్లే తక్కినవి యూహించునది,

బహుళమనుటచే ద్విత్వ లుకార ఱుకారములమీఁదను, మఱికొన్ని శబ్దములమీఁదను ఉత్వలోపంబు గానరాదు. బల్లులు - పిల్లులు - విల్లులు - నల్లులు - మిల్లులు - తిల్లులు - ఇట్టులు - మిట్టులు - నాట్టులు - అట్టులు - కట్టులు - జెట్టులు - కొట్టులు - తొట్టులు - పుఱులు - చెఱులు ఇత్యాదులు.

సూ॥ ౨౦. లువర్ణకంబునకు ముందున్న యసంయుక్తము లై యుదంతంబులైన 'డ - ల - ర'లకు నలఘులకారంబు బహుళంబుగ నగు.

ఉ. త్రాడులు - త్రాళులు, గుమ్మడులు - గుమ్మళులు, మొగిలులు - మొగిళులు, పిడికిలులు - పిడికిళులు, ఊరులు - ఊళులు, పందిరులు - పందిళులు.

బహుళమన్నందున చూరు - పేరు - కారు - కోరు - సేరు - తీరు ఇత్యాదులందు లేదు. నానుపర్యాయంబునఁ బేళ్లు అనుట సరిగాదు.

సూ॥ ౨౧. బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబులైన 'ల - డ'ల కలయు లకారంబు నిత్యంబు

ఉ. మొసలులు - మొసళ్లు, తడులు - తళ్లు, గుడులు - గుళ్లు.

పై సూత్రముచొప్పున నేర్పడిన త్రాడులు - గుమ్మడులు లోనగు వానికి ౨౯-వ సూత్రము చొప్పునఁ ద్రాడ్లు - గుమ్మడ్లు అను రూపంబులు సిద్ధింపకుండుటే యీ సూత్రమువలన ప్రయోజనము.

సూ॥ ౨౨. మూఁడు నాఁడులం దప్ప నేకపదంబున సంయుక్తాక్షరంబు పరంబగునపు డఱసున్న నిఱసున్న యగు.

ఉ. బోఁటులు - బోంట్లు, గూఁడులు - గూండ్లు, ఏఁడులు - ఏండ్లు 'బోఁటులు' ననునది యేకపదము. ఇది ౧౯-వ సూత్రము చొప్పున బోఁట్లు' -గును. అట్లగునపు డీ సూత్రము ప్రకారము అరసున్న నిండుసున్న యయి 'బోంట్లు' అగును. 'పెండ్లి' అనువానికి మాఱుగ పెళ్లి - పెంళ్లి అనుట తప్పు.

మూఁడు నాఁడులు మాత్రము, మూళ్లు నాళ్లు అగును. ఉ. మూఁడు మూళ్లు తొమ్మిది. ఎన్నినాళ్లు ఏకపదంబనుటచే దోపెఁడు ఇత్యాదులందు లేదు. దోపెఁడులు - దోసెళ్లు.

సూ॥ ౨౩. ఔపవిభక్తికములందు ద్విరుక్త 'లు'వర్ణకంబునకు లు, ల, వర్ణకంబులు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక 'డు' వర్ణకంబు వైకల్పికంబు.

ఉ. విల్లు - విల్లులు - విండులు, ముల్లులు - ముంచులు, పల్లులు- పండులు, బండికల్లు-బండికల్లులు-బండికండ్లు. ఇత్యాదులు ౧౯-వ సూత్రము చొప్పున విండ్లు - ముండ్లు - పండ్లు. పళ్లు లోనగు రూపంబు లసాధువులు.

సూ॥ ౨౮. ఔపవిభక్తిక లివర్ణమునకు 'లు-లి'లు పరంబు లగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబులు బహుళంబుగ నగు.

రోఁకలి-రోఁకలిలు, రోఁకండులు - రోఁకండ్లు. (సూ. ౨౦) రోఁకలులు (సూ. తత్స. ౫౬) రోఁకళులు (సూ. ౨౦.) రోఁకళ్లు ఇట్లు గొడ్డలి - కొడవలి - అటుకలి ఇత్యాదులు బహుళ గ్రహణముచేతను ఔపవిభక్తికముగా నుండుటను పెండిలి-పెండ్లి, పెండ్లులు - పెండ్లిండులు-పెండ్లిండ్లు, అని రూపము లేర్పడియె.

సూ॥ ౨౯. కొన్ని బహువచనాంత నామంబుల మీఁద బహువచనం బగు.

ఉ. కొడవండ్లులు - కొడవండ్లులను, వేడుకాండ్రురు, వెలయాండ్రురు ఆండ్రురు - కోడండ్రురయందు, ఇత్యాదులు. కొడవండ్లు అనుశబ్దము బహువచనాంతమై యుండ మరల దానిపై 'లు' వర్ణకము వచ్చి కొడవండ్లులు అయ్యెను. అట్లనే కోడండ్రు - కోడండ్రురు. లువర్ణకముపై 'లు' వర్ణకము 'రు' వర్ణకముపై 'రు' వర్ణకము వచ్చును. ఇట్లు కొడవళ్లులు - సొంకళ్లులు - సెవిళ్లులు - ముండ్లులు - నీళ్లులు - ఆంగ్లిష్టమునం దీనియుపయోగంబు లేదు ఉ. చూపులులు - వారు - వీరు - మీరు - వారలు - వీరలు - మీరలు అగు.

## న్వంతంబులు.

సూ॥ ౩౦. కలను మొదలగు శబ్దంబుల నువర్ణంబున కేకవచనంబున వైకల్పికంబుగను బహువచనంబున నిత్యముగను కుజ్జగు.

ఉ. కలను - కలఁకు - కలఁకులు. (కుజ్ = ఁకు) కలను - మ్రాను - కొలను - వలను - కేలను - గవను - నెఱను - పరను - కొఱను ఇవి కలన్వాదులు. ను + అంతము = న్వంతము.

సూ॥ ౨౭. రేను, గోను శబ్దంబుల నువర్ణంబునకుఁ బైయట్ల గుజ్జగు.

రేను - రేఁగు - రేఁగులు, గోను - గోఁగు - గోఁగులు.

పై యట్ల యనఁగా నేకవచనంబున వైకల్పికము. బహువచనంబున నిత్యము.

సూ॥ ౨౮. ఁలు, ల'లు పరంబగునపుడు చేను - పేను - మీను - రేయి - ఱాయి - వేయి - వ్రాయి - పాయి - ప్రాయి - శబ్దంబుల కడవర్ణంబులు లోపించు.

ఉ. చేను - చేలు, పేలు - మీలు - రేలు - ఱాలు - వేలు - వ్రాలు - పాలు - ప్రాలు, 'మీనులకొ' అను నొకానొక కవి ప్రయోగము సాధుత్వము చింత్యము, రే ఱా వే లకు వ్యస్తంబు లైనపుడు స్వతంత్ర ప్రయోగంబులు గలవు ఈరే మదనాస్త్రఘాతముల; ఇనుమో ఱాయో; మొగములు వే గల శేషుఁడు.

నూయి - గోయి - వాయి - చేయి ఇత్యాదులు ఔపవిభక్తికము లగుట నీ సూత్రంబునకు లక్ష్యంబులు కానేరవు. నే వోసినయగ్ని; నే మిడిచినం జల్లారు నే యిత్యాదులఁ 'నే' శబ్దమునకుఁ గాన నయ్యెడి.

సూ॥ ౨౯. బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుదియక్షరమునకు లోపంబు విభాష నగు.

ఉ. ఆవు - ఆవులు - ఆలు, జాము - జాములు - జాలు, చుట్టము - చుట్టములు - చుట్టలు, మీసము - మీసములు - మీసలు, పూవు - పూవులు - పూలు, పూ యనివ్యస్త పదముం గలదు. కాలకంఠుని శిరసు పూ గగన గంగ.

సూ॥ ౩౦. నామాంతమందలి 'ఇయ'కు బహుళంబుగ నేకారం బగు.

ఉ. జన్నియ - జన్నె, వన్నియ - వన్నె, కొండియము - కొండెము, కొంచియము - కొంచెము, ఇట్లు వీణె - మల్లె - కుంచె - లంజె - గద్దె - ఒల్లె. జందెము - పందెము. బహుళమన్నందున ముద్దియ - కాటియ - సందియము - చెలియ ఇత్యాదులందు ఇయకు మాఱుగ 'ఎ' త్వంబు రాదు.

సూ॥ ౩౧. 'ఇయ' శబ్దంబునందికారలోపంబు ముత్తియాదులం దగు.

ఉ. ముత్తియము-ముత్తెము - ముత్యము, కన్నియ - కన్య, వీడియము - వీడ్యము, దివ్వియ - దివ్య, కల్లియము - కల్యము. పల్లియము - పల్యము. ముత్తియము=ముత్త్+ఇయ+ము - 'ఇయ' కుమాఱు. 'ఏ' వచ్చిన ముత్తెము. 'ఇ' లోపించిన. ముత్ +య+ము=ముత్యము. (చూ. సంధి. సూ. ౮౨.)

సూ॥ ౩౨. వస్తునిర్దేశమం దదె, యదిగో, లు సర్వత్ర యగు.

కనులకుగోచరించు వస్తువును జూపుటయందు నేకవచన బహువచనము లందును మహతీ మహ దమహ దర్థకములందును అదె - అదిగో, ఇదె - ఇదిగో నను నవ్యయంబులగు. అదె రాముడు, ఇదె సీత, అదె వనము. అదిగో రాముఁడు, అదిగో సీత, అదిగో వనము. అదె పో బ్రాహ్మణ నీకును సద యుఁడు నా భాగసుతుఁడు; అదిగో సురులు. పుష్కరాదులగు దీవులన్నిట నుండి వచ్చియున్నారిదె శీతభాను దిననాయక వంశజులైన రాజబృందారకులు.

వాఁడె రాముఁడు, కీరె వేల్పు లని కలదు గాని వారు గో వీరు గో యను రూపంబులు చింత్యంబులు. అది గోఁబుగుపొమ్మ్వయ్యమవి పింగళి సూరన్న ద్రుతప్రకృతికముగాను, అది గో కానఁగఁబడియెనని వరాహ

పురాణకర్తలు కళగాను బ్రయోగించిరి. పింగళి సూరన్నగారి ప్రయోగమే ప్రామాణికము. ఇది - ఇదిగో సమీపవస్తువులఁ జూచుటయందు నగు.

## సర్వనామ ప్రకరణము.

సూ॥ 33. ఆ - ఈ - ఏ - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - అంత - ఇంత - ఎంత - కొంత - నా - నీ - మన - తా - మెకు ్ర-లును, ఒకటి రెండు లోనగు సంఖ్యావాచకంబులును సర్వనామంబులు.

సంఖ్యార్థమును దెలుపునది వాస్తవముగ 'న్ని'యే. అం అః యన్నట్టు లుచ్చారణ సౌకర్యమునకై 'అ' చేర్పఁబడుట 'అన్ని' యయ్యెను. అనునాసికము లనుస్వారముగఁ సామాన్యముగఁ దెనుఁగున మాఱుట గలదు గాన 'త' పరమైనపుడు 'న్ని' 'ం' పూర్ణబిందువుగ మాఱి అంత యయ్యెను. ఇది యితరాచ్చులకుఁ బరమైనపుడు సౌఖ్యార్థమె వచ్చిన 'అ' లోపించును.

ఆ + అంత = ఆ + ంత = అంత (ఆ హ్రస్వమై.)
ఈ + అంత = ఈ + ంత = ఇంత (ఈ ,, .)
ఏ + అంత = ఏ + ంత ఎంత (ఏ ,, .)

సూ॥ 34. లుప్తశేషంబులు ది - వి - న్ని - ంత,లు పరములగుచో ఆ - ఈ - ఏ - లు హ్రస్వము లగును.

ఉ. అది - అవి - అన్ని - అంత. 'అన్ని' శబ్దము సంఖ్యను దెలుపును. త్వార్థంబైన 'తన' వర్ణకములోని ప్రథమాక్షరము దీనికిఁ బరము కాఁగా 'అన్ని + త' యనియాయి ద్విత్వనివర్ణకము (న్ని) పూర్ణబిందువుగా మాఱి సర్వము అను నర్థము బోధించు 'అంత' యను శబ్దమేర్పడియె

ఆ + అన్ని = ఆ + న్ని = అన్ని.
ఈ + అన్ని = ఈ + న్ని = ఇన్ని.

ఏ + అన్ని = ఏ + న్ని = ఎన్ని.

ఇట్టులే అది - ఇది - ఎది - అవి - ఇవి - ఎవి.

సూ॥ ౩౫. 'ఒక'కు 'న్నింతే'లు పరములగుచో నర్ణవ్య త్యయ సంయోగంబు లగు.

అనఁగా ఒ + (అ)న్ని = ఒక + న్ని = కఒ + న్ని = కొన్ని. ఒక + అంత = ఒక + ంత కఒ + ంత = కొంత.

సూ॥ ౩౬. ఏకత్వబహుత్వంబుల మహదర్థకంబున డుజ్-రు - లును, నమహదర్థకంబున ది - వి - లు నగు.

అనఁగా మహదర్థకమున నేకవచనమున 'ఁడు' బహువచనమున 'రు' అమహదర్థకమున నేకవచనమున 'ది' బహువచనమున 'వి' యగు.

మహ. ఏక. వాఁడు. బహు. వారు. అమ. ఏ. అది. బ. అవి.

సూ॥ ౩౭ డుజ్ పరమైనపుడు ఆ - ఈలకు వకారంబు పూర్వాగమం బగు.

ఉ. ఆ + ఁడు = వ + ఆ + ఁడు = వాఁడు.

ఈ + ఁడు = వ + ఈ + ఁడు = వీఁడు.

సూ॥ ౩౮. ఏకారంబునకు డుజ్ పరమైనపుడు వకారంబు పూర్వాగమంబు వైకల్పికంబు.

ఉ. ఏ + ఁడు = వ + ఏఁడు = వేఁడు (పూర్వాగమము.)

ఏ + ఁడు = ఏఁడు (వకారాగమములేదు.)

సూ॥ ౩౯. వాఁడు శబ్దమునకు బహువచనంబున రువర్ణకం బాగమం బగు. అగుచో ఁడు వర్ణకంబున కుత్వలోపంబును ఖండబిందువు పూర్ణబిందువు నగు.

ఉ. వాఁడు - వాఁడురు, వాఁడ్రు - వాండ్రు, వీండ్రు - ఎవండ్రు.

సూ॥ ౧౦. వారు - వీరు - మీరు శబ్దంబుల గువర్ణకం బుపై నుకల బహువచనంబున లువర్ణకంబగు. అగుచో రువ ర్ణకంబు మీఁది యుకారం బగు.

ఉ. వారలు - వీరలు - మీరలు.

సూ॥ ౧౧. బహువచన ప్రత్యయంబయిన, 'లు' క్రొన్ని యెడల నలఘు రేఫం బగు. అగుచో అన్ని - ఇన్ని - క్రొన్ని - ఎన్నిలోని 'న్ని'కిఁ బూర్ణబిందు పూర్వకదకారం బాదేశంబగు.

ఉ. అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు - చూపువారు = చూపఱు (చూపుగలవారు) పగవారు=పగఱు (పగ గలవారు) అని యయ్యె. అందఱునకు 'అందొఱు' అని యును గలదు.

సూ॥ ౧౨. వాఁడు మహదర్థకంబునకు బహువచన రూపంబులు మహన్మహద్వ్యర్థకంబులును నగు.

'వాఁడు' పురుషుని బోధించును. వాండ్రు - వారు - వారలు పురుషులను స్త్రీలను బోధించును. ఇట్లులే వీఁడు - ఎవఁడు.

సూ॥ ౧౩. 'ది' 'వి' లు పరములైనపుడు 'ఆ-ఈ' లు నిత్యముగను, 'ఏ' వైకల్పికముగను హ్రస్వ మగు.

ఉ. ఆ+ది = అది, ఈ+ది = ఇది, ఏ + ది = ఎది, అవి - ఇవి - ఏవి - ఎవి.

సూ॥ ౧౪. ది-వి-న్ని-ం తాంతంబు లమహదర్థకంబులు.

అది - అవి - అన్ని - అంత; ఇది - ఇవి - ఇన్ని - ఇంత; ఎది - ఏది; ఎవి - ఏవి; ఎన్ని - ఎంత; కొన్ని - కొంత; ఇవి యమహదర్థకంబులు.

సూ॥ ౪౫. హ్రస్వంబుమీఁది ది - వి - లకు ద్విత్వంబును నగు. సమాసంబునఁ గాదు.

ఉ. అద్ది - అవ్వి; ఇద్ది - ఇవ్వి; ఎద్ది - ఎవ్వి; ఆయది - నాయది - మాయది; నాయవి - నీయవి.

సూ॥ ౪౬. ఆ ఈ ఏ వీనికిఁ ద్రికమనిపేరు.

సూ॥ ౪౭. మహద్వాచకంబున నేకత్వంబునఁ బూజ్యార్థంబునఁ ద్రికంబునకు 'వాఁడు' పరమగు. అగుచో 'వా'కుఁ దనర్ణం బాదేశం బగు.

ఆ+వాఁడు = ఆతఁడు; ఈవాఁడు = ఈతఁడు; ఏవాఁడు = ఏతఁడు ఇట్టిచో ఆ ఈ ఏ-లు హ్రస్వంబులు నగు. అతఁడు ఇతఁడు ఎతఁడు.

సూ॥ ౪౮. పూజ్యార్థంబున నేకత్వంబున మహదర్థకంబున అన్నయు, మహత్యర్థకంబున అమ్మ - అప్ప - అక్కయు, నద్విత్వాంతంబులయి త్రికంబున కనుప్రయుక్తంబు లగు. అగుచో అమ్మాదు లెదంతంబులయి యాద్యకార శూన్యంబులగు.

అన్న దీని ద్విత్వాంతము గాని రూపము అన. ఇది పూజ్యార్థంబు. ఏకవచనంబున ఆ ఈ ఏ-లకుఁ జేర్పఁగా ఆయన - ఈయన - ఏయన యగు. మహత్యర్థకంబున అమ్మ - అప్ప - అక్క వీని ద్విత్వాంతములు గాని రూపంబులు అమ - అప - అక. ఇవి ఆ - ఈ - ఏ-లకుఁ జేర్పఁగా ఆ+అమ; ఆ+అప; ఆ+అక యగు. ఆ శబ్దంబుల యందలి మొదటి అకారములు పోఁగా ఆ + మ; ఆ + ప; ఆ+క నిలిచి యవి యెకారములు పొందినవై ఆమె - ఆపె - ఆకె యని యేర్పడియె. ఇట్టులే తక్కినవి.

సూ॥ ౨౯. అట్టి-ఇట్టి-ఎట్టి, శబ్దంబులకు వాఁడు - వారు, పరంబులగుచో, 'వా'కు లోపంబు వైకల్పికంబుగ నగు.

అట్టి + వాఁడు = అట్టిఁడు - అట్టివాఁడు; ఇట్టివాఁడు - ఇట్టిఁడు; ఎట్టివాఁడు - ఎట్టిఁడు; అట్టివారు - అట్టిరు ఇత్యాదులు.

సూ॥ ౨౧౦. ఏ శబ్దంబునకు వాఁడు - వారు, పరమైనప్పుడు దీర్ఘాదీర్ఘ ద్విత్వాద్విత్వంబులు 'వా'కును, హ్రస్వద్విత్వ వకారంబుల ముందు ఏశబ్దంబు హ్రస్వంబును, నగు.

ఉ. ఏ+వాఁడు.

దీర్ఘము ద్విత్వమైన వా = ఏవ్వాఁడు. ఇచ్చట 'వా' ద్విత్వము కావున ఏ హ్రస్వ మగును ఎవ్వాఁడు.

అదీర్ఘ ద్విత్వమైన వా = ఏవ్వఁడు ,, ఎవ్వఁడు.

దీర్ఘము అద్విత్వము = ఏ+వాఁడు = ఏవాఁడు.

అదీర్ఘము అద్విత్వము = ఏ+వఁడు = 'వ' హ్రస్వము కావున ఏ హ్రస్వమగు. ఎవఁడు.

ఇట్లులే దీని బహువచనములు ఎవ్వారు - ఎవ్వరు; ఏవారు - ఎవరు.

సూ॥ ౨౧౧. ఏకవచన బహువచనంబుల అస్మదర్థంబున ఏకు 'న-ము'లును యుష్మదర్థకంబున ఈకు 'వు-రు'లు నగు.

ఉ. ఏక. ఏను. బహు. ఏము ఏ. ఈవు బ. ఈరు. పర్యాయంబున న - ము - లు ఏ ఈ లకుఁ బూర్వాగమంబులు నగు.

ఏ. న+ఏను = నేను. బ. మ+ఏము = మేము.

ఈ. న+ఈవు= నీవు. బ. మ+ఈరు = మీరు.

సూ॥ ౨౧౨. ఎల్లశబ్దంబునకు వారు పరమైనపుడు 'వా'కు లోపంబు వైకల్పికంబు.

ఉ. ఎల్లవారు - ఎల్లరు.

సూ॥ ౨౧౩. వాఁడు - వీఁడు - వేఁడు - ఏఁడు ద్వితీయాద్యేకవచన రూపంబులు, నుదంత దుమాంశంబులు వోలె నగు.

ఉ. వానిన్ - వానిచేన్ - వానితోన్ - వానికొఱకు - వానికై - వానికి - వానియందు. ఇట్లే తక్కినవి.

సూ॥ ౨౧౪. ద్వితీయాది బహువచనంబుల యుత్వంబున కిత్వం బగు.

వాడు బహువచనమున వారు అని యిదివఱకే చెప్పఁబడినది. ద్వితీయావిభక్తి మొదలైన విభక్తుల బహువచనంబున గు - రి యగు. వారిన్ - వారిచేతన్ - వారికొఱకు - వారియందు మొ॥ లైనవి.

సూ॥ ౨౧౫. అది-అవి - ఇది - ఇవి - ఎది - ఎవి వీనికి ద్వితీయాది విభక్తులు పరములగునపుడును, సప్తమి ననర్థకంబు పరం బగు నపుడును, దా - వా - దీ - వీ - దే - వే లగు.

ఏక. దానిన్-బహు. వానిన్, దానిచేన్-వానిచేన్, దానికొఱకున్-వానికొఱకున్, దానికిన్-వానికిన్, దానిలోన్-వానిలోన్, దానియందున్-వానియందున్, ఇట్లే తక్కినవి. దాన - వీన - దీన - దేన - వేన. ననర్థకంబు తృతీయార్థమునను వచ్చును గావున నీ రూపంబులు తృతీయ యందును నగు. వాటిని - వాటిలో - వాటియందు, వీటిని - వేటిని గ్రామ్యంబులు.

సూ॥ ౨౧౬. తదాదులకు ద్వితీయయం దుభయ వచనంబుల నివర్ణకం బగు.

అది - అవి, ఇది - ఇవి, ఏది-ఏవి, ఇవి తదాదులు, దానిన్-వానిన్.

సూ॥ ౨౧౭. ఆత్మార్థం బొకచో నామాన్తదర్థాభిధాయియు నగు.

ఉ. తన కిష్టుఁడు. అనఁగా 'నా కిష్టుఁడు' అని యర్థము. ఆత్మార్థక శబ్దము తాను. అస్మదర్థకశబ్దము నేను. కావున 'నాకు' అనుటకు మాఱు 'త'కున అని ప్రయోగము.

సూ॥ ౪౮. సంఖ్యా పూరణార్థంబున 'అవ'కు 'అగు' వాదేశంబు వికల్పంబుగా నగు.

ఉ. ఏడవ పర్వము – ఏడగు పర్వము.

సూ॥ ౪౯. మహద్వాచకంబులకు విశేషణంబులైన సంఖ్యావాచకంబులకు నమహద్రూపంబులు నగు.

ఉ. పదివేలు మనుష్యులు పదివేవురు మనుష్యులు. మనుష్యులు మహద్వాచకము. దీనికి విశేషణము పదివేలు. ఇది సంఖ్యావాచకము. కావున నిది మహద్రూపముగా నొండె అమహద్రూపంబుగా నొండె నుండ నగు.

సూ॥ ౫౦. అన్నాదు లదంత ప్రశ్నార్థకంబుల కనుప్రయుక్తము లగుచో వ్యతిరేకార్థ సూచకంబు లగు.

ఉ. తగునయ్యా? తగున అయ్యా? తగున ఇది ఆకారాంత ప్రశ్నార్థకము దీనికి అయ్యా చేర్పఁగాఁ దగునయ్యా? యయ్యె. బహుళగ్రహణముచే సంధి నిత్యము. నీ కిట్లు సేయఁ దగునయ్యా, అనఁగా నీ కిటు సేయుట తగ దను నర్థమును సూచించును. అ ఆ ఎ ఏలు కేవల ప్రశ్నార్థకమునందును, వ్యతిరేకార్థ సూచనయందును నగు. అన్నాదు లనుప్రయుక్తము లైనపుడు వ్యతిరేకార్థమును మాత్రము సూచించును. వినయగౌరవపూర్వకతిరస్కారములం దివి చేర్పఁబడును. అన్నాదులు సంధి. సూ ౩ చూడుము.

సూ॥ ౫౧. అనాద్యంబును నసంయుక్తంబును నగు గకారమునకు నొకానొకచో వకారంబగు.

ఉ. వేగి - వేవి; అలిగె - అలివె; తగులు - తవులు; నగళ్లు - నవళ్లు. అనాద్యము అనఁగా శబ్దమునకు మొదటి యక్షరము గానిది. అసంయుక్తము= ద్విత్వాక్షరము గాని సంయుక్తాక్షరము గాని కానిది. ముగ్గురు - ముప్వురు. ఇచట ద్విత్వంబైన 'గ్గు'నకు 'వ్వు' రాలేదు. మూగురు - మూవురు - ముప్వురు అని యయ్యెను. ఇర్వురు ఇది ఇర్గురు'లోని గకారమునకు వకారము రాలేదు. ఇరుగురు - ఇరువురు - ఇర్వురు అని యయ్యెను. ఒకానొకచో నన్నందున రేగు - బాగు - వాగు - ఓగు - లాగు - సాగు, ఇత్యాదులందులేదు. బిందుపూర్వక గకారంబునకు వకారంబు రాదనుట సరిగాదు. ఉ. మెసఁగు - మెసవు; మలుఁగు - మలువు; మడుఁగు - మడువు; తీఁగె - తీవ; నిసుఁగు - నిసువు; విసుఁగు - విసువు; వేసఁగి-వేసవి; మూఁగ-మూవ; లోనైనవి. "వెస న్వెసింగి పోవు సిగ్గు వీసమంతలేదు." విప్రనారాయణ చరిత్రము. ౪. అ.

---

## ఔపవిభక్తిక ప్రకరణము.

ఉపవిభక్తులంగూర్చి తెలుపుప్రకరణ
మౌపవిభక్తిక ప్రకరణము.

**సూ॥ ౯౨. ఉపవిభక్తు లనఁగాఁ గొన్ని నామంబుల యేకవచనవిభక్తులకు ముందుగ వచ్చునట్టి ప్రత్యయములు.**

ఇవి ఇ - టి - ంటి - తి యను వర్ణకములు. ఉదా. కాలు దీనికిఁ దృతీయావిభక్తి 'చేత' చేర్పఁగాఁ 'గాలుచేత' నని కావలసియుండఁగా కాలు+ఇ+చేత = కాలిచేత ననియగు. ఇట్లు,

కూడు+కుండ = కూటికుండ. కన్ను+నీరు = కంటినీరు.

అఱు + ను = అఱి+ని+ను. అఱుతిను = అఱుతిని = అర్తిని.

**సూ॥ ౯౩. ఊరు మొదలగు వాని కిత్వంబగు.**

ఊరు మొదలగు శబ్దములకు ఇవర్ణము వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఊరు | ఊరికి. | మ్రాను | మ్రానికి. |
| తేరు | తేరి కుందుకు. | మేను | మేనికి. |
| పేరు | పేరికి. | గవను | గవనికి. |
| నోరు | నోరికి. | కొలను | కొలనికి. |
| నగరు | నగరికి. | కలను | కలనికి. |
| చోటు | చోటికి. | వలను | వలనికి. |
| చేను | చేనికి. | | |

ఒడలు = ఒడలికి. లోను = లోనికి.

కాలు = కాలికి.

వ్రేలు = వ్రేలికి.

పాలు = పాలికి. (భాగము)

ప్రోలు = ప్రోలికి.

మఱందలు = మఱందలికి.

ఆలు - ఇల్లాలు - చెల్లెలు - ప్రోయాలు - కోడలు మొదలైనవి.

## టి

సూ॥ ౭౪. టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంత్యాగమంబును, గొన్నింటికిం బర్యాయంబు రెండును బ్రాయికంబుగ నగు.

'టి' యను ఉపవిభక్తి కొన్ని శబ్దముల కడపటి యక్షరంబునకు ఆదేశముగ వచ్చును. కొన్ని శబ్దముల కడపట ఆగమముగా వచ్చును. కొన్ని శబ్దంబులకు ఆదేశముగను ఆగమముగను గూడ వచ్చును.

కడపటి యక్షరమునకు ఆదేశముగ 'టి' వచ్చుటకు ఉదా. త్రాడు-త్రాటిని. ఇందు 'డు' బదులుగ ఆదేశముగ 'టి' వచ్చి త్రాటి యని యయి తత్సమపరిచ్ఛేదము ౪౩-వ సూ. ప్రకారము 'త్రాటిని' నయ్యె.

| | | | |
|---|---|---|---|
| కాఁడు | కాటిని. | గూఁడు | గూఁటికి. |
| నోరు | నోటిని. | పురుడు | పురిటికి |
| ఏఱు | ఏటిని | అంబలి | అంబటికి. |
| సుదురు | సుదుటికి. | కొడవలి | కొడవటికి. |
| గోరు | గోటికి. | రోఁకలి | రోఁకటికి. |
| అంగిలి | అంగిటికి. | గొడ్డలి | గొడ్డటికి. |
| నాఁగలి | నాఁగటికి. | కుందేలు | కుందేటికి. |
| లోఁగిలి | లోఁగిటికి. | తాఁబేలు | తాఁబేటికి |
| చెక్కిలి | చెక్కిటికి. | ఆగమముగ | 'టి' వచ్చుటకుదాహరణములు. |
| నాఁడు | నాఁటికి. | అన్ని | అన్నిటిని. |
| కూడు | కూటికి. | ఎన్ని | ఎన్నిటిని. |
| ఏఁడు | ఏఁటికి. | కొన్ని | కొన్నిటిని. |
| తిరుగలి | తిరుగటికి. | ఎనిమిది | ఎనిమిదిటిని. |
| ఆఁకలి | ఆఁకటికి. | నాలుగు | నాలుగిటిని. |
| దోసిలి | దోసిటికి. | వేయి | వేయిటిని. |
| ఱోలు | ఱోటికి. | తొల్లి | తొల్లిటికి |
| పెరడు | పెరటికి. | కాడ్డు | కాటికి. |

ఆదేశముగను ఆగమముగను వచ్చుట కుదాహరణములు.

| | ఆదేశము | ఆగమము. |
|---|---|---|
| ఏమి | ఏటికి | ఏమిటికి. |
| మూఁడు | మూఁటికి | మూఁడిటికి |
| రెండు | రెంటికి | రెండిటికి. |
| మొదలు | మొదటినుండి | మొదలిటినుండి. |

| | | |
|---|---|---|
| పగలు | పగటికి | పగలిటికి. |
| నూఁడు | నూటికి | నూఱిటికి. |

ఇత్యాదులు.

నీరు శబ్దమునకు ఇకారము టికారము రెండును వచ్చును. నీరిలోన - నీటియందు. నీరిలోనఁ బోఁచు బింబము. నీటఁ బుట్టినవాఁడు.

ంటి

సూ॥ ౭౫. హ్రస్వముమీఁది 'టి' వర్ణమునకు ముందు పూర్ణబిందువు బహుళంబుగా నగు.

మీఁది సూత్రముల కుదాహరణములుగ నీయఁబడిన శబ్దములందు 'టి' వర్ణము కొన్నిచోటుల హ్రస్వమునకుఁ బరముగనున్నది. కొన్ని చోటుల దీర్ఘమునకుఁ బరముగనున్నది. ఉ. అన్ని - అన్నిటికి. ఇచ్చట 'న్ని' హ్రస్వము ఏమి - ఏటికి. ఇచ్చట 'ఏ' దీర్ఘము.

దీర్ఘాక్షరమునకుఁ బరముగనుండు 'టి' వర్ణమునకు ముందు నిండుసున్న రాదు అనఁగా 'ంటి' రాదని యర్థము. హ్రస్వాక్షరమునకుఁ బరమైన 'టి'కి ముందు కొన్నిశబ్దంబులలో నిండుసున్న వచ్చును. కొన్నిచోటుల రాదు.

| | | |
|---|---|---|
| అన్నిటికి | అన్నింటికి | ఇచ్చట నిండుసున్న వచ్చినది. |
| వేయిటికి | వేయింటికి. | |
| తొల్లిటికి | తొల్లింటికి. | |

మొదటినుండి ఇది మొదంటినుండి యనికాదు.

మొదలిటినుండి మొదలింటినుండి యని యగు.

నుదుటికి - అంగిటికి - అంబటికి - పగటికి ఇత్యాదులందు నిండుసున్న రాదు.

ఈ సూత్రము నిండుసున్న విధించునేకాని యరసున్న విధింపదు. కావున అన్నిఁటికి కొన్నిఁటికి నని వ్రాయుట తప్పు.

**సూ॥ ౬౬. పదాద్యంబగు హ్రస్వంబుమీఁది 'టి' వర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు.**

పదముయొక్క మొదటియక్షరము హ్రస్వముగానుండి యాపద మాపవిభక్తికాంతమైనయెడల 'ంటి'యే వచ్చును. ఉ.

| | | | |
|---|---|---|---|
| కన్ను | కంటిని. | విల్లు | వింటిని |
| మిన్ను | మింటిని. | ఇల్లు | ఇంటిని. |
| మన్ను | మంటిని. | పల్లు | పంటిని. |
| చన్ను | చంటిని. | ముల్లు | ముంటిని. |

తి.

**సూ॥ ౬౭. అఱ్ఱు మొదలగు శబ్దముల తివర్ణం బంతాగమంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు.**

అఱ్ఱు మొదలగు శబ్దము లనఁగా అఱ్ఱు-కఱ్ఱు-కొఱ్ఱు-గొఱ్ఱు-మిఱ్ఱు-వఱ్ఱు-పఱ్ఱు లోనగు ద్విత్వ శకటరేఫములు కడపటఁ గల శబ్దములు వీనికి నౌపవిభక్తికమైన 'తి' ఆగమముగఁ గడపట వచ్చును. అఱ్ఱుతి. 'తి' ఆగమముగ రాఁగానే 'ఱు' లోని యొక రేఫము లోపించి 'ఱు' యని మాత్ర ముండి 'అఱుతి' యని యగు. ఇది ఇకారాంతము గనుక ద్వితీయావిభక్తి ప్రత్యయము 'ని' వచ్చును రాఁగా అఱుతిని యయి యీ ప్రకరణము సూ. ౬౯ ప్రకారము అటితిని యగు. ఇది 'అర్తిని' నని యు నగు. తాటిపఱ్ఱు తాటిపర్తిని.

**సూ॥ ౬౮. విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణం బగు**

ప్రత్యయము పరమైనపుడు గోయి మొదలగు శబ్దములందుఁ గడపట నుండు యి మొదలగు నక్షరములు 'తి'గా మాఱును.

గోయి దీనికి బహువచన ప్రత్యయము 'లు' చేర్పఁగా 'గోయిలు' అని యయి యీ సూత్ర ప్రకారము 'యి' 'తి' కాఁగా 'గోతిలు' అయి తత్సమ

పరిచ్ఛేదము ౧౬-వ సూత్రప్రకారము 'గోతులు' అని యయ్యెను. ఇట్లు గోతిని - గోతులను అనియు నగు.

గోయి - చేయి - దాయి - నూయి - నేయి - వాయి - రోయి. ఇవి గోయి ప్రభృతులు.

జాయి అనుదానికి ద్వితీయాది ప్రత్యయములు పరమైనప్పుడు తి వచ్చును. ఉ. జాతిని - జాతిచేత.

చేఁదుశబ్దము సమాసంబున చేఁతి యని యగును. ఉ. చేఁతివేము. శాగ.

సూ॥ ౬౯. టి తివర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు

అనఁగా ఔపవిభక్తికాంతములై ఉకారాంతములైన శబ్దములకు టి - తి - వర్ణంబులు పరంబులయినపుడు ఉకారము ఇకారముగ మారును.

రెండు ఇది అకారాంతము. దీనికి 'టి' పరముకాఁగా రెండుటి అనియగు 'డు' 'డి' యగు రెండిటి. షష్ఠీవిభక్తియందు రెండిటికి; ద్వితీ. రంటిని.

ఇట్లు మూఁడిటికి - నాలుఁగిటికి - ఐదిటికి - ఆఱిటికి - ఏడిటికి - పది టికి - మొదలిటికి - పెక్కిటికి - ప్రొద్దిటికి. తివర్ణమునకు 'అట్లు మొదలగు' మీఁది సూత్రము చూడుఁడు. కొన్నియెడల నుత్వంబున కిత్వంబు లేదు. కుడు టికి - నుసుటికి - నెత్తుటికి.

సూ॥ ౭౦. టివర్ణంబు పరంబగునపుడు క్రిందు-మీఁదు - ముందు-పు వర్ణంబుల యుత్వంబున కత్వం బగు

| | | | |
|---|---|---|---|
| క్రిందు | క్రిందటిని. | మాపు | మాపటికి. |
| మీఁదు | మీఁదటిని | రేపు | రేపటికి. |
| ముందు | ముందటిని. | అప్పుడు | అప్పటికి. |
| | | ఇప్పుడు | ఇప్పటికి. |
| | | ఎప్పుడు | ఎప్పటికి. |

పై శబ్దంబులందలి ఉకారాంతములైన దు - పు వర్ణంబులు అకారాంతములై ద - ప లయ్యెను.

సూ॥ ౭౧. ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు.

ఔపవిభక్తికములకుఁ దృతీయావిభక్తియొక్క యర్థమందును సప్తమీవిభక్తి యర్థమందును ఆ విభక్తుల ప్రత్యయములకు మాఱుగా అకారము బహుళముగా వచ్చును.

గోరు తృ. గోరుచేతను 'చేత' కుమాఱు 'అ' కారము రాఁగా గోరు + అను = గోరను గీఱెను.

ఊరు. సప్త. ఊరు + అందును = ఊరు + అను = ఊరను. బహుళమనుటచే గోరచేత, ఊరియందు నిత్యాది రూపములు నగు. ఇట్లు గొడ్డటనఱికెను. ఇంటలేఁడు - మంటఁగలిసె - వఱుతఁబోయె - కఱుతఁబొడిచె - కంటఁ జూచె - మింటనుండె - కేలఁదాఁకె లోనైనవి.

'కొఱఁతం బడుం గుకవి' యను మనుచరిత్ర ప్రయోగసాధుత్వము చింత్యము.

## కారక పరిచ్ఛేదము.

సూ॥ ౧. వాక్యంబునఁ గర్తకుఁ గ్రియకుఁ గల యన్వయ సంబంధమును దెలుపునది కారకము * ఇది కర్త - కర్మము - కరణము-సంప్రదానము-అపాదానము- అధికరణము అని యాఱు విధములు.

### ప్రథమావిభక్తి.

సూ॥ ౨. ప్రాతిపదికార్థ, పరిమాణ, సంబోధ, నోక్తార్థంబులం బ్రథమ యగు.

ప్రాతిపదికార్థము. ఉ. కృష్ణుఁడు - గోవిందుఁడు.

పరిమాణార్థము. ఉ. చెట్లకు నీళ్లు రెండు కడవలు పోయుము. రెండు కడవలకొలఁత గల నీళ్లని యర్థము కావునఁ గడవలు అను పదము ప్రథమ యందున్నది.

సంబోధనము. ఉ. ఓరాముఁడ - ఓకృష్ణుఁడ.

ఉక్తార్థము. ఉ. రాముఁడు విల్లు విఱిచెను.

క్రియ నుద్దేశించి ఎవఁడు-ఏది యను ప్రశ్నము వేయఁగాఁ బ్రత్యుత్తర మేది యగునో దాని బోధించుశబ్దము ప్రథమావిభక్తి యందుండును. రాముఁడు విల్లు విఱిచెను - విఱిచెను క్రియ. విఱుచు అను కార్యము చేసినవాఁ డెవఁడను ప్రశ్నమునకు రాముఁడు అని ప్రత్యుత్తరము కాన రాముఁడు అను పదము ప్రథమావిభక్తియం దున్నది.

---

*"Karaka is the name given to the relation subsisting between a noun and a verb in a sentence."

సూ॥ 3. కాలాధ్వములకుఁ దఱచుగఁ బ్రథమ యగు.

ఉ. నిన్నరాత్రి నేను మేలుకొని యుంటిని. రాత్రి. (కాలము) ప్రథమ. వాఁడు పది పరుగులు నడచెను. పరుగులు. (దూరము) ప్రథమ.

ఇచ్చట అధ్వ మనఁగా దూరము. తఱచుగ ననుటచేఁ బ్రాప్తస మేలు కాంచి. ఇత్యాదులు గలవు.

సూ॥ ४. కర్మంబున ద్వితీయ.*

ఎవనిని, దేనిని, అను ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తర మేది యో దానిని బోధించునది ద్వితీయావిభక్తియం దుండును.

ఉ. సజ్జనుని శుభములు పొందును. ఎవనిని బొందును? అను ప్రశ్నకు 'సజ్జనుని' నని ప్రత్యుత్తరము. కావున నది ద్వితీయావిభక్తియం దున్నది.

సూ॥ ౫. కర్మప్రవచనీ యోద్దేశార్థంబుల ద్వితీయకుఁ గూర్చి-గుఱిచి-గుఱించు లగు

కర్మప్రవచనీయము. ఉ. దైవముగుఱించి జపము. ఉద్దేశార్థము. ఉ. జ్ఞానముగుఱించి విద్య - కాశిం గూర్చి ప్రయాణము - మోక్షముఁ గుఱించి ప్రయత్నము. ఉద్దేశ ద్వితీయకు కొఱకు - కై - కు - వర్ణకంబులు నగు. కాశికిఁ బ్రయాణము. మోక్షము కొఱకుఁ (కై) బ్రయత్నము.

## తృతీయావిభక్తి.

సూ॥ ౬. కర్తృ, కరణ, హేతు, ప్రకృతి, గోత్ర, గ్రహ్యా దులకుం జేత యగు.

---

*"The accusative denotes the object *i.e.* the person or thing upon whom or which the effect of an action takes place."

కర్త కార్యముఁ జేయువాఁడు. (Agent or doer of an action) ఉ. దుర్జనులచే సజ్జను లవమానింపఁబడుదురు. ఇచటఁ గార్య మవమానించుట దానిని జేయువారు దుర్జనులు. కావున నాపదమునకుఁ జేత యను ప్రత్యయము చేర్పఁబడియె. కర్మణిప్రయోగమునందే కర్తృవాచకమునకుఁ జేతకా-చే నగు.

కరణము = కార్యముఁ జేయుటయం దుపయోగపడు సాధనము లేక యుపాయము (the instrument or means by which an action is done) ఉ. రామునిచే బాణముచే వాలి చంపఁబడియె. చంపుటయం దుపయోగపడిన సాధనము బాణము. కావున దానికిఁ జేఁ జేర్పఁబడియె. (చేత - తోడలలోఁ గడపటి యక్షరము పోఁగా మిగిలినవి చే - తో యను ప్రత్యయములు).

హేతువు ఉ. భక్తిచేత మోక్షంబు గలుగు. మోక్షము గలుగుటకు భక్తి హేతువు గాన దానికిఁ జేతఁ జేర్పఁబడియె.

ప్రకృతి = స్వభావము (nature) ఉ. వాఁడు స్వభావముచేత మంచివాఁడు.

గోత్రము = కులము. ఉ. వాఁడు కులముచే బ్రాహ్మణుఁడు.

గ్రహ్యాది = గ్రహించుట మొదలైనవి. ఉ. రాముఁడు దేవతలచే మొక్కులు గొనియె. ఈ విషయము నాగడుచే వింటిని. వాఁడు జనులచేత నే తాపసుఁ డని తోఁచెడి. వాఁడు స్వతేజముచే సూర్యతేజమును మ్రింగు చున్నాఁడు. ఈ చేతకు వలన వర్ణకంబును నగు.

సూ॥ ౭. కరణ సహార్థంబులం దృతీయకుఁ దోడ వర్ణకం బగు.

కరణము. ఉ. కత్తితో నఱకెను.

సహార్థము. (సహ = కూడ) ఉ. రాముఁడు కపులతో లంక కేగెను.

సూ॥ ౮. తుల్యార్థయోగంబునను, 'అను' లోనగు ధాతువుల యముఖ్యకర్మంబునకును బ్రాయికంబుగ 'తోడ' 'కు' వర్ణకంబు లగు.

ఉ. తుల్యార్థయోగము (తుల్యము = సమానము.) ఉ. గుణమున రామునితో సముఁడు భరతుఁడు. గుణమున రామునకు సముఁడు భరతుఁడు.

'అను' లోనగు ధాతువు లనఁగా అనుట - చెప్పుట యీ యర్థము గల ధాతువు లనియర్థము. ఉ. రాముఁడు సీతతో నిట్లనియె. ఇచట 'అనియె' నను క్రియకు 'ఇట్లు' ముఖ్యకర్మము, 'సీత' అముఖ్యకర్మము (Indirect object) కావున 'సీత' యను శబ్దమునకు 'తోడ' కాని 'కు' గాని చేర్చవచ్చును.

ప్రాయికముగ ననుటచే "సీతం బలికెన్" అనియుఁ జెప్పవచ్చును.

సూ॥ ౯. చేసి - చేతవిభక్త్యర్థ కావ్యయంబు. అది తత్ప్రాగ్వ్యయార్థకవర్ణకంబులకును' వెలసకుఁ బఱచుగ ననుప్రయుక్తమగు.

ఉ. విప్రసంబోధనఁజేసి=సంబోధనను + చేసి. సంబోధనను అనఁగా సంబోధనచేత నని యర్థము కావునఁ దృతీయార్థమునందు ద్వితీయ. దీనికిఁ జేసి యను ప్రయుక్త మయ్యె. నీ యుపదేశముం జేసి అనఁగా ఉపదేశము చేత నని యర్థము. ధర్మతనూభవువలనఁ జేసి. ఇత్యాదులు. చేత విభక్తియొక్క యర్థమున వచ్చు 'చేసి' యనునది క్త్వార్థకము గాదనియు నవ్యయమనియుఁ దెలియవలయును.

సూ॥ ౧౦. యుక్త్యర్థంబునఁ దోడకుఁ దోడుతయు నగు.

ఉ. భయముతోడుత - వినయముతోడుత. (యుక్తి = కూడిక.)

సూ॥ ౧౧. ఉపయోగంబునం దాఖ్యాతకుఁ దృతీయా పలన లగు.

ఉ. మామగవారు ద్రోణాచార్యుచే విద్య నభ్యసించిరి. కుశలవులు వాల్మీకులతో రామాయణముఁ బఠించిరి. వానివలన నేను విద్య గ్రహించితి.

ఆఖ్యాత = నియమముతో విద్య నేర్పువాఁడు.

ఉపయోగము = నియమముతో విద్యగ్రహించుట.

సూ॥ ౧౨. అచేతనంబులమీఁది తోడకు మై మెయి లు విభాష నగు.

ఉ. రయముమై - ఆసమెయి.

సూ॥ ౧౩. సంప్రదానంబునకుం జతుర్థీ - కుషష్ఠు లగు.

ఇచ్చుధాతువున కముఖ్యకర్మమునకును ఎవనిని లేక, దేని నుద్దేశించి యీయఁబడుచున్నదో వానిని లేక, దానిని బోధించుపదమునకు చతుర్థీ విభక్తి ప్రత్యయములుగాని, షష్ఠి 'కు' వర్ణకముగాని వచ్చును. ఉ. విష్ణుఁడు దేవతలకొఱకు నమృతము పంచి యిచ్చెను. దేవతలకు నని యైనను జెప్ప వచ్చును. రాముఁడు విభీషణున కభయ మిచ్చెను.

ఉద్దేశమాత్రమునకు ఉ. ఋషులు మోక్షము కొఱకు యత్నింతురు.

సూ॥ ౧౪. హేతుప్రయోగంబునఁ జతుర్థీ, కుషష్ఠు లగు.

ఉ. అన్నముకొఱకుఁ గాచియున్నాఁడు. కాచియుండుటకు అన్నము హేతువు. ఎవ్వనికొఱ కవతార మెత్తితివి. జ్ఞానముకొఱకు హరి సేవ్యుఁడు. గుడ్డకు యాచించెను.

కొఱకు ప్రత్యయార్థంబునఁ బొంటెయు నగు. ఉ. జగములు రక్షించు పొంటె=రక్షించుకొఱకు.

## పంచమీవిభక్తి, వలన.

సూ॥ ౧౫. అపాయ, జుగుప్సా, విరామ, ప్రమాద, గ్రహణ, భీ, త్రాణ, జన్మ, పరాజ, యాంతర్ధి, వారణ, హేతు వులందు వలన వర్ణకం బగు.

ఉ. అపాయము = ఎడఁబాటు. (Motion away from) దీనికే అపాదాన మనిపేరు. ఉ. దేశమువలన వెడలె. అనఁగా దేశమును వదలి పోయెను.

జుగుప్స = రోఁత (hatred) ఉ. పాపమువలన నేవగించె.

విరామము = చాలించుట (To desist) ఉ. శుభకర్మంబులవలన విరమింపరాదు.

ప్రమాదము = హెచ్చరిక తప్పుట (To be careless about) ఉ. సత్యమువలనఁ బ్రమాదపడరాదు.

గ్రహణము = ఇంద్రియాదులచే గ్రహించుట. ఉ. పాపులు లోకుల వలన లంచము గ్రహింతురు.

భీ = భయము (fear) ఉ. చోరునివలన భయపడియె.

త్రాణము = కాపాడుట (Protection from) ఉ. కొంచెము ధర్మమైనను గొప్ప భయమువలన రక్షించును.

జన్మము = పుట్టుక ఉ. దితివలన దైత్యులు జన్మించిరి.

పరాజయము = గాసి - శ్రమము. ఉ. చదువువలన గాసిపడియె.
(శ్రమము కలిగించునది యేదియో దానికి 'వలన' చేర్పవలయును.)

అంతర్ధి = డాఁగుట. ఉ. కృష్ణుఁడు తల్లివలన డాఁగె.

(When the concealment is to be had recourse to, that whose sight is desired to be avoided is put in the Ablat.ve )

వారణము = అడ్డగింత. ఉ. పాపమువలన వారించె.

హేతువు - ఉ. జ్ఞానమువలన ముక్తుఁ డనఁబడును. ఈ 'వలన'కు కొండొకచో 'ను' వర్ణకం బగు. ఈ 'వలన'కు ఉండి యు నగు.

ఉండి.

సూ॥ ౧౬. అధ్వ కాల నిర్మాణంబుల నుండి యగు.

అధ్వ మనఁగా దూరము. ఒక స్థలమునకు మఱియొకస్థలమునకుఁ గల దూరము చెప్పవలసివచ్చినపుడును, ఒక కాలమునుండి మఱియొక కాలమునకుఁ గలవిశేషము చెప్పవలసి వచ్చినపుడును 'ఉండి' యగును. ఉ. ఆ యూరి నుండి యీ యూరికి నొక యామడ. చైత్రమునుండి ఫాల్గునమువఱకు సంద్రెండు నెలలు. (ఈ 'ఉండి' ప్రత్యయ మవ్యయ మనియు క్త్వార్థ కము కాదనియు నెఱుంగునది.)

ఆది ప్రభృతులకు 'ఉండి' యగు. ఉ. ఆదినుండి - మొదటి నుండి - వెలినుండి - వెలుపలనుండి - పైనుండి - క్రిందనుండి - అంతనుండి - ఎంనుండి - అందుండి కడనుండి ఇత్యాది.

సూ॥ ౧౭. వలన - న - లకు 'నుండి' యనుప్రయుక్తంబు లగు.

ఉ. పాలసంద్రమువలననుండి యమృతము జన్మించె. ఆకాశంబుననుండి గంగ డిగియె.

సూ॥ ౧౮. ఉండిశబ్దము పరంబగునపుడు 'వలన' కు షష్ఠీయూస్తము లాదేశంబు లగు. అగుచోఁ గొండొక యెడ నుండి కి లోపంబును నగు.

ఉ. కాశినుండి వచ్చితి. కాశియందుండి వచ్చితి. కంటినుండి నీళ్లు కాఱెను. కంటనుండి నీళ్లు కాఱెను.

ఉండి లోపమునకు ఉ. గర్భముక్ వెలువడును. కంటి నీళ్లుగారెను. నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె ననుచోట నుండి లోపించె. కంటినుండి- ఇంటినుంచి - నాటినుంచి ఇట్టివి గ్రామ్యరూపంబులు.

## కంటె - షష్ఠి.

సూ॥ ౧౯. అన్య, దూర, సమీపే, తరోత్తరాద్యర్థయోగంబునఁ గంటె-కు వర్ణకంబు లగు.

ఉ. రామునకంటె నన్యుఁడు దయాళుం డెవండు. వానికంటె నేఁడు మంచివాఁడు. రామేశ్వరమునకంటెఁ గాశి దూరము. కాశికంటె రామేశ్వరము దగ్గఱ. దానికంటె నితరము. కాశికంటె హిమవంత ముత్తరము. రామేశ్వరమునకంటె సింహాళము దక్షిణము. రామున కన్యుండు దయాళుండెవఁడు? ఇత్యాదులు.

సూ॥ ౨౦. కంటె వర్ణకంబు నిర్ధారణంబున నగు.

ఉ. శ్రేష్ఠగుణముగలవానిని బోల్చునపుడు 'కంటె' నుపయోగింపఁబడును. నూఱశ్వమేధములకంటె సత్యము శ్రేయము. దొంగిలించి పరమాన్నము తినుటకంటెఁ గష్టించి కలిత్రాగుట మేలు. చదువకుండుటకంటెఁ జదివి మఱచుట మేలు

'కంటె'కు మాఱు 'కన్న'యు నగు.

సూ॥ ౨౧. హేతువు లగు గుణక్రియలకు, ననన్తర క్రియలమీఁదను షష్ఠివర్ణకం బగు.

ఉ. విద్యనుబట్టి గౌరవము కలుగును. నీవు ప్రత్యక్షమగుటంబట్టి నాజన్మ మీడేరె. ఇచట 'పట్టికి' 'వలన'యుఁ గలుగు. విద్యవలన గౌరవము కలుగును. నీవు ప్రత్యక్ష మగుటవలన నాజన్మ మీడేరె.

అనన్వితక్రియకు. ఉ. నీవు గలుగంగఁబట్టి నే నీయుప్పు దప్పించుకొంటిని. నీవు గలుగుటఁబట్టి నే నీముప్పు తప్పించుకొంటిని.

షష్ఠి.

సూ॥ ౨౨. సంబంధంబున షష్ఠిని యొక్క కు లగు.

ఉ. మాయొక్క యిష్టదైవము రాములు. మాకు నిష్టదైవము రాములు.

శాబరయొక్క చదువు. ఇట్టిచోట్ల 'కు' వర్ణకంబు రాదు. ఈ యొక్కకు లోపంబు వైకల్పికంబు. మాయింటివేల్పు వేంకటేశ్వరులు.

సూ॥ ౨౩. నామంబులకుఁ గాలావధియందు 'కి-కు' వర్ణకంబు లగు.

ఉ. కాలపద్దికి. ఉ. నీవు పదినాళ్లకు రమ్ము. నీ వేఁడాదికి రమ్ము, కాలావధి = గడువు.

సూ॥ ౨౪. వ్యస్తంబైన కర్తృపదప్రథమకు సమాసంబున యొక్క షష్ఠి యగు. అది యొకచో వ్యవహితంబును నగు. ఇట యొక్క కు లోపంబు నిత్యంబు.

ఉ. నేను పఠించిన వేదములు. ఇచ్చోటఁ బఠించిన యను క్రియకు 'నేను' కర్త ప్రథమావిభక్తి. దీనిని సమాసముగ వ్రాయునప్పుడీ కర్తృపదమునకు దాని షష్ఠీవిభక్తిరూపము వచ్చును. 'నేను' అనుదాని షష్ఠీవిభక్తిరూపము 'నాయొక్క' కాఁబట్టి 'నేను పఠించిన వేదములు' అనునది 'నాయొక్క పఠించినవేదములు' అయ్యెను. యొక్క కు లోపము రాఁగా 'నాపఠించిన వేదములు' అయ్యెను. "నీ విష్ణుఁ డొనర్పంబూనిన కృతి." ఇది 'నీ యొక్క డొనర్పం బూనిన కృతి' యని యగును. ఇందు "పూనిన" యను క్రియకును దీనికిఁ

కర్తృపదమైన 'నీవు' యొక్క షష్ఠీవిభక్తిరూపమైన 'నీ' అనుపదమునకు నడుమ 'ఇష్టు డోనెస్ట్' అనుపదము లున్నవి. ఇంగు ''ఒనస్ట్'' అనునది మాత్రము 'పూనిన' అనుదానికి విశేషణము. ఇట్లు 'భీష్మ కొనిపోయిన' లోనైనవి. సమాసముగఁ గాక వేఱు వేఱుగ వ్రాసిన పదంబులు వ్యస్తములు. వ్యవహితము = నడుమ నితరపదములు వచ్చుటచే నెడమైనవి.

సూ॥ ౨౫. నిర్ధారణమందు లోపల అందు వర్ణకంబు లగు.

నిర్ధారణ మనఁగా నేకవిధమైన జాతి గుణము క్రియగల గుంపునుండి వేఱుపఱుచుట. అట్లు నిర్ధారణము చేయునప్పుడు షష్ఠిని 'లోపల' సప్తమిని 'అందు' వర్ణకంబు లగు. ఉ. విలుకాండ్రలో రాముఁడు మేటి. విలుకాండ్రయందు రాముఁడు మేటి. దయావతులలో సీత మిన్న. దయావతులయందు సీత మిన్న. సంస్కృతసమాసంబున నిర్ధారణమందు షష్ఠీసమాసంబు లేదు. ఉ. బుధోత్తముఁడు - బుధులయం దుత్తముఁడనియే విగ్రహము. బుధులలో ననుట సరిగాదు.

సప్తమి.

సూ॥ ౨౬. అధికరణ* దూరాంతికార్థంబుల సప్తమి యగు.

అధికరణ మనఁగా నాధారము. అది మూఁడు విధములు.

(1) ఔపశ్లేషికము. అనఁగా నొకదాని నొకటి నొఱసికొని యుండుట. ఉ. వ్రేళ్లయందు గోళ్లున్నవి.

(2) వైషయికము అనఁగా విషయసంబంధమైనది ఉ. విద్యయం దాసక్తి కలదు.

---

*"The place where an action takes place with refere-nce to the subject or object is called Adhikarana."

(3) అభివ్యాపకము. అనఁగా నంతటవ్యాపించి యుండునది. ఉ. అన్నిటి యందు వాయువుగలదు.

దూరార్థము. ఉ. ఆ పుస్తకము దూరంబుననున్నది. 'దూరమునందు' అనియుఁ జెప్పవచ్చును.

సమీపార్థము. ఉ. ఇది దాపుననున్నది. దాపునందున్నది. వైశాఖ మాసంబున నెండలు మెండు. పూర్వాభాద్రయందు నా జననము.

సూ॥ ౨౭. విశేష్య విశేషణంబులు తుల్యలింగ విభక్తి వచనంబులు.

ఉ. రాముఁడు జగదభిరాముఁడు. త్రైలోక్యమాతను సీతను నమస్కరింతు. చూ. తత్సమపరిచ్ఛేదము. ౪-౫-౬ పుటలు.

సూ॥ ౨౮. స్త్రీసమంబులును, ముువర్ణకాంతంబులును నగు విశేషణంబుల బహువచనంబున కేకవచనంబు బహుళంబుగ నగు.

ఉ. స్త్రీసమము. ఉ. చిగురులు మృదువుగానున్నవి. చిగురులు మృదువులుగా నున్నవి. ముువర్ణకాంతవిశేషణము. ఉ. మనోహర మగువనములు - మనోహరము లగువనములు. మీఁది సూత్రమున కిది యపవాదము.

సూ॥ ౨౯. కొన్నియెడల నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు.

రాముఁడు బ్రహ్మాదులకుఁ బూజ్యుఁడు. బ్రహ్మాదులచేతను బూజ్యుఁడు. నాతో మార్కొనలేరు. నన్ను మార్కొనలేరు. నాకు మార్కొనలేరు. నీకు భక్తుఁడు - నీయందు భక్తుఁడు. రాముఁ డయోధ్యవెడలెను, రాముఁ డయోధ్యను వెడలెను, రాముఁ డయోధ్యనుండి వెడలెను.

వాఁడు పల్లకి దిగెను, వాఁడు పల్లకినుండి దిగెను. నీవు సుఖముండుము, నీవు సుఖముతో నుండుము. లోనైనవి.

సూ॥ 30. ఉపకరణజడంబు తృతీయకు 'న' వర్ణకం బగు.

ఉ. కృష్ణుండు శిశుపాలుని కంఠంబు చక్రంబున ఖండించె. చక్రంబుచే నని యర్థము.

సూ॥ 31. తృతీయాసప్తములకుఁ బ్రాయికంబుగ జడంబులకు ద్వితీయ బహుళంబుగ నగు.

తృతీయకు ద్వితీయ. ఉ. సహోదరోద్యమునుఁ జేసి. ఇంద్రుండు వజ్రాహతి వృత్రుని వధించె. చక్రనాకముల నదరు కీలను. (అజడము.)

సప్తమి ఉ. శిరమును ఐన్నె. అయోధ్యం గల జనులు. మనుజాల జ్ఞాతి యుత్తముండు. బహుళగ్రహణముచే అజడంబులకు సప్తమ్యంతంబులకు ద్వితీయ వచ్చినది యగు. వాఁడు పువులం బూజించె. వాఁ డన్యదేశంబులఁ జరించె.

ప్రాయికమనుటచే నజడంబులందుఁ బ్రయోగవైరళ్యంబు చూపఁబడె.

సూ॥ 32. జడంబును నగు సిద్ధద్వితీయకుం బ్రథమ యగు.

ఉ. వాఁడు వస్త్రములను నేసె, వాఁడు వస్త్రములు నేసె. 'జడంబును' ననుటచేఁ గ్వాచిత్కంబుగ నజడంబు ద్వితీయకుఁ బ్రథమ యగు ఉ. వాఁడు హయంబుఁ బొందుగొనియె, వాఁడు హయంబు నొండు గొనియె. సిద్ధద్వితీయ యనుటచే నితరవిభక్తులకు మాఱుగ వచ్చిన ద్వితీయకుఁ బ్రథమ రాదు.

సూ॥ 33. జడంబైన సప్తమికిఁ బ్రథమ వైకల్పికంబుగ నగు.

ఉ. తీర్థమాడి - పేరోలగంబుండి - ఏకతంబుండి - చిచ్చుఁజొకి.

సూ॥ ౩౭. విధేయవిశేషణంబు ద్వితీయకుఁ బ్రథమయు నగు.

ఉ. రాముఁడు లంకను విభీషణు రాజుగఁ జేసెను. నీవు తగినవారిని మంత్రులుగాఁ జేసితివా? నీవు తగినవారిని మంత్రులఁగాఁ జేసితివా. రాజుగ-మంత్రులుగా ఇట్టివి విధేయవిశేషణములు.

సూ॥ ౩౮. అగ్వాదివ్యవహితావ్యవహితంబు లగు విశేషణంబులకుం బ్రథమ యగు.

అగు - అవు - ఔ - అయిన, ఇవి అగ్వాదులు. ఇవి విశేషణ విశేష్యములకు నడుమువచ్చినను లేక యధ్యాహార్యములైనను విశేష్య మేవిభక్తి నుం డినను విశేషణము ప్రథమావిభక్తి నుండి యుండును. ఇచట నవ్యవహిత మనఁగా నధ్యాహార్యమని యర్థము.

సుగుణాభిరాముఁ డగు రామునకు జోహారు వొనర్చెద.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద. ఇచట విశేష్యము న్యస్తపదము.

పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతు పనుపు } ఇచట విశేష్యము
ప్రార్థివ ప్రాగ్రసరుండగు ధర్మసుతు పనుపు } సమాసాంతర్గతము.

బాహుబలసారఘనుల్ మధుకైటభాదిదైత్య పతుల నెల్లఁ ద్రుళ్లడఁచె. బాహుబలసారఘను లగు మధుకైటభాదిదైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడంచె. తల్లి ద్రౌపదితోడఁ - తల్లి యగు ద్రౌపదితోడఁ. మాతండ్రి పరాశరసుతు చేతఁ-మాతండ్రి యగు పరాశరసుతుచేత. నృపధర్మోదయుఁ డర్జునుతోడను-నృపధర్మోదయుఁ డగు నర్జునుతోడను లోనైనవి.

సూ॥ ౩౬. విశేషణంబు లనేకంబు లున్నచోఁ గడదానికి నగ్వాదులును, తత్పూర్వంబులకు 'అయి' యనుపదంబును నగు. కానిచోఁ బ్రతివిశేషణమున కేని యంత్యవిశేషణంబు మాత్రంబున కేని సముచ్చయార్థంబును వైకల్పికంబుగ నగు.

ఉ. అనఘుఁడు నిశ్చలాత్ముఁడు మహాత్ముఁడగు రామభద్రుని స్మరింతు; అనఘుఁడై నిశ్చలాత్ముఁడై మహాత్ముఁడగు రామభద్రు స్మరింతు; అనఘుఁడును నిశ్చలాత్ముఁడును మహాత్ముఁడు నగు రామభద్రు స్మరింతు; అనఘుఁడు నిశ్చలాత్ముఁడు మహాత్ముఁడు నౌ రఘురాము నెంతు.

సూ॥ ౩౭. భావార్థకాదియోగంబునఁ గర్తకుఁ బ్రథమ యగు.

ఉ. రాముఁడు వచ్చుట. రాముఁడు రాఁగా భరతుండు సంతసించె. రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబు లగు. రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు. వచ్చుట భావార్థకము. ఇట్లు తక్కినవి.

సూ॥ ౩౮. సర్వనామ, సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుఁ బ్రథమ బహుళంబుగా నగు.

ఉ. అన్నిగుఱ్ఱములకు - అన్నింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱము లన్నింటికి - గుఱ్ఱముల కన్నింటికి సాహిణులు మువ్వురు.

రెండు గుఱ్ఱములకు - రెండింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి సాహిణులు నలుగురు. లక్ష గుఱ్ఱములకు - లక్షకు గుఱ్ఱములకు - గుఱ్ఱములు లక్షకు - గుఱ్ఱములకు లక్షకు రవుతులు లక్ష. ఇత్యాదులు.

అన్ని - సర్వనామము. రెండులోనైనవి సంఖ్యను దెలుపునవి.

సూ॥ ౨౯. అస్మచ్ఛబ్ద విశేషణంబులకు ను ము - లును, యుష్మచ్ఛబ్ద విశేషణంబులకు వు రు - లును, నేక బహువచనంబుల నగు. అగుచో ముందున్న 'ఉ' కారంబు 'అ' కారంబగు.

ఉ. అస్మచ్ఛబ్దము 'నేను' అస్మచ్ఛబ్ద విశేషణము, ఉ. మంచివాఁడను.

ఏ. నేను మంచివాఁడను. (మంచివాఁడు + ను = మంచివాఁడ + ను.)

బ. మేము మంచివారము. (మంచివారు + ము = మంచివార + ము.)

యుష్మచ్ఛబ్దము = నీవు.

ఏ. నీవు పుణ్యచరితుఁడవు - మీరు పుణ్యచరితులరు. ఇకారాంతంబులమీఁది ను ము వు లు, ని వి లగు. ఉ. నేను కవిని - నీవు కవివి.

సూ॥ ౩౦. కొన్ని యెడల మధ్యమోత్తమపురుషంబులకుఁ బ్రథమపురుష మగు.

ఉ. పాండు భూవరునకుఁ గోడలైతి. కోడలనైతి. నీవు మంచివాఁడు. నీవు మంచివాఁడవు. మీరు పెద్దలు. మేము పిన్నలు.

సూ॥ ౩౧ సంబోధనంబునను, మధ్యమోత్తమ పురుష 'వు - ను'లు పరంబు లగునపుడును 'అది' కి 'దాన' యాదేశంబగు.

ఓసి పసిదాన! నీవు పసిదానవు - నేను బసిదానను.

సూ॥ ౩౨. అన్య, యుష్మ, దస్మత్తాద్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు.

వాఁడు - నీవు, నేను పదంబులు గాని వీని బహువచనంబులు గాని వీనిలో నేరెండైనను నొక క్రియకుఁ గర్తృపదంబులుగ నైనచో వీనిలో ముం జటి పదంబున కన్నఁ దరువాతిది బలముగలది గావున దాని ననుసరించిరే క్రియ యుండవలయును. అనఁగా వాఁడు నీవు అనునవి యొక వాక్యమునఁ గర్తృపదంబులుగ నున్నయెడలఁ మధ్యమపురుష క్రియ యుండవలెను. 'వాఁడు నేను' కర్తలైనచో నుత్తమపురుష క్రియ యుండవలయును ఇట్లే తక్కినవి

ఉ. వారు మీరు మేము పోవుదుము - వారు మేము పోయెదము. వారు మీరు పోఁడు.

సూ॥ ౮౩. వాక్యంబునఁ బూర్వపరనియమంబు కొన్ని శబ్దంబులకుం దక్కఁ గానరాదు.

ఉ. కొన్ని యనఁగా ఏని - తప్ప - దనుక, ఇత్యాదులు. చూ. వాక్యపరిచ్ఛేదము.

*Vidya Venkata Ramraju.*
AYURVEDA PRACTIONER

---

Vidya Venkata Ramraju
AYURVEDA PRACTIONER

# సమాసపరిచ్ఛేదము.

సూ॥ ౧ ప్రసిద్ధముగ వేఱువేఱగు నర్థంబులుగల పదంబు లేకపదం బగుట సమాసంబు.

(సంధిపరిచ్ఛేదము ౭౫-వ పుట చూడుము)

సూ॥ ౨. భాషాభేదంబు వలన సమాసము మూఁడు విధంబులు.

i. సాంస్కృతికము. ii. ఆచ్ఛికము. iii. మిశ్రము.

సూ॥ 3. i. కేవలసంస్కృతశబ్దంబుల సమాసంబు సాంస్కృతికంబు.

ఇది రెండువిధములు. సిద్ధము - సాధ్యము. సంస్కృతవ్యాకరణ సూత్రముల ననుసరించి కూడినది సిద్ధము. ఉ. రామ+ఆజ్ఞ. = రామాజ్ఞ. కుంతీతనయుఁడు ఇందుఁ గడపటి శబ్దము తత్సమస్వరూపంబు గలదైయుండును.

సూ॥ ౪. తత్సమంబుల సమాసంబు సాధ్యంబు.

ఉ. రాము+ఆజ్ఞ = రామునాజ్ఞ. (చూ. సంధి. ౪౯ సూ.) కుంతితనయుఁడు. (చూ. తత్సమ. 3౯ సూ.) ఇం దన్నిశబ్దంబులు తత్సమస్వరూపంబులు గలవగు.

సూ॥ ౫. తెనుఁగు పదంబుల సమాసం బాచ్ఛికంబు. దీనినే సమాసక మందురు.

ఉ. గొంతికొడుకు; అలరుఁ దేనియ; మ్రానుమానికి (క్రో.తి.)

సూ॥ ౬. తెనుఁగు పదములు సంస్కృతపదములు కలిసి సమాసంబయిన మిశ్రసమాసం బగు.

(మిశ్రము = కలయిక) ఉ. రామునానతి (రాము+నానతి) మంచి వాఁడు. మిశ్రసమాసంబునందు మొదట సంస్కృతశబ్దము ండదు. ఉదాహరండి అనేకమార్గములోనైనవి దుష్టములు.

విభక్తి లోపాలోపములవలన సమాసములు రెండు విధములు.

విభక్తి లోపముగానిది 'అలుక్సమాసము'. విభక్తిలోపించిన 'లుక్సమాసము.' ఉ. కరము + వాఁడి = కరవాఁడి పుట్టము + గోఁచి = పుట్టగోఁచి.

(చూ. సంధి. ౭౭ సూ.) అర్థభేదమువలన సమాసములు నాలుగు విధంబులు.

(1) ద్వంద్వము. (2) తత్పురుషము. (3) బహువ్రీహి. (4) అవ్యయీభావము.

## ద్వంద్వసమాసము.

సూ॥ 2. అనేక సుబంతములు సముచ్చయార్థంబు గలవై సమసించిన ద్వంద్వసమాస మగు. ఇది యుభయపదార్థప్రధానము.*

సుబంతములు (చూ. సంధి. 28 సూ.) అనేకములు = ఒకటికిఁ బైబడినవి. సముచ్చయార్థంబులు గలవై యనఁగా విగ్రహమున సముచ్చయంబులైన 'యు - ను'లు చేర్చుట కవకాశమిచ్చుట గలవి.

ఉభయ పదార్థప్రధానము అనఁగా సమాసమం దున్న యన్నిపదములు ముఖ్యములైన వనుట. ఇట్టి సమాసము ద్వంద్వము. (ద్వంద్వము=జంట.)

ఉ. తల్లిదండ్రులు పూజ్యులు. ఇందుఁ దల్లి తండ్రి యనునవి సుబంతములు (నామవాచకములు) ఒకటికిఁ బైబడి యున్నవి.

---

*"A Dwanda compound consists of two or more nouns which if not compounded, would be connected by the conjections."

విగ్రహమునఁ దల్లియును తండ్రియును అని వ్రాయఁ దగియున్నవి. తల్లియును తండ్రియును ఇద్దఱు పూజ్యులే గనుక నుభయపదార్థ ప్రధానము కావున నిది ద్వంద్వసమాసము. ఇట్టులే కూరగాయలు ఊరువల్లెలు మొదలైనవి, తల్లి + తండ్రి = తల్లిదండ్రులగుటకు సంధి. సూ. ౪౦ చూడుము.

ద్వంద్వము మూఁడు విధములు. i. ఇతరేతర ద్వంద్వము. ii. సమాహారద్వంద్వము. iii. ఏకశేషము.

సూ॥ ౮. ప్రత్యేకాన్వయము గలది యితరేతర ద్వంద్వము.*

ఉ. అన్నదమ్ములు చదువరులు. అనఁగా అన్నయును చదువరి తమ్ముఁడును చదువరి యనునవి సమాసముగఁ గూడిన రెండుపదములు వేర్వేఱ 'చదువరి' శబ్దముతో నన్వయించుచున్నవి. ఇట్లే సీతా రామ లక్ష్మణులు కానలకుఁ బోయిరి.

సూ॥ ౯. సమాసాంత శబ్దలింగమె సమాసంబునకుఁ దద్విశేషణంబునకు నగు.

ఉ. సీతారాములు. ఇచ్చటఁ గడపటిదైన రామశబ్దము పుంలింగము. దాని బహువచనమే సమాసంబున కంతయు నయ్యె. రుక్మిణీ మిత్రవిందలు, ఇందుఁ గడపటి మిత్రవిందశబ్దము స్త్రీవాచకము గాన దాని బహువచనరూపమే సమాసమున కయ్యెను. నలదమయంతు లిద్దఱు గుణప్రభావాదుల ధన్యమానలు-నలదమయంతు లనుసమాసమున 'దమయంతి' యను స్త్రీవాచకశబ్దము

*"When the several members of a Dwanda compound are viewed separately it is called Itaretara Dwanda. In this species each memberis of equal importance *i. e.* has its own independent meaning."

కేషపటు సున్నది. కావున విశేషణము 'బాధ్యమానలు' అని స్త్రీలింగరూపము గలదై యున్నది. (పుంలింగరూపము బాధ్యమానులు.)

## సమాహారద్వంద్వము.

సమాహార మనఁగా సమూహము. ఇందుఁ బ్రత్యేకాన్వయము ముఖ్యముగాదు. సమూహార్థమే ముఖ్యము.

సూ॥ ౧౦. సమాహారద్వంద్వంబు* తెనుఁగునఁ బ్రాయికంబుగ బహువచనము.

ఉ. ఆహార నిద్రాభయములు. ప్రాయికమనుటచే భయభక్తి - హితాహితము - కూడు గూర - దరి దాపు - రేవగలు - కూడు గుడ్డ. ఇత్యాదులు ప్రయోగంబులఁ గలవు. నాకుఁ గూడు గుడ్డయిచ్చి రక్షించుము. అనఁగాఁ గూడు గుడ్డ మాత్రమే గాక ప్రాణము మానము కాపాడుకొనుటకై కావలసినవన్ని యని యర్థము.

## ఏకశేషము.

సూ॥ ౧౧. ఏకవిధరూపములు గల పెక్కు శబ్దములు సమసించునపు డందొక్క శబ్దమునకు మాత్రము బహువచనప్రత్యయం బగు. తక్కినవి లోపించు. దీనికే యేకశేష మనిపేరు.

ఉ. రాముఁడు + రాముఁడు + రాముఁడు. 'రాముఁడు' అను పేళ్లు గలవారు ముగ్గు రున్నప్పు డొక 'రాముఁడు' అనుదానికి మాత్రము

---

*"Samahara Dwanda is that species of Dwanda which implies an aggregate or the things enumerated in which constitute a complex idea. In this species the meaning of the different members is subordinate to the collective sense of the whole compound."

బహువచన ప్రత్యయముఁ జేర్చి తక్కినశబ్దములు లోపింపఁగా 'రాములు' అని యగును. అనేక సుబంతములు లేమి నిది ద్వంద్వంబు గాదండ్రు.

సూ॥ ౧౨. పుంలింగ స్త్రీలింగశబ్దము లేకశేషం బగు చోఁ బుంలింగరూపంబె యగు.

ఉ. శివుఁడు + శివ = శివులు. విటుఁడు + విటి = విటులు. తెనుఁగున 'విటీవిటులు' ఇత్యాది ప్రయోగములు గలవు.

ఇది సరూపైకశేషము - విరూపైకశేషము అని రెండు విధములు.

సూ॥ ౧౩. సమానరూపంబులు గల శబ్దంబుల యేక శేషము సరూపైకశేషము.

ఉ. రాముఁడు + రాముఁడు + రాముఁడు = రాములు.

సూ॥ ౧౪. భిన్నరూపములు గలశబ్దంబుల యేకశేషము విరూపైకశేషము.

ఇవి రెండువిధములు. ఏకార్థవిరూపైక శేషము. ఉ. వక్రదంతుఁడును కుటిలదంతుఁడును వచ్చిరి. ఈ రెండు శబ్దములు వంకరపండ్లు గలవాఁడను నొక యర్థమేగలవి. రూపములు మాత్రము వేఱుగనున్నవి. కావున వక్ర దంతులు వచ్చి రనియైనను కుటిలదంతులు వచ్చిరని యైనను జెప్పవచ్చును. భిన్నార్థవిరూపైక శేషము. ఇందు రూపము - అర్థము రెండును వేఱువేఱుగ నుండును. ఉ.

స్వస + భ్రాత = భ్రాతలు. తోఁబుట్టినది + తోఁబుట్టినవాఁడు.
పిత + మాత = పితలు.
పుత్రి + పుత్రుఁడు = పుత్రులు.

సూ॥ ౧౫. అచ్ఛిక ద్వంద్వంబునఁ బూర్వపదంబు స్త్రీసమం బగు.

ఉ. అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరుపల్లెలు - ఆలుమగలు - కూఁతుగాండ్రు. ఇచ్చట అన్న - తల్లి - ఊరు - ఆలు - కూఁతు స్త్రీసమంబులు. తమ్ముఁడు + అన్న - ఇత్యాదులు సమాసంబుగఁ గూడవు.

సూ॥ ౧౬. ఋకారాంతశబ్దంబులు ద్వంద్వంబగుచోఁ బూర్వపదాంత ఋత్వంబునకు రేఫంబొండె, దీర్ఘంబొండె వైకల్పికంబుగ నగు.

మాతృ - పితృశబ్దములు ఋకారాంతములు. ఇవి ద్వంద్వముగఁ గూడఁగా 'మాత్రపితలు' అనికాని 'మాతాపితలు' అని కాని యగు.

ఋకారాంతశబ్దంబులు ద్వంద్వంబగుచో నన్నందున రామమాంధాతృ రఘుక్షితీశు లన్నప్పుడు మాంధాతృ శబ్దము 'మాంధాత్ర' గా నేరదు.

సూ॥ ౧౭. ద్వంద్వాంతమందలి శబ్దము సమాసమునఁ బ్రతిపదముతో వేఱువేఱుగ సంబంధించి యుండు.

ఉ. కపులనృపులచే = కపులచే + నృపులచే.

కన్నవిన్నది = కన్నది + విన్నది.

వాసరవానరనాథులు = వాసరనాథుఁడు + వానరనాథుఁడు.

పోరాకుండఁగ = పోకుండఁగ + రాకుండఁగ

జారచోరత్వములు = జారత్వము + చోరత్వము.

సూ॥ ౧౮. మహాద్వాచకంబులు ద్వంద్వంబు లగుచోఁ దెనుఁగున నొక్కెడఁ బూర్వపదాంత స్వరంబునకు దీర్ఘంబును నగు.

ఉ. అన్నాదమ్ములు - అప్పాచెల్లెండ్రు - తల్లీదండ్రులు. వాచ్యులు రక్తసంబంధముగలవారైనప్పుడే యీ సూత్రమన్వయించును.

సూ॥ ౧౯. ద్వంద్వకర్మధారంబులఁ బూర్వపదాంత మువర్ణకము లోపించి యొక్కెడ సమసించుటయుఁ గలదు.

చుట్టము+పక్కము = చుట్టపక్కములు, అందము+చందము = అందచందములు. పుట్టము+గోఁచి=పుట్టగోఁచికరము+వాఁడి=కరవాఁడి. ఇట్టివి ప్రయోగంబుల నెఱుంగునది.

## తత్పురుష సమాసము.

### సూ॥ ౨౦. ఉత్తరపదార్థప్రధానము తత్పురుషము.*

రెండు శబ్దములు గల సమాసమున రెండవపదముయొక్క యర్థమే ముఖ్యముగా నున్నయెడల నది తత్పురుషము. ఉ. నల్లగుఱ్ఱము పరువెత్తెను. అనునపుడు పరువెత్తినది గుఱ్ఱమే కాని నల్లన కాదు గనుక ఉత్తరపదమే ప్రధానమైనది. కాఁబట్టి 'నల్లగుఱ్ఱము' తత్పురుష సమాసము.

ఇది i. సమానాధికరణము, ii. వ్యధికరణము, iii. నఞ్, iv. ప్రాది, v. ఉపపదమని ౫ విధంబులు.

## సమానాధికరణము.

సమాన=ఒకటియే యయిన, అధికరణము=ఆధారముఁ గలది. అనఁగా సమాసమందలి రెండు పదముల భావము ఒక శబ్దమునందే నిలిచియుండవలెను. నల్లగుఱ్ఱము - అన్నప్పుడు నల్లఁదనము - గుఱ్ఱపుఁదనము రెండును గుఱ్ఱమునందేయున్నవి. ఈ సమానాధికరణమునకే కర్మధారయ మనియుఁ బేరు. (చూ. మొ. భా. ౭౦-౭౧ పుటలు) సాధారణముగ మొదటిపదము రెండవదానికి విశేషణముగ నుండును.

ఇది విశేషణపూర్వపదము - విశేషణోత్తరపదము - విశేషణోభయపదము - ఉపమానపూర్వపదము - ఉపమానోత్తరపదము - సంభావనాపూర్వ పదము -

---

*When a compound consists of two members and the first determines the sense of the other, that is called Tathpurusha.

అవధారణా పూర్వపదము - మధ్యమపదలోపి - ద్విగువు - మయూరవ్యంసక సమాసము - అని భేదంబులు గలది.

సూ॥ ౨౧. సమానాధికరణమందలి రెండు పదములలో మొదటిపదము విశేషణముగను రెండవది విశేష్యముగనుండిన విశేషణపూర్వపద కర్మధారయము.

ఉ. కఱకు బాణము. ఈ విశేషణము త్రిక - స్త్రీసమ-ముగంత-ధాతుజ విశేషణంబుల నేదేనైయుండు. త్రికపూర్వకము. ఉ. ఈకాలము.

స్త్రీసమములు. ఉ. వేఁడిపాలు - వాఁడిమయూఖములు.

ముగంతము. ఉ. కఠినపుఁ బల్కు.

ధాతుజవిశేషణము=క్రియాజన్యవిశేషణము. వినెడు సభ్యులు.

సూ॥ ౨౨. రెండవపదము విశేషణమైనచో విశేషణోత్తరపద కర్మధారయము.

ఉ. కపోతవృద్ధము. ఇచ్చట విశేషణమైన 'వృద్ధ' శబ్ద ముత్తరపదముగా నున్నది. ఇట్లు తమ్ముఁ గుజ్జుఁడు. చిలుక మొకరి.

సూ॥ ౨౩. ఉభయపదములు విశేషణములైనచో విశేషణోభయపద కర్మధారయము.

ఉ. శీతోష్ణము. కనని వినని విషయము.

సూ॥ ౨౪. ఉపమానము పూర్వపదముగనున్న నుపమానపూర్వపదము.

ఏ వస్తువును గుఱించి మనము మాటలాడుచున్నామో యది యుపమేయము. ఆ వస్తువును నే యితరవస్తువుతో సమానమని పోల్చెదమో యది యుపమానము.

ఒకఁడు తిర్యగ మాటలాడినపుడు ఆ మాటలను గుఱించి చెప్పుట

లోఁ దేనెమాటలు అనినచో 'మాటలు' ఉపమేయము. తేనె యుపమానము. అనఁగా మాటలు తేనెవలెఁ దియ్యగా నున్నవని యర్థము. తేనెవంటిమాటలు అని విగ్రహము. ఇచ్చట నుపమానమైన తేనె యనుమాట ముందుగా నుండుటచే 'తేనెమాటలు' ఉపమానోత్తరపద కర్మధారయము. ఇట్లు చిగురుఁ గేలు - పూవుఁబోఁడి. పూవుఁబోఁడి యిత్యాదులం దుత్తరపదంబు పరుషాది (పోఁడి) యని యెఱుంగునది.

సూ॥ ౨౫. ఉపమాన ముత్తరపదముగాఁ గలది యుపమానోత్తరపద కర్మధారయము.

ఉ. ముఖపద్మము. ఇచ్చట నుపమానమైన పద్మము రెండవపదముగా నున్నది. ఇట్లు మోముఁదమ్మి. దీనినే యుపమిత సమాసమందురు. సింహము - శార్దూలము - నాగము - వ్యాఘ్రము - పుంగవము - ఋక్షము - ఋషభము - కుంజరము - చంద్రుఁడు ఇత్యాదు లుత్తరపదము లైనపుడు శ్రేష్ఠార్థమును దెలుపును. పురుషసింహము - మునికుంజరుఁడు ఇత్యాది. ఇందు సామాన్యధర్మము చెప్పరాదు.

సూ॥ ౨౬. సంభావనాపదము పూర్వమందుఁ గలది సంభావనా పూర్వపద కర్మధారయ మగు.

సంభావన యనఁగా ఊహ, లేక, సంజ్ఞ. ఉ. వేఁపచెట్టు. చెట్ల జాతిలో నొకవిధమైన చెట్టునకు వేము అని పేరుపెట్టఁబడెను. కాఁబట్టి వేము అనఁగానే యాగుణములు గల చెట్టుగదా యని మనస్సునకు స్ఫురించును. అట్లొకపదార్థము గుర్తు తెలియుటకై దాని కుంచఁబడిన పేరే సంజ్ఞ. అది పూర్వపదముగా నుండిన సంభావనా పూర్వపద కర్మధారయము. ఇట్లు చింతచెట్టు - రామరావు - నన్నయభట్టు - కృష్ణశాస్త్రి - రంగమ్మ ఇత్యాది.

సూ॥ ౨౭. అవధారణాపదము పూర్వమందుఁ గలది యవధారణాపూర్వపద కర్మధారయము.

అవధారణ యనఁగా నొకవస్తువును మఱియొకవస్తువుగ నిశ్చయించుట ఉ. అజ్ఞానాంధకారము. అజ్ఞానము - అంధకారము (చీఁకటి) యివివేఱు వేఱువస్తువు లయినను అజ్ఞానమునే చీఁకటిగా నిశ్చయించుటచేత అవధారణాపూర్వపద కర్మధారయము. దీనికి రూపకసమాసమనియుఁ బేరుగలదు. ఇట్లు విద్యాధనము. సంసారసాగరము.

సూ॥ ౨౮. సంఖ్యాపూర్వపదము ద్విగువు.

అనఁగాఁ గర్మధారయ సమాసమందు మొదటిపదము సంఖ్యావాచకముగా నుండిన ద్విగుసమాస మగు. ఉ. మూఁడులోకములు. ఇచట మొదటి పదమైన 'మూఁడు' సంఖ్యావాచకము.

సూ॥ ౨౯. సమాహారద్విగు వేకవచనము.

ఉ. త్రిలోకి=మూఁడులోకముల సమాహారము. (సమూహము) ఇట్లు త్రిభువనము-పంచపాత్రము. త్రిసంధ్యము. తెనుఁగున బహువచనమునఁ బ్రయోగములు గలవు. షష్టిహాయ నద్విరదంబులట్లు.

సూ॥ ౩౦. మిశ్రద్విగువు బహువచనము.

అనఁగా మొదటి సంఖ్యావాచకము తెనుఁగుగాను రెండవశబ్దము తత్సమముగా నుండిన బహువచనమే యగు. ఉ. రెండులోకంబులు - నాలుగు పురుషార్థములు - ముజ్జగములు - ఇత్యాదులు.

ముజ్జగము. ఇచట జగము తద్భవమని యెఱుంగునది. నల్దిక్కు - ముల్లోకము - మువ్వురార్థము అనునవి ప్రౌఢప్రయోగములు.

సూ॥ ౩౧. అచ్ఛద్విగువున కేకవచనంబు ప్రాయికంబు:

ఉ. ముమ్మాఱు - ముప్పొద్దు - ముత్రోవ - ముక్కాలు. ప్రాయికం బనుటచే - నల్గడలు - ఇరుగడలు - ఇరుపరియలు ఇత్యాదులును గలవు.

సూ॥ ౩౨. మిశ్రద్విగువున విశేషణం బేకాంతంబై విశేష్యం బమహాద్వాచకం బైనచో నేకవచనమే యగు.

ఏకాంతము = ఒకటి కడపటఁగలది - పదునొకటి - ఇరువదొక్కటి లోనైనవి. ఉ. ఇరువదియొక్క పుస్తకము. ఇరువదియేడు నక్షత్రములు.

ఇచ్చట విశేషణ మేకాంతముగాదు గనుక విశేష్యము బహువచనమం దున్నది. పుస్తకము తత్సమశబ్దము. సమాసము గానియెడల విశేష్యము పూర్వపదంబై బహువచనంబగు, పుస్తకము లిరువదియొక్కటి. ఇరువది యొకరు భటులు, ఇచ్చట 'భట' శబ్దము మహద్వాచకము గాన బహువచనంబున నున్నది.

సూ॥ ౩౩. సమానాధికరణంబునఁ బూర్వపదంబైన మూఁడుశబ్దములోని డుజ్జునకు లోపంబును ఉత్తరపదాది హల్లునకు ద్విత్వంబును బహుళంబుగ నగు.

ఉ. మూఁడు+మాఱులు = ముమ్మాఱు, మూఁడు+మాఱులు=మూ+మాఱులు = ము + మాఱులు = ము + మ్మాఱులు = (చూ. సూ. ౩౧) ముమ్మాఱు.

సూ॥ ౩౪. త్రికంబున నేదైనఁ గర్మధారయమందుఁ దోలుత నుండెనేని త్రికపూర్వక కర్మధారయ మగు.

ఉ. అచోటు - ఈకాలము - ఏయూరు. ఆ - ఈ - ఏ - లనఁ ద్రిక మనిపేరు.

సూ॥ ౩౫. ద్విత్వహల్లు పరంబగునపుడు పూర్వమం దున్న యాచ్ఛికదీర్ఘంబు హ్రస్వం బగు.

ఉ. మూఁడు+మాఱులు = ము+మ్మాఱు. ఏది - ఎద్ది.

సూ॥ ౩౬. త్రికంబునకు నసంయుక్తంబులును ఋకారంబును నూష్మరేఫేతరంబులు నైన హల్లులు పరంబులైనపుడు వానికి ద్విత్వంబు బహుళంబుగ నగు.

ఉ. ఆదేశము - అద్దేశము; ఈ సెలవు - ఇస్సెలవు; ఏబాలుఁడు - ఎబ్బాలుఁడు - మొదలైనవి. అసంయుక్తము లనుటచే ఆగ్రామము - ఈ ప్రోలు ఇవి అగ్గ్రామము - ఇప్ప్రోలు కానేరవు. "నీ విప్ప్రభావ" మనునది (నీవు+ఈ ప్రభావము) నిర్బంధమువలన నైన యుచ్ఛృంఖలప్రయోగమని యెఱుంగునది. ఆఋషి = అఋఋషి కానేరదు.

ఊష్మరేఫేతరంబు లన్నందున ఊష్మములకు రేఫములకు ద్విత్వము లేదు. అశ్శక్తి - అష్షట్కము - అస్సంతతి - ఇహ్హవిస్సు - అర్రాజు - ఎర్రాయి యిట్టి రూపంబులు లేవు.

బహుళమనుటచేఁ బరంబైన వర్గద్వితీయ చతుర్థములు తత్పూర్వ వర్గ విషమంబులతో సంయుక్తము లగు.

ఈ ధరిత్రి = ఇధ్ధరిత్రి యని కావలసియుండఁగా నది యుచ్చారణమునకు సాధ్యముకాకుండుటచే నావర్గంబున దాని పూర్వంబుననుండు 'ద'కారముతో సంయుక్తమయ్యెను. ఇద్ధరిత్రి - ఇఘ్ఘె అద్ధీరాగ్రణి గెల్పుటుత్సవము - ఇబ్భంగి యిత్యాదులు. ఎన్నఁడు - ఎవ్వఁడు ఇత్యాదిరూపంబులు బహుళగ్రహణముచే నవి యెఱుంగునది.

సూ॥ ౩౭. కృతహ్రస్వం బగు త్రికంబుమీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు.

'ఆ+చోటు' పైసూత్రము ప్రకారము అచ్చోటుకాఁగా 'చ్చో' యందుండు 'ఓత్వము' హ్రస్వముగాఁ గాని అత్వముగాఁ గాని యగును.

హ్రస్వము కాఁగా అచ్చోటు. అత్వమురాఁగా అచ్చటు. ఇట్లే ఇచ్చోటు- ఇచ్చటు - ఎచ్చోటు - ఎచ్చటు. వీని ద్విత్వంబునకు లోపంబును గలదు. అచటు - అచోటు - ఇచటు - ఇచోటు - ఎచటు - ఎచోటు. ముచ్చోటులు - ముచ్చటులు - ముచ్చోటులు అను రూపంబులు ప్రయోగంబులఁ గానంబడియెడి.

సూ॥ ३౨. ఉత్తరపదం బగుచోటు శబ్దము టాక్షరము నకు లోపంబు విభాష నగు.

చోటుశబ్దము ఔపవిభక్తికము. దీనిసప్తమి ఏకవచనరూపము, చోటన్ ఇందు 'టు' కారంబునకు లోపంబు వైకల్పికంబు. అచ్చోన్ - ఒకచోన్ - అచ్చోటన్ - ఒకచోటన్.

సూ॥ ३౯. కర్మధారయంబున రెండుశబ్దములకు నడుమ నర్థగ్రహణమున కావశ్యకమైనపదము లోపించిన మధ్యమపద లోపి యగు.

ఉ. జవ్వాదిసెట్టి = జవ్వాది+అమ్ము+సెట్టి యని యర్థము. 'అమ్ము' లోపించినది.

సూ॥ ౪౦. సంబంధార్థమం దన్నిశబ్దంబులమీఁదఁ దచ్ఛబ్దం బగు.

ఉ. నాది - వానిది - నీయది - మావాఁడు - ఇంటియాతఁడు - ఇంటివాఁడు ఇంటిది.

అది - వాఁడు లోనైనవి తచ్ఛబ్దంబులు.

సూ॥ ౪౧. ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించు నపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు.

ఉ. వచ్చినవాఁడు - వచ్చినది - రానివాఁడు - రానిది. వచ్చిన రాని యివి వచ్చుధాతువుల నైన విశేషణములు.

సూ॥ ౪౨. ఎల్లయెడలఁ గ్రియావిశేషణంబులకు 'అట్టి' యనుపదంబు వైకల్పికంబుగ ననుప్రయుక్తం బగు.

ఉ. కపులు కట్టినసేతువు = కపులు కట్టినట్టి సేతువు.

సూ॥ ౪౩. షడ్వర్ణపర్యంతంబైన యాంధ్రశబ్దంబు తత్సమ శబ్దంబుతోడ సమసించు.

ఉ. వాఁడి మయూఖములు - వేఁడి పయోధారలు. ఆఱక్షరముల వఱకుఁ బరిమితి గల తెనుఁగుశబ్దము తత్సమశబ్దముతోఁ జేరి కర్మధారయమగు. తెనుఁగుశబ్దము పూర్వమున నుండవలయును గాని, శుద్ధ సంస్కృత శబ్దము తెనుఁగు శబ్దముతో సమసింపదు గావున శుద్ధతప్పు, అనేకమార్లు బహుమంది ఇత్యాదులు సాధువులుగావు. అపపాడి (దశ ౧౧ ఆ) అపనమ్మకము దిన వెచ్చము. 'కటికి చీఁకటి దిండికరముల గిలిగింత' ననుచో కటికి చీఁకటిదిండి విశేషణంబయి యా అక్షరముఁకు మించియున్నది. ఇట్టి ప్రయోగ మిది యొక్కటియ చూపబడెడి.

సూ॥ ౪౪. కర్మధారయంబునందు గుణవచనంబులకు నిగాగమంబు బహుళంబు.

గుణవచన మనఁగా విశేషణము. నల్ల - తెల్ల - చల్ల - పచ్చ - ఎఱ్ఱ - తియ్య - కమ్మ - పుల్ల - విన్న - తిన్న - అల్ల - చక్క - అలక - మెల్ల - ఇత్యాదులు గుణవచనంబులు.

ఉ. చల్లగాలి - చల్లనిగాలి, పరుషంబులు పరంబు లగునపుడు కొండొకచో నిగాగమంబునకు బిందువగు. చల్ల + ని + తెమ్మెర = చల్లఁదెమ్మెర, కమ్మ + ని + తేనె = కమ్మఁదేనె, కమ్మందేనె.

సూ॥ ౭౫. గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ ననర్ణకంబునకు బిందువు గానంబడియెడి.

ఉ. చక్కంగఁ జూడ నోపనివాఁడు - చక్కంగఁ బ్రియుండు వర్ధిలుట.

సూ॥ ౭౬. సమాసంబుల నొపవిభక్తికంబుల దీర్ఘపూర్వక ద్విత్వ ముపర్ణంబులకు ఖండ పూర్ణబిందు పూర్వకంబుగను, లఘు పూర్వక ముపర్ణంబునకుఁ గేవలమును పనర్ణంబునగు.

దీర్ఘపూర్వక ముపర్ణంబునకు 'ఁప' వచ్చినందునకు ఉ. చూ. మొ. భా. సంజ్ఞ. సూ. ౨౮. ద్విత్వ ముపర్ణంబునకు 'ంపు.' ఉ. అమ్ము - అంపవాన - ఎమ్ము - ఎంపప్రోవు.

లఘుపూర్వక ముపర్ణంబునకు 'పు.' ఉ. ఇనుము - ఇనుపకాఁడి - ఎనుపగొడ్డు - మినుపపప్పు - జనుపనార - కనుపపులు ఇత్యాదులు.

సూ॥ ౭౭. మయూరవ్యంసక సమాసములు.

ఉ. మయూరవ్యంసకము (మోసపునెమలి) ఉచ్చావచము (అనేక ప్రకారములు గలది.) అకించనుఁడు - అసత్యోభయుఁడు - రాజాంతరము - గ్రామాంతరము - చిన్మాత్రము - అహమహమిక - అహంపూర్వక - అహోపురుషిక.

## వ్యధికరణ తత్పురుషము.

సూ॥ ౭౮. భేదమయిన యాధారము గలది వ్యధికరణము.

అనఁగా రెండుపదముల యర్థములు వేఱువేఱు ఆధారములు గలవిగ నుండవలయును.

ఉ. రామునిగుఱ్ఱము. ఇచ్చట రామునితనము - రామునందే యుండును. గాని గుఱ్ఱమునందుండదు. అట్టులే గుఱ్ఱపుఁదనము గుఱ్ఱమునందే యుండును. కాఁబట్టి రెంటియర్థము రెంటియందున్నది గాని సమానాధికరణము నందువలె నొక పదార్థమునందే లేదు (చూ. సంధి. సూ. ౩౭) ఇది ద్వితీయా తత్పురుషము - తృతీయాతత్పురుషము - చతుర్థీతత్పురుషము - పంచమీతత్పురుషము - షష్ఠీతత్పురుషము - సప్తమీతత్పురుషము - నఞ్ తత్పురుషము- ప్రాది - ఉపపదము - గతి - నిత్యసమాసమని భేదంబులు.

విగ్రహమునందు మొదటిపదము ద్వితీయా విభక్తియందుండెనేని ద్వితీయాతత్పురుషము.

ఉ. నెలతాల్పు - వాఁకతాల్పు - దుఃఖాతీతము - కృష్ణశ్రితుఁడు-అన్నబుభుక్షువు - సుఖాపన్నుఁడు - ముహూర్తసుఖము - సంవత్సరవాసము. మొ నెల ను+తాల్పు=నెలతాల్పు.

తృతీయాతత్పురుషము. ఉ. నెల తక్కువవాఁడు - నెలచేత తక్కువవాఁడు. ఇట్లు హరిరక్షితుఁడు - నఖభిన్నము - మాతృసదృశుఁడు - మాసపూర్వుఁడు - మాసావరుఁడు - పితృసముఁడు - వాక్కలహము - గుడమిశ్రితము - దధ్యోదనము - రాజపూజితుఁడు - ఆచారనిపుణుఁడు.

దీనియందలి యలుక్సమాసములు. ఉ. నీతోడిచెలిమి - నాచేతిప్రాపు - పుంసానుజుఁడు (అన్నగలవాఁడు) జనుషాంధుఁడు (పుట్టుగ్రుడ్డి.)

చతుర్థీతత్పురుషము. ఉ. దేవరమేలు - దేవరకొఱకుమేలు. విప్రార్థము (బ్రాహ్మణులకొఱకు) భూతబలి - గోహితము.

అలుక్సమాసములు.

ఆత్మనేపదము - పరస్మైపదము.

పంచమీతత్పురుషము. ఉ. దొంగభయము-దొంగవలన భయము-సుఖాపేతము - చక్రముక్తుఁడు - స్వర్గపతితుఁడు.

అలుక్సమాసములు. స్తావలని సేరము - దూరాదాగతుఁడు. మొ॥ శిరసావహించి ఇది తెనుఁగు గ్రంథములఁ బ్రయోగింపఁబడియున్నది గాని సంస్కృత వ్యాకరణసమ్మతము గాదంద్రు.

షష్ఠీతత్పురుషము. ఉ. రామునిబాణము రామునియొక్క బాణము. ఇట్లు భూభర్త - రాజపరిచారకుఁడు - దేవపూజకుఁడు- పూర్వకాయము. (కాయముయొక్క పూర్వము) అపరకాయము - అర్ధరాజ్యము - మధ్యాహ్నము - సాయాహ్నము - మధ్యరాత్రము.

అలుక్సమాసములు. దేవానాంప్రియుఁడు - వాచోయుక్తి - పశ్యతోహరుఁడు - దివోదాసుఁడు - దివస్పతి - వాచస్పతి - శునశ్శేపుఁడు - మాతుష్వస.

నిర్ధారణషష్ఠియందు సమాసము లేదు. ఉ. నృపోత్తముఁడు - నృపులయం దుత్తముఁడని చెప్పవలయును గాని నృపులలో నుత్తముఁ డనరాదు.

సప్తమీతత్పురుషము. ఉ. మాటనేర్పరి - దానశౌండుఁడు - యుద్ధకుశలుఁడు - రణపండితుఁడు - వాదనిపుణుఁడు - ఆతపశుష్కము - స్థాలీపక్వము - ఈశ్వరాధీనము - చక్రబంధము - తీర్థకాకము - నగరవాయసము - కూపమండూకము.

తెనుఁగున షష్ఠీ - సప్తమీతత్పురుషంబుల నవర్ణకంబు విభాష నగు.

ఉ. యోగక్షేమమున తెలుఁగు-పుణ్యాశ్రమంబున యొద్ద-లోకంబున వారు - లోకమువారు. అలుక్సమాసములు. ఉ. గేహేశూరుఁడు - పాత్రే

కుశలుఁడు - యుధిష్ఠిరుఁడు - స్తంబేరమము - బిలేశయము - కర్ణేజపము - ఖేచరుఁడు - పంకేరుహము - కుశేశయము - దివిజులు - కంఠేకాలుఁడు - వనేచరులు - నీరేజము - తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - ఊరఁబంది లోనైనవి.

సూ॥ ౪౯. యుష్మ దస్మ దా త్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునప్పుడు 'దు' గాగమంబగు. ఉ. నీదుకరుణ-నీకరుణ. నాదునేరమి - తనదురూపు. బహువచనంబున సాధుప్రయోగంబులు లేవు.

## నఞ్.

సూ॥ ౫౦. అకార నకారములు సమాసాదినుండి వ్యతిరేకార్థము బోధించునేని నఞ్ తత్పురుషము.

సంస్కృతమునందు వ్యతిరేకార్థము తెలుపునది 'న'. అచ్చుపరమగుచో నీ 'న' - 'అన్'గా మాఱును. హల్లుపరమైనచో 'అ'గా మాఱును. ఉ. న+ఉచితము = అన్+ఉచితము = అనుచితము. న+బ్రాహ్మణుఁడు = అ+బ్రాహ్మణుఁడు = అబ్రాహ్మణుఁడు. ఇట్టివి నఞ్ తత్పురుషములు. నముచి-నఖము - నకులము - నపుంసకుఁడు - నక్షత్రము - నక్రము - నాకము - ఇత్యాదులయందు 'న' 'అ'గా మాఱదు గాని యిందుఁ గొన్ని బహువ్రీహిసమాసము లున్నవి.

## ప్రాదితత్పురుషము.

సూ॥ ౫౧.

ప్రాది = ప్ర+ఆది.

ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఇవి యుపసర్గములు, ఇందు 'ప్ర' మొదట నున్నది గాన నివి

ప్రాదులనంబడు. తత్పురుష సమాసమందు వీనిలో నేదైన మొదట నుండెనేని యది ప్రాదితత్పురుష మగు. ఉ. ప్రాచార్యుఁడు. (ప్ర + ఆచార్యుఁడు) ప్రవాతము. అతిమాలము (పూలసరమును నతిశయించినది) అతిరథుఁడు - అవకోకిలము (కోకిలచే నాకర్షింపఁబడినది) నిర్లంకుఁడు. (లంక నుండి నిర్గమించినవాఁడు.)

## గతితత్పురుషము.

సూ॥ ౫౨.

అస్తమయము - పురస్కారము - తిరస్కారము - సత్కారము - అలంకృతి - ఇత్యాదులు గతి తత్పురుషములు.

సూ॥ ౫3. సంఖ్యావ్యయంబులు పూర్వపదంబులైనచో 'అంగుళి' అదంతమగు.

సంఖ్యాపూర్వము. ఉ. ద్వ్యంగుళము దారువు. అనఁగా రెండంగుళముల ప్రమాణముగల కొయ్య.

అవ్యయపూర్వము. ఉ. నిరంగుళము.

సూ॥ ౫౪. ఏకదేశ సంఖ్యావ్యయంబులకును సర్వ-సంఖ్యాత-పుణ్య శబ్దములకును బరమైన రాత్రి శబ్దము అకారాంతమగు.

ఏకదేశ మనఁగా భాగము. ఉ. అర్ధరాత్రము - మధ్యరాత్రము - పూర్వరాత్రము - అపరరాత్రము - లోనైనవి.

సంఖ్య - ఉ. ద్విరాత్రము - త్రిరాత్రము - సప్తరాత్రము. మొ॥

అవ్యయము. అతిరాత్రము. (అతిక్రాంతమైన రాత్రి) సర్వరాత్రము - సంఖ్యాతరాత్రము - పుణ్యరాత్రము.

ద్వంద్వసమాసంబున అహస్సు పూర్వముగాఁగల రాత్రిశబ్ద మిట్లయగు. అహోరాత్రము. పరమువెలి మూఁడహోరాత్రములు. ఏకాహము -

పూర్వాహ్ణము - పూర్వాహ్ణము - పరాహ్ణము - ఇట్లు అహాన్ శబ్దము తత్పురుషంబున నగు.

సూ॥ ౫౫. తత్పురుషాంతమున i. గో - గవము అగు. ii. అయస్ - సరస్ శబ్దములు - జాతి - సంజ్ఞలఁ దెలుపునపుడు అకారాంతములగు.

i. ఉ. పరమగవము. పరమగోవు అనరాదు. ii. ఉ. కాలాయసము (నల్లయినుము) మండూకసరసము - (కప్పలతో నిండినకొలను) జలసరసము - (ఇది యొకకొలనిపేరు.)

సూ॥ ౫౬. కర్మధారయ - బహువ్రీహులయందుఁ దొలిపదమైనపుడును జాతీయశబ్దము పరమైనపుడును మహచ్ఛబ్దము 'మహా' యగు.

ఉ. మహత్ + వృక్షము = మహావృక్షము. (కర్మ). మహాబాహుఁడు- (బహు). మహాజాతీయము. మహాత్సేవయనఁగా గొప్పవారియొక్క సేవయని యర్థమే కాని గొప్పసేవయని యర్థముగాదు.

## బహువ్రీహి.

సూ॥ ౫౭. అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి.*

అన్యపదార్థ మనఁగా సమాసమునందలి పూర్వపదము బోధించుదాని కంటెను ఉత్తరపదము బోధించుదాని కంటెను వేఱైన మఱియొక వస్తువు

*"A Bahuvrihi compound consists of two or more words and denotes something else than what is expessed by its members. It generally attributes that which is expressed by its second member, determined or modified by what is denoted by its first member, to something denoted by neither of the two."

యొక్క యర్థమే ముఖ్యముగాఁ గలది. ఉ. రాముఁడు సాధుబుద్ధి. ఇచట సాధుబుద్ధి యనఁగా సాధువైన బుద్ధి యని యర్థమైనయెడ నది కర్మధార యము.* ఎవనియొక్క బుద్ధి సాధువో వాఁడు సాధుబుద్ధి అని యర్థమయిన యెడ ఆ పురుషుఁడు సాధుత్వము కంటెను బుద్ధికంటెను వేఱైనవాఁడు కనుక సాధుబుద్ధి యనునది బహువ్రీహి సమాసము. ఈ సమాసమునకు విగ్రహము చెప్పునపుడు ఏది - ఏవాఁడు - ఎవ్వతె యొక్క విభక్తిరూపము లుండవల యును. ఉ. పీతాంబరుఁడు. ఎవనియొక్క అంబరము (వస్త్రము) పీతమో (పచ్చనయో) వాఁడు పీతాంబరుఁడు విష్ణువు. పీతమైన యంబరము గల వాఁడు. ఇదియును సమానాధికరణము వ్యధికరణమని రెండు విధంబులు. సమానాధికరణము ద్వితీయాదిభేదములచే నాఱు విధంబులు.

ద్వితీయాబహువ్రీహి. ఉ. ప్రాప్తోదకము గ్రామము. ఉదకము దేనిని బ్రాప్తించెనో యది. విగ్రహమునందు 'దేనిని' యని ద్వితీయావిభక్తి రూపమువచ్చినందున, ద్వితీయాబహువ్రీహి. ఇట్లే తక్కినవి.

తృతీయా బహువ్రీహి. ఉ. లబ్ధవిద్యుఁడు కృష్ణుఁడు. ఎవనిచేత విద్య లబ్ధమయ్యెనో వాఁడు = కృష్ణుఁడు.

---

*"The difference between a Karmadharaya and a Bahuvrihi Compound is this:—In the former, one of the members alone is in apposition to the substantive it qualifies, while in the latter the whole compound is so. In the former the sense is complete in the compound itself; in the latter it is not so.

"That is a Samanadhikarana Bahuvrihi in which both the members are in apposition to each other *i.et* have the same case relation when dissolved."

చతుర్థీబహువ్రీహి. ఉ. దత్తాస్త్రుఁడు రాముఁడు. ఎవనికొఱకు అస్త్రములు దత్తము లయ్యెనో వాఁడు = రాముఁడు.

పంచమీబహువ్రీహి. ఉ. నిరస్తదోషులు. ఎవరివలన నుండి దోషములు నిరస్తము లయ్యెనో వారు = మునులు.

షష్ఠీబహువ్రీహి. ఉ. పీతాంబరుఁడు. ఎవనియొక్క యంబరము పీతమో వాఁడు పీతాంబరుఁడు.

సప్తమీబహువ్రీహి. ఉ. వీరపురుషము గ్రామము.

దేనియందు వీరులగు పురుషులు గలరో యది.

## వ్యధికరణ బహువ్రీహి.*

వ్యధికరణ బహువ్రీహి. షష్ఠీసప్తములందు మాత్రమే యుండును.

షష్ఠీబహువ్రీహి. ఉ. పద్మగంధి. పద్మముయొక్క గంధమువంటి గంధమెవనికిఁ గలదో యది = దమయంతి.

సప్తమీబహువ్రీహి. ఉ. చక్రపాణి. పాణియందుఁ జక్రమెవనికిఁ గలదో వాఁడు = విష్ణువు ఇట్లు చంద్రశేఖరుఁడు.

## నఞ్పూర్వపద బహువ్రీహి.

సూ॥ ౨౪౮. నఞ్ పూర్వపదముగాఁ గల బహువ్రీహి నఞ్ పూర్వపద బహువ్రీహి.

ఉ. పుత్త్రుఁడు ఎవనికి లేఁడో వాఁడు అపుత్త్రుఁడు. అఘము ఎవనికి లేదో వాఁడు అనఘుఁడు. ఈ నఞ్‌వలెఁ గొన్ని యుపసర్గములును బూర్వపదంబులుగ నుండును. ఉ. దేనియొక్క పర్ణములు (ఆకులు) ప్రపతితములో (రాలిపోయినవో) అది ప్రపర్ణను. ఎవనియొక్క దయ నిర్గతమో

*A Vyadhikarana Bahuvrihi is that whose members are not in apposition to each other *i.e.* are in different cases when dissolved.

వాఁడు నిర్దయుఁడు (=దయలేనివాఁడు) ఎవనియొక్క కంధర (కంఠము) యుద్ధతమో (ఎత్తఁబడినదో) వాఁడు ఉత్కంధరుఁడు. ఎవనియొక్క జీవితము విగతమో వాఁడు విజీవితుఁడు. ఇట్లు నిర్జనము - విజనము మొదలైనవి.

సూ॥ ౫౯. 'సహ' శబ్దము పూర్వపదముగా నుండిన సహపూర్వపద బహువ్రీహి.

తృతీయావిభక్తి నామవాచకముతో 'సహ' శబ్దముచేరి బహువ్రీహియయి విశేషణముగ నగు. అప్పుడు 'సహ' శబ్దము 'స' యని వైకల్పికముగ నగు. (సహ = కూడ) పుత్రునితో + సహ (కూడ) సహపుత్రుఁడు, లేక సపుత్రుఁడు. ఆశీస్సు (దీవన) నందు 'సహ' శబ్దము 'స' కాదు. ఉ. సహపుత్రుఁడగు రాజునకు స్వస్తి యనవలయును.

సూ॥ ౬౦. సంఖ్యావాచకము సంఖ్యావాచకముతోఁ గలసి బహువ్రీహియైనయెడల సంఖ్యోభయపద బహువ్రీహి.

ద్విత్రము = ఇద్దఱో ముగ్గురో.

ద్విదశము = రెండు పదులు ఇరువది.

సూ॥ ౬౧. దిక్కులయంతరాళమును (నడిమిప్రదేశము) దెలుపు బహువ్రీహి దిగంతరాళ బహువ్రీహి.

ఉ. దక్షిణపూర్వము = దక్షిణమునకును దూర్పునకు నడిమిప్రదేశము = ఆగ్నేయమూల. ఇట్లే ఉత్తరపూర్వము.

సూ॥ ౬౨. వ్యతిహారలక్షణ బహువ్రీహి.

వ్యతిహార మనఁగాఁ దన విషయమం దొకఁ డేవిధముగ వర్తించునో యట్టులే యతనియందుఁ దాను వర్తించుట. ఉ. కచాకచి. ఒకని వెండ్రుకలు మఱియొకఁడు పట్టుకొని చేయు యుద్ధము. ఇట్టులే దండాదండి - ముష్టాముష్టి - హస్తాహస్తి - బాహాబాహి - ముసలాముసలి. ముష్టీముష్టియనియుఁ గలదు.

సూ॥ ౬౩. తెలుఁగున స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు.

ముక్కంటి - వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మోటబరి ఇత్యాదులు.

సూ॥ ౬౪. తెలుఁగునను బహువ్రీహిని సమాసాంత కార్యంబులు గానంబడియెడి.

ఉ. ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.

## అవ్యయీభావము.

సూ॥ ౬౫. పూర్వపదార్థప్రధానము అవ్యయీభావము.

అనఁగాఁ బూర్వపదముయొక్క యర్థమే ముఖ్యముగాఁ గలది యవ్యయీభావసమాస మగునని యర్థము. ఉ. నిర్జనము = నిర్ + జనము = జనము లేమి. ఇచ్చట 'లేమి' ని దెలుపు 'నిర్' అను నవ్యయము ప్రధానము గాని 'జనము' కాదు.

అవ్యయీభావమునందుఁ బ్రాయికముగా మొదటిపద మవ్యయముగా రెండవది నామవాచకముగా నుండును. ప్రాయికమనుటచే నుత్తరపద మవ్యయ ముండుటయుఁ గలదు.

యథాశక్తి. ప్రత్యక్షము - పరోక్షము - సమక్షము - అధ్యాత్మము - నిర్మక్షికము - అతిమాత్రము - అనురూపము - అనుగుణము - ప్రత్యహము - ప్రతిపర్వతము - సహరి - అనుక్రమము - ముంగేలు - ముంజేయి - ముత్రాత - ఆబాలము - సప్తగోదావరము - సమభూమి - ప్రదక్షిణము. ఇట్టివి యవ్యయీభావ సమాసములు.

సూ॥ ౬౬. తెనుంగున నొక్కొకచో సమాసగతపూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను, వాని పెక్కింటితోడను నన్వయించెడి.

ఉ. వానిబలమును దేజమును; అనఁగా వానిబలమును వానితేజము నని యర్థము. పరులధనమునకు విద్యాపరిణతికి.

సూ॥ ౬౭. అక్షి శబ్ద మకారాంత మగు.

జలజాక్షుఁడు - జలజమువంటి కన్నులు గలవాఁడు (జలజాక్షిశబ్దము ప్రత్యయమున జలజాక్షుఁడగు) దీని స్త్రీలింగరూపము జలజాక్షి. సూత్రమున 'బహువ్రీహిని' అనుపద మధ్యాహార్యము.

సూ॥ ౬౮. అవర్ణపూర్వకంబైన శక్తిశబ్దము వైకల్పికంబుగ అకారాంత మగు.

ఉ. అశక్తుఁడు - అశక్తి.

సూ॥ ౬౯. బహువ్రీహి సమాసాంతమున.

i. జాయ - జాని యగు.

ii. ఉత్ - పూతి - సు శబ్దంబులు పూర్వమందున్నను, ఉప, మానద్యోతక మగు సమాసంబునను గంధశబ్దము గంధియగు.

i. వాగ్జాని=సరస్వతి యెవనికి జాయయో యతఁడు (జాయ=భార్య.)

ii. ఉ. ఉద్గంధి = మీఁదవ్యాపించు గంధముగలది. పూతిగంధి = చెడువాసన గలది. సుగంధి = మంచివాసన గలది.

పద్మగంధి = పద్మగంధమువంటి గంధము దేనికిఁగలదో యది స్త్రీ.

ఉపమానద్యోతకము నుటచే యోజనగంధయని రూపము. యోజనగంధి యనుట యసాధువు. (యోజనగంధ = సీత - సత్యవతి.)

సూ॥ ౭౦. సు దుస్సులు పూర్వమందుఁగల హృదయ శబ్దము హృత్తగు.

సుహృత్తు = స్నేహితుఁడు, దుర్హృత్తు = విరోధి.

---

AYURVEDA PRACTIONER

## తద్ధితపరిచ్ఛేదము.

సూ॥ ౧. విశేష్యములకుఁ గాని విశేషణములకుఁ గాని భావార్థము స్వార్థము లోనగునర్థంబుల రాఁదగిన యొకవిధమైన ప్రత్యయములు తద్ధితము లనఁబడును.

ఈ ప్రత్యయములు పరమగునపుడు 'ఁడు' వర్ణకము లోనగు ప్రత్యయములు లోపించును.

రాముఁడు - ఇది విశేష్యము. దీనికిఁ దద్ధితప్రత్యయము 'తనము' భావార్థంబునఁ జేర్చినచో 'రాముఁడు + తనము' అని కాఁగా 'ఁడు' లోపించి రాముతనము అని యగు. మంచితనము. మంచి యను విశేషణమున కితర ప్రత్యయములు చేరియుండలేదు గాన వానికి లోపములేదు.

సూ॥ ౨. తనవర్ణకంబు భావార్థంబునం దగు.

భావము అనఁగా స్వభావమువలనఁ గలిగినదని తెలుపునది. ఆ యర్థంబునందు 'తనము' అను వర్ణకంబు చేర్పఁబడును.

విశేష్యములు. రాముతనము - రామునితనము - సీతతనము - మనుమనితనము - బంటుతనము.

విశేషణములు. గొప్పతనము - మంచితనము - నల్లఁదనము - పుల్లఁదనము.

ఆఁకొన్నతనము - ఓర్వలేనితనము లోనగు ప్రయోగంబులందు 'వాని' యనునది వైకల్పికంబుగ లోపంబు. ఆఁకొన్నతనము = ఆఁకొన్నవానితనము, ఓర్వలేనితనము = ఓర్వలేనివానితనము.

సూ॥ 3. చిన్నాదులకు తికవర్ణకం బగు.

చిన్నతికము - కన్నెతికము - పెద్దతికము - చుట్టతికము - దొంగ తికము - పేదతికము - మిండతికము - లంజెతికము. విశేషవిధులు సామాన్య విధులను వైకల్పికముగ బాధించును గనుక 'చిన్నతికము' మాఱు 'చిన్నతనము' అనియుఁ జెప్పనగు. ఇట్లులే తక్కినచోట్ల నెఱుంగునది.

సూ॥ ౪. తికము పరంబగునపు డుత్వంబున కత్వం బగు.

మీఁది సూత్రమున కీయఁబడిన యుదాహరణంబులందుఁ (జిన్న మొద లయిన శబ్దములు అ ఎ లంతమందుఁ గలవే కాని) ఉకారాంతములులేవు. ఉకా రాంతశబ్దములకు తికము పరమైనయెడ ఉకారము అకారముగ మాఱును. ఉ. తొత్తు+తికము = తొత్తతికము. వెజ్జు+తికము = వెజ్జతికము. వెడ్డు+ తికము = వెడ్డతికము.

సూ॥ ౫. ఇమివర్ణకంబు పేర్వాదుల కగు.

పేరు మొదలైనశబ్దములకు 'ఇమి' ప్రత్యయం బగు.

పేరు+ఇమి = పేరిమి. ఇట్లు పేరిమి - మ్రుచ్చిమి - కడిమి - మేలిమి - చెలిమి - పోఁడిమి - వాఁడిమి - వేఁడిమి ఇత్యాదులు.

సూ॥ ౬. నవర్ణకంబు గుణవచనంబులైన నల్లాదుల కగు.

గుణవచనము లనఁగా గుణమును దెలుపు విశేషణములు.

నల్ల + న = నల్లన. ఇట్లు తెల్లన - పచ్చన - ఎఱ్ఱన - చాయన - తియ్యన - కమ్మన - పుల్లన - చప్పన - విన్నన - తిన్నన - అల్లన - ఒయ్యన - తిమ్మన - చక్కన - ప్రేకన లోనైనవి.

సూ॥ ౭. ఇకవర్ణకం బగ్గలాదుల కగు.

అగ్గలము+ఇక = అగ్గల+ఇక = అగ్గలిక. ఇట్లు - ఒమ్ము ఒమ్మిక.

సూ॥ ౮. కరవర్ణకము నాయఁకశబ్దమున కగు.

నాయఁకుఁడు+కరము = నాయఁకరము.

సూ॥ ౯. టివర్ణకం బొంటుశబ్దమునందలి టువర్ణంబునకగు.

ఒంటు - ఒంటి.

సూ॥ ౧౦. మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

మగఁడు - మగఁటిమి - మగతనము. ఇట్లు పేదఱిమి - ఒజ్జనము- కోటరము - కోడంట్రము - కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము - నయగారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు.

మీఁదఁ జెప్పినవన్నియు భావార్థంబున వచ్చు ప్రత్యయంబులు. ఇఁక స్వార్థంబున వచ్చు ప్రత్యయములు చెప్పఁబడు.

స్వ+అర్థము = స్వార్థము. ఇందు తొలుతటి పదమున కేయర్థమో తద్ధిత ప్రత్యయము చేరియు నదేయర్థమే కాని యర్థమునందు భేదముండదు.

సూ॥ ౧౧. అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకంబగు.

అరమర+ఇక = అరమరిక. అరమర యనిన నేమియర్థమో యర మరిక యనిన నా యర్థమే. ఇట్లు ఆము - ఆమిక; అల్లిబిల్లి - అల్లిబిల్లిక; గండి - గండిక; నడవడి - నడవడిక; నాడు - నాడిక; నివ్వాళి - నివ్వాళిక; పాత్రి - పాత్రిక; మాన - మానిక; మెలి - మెలిక; వాలు - వాలిక; ఒరిమ - ఒరిమిక; ఇత్యాదులు.

సూ॥ ౧౨. ఉకవర్ణకంబు చిఱుతాదుల కగు.

చిఱుత - చిఱుతుక; నాతి - నాతుక; నెలఁత - నెలఁతుక; మెలఁత - మెలఁతుక; పడఁతి - పడఁతుక; మడఁతి - మడఁతుక; పొలఁతి - పొలఁతుక; వెలఁది - వెలఁదుక; నిప్పు - నిప్పుక; ఎమ్ము - ఎమ్ముక. ఇత్యాదులు.

సూ॥ ౧౩. అడ, యిమి, వర్ణకంబులు వేఱున కగు.

వేఱు + అడము = వేఱడము, వేఱు + ఇమి = వేఱిమి.

సూ॥ ౧౪. అడివర్ణకంబు వెల్ల కగు.

వెల్లడి.

సూ॥ ౧౫. ఇడివర్ణకంబు తెలివి, విరివి, వినికి, లేమి, రాపులకు నగు.

తెలివిడి - విరివిడి - వినికిడి – లేమిడి - రాపిడి.

సూ॥ ౧౬. ఇత వర్ణకం బింపు, బిగి, పోరుల కగు.

ఇంపు + ఇతము = ఇంపితము; బిగితము; పోరితము.

సూ॥ ౧౭. ఇరి వర్ణకంబు వాఁపున కగు.

వాఁపిరి.

సూ॥ ౧౮. కార వర్ణకంబు నుడి - కొలఁత ల కగు.

నుడికారము - కొలగారము.

సూ॥ ౧౯. మిరి వర్ణకంబు చలి కగు.

చలిమిరి.

ఇఁక మతుబర్థంబున వచ్చు ప్రత్యయములు చెప్పఁబడును.

సూ॥ ౨౦. కాఁడు కత్తియ వర్ణకంబులు పుంస్త్వ, స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.

ఆట మొదలగు శబ్దములకు మతుబర్థంబునఁ బుంలింగంబున 'కాఁడు' అను ప్రత్యయము, స్త్రీలింగంబున 'కత్తె' యను ప్రత్యయము వచ్చును. మత్ అనునది కలయను నర్థమున వచ్చు సంస్కృత ప్రత్యయము. అదియే తత్సమం

బునఁ బుంలింగంబున మంతుఁడు - వంతుఁడగును. ఉ. బుద్ధిమంతుఁడు - బుద్ధిగలవాఁడు, దయగలవాఁడు - దయావంతుఁడు, ఇఁక మీఁదఁ జెప్పఁబడు ప్రత్యయములు కల లోనగునర్థము లిచ్చునవి.

చెలిమి+కాఁడు అనఁగాఁ జెలిమికలవాఁడు అని యర్థము. స్త్రీవాచకమైనపుడు చెలిమికత్తియ-చెలిమికత్తె. కటారి (ఆయుధముగాఁ) గలవాఁడు = కటారికాఁడు. ఈయర్థములందు నీ ప్రత్యయములు అట - అపేపము - ఎమ్మె - ఓయారము - కటారి - కొల్ల - చెలిమి - చేరువ - చొరవ - జెట్టి - జాజెర - జూదము - తిండి - తేర - దొడ్డ - నీటు - నేస్తము - బేరము - బయము - వీణె - సంబళము - అమ్ము - అంటు - అంకము - కవళి - కైలాటము - వగ - విల్లు - వెచ్చము - సొగసు - మాయము - వేఁట - జాలము - జీతము - తెక్కలి - తెరవాటు - బంది - బోనము - కన్నము - వేడుక - లోనగు పదములపై వచ్చును. ముఖ్యకంబునకు లోపము = మాయగాఁడు.

సూ॥ ౨౧. కాఁడు, కత్తియ, కారంబుల, క కారమునకు గ కారంబు కొండొకచోఁ గానంబడియెడి.

అందగాఁడు - అందగత్తె; కొండెగాఁడు - కొండెకత్తె; బేరగాఁడు - బేరగత్తె; మొనగాఁడు - మోసగాఁడు - నయగారము లోనైనవి.

సూ॥ ౨౨. కాఁడు కొండొకచోఁ దత్సమంబుల మీఁదను గానంబడియెడు.

లిపికాఁడు-కార్యగాఁడు-అంకకాఁడు-ఆయకాఁడు-ఆయతికాఁడు.

సూ॥ ౨౩. కాఁడు, కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టు.

చెలికాఁడు - చెలికత్తియ; హెగ్గడికాఁడు - హెగ్గడికత్తె; అడప కాఁడు - అడపకత్తె; విటకాఁడు - విటకత్తె - అంకకాఁడు ఇచటఁ దత్సమ శబ్దములమీఁద వచ్చెను. హాస్యగాఁడు నిట్టి దకా నెంచ నగు.

సూ॥ ౨౪. కాఁడు తిర్యక్కులకుం గానంబడియెడి.

తిర్యక్కులు = పశుపక్ష్యాదులు.

ఇబ్బందిగాఁడు-ఒంటిగాఁడు-కొమ్ముకాఁడు-పరికాఁడు, ఇత్యాదులు.

సూ॥ ౨౫. ఈఁడు వర్ణకంబు పుంస్త్వంబున నటమటాదుల కగు.

అటమటము+ఈఁడు = అటమటీఁడు. ఇట్లు కమ్మసము - కన్నడము - కొండెము - బాసము - బూటకము - మంపడి - మన్నెము - సుంకము - గారడి - ఇత్యాదులు. ఉక్కివము+ఈఁడు = ఉక్కీఁవని యగు.

సూ॥ ౨౬. ఈఁడు కొన్నియెడల స్వార్థంబునం దగు.

దిమ్మరి+ఈఁడు = దిమ్మరీఁడు - మొక్కలీఁడు - కల్లరీఁడు.

సూ॥ ౨౭. అరివర్ణకంబు జాలాదుల కగు.

జాలము+అరి = జాలరి, ఇట్లు ఒఱపరి - కల్లరి - చదువరి - జూదరి - టక్కరి - తగవరి - తీరుపరి - తెంపరి - తెరువరి - నేరుపరి - మతకరి (మతకము) వెరవరి - వేఁటరి - సిగ్గరి - సొంపరి - లావరి - చూపరి (సుంకము+అరి) సుంకరి - పూజరిలోనైనవి. పూజ+అరి = పూజారి; సొన్నము+అరి = సొన్నారియని కడయచ్చునకు దీర్ఘంబు.

సూ॥ ౨౮. ఇవర్ణకం బోయారాదుల కగు.

ఓయారము+ఇ=ఓయార+ఇ=ఓయారి; ఇట్లు అక్కసము - కవలు - చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటా

రసము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము - నల్ల లోనైనవి ఓయారాదులు.

సూ॥ ౨౯. త వర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపు డగు.

కొఱవ - ఇది కులవాచకము. కొఱవజాతి స్త్రీయని చెప్పునప్పుడు కొఱవ+త = కొఱవత యని యగు. ఇట్లు చాకిత - వాసెత - ప్రేత - సాలెత - బోయిత - బోయత లోనైనవి.

సూ॥ ౩౦. తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు.

బోయెత - చెంచెత - మాలెత. చెంచిత యని ఇకారంబును నగు.

సూ॥ ౩౧. చెడుగు-దుడుకు-నిడుపులకుఁ బుంస్త్వంబునం దకారం బగు.

చెడుగు+ఁడు = చెడుగు+అ+ఁడు=చెడుగఁడు. ఇట్లు దుడుకఁడు-నిడుపఁడు.

సూ॥ ౩౨. యువతి - విటీ - రజస్వలలు గుబ్బెత - మిండత- ముట్టుతలు నాఁబడుదురు.

యువతి = ప్రాయపుస్త్రీ గుబ్బెతయనియు, విటకత్తె - మిండతయని యు, ముట్టైనస్త్రీ ముట్టుత యనియు ననఁబడుదురు.

సూ॥ ౩౩. వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబునం దాఁడును, స్త్రీవాచ్యం బగునపు డాఁడియు నగు.

వగ - దీనికి బహువచనము వగలు. పుంలింగమున 'ఆఁడు' చేర్పఁగా వగలాఁడు అనియు స్త్రీవాచ్యం బయినప్పుడు వగలాఁడి యగుననియు తెలియునది. ఇట్లు మాయలాఁడి.

వగ - చిన్నె - పలుకు - వన్నె - దొమ్మి - ఎమ్మె - మాయము - బిఢదు. లోనైనవి వగాదులు.

పుంలింగప్రత్యయము 'ండు' అనియు, ఉచ్చారణమున సుఖమునకై 'ఆ' చేర్పఁబడి 'ఆఁడు' అయ్యె ననియు సంస్కృతమునందువలె స్త్రీలింగ ప్రత్యయమైన 'ఇ' పరముకాఁగా 'ఆఁడి' యయ్యెననియు గ్రహించునది. చూ ప్రథమభాగము ౧౨౪-వ పుట.

ఈ 'ఆఁడు' ప్రత్యయము 'వాఁడు - కాఁడు' లోనగు శబ్దంబులం దున్నను అచ్చట వాఁడి - విలుకాఁడి యని స్త్రీలింగరూపంబులు రావు.

సూ॥ ౩౮. ముక్కులోనగువానికి వాని లేమిని దెలుపుచో నిఁడివర్ణకం బగు.

ఇఁడి ప్రత్యయ మొకశబ్దమునకుఁ జేర్చినపుడు దానిలేమిని సూచించును. ముక్కు + ఇఁడి = ముక్కిఁడి - ముక్కు లేనివాఁ డని యర్థము. వాలు - వాలిఁడి; వెరవు - వెరవిఁడి; ఇట్లు సిగ్గిఁడి - ఉప్పిఁడి లోనైనవి. చూ. సంజ్ఞా. సూ. ౩౦. మతుబర్థప్రత్యయములు ముగిసెను. ఉప్పిండి తిండి పోతుల నోళ్లఁబడి యుప్పుపిండి యయ్యెను.

సూ॥ ౩౯. 'ఇ' వర్ణకంబు కొన్నిచోటుల లేమిని దెలుపును.

గ్రుడ్డు+ఇ = గ్రుడ్డి. కొన్నిచోటుల 'గల' యను నర్థంబునను. నల్ల + ఇ = నల్లి నల్లనఁగా నెత్తురు.

సూ॥ ౪౦. కలయను నర్థంబున 'అ' యగు.

ఉ. చెలువు + అ = చెలువ. దున్న + అ = దున్న.

సూ॥ ౪౧. పరిమాణార్థంబునఁ బ్రథమైకవచనంబునందు ఎఁడు వర్ణకం బగు.

కొలఁతను దెలుపునర్థమందుఁ బ్రథమావిభక్తి ఏకవచనమందే 'ఎఁడు' ప్రత్యయము వచ్చును. ఉ తూమెఁడు - మూరెఁడు - జెత్తెఁడు - వీసెఁడు

జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు - ఓడెఁడు - లోనైనవి. కుంచము+ఎఁడు = కుంచెఁడు; చిక్కము+ఎఁడు=చిక్కెఁడు అని రూపంబులు, ఇందు మువర్ణకలోపము.

సూ॥ ౩౯. ఎఁడువర్ణకము పరంబగునపుడు లివర్ణము లోపించు.

కమికలి + ఎఁడు = కమికెఁడు; పట్టిలి + ఎఁడు = పట్టెఁడు. ఇట్లు కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - ప్రిడిసెఁడు - సందెఁడు - పుక్కెఁడు లోనైనవి.

సూ॥ ౪౦. దఘ్నార్థంబున బంటి - కోలఁదు లు సర్వత్ర యగు.

దఘ్నార్థమున ననఁగా లోఁతును దెలుపుటయందు బంటి - కోలఁది యను ప్రత్యయములు వచ్చును.

మోఁకాలిబంటి - మోఁకాటికోలఁది; బొమ్మబంటి - బొమ్మకోలఁది. సర్వత్ర యనుటచేఁ దత్సమశబ్దంబులమీఁదను నివి వచ్చును. కటిబంటి. ఈ యర్థంబున సంస్కృతప్రత్యయమైన 'మాత్రము' అనునదియు వచ్చును. ఏమాత్రము నీవు? గిరిగెల మాత్రము.

సూ॥ ౪౧. ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబుల మీఁదను మయట్ ప్రత్యయము చూపట్టెడు.

మిక్కుటమను నర్థము తెలుపు 'మయము' అను ప్రత్యయము తెనుఁగు పదంబులమీఁదను వచ్చును. ఉ. తేనెమయము - తేమమయము.

సూ॥ ౪౨. మతుబర్థంబున నవర్ణకం బెందేనియగు.

ఉ. దివ్యతేజంబుననాఁడు=దివ్యతేజముగలవాఁడు.

ఇవిగాక మఱికొన్ని వర్తకంబులును ప్రయోగంబులుఁ గలవు. ఉ. మంటమారి - తంటలమారి - నిదురపోతు - తూఁగుపోతు - తిండిపోతు - ఇవి స్వభావమును దెలుపును.

అడపము = తాంబూలపుసబ్బి లేక తిత్తి వానినుంచుకొని యుండు వాఁడు అడప.

పెండ్లి - వివాహము - వివాహమైన స్త్రీ పెండ్లము. ఇట్టివి యనార్య ప్రయోగంబుల నెఱుంగునది.

Vidyu Venkata Ramaraju
AYURVEDA PRACTIONER

## క్రియాపరిచ్ఛేదము.

క్రియలు తత్సమములు, ఆచ్ఛికములు అని రెండు విధంబులు.

సూ॥ ౧ సంస్కృతధాత్వాదులకు 'ఇంచు' చేర్పంగానైనవి తత్సమక్రియలు.

ఉ. రంజించు - ఘటించు - పోషించు - నుతించు స్తుతించు - హరించు ఇత్యాదులు.

చేయు-కొట్టు-తిట్టు-పయనించు, లోనగునవి అచ్ఛికక్రియలు. ఇవి సకర్మకములు అకర్మకములు - అని రెండువిధంబులు.

సూ॥ ౨. కర్మమును గోరునది సకర్మకము.

ఉ. కుమారుఁడు శత్రువులను గొట్టును. కొట్టును అనఁగానే యెవని నని ప్రశ్నింపఁగా 'శత్రువులను' అని కర్మమును దెలుపుచున్నది. కాన కొట్టు ధాతువు సకర్మకము.

సూ॥ 3. కర్మమును గోరనిది అకర్మకము.

ఉ. అవివేకి పట్టినకార్యము పాడగును. ఇచట 'పాడగును' అనునది క్రియ. 'ఎవనిని' 'దేనిని' అని యడుగుటకు వల్లలేదు. కావున నిది అకర్మకము.

ఇవి సమాపకక్రియలు. అసమాపకక్రియలని రెండు విధములు.

సూ॥ ౪. కార్యము కొఱఁతలేక ముగియునట్లు చెప్పునది సమాపకక్రియ.

ఉ. వాఁడు వచ్చెను. వీఁడు పోయెను.

సూ॥ ౫. కార్యము పూర్ణముగ ముగియనట్లు చెప్పునది యసమాపక క్రియ.

ఉ. హనుమంతుఁడు సముద్రము దాఁటి లంకఁ జొచ్చి సీతఁ జూచి మాటలాడి రాక్షసులఁ జంపి లంకఁ గాల్చి మరలి వచ్చెను.

ఇందు దాఁటి - చొచ్చి - చూచి - మాటలాడి – చంపి - మరలి యివన్నియు నసమాపక క్రియలు. వచ్చెను - సమాపక క్రియ. వాఁడు వచ్చుచుఁ బోవుచు నాతో మాట్లాడెను. వచ్చుచు - పోవుచు. అసమాపక క్రియలు.

అసమాపక క్రియలు క్రియాకాంక్షాసమాపకము లని నామాకాంక్షాసమాపకము లని రెండు విధములు.

సూ॥ ౬. క్త్వార్థకము లోనగు క్రియలు క్రియాకాంక్షాసమాపకములు.

ఉ. హనుమంతుఁడు లంకఁ జొచ్చి సీతను జూచెను. ఇచటఁ జొచ్చి యనునది యసమాపక క్రియ. 'లంకఁ జొచ్చి' యనఁగానే 'ఏమిచేసెను' అను ప్రశ్నము రాఁగా (సీతను) జూచెను అని ప్రత్యుత్తరము. ఈ 'చూచెను' క్రియ గావున నిది క్రియాకాంక్షాసమాపకము.

సూ॥ ౭. క్రియాజన్య విశేషణములు నామాకాంక్షాసమాపకములు.

చదివెడు బాలుఁడు. ఇచ్చటఁ 'జదివెడు' క్రియాజన్యవిశేషణము. చదివెడువారెవరు? అని ప్రశ్న. బాలుఁడు అని ప్రత్యుత్తరము. ఇది నామవాచకము. 'చదువు' అను ధాతువువలనఁ గలిగిన విశేషణము చదివెడు కావున 'చదివెడు' క్రియాజన్య విశేషణము. ఆకాంక్ష=చూ. వాక్యపరిచ్ఛేదము. సూ. ౨.

క్రియలు వర్తమానార్థకము - భూతార్థకము - భవిష్యదర్థకము - తద్ధర్మార్థకము అని నాలుగు విధంబులు.

సూ॥ ౮. జరుగుచున్న కాలమును దెలుపునది భవిష్యదర్థకము.

అనఁగా నొకవిషయమై మాటలాడుచున్నప్పటికా కార్యము ముగియక జరుగుచున్నయెడ నది వర్తమాన మనఁబడును. దీనిని 'లట్టు' అందురు.

ఉ. రాముఁడు వచ్చుచున్నాఁడు. అనఁగా నీమాట చెప్పఁబడు సమయమునందు వచ్చుట అనుకార్యము రామునిచేఁ జేయఁబడుచున్నది. అది యప్పటికి ముగియలేదని అప్పటికిఁ బ్రారంభము గాక యుండలేదని యర్థము.

సూ॥ ౯. కడచిన కాలమును దెలుపునది భూతార్థకము.

ఉ. రాముఁడు వచ్చెను. అని చెప్పినయెడల 'వచ్చుట' యనుకార్యమీమాట చెప్పుటకు ముందే ముగిసినదని, యాకార్య మప్పటికి జరుగుచుండుట లేదని యది యిఁకమీఁదఁ బ్రారంభము కాఁబోదని యర్థము. దీనిని లిట్టు అందురు.

సూ॥ ౧౦. రాఁగల కాలమును దెలుపునది భవిష్యదర్థకము.

ఉ. రాముఁడు రాఁగలఁడు. అనఁగా 'వచ్చుట' యనుకార్య మంతకు ముందు జరగియుండలేదని, యిప్పుడు జరగఁ బ్రారంభము కాలేదని యిఁక ముందది జరుగునని యర్థము. దీనిని 'ౢట్టు' అందురు.

సూ॥ ౧౧. మీఁదఁ జెప్పంబడిన మూఁటికన్న వేఱై యా మూఁడు కాలముల యర్థమునం దుపయోగింపఁబడునది తద్ధర్మార్థకము.

దీనిని 'లాట్టు' అందురు.

సూ॥ ౧౨. తద్ధర్మ - తచ్ఛీల - సంభావనా - సంప్రశ్న - సాతత్య - వర్తమాన - భావి - వ్యాశీ రాదులందుఁ దద్ధర్మాద్యర్థక మగు.

తద్ధర్మము. ఉ. వర్తకుఁడు వ్యాపారమును జేయును. (ధర్మము.)

తచ్ఛీలము. ఉ. నీళ్లు పల్లమునకుఁ బాఱును. (స్వభావము)

సంభావన. ఉ. వాఁ డిప్పుడు వచ్చును. (ఊహ.)

సంప్రశ్నము. ఉ. ఇచ్చెదవా యీయవా? (అడగుట.)

సాతత్యము. ఉ. భూమి గుండ్రముగ నుండును. (ఎల్లప్పుడుండునది.)

వర్తమానము. ఉ. ఆమాట మఱచినను మఱవు రాదయ్యెడి.

భావి. ఉ. ఱేపు వర్షము వచ్చును. (రాఁబోవునది.)

ఆశీస్సు. ఉ. భగవంతుఁడు నిమ్ము రక్షించును. (దీవన)

సమాపక క్రియాపదంబులకు ఉత్తమపురుషము - మధ్యమపురుషము - ప్రథమపురుషము అని మూఁడు పురుషములు గలవు.

సూ॥ ౧౩. త న్నుత్తమపురుషము.

తన్ను గుఱించి తానే చెప్పుకొన్నయెడల నుత్తమపురుషము. దీనికి 'నా' శబ్దము కర్తగానుండును.

ఉ. నేను వచ్చితిని. అని యీ చెప్పినవాఁడు తన్ను గుఱించి తానే చెప్పుకొనుచున్నాఁడు. 'వచ్చితిని' అను క్రియకు 'నేను' కర్తగానున్నది. కావున 'వచ్చితిని' ఉత్తమపురుష క్రియ. ఇచ్చట 'నేను' లోపించినను దోషము లేదు.

సూ॥ ౧౪. ఎదురు మధ్యమ పురుషము.

ఎదుటనుండువానిని గుఱించి చెప్పునది. దీనికి 'నీ' శబ్దము కర్తగా నుండును. ఉ. నీవు వచ్చితివి. ఇది యొకఁడు తనయెదుటనుండువానితో నతనిగుఱించి చెప్పునది 'నీవు' కర్త. కావున 'వచ్చితివి' మధ్యమపురుష క్రియ.

సూ॥ ౧౫. ఎక్కడెక్కడనో ప్రథమ పురుషము.

తన్ను గుఱించి గాక యెదుటివాని గుఱించి గాక యితరుల గుఱించి చెప్పినఁ బ్రథమపురుషమగు. దీనికి నామవాచకముగాని 'నా - నీ' శబ్దములు తప్ప మిగిలిన సర్వనామశబ్ద మేదైనను గర్తగానుండును. ఉ. రాముఁడు వచ్చెను. అందఱు బాగున్నారు. వచ్చెను - ఉన్నారు. ప్రథమపురుష క్రియలు.

| | | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| ఉత్తమపురుష ప్రత్యయములు. | | ను | ము. |
| మధ్యమపురుష | ,, | వు | రు. |
| ప్రథమపురుష | ,, | (డుజ్) ఁడు. | రు. |
| ఉదా. | వర్త. | భూత. | భవి. |

| | | | | |
|---|---|---|---|---|
| ఉ. పు. ఏక. | వచ్చుచున్నాఁడను. | వచ్చితిని. | రాఁగలను. |
| బహు. | వచ్చుచున్నాము. | వచ్చితిమి. | రాఁగలము. |
| మ. పు. ఏక. | వచ్చుచున్నాఁడవు. | వచ్చితివి. | రాఁగలవు. |
| బహు. | వచ్చుచున్నారు. | వచ్చితిరి. | రాఁగలరు. |
| ప్ర. పు. ఏక. | వచ్చుచున్నాఁడు. | వచ్చెను. | రాఁగలఁడు. |
| బహు. | వచ్చుచున్నారు. | వచ్చిరి. | రాఁగలరు. |

ఈ ప్రత్యయములు మహదర్థకమం దగు.

అమహదర్థకమందు ప్ర. పు. దు. వు.

ఇవి 'ఉన్న' అనుదానికి ననుబంధములైన ది. వి.

యగు.

అనుబంధ మనఁగా శబ్దమునకుఁ గడపటఁ జేర్చి చెప్పుట.

ఉదా. ఏక. అది రాఁగలదు. బ. అవి రాఁగలవు.

అది వచ్చుచున్నది. బ. అవి వచ్చుచున్నవి.
మహత్యర్థమందు బహువచనప్రత్యయములు మహత్తునకువలె నగు.

## వర్తమానార్థకము (లట్టు)

సూ॥ ౧౬. ఉదంత ధాతువులకు వర్తమానంబున 'ఉన్న' యనుబంధ మగు. అగుచో ముందు 'చు' వర్ణకం బగు.

ఉ. 'వచ్చు' ధాతువు. ఇవి 'ఉ' త్వము కడపటఁ గలది. దీనిని వర్తమానార్థకమునఁ జెప్పవలసినయెడల వచ్చు+చు+ఉన్న=వచ్చుచున్న, యగు, ఇట్లులే రక్షించుచున్న మొదలయినవి

డి, వి, దక్కఁదక్కిన ప్రత్యయములు పరమైనపుడు 'ఉన్న' దీర్ఘాంత మగు. ప్ర. ఉ. వచ్చుచు+ఉన్న +ఁడు = వచ్చుచున్నాఁడు. ఇట్లే ప్ర. బ. వచ్చుచున్నారు. ఉ. వచ్చుచున్నాను - వచ్చుచున్నాము. మధ్య. వచ్చుచున్నావు. బ. వచ్చుచున్నారు. ప్ర. వచ్చుచున్నది - వచ్చుచున్నవి.

## భూతార్థకము (లిట్టు.)

సూ॥ ౧౭. భూత · తద్ధర్మాద్యర్థకంబులం దేకవచనంబున ఎను - ను వర్ణంబు లగు.

అనఁగా భూతంబున ఉదంతి ధాతువునకు ప్రథమపురుషైకవచనంబు 'ఎను' వర్ణంబును, తద్ధర్మంబున 'ను' చేర్పఁబడును. ఉ. భూ. వచ్చు+ఎను= వచ్చెను. తద్ధ. వచ్చు+ను=వచ్చును.

సూ॥ ౧౮. అన్వర్థంబున భూతంబునకుఁ దద్ధర్మాద్యర్థకం బగు.

అన్వర్థమున ననఁగా 'అనుట' యనునర్థంబున భూతార్థమునకుఁ దద్ధర్మార్థక ముపయోగింపవచ్చును. అనుట - చెప్పుట-పలుకుట లోనగునవి యన్వర్థపదంబులు.

'విశ్వామిత్రుఁడు రామున కనియెన్' అనుటకుబదులు విశ్వామిత్రుఁడు రామున కనున్ అనియుఁ జెప్పవచ్చును.

సూ॥ ౧౯. భూతంబున ధాత్వంతోత్వ మిత్వ మగు.

భూతార్థకంబున ధాతువు కడపటి ఉకారము ఇకార మగును. ఉ. వచ్చు + ఇ = వచ్చి, చూచు + ఇ = చూచి. వీనికి మధ్యమోత్తమ ప్రత్యయంబులు పరంబులగునపుడు 'తి' వర్ణకంబగు. ఉదా. వచ్చి + తి + ము. వచ్చి+తి+ను. మ. వచ్చి+తి+వు. వచ్చి+తి+రు.

సూ॥ ౨౦. ఇత్వంబుమీఁది ను ము వు రు-ల కిత్వం బగు

వచ్చి + తి + ని = వచ్చితిని - వచ్చితిమి - వచ్చితివి - వచ్చితిరి.

భవిష్యదర్థకము (లృట్టు.)

సూ॥ ౨౧. భవిష్యదర్థకంబున 'కల' (కలజీ) యగు.

ఉ. చేయఁగల, చూడఁగల. జీ బిందువును సూచించును.

సూ॥ ౨౨. కల - పడు (పడుజీ) లును, ప్రార్థనాదులైన ఇమ్ము - కదె - కదవె - లును, అగుధాతువున కన్నంతరూపంబులును, బరంబులైనపుడును, దుమున్నర్థ భావలక్షణంబులను ధాతువు లన్ప్రత్యయాంతము లగు.

అన్ప్రత్యయాంతము లనఁగా అన్ అను ప్రత్యయము కడపటఁ గలవి.

చేయు + కల = చేయన్ + కల = చేయఁగల - చేయంగల.

చేయు + పడు = చేయన్ + పడు = చేయఁబడు.

చేయు + ఇమ్ము = చేయన్ + ఇమ్ము = చేయనిమ్ము.

చేయు + కదె = చేయన్ + కదె = చేయఁగదె.

చేయు + కదవె = చేయన్ + కదవె = చేయఁగదవె.

తుమున్నాద్యర్థకము. ఉ. చేయఁ బ్రయత్నించెను.

భావలక్షణము. ఉ. వీఁడుచేయ నతఁడు చూచెను.

అగుధాతువున కన్నంతరూపంబులు కన్ - కాన్. ఉ. చేయఁగన్ చేయఁగాన్.

సూ॥ ౨౩. జిత్తు పరంబగునపుడు ధాతువు కడపటి యుకార మకారమగు.

చేయమి - చేయకుము - చేయని - చేయఁడు - చేయదు - చేయను - చేయవు - చేయరు.

అనఁగా, కలజి - పడుజివలె నేయే ప్రత్యయములకు 'జి' చేర్పఁబడునో యవి పరమైనపుడు ధాతువు కడపటి ఉకారము అకారముగ మాఱును.

### తద్ధర్మాద్యర్థకము (లాట్టు.)

సూ॥ ౨౪. తద్ధర్మాద్యర్థకంబున డుఃజితరంబులు పరంబులగునపుడు దుగాగమం బగు.

ఉ. చేయుదును = చేయుదుము.

మ. చేయుదువు = చేయుదురు.

ప్ర. చేయును = చేయుదురు.

డుజితరంబులు = డుజ్ఞునకంటె నన్యములైనవి. (చూ. క్రియ. సూ. ౧౫.

సూ॥ ౨౫. తద్ధర్మంబున డుజేతరంబులు పరంబు లగు నపుడు 'ఎద'యును, 'ను' వర్ణకంబు పరంబగు నపుడు 'ఎడి' 'ఎదు'లును బహుళంబుగ నగు.

ఉ. వచ్చెదను - వచ్చెదము. మ. వచ్చెదవు - వచ్చెదరు. ప్ర. వచ్చెడిని - వచ్చెదును - వచ్చెదరు. ఈ ప్రత్యయములు ప్రాయికంబుగ వర్తమానమందు నగు.

సూ॥ ౨౬. భూతతద్ధర్మంబుల వకారంబునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. వినితివి - వినితి; వినుదువు - వినుదు; వినెదవు - వినెదు.

సూ॥ ౨౭. తిర్యగ్జడంబులు కర్త లైనచో భూతతద్ధర్మార్థక ప్రథమాబహువచనంబున నేకవచనం బగు.

ఉ. చిలుకలు రంజిల్లె - రంజిల్లు - రంజిల్లెడి; చిగుళ్లు విలసిల్లె - విలసిల్లు - విలసిల్లెడి.

సూ॥ ౨౮. తద్ధర్మభూతక్రియలకు నన్నాదులు పరము లైనచోఁ బ్రశ్నార్థకంబు లగు.

ఉ. పెద్దలగు వారి నెపుడు సేవింతువన్న? జగడగొండివి గాకుండఁ జదువుదయ్యా?

అన్నాదులు. చూ. సంధి. సూ. 3.

సూ॥ ౨౯. అన్నాదిపరకం బయిన తద్ధర్మక్రియ ప్రశ్నార్థకం బయి వ్యతిరేకార్థంబు సూచించు.

ఉ. శీలమును నీవు మఱవంగఁ జెల్లునయ్యా; పాడియయ్యా యిట్టిపనికిఁ బనుప?

ఈ యర్థంబున నన్నాదులకు ముం దటుశబ్దంబును నగు. ఉ. పాడి యటయ్యా = పాడి + అటు + అయ్యా; కలదటయ్యా?

## ఆశీరాద్యర్థకము (లోట్టు.)

సూ॥ 3౦. ఆశీరాద్యర్థకంబున 'ఎడు' 'త' వర్ణకంబు లగు, ఇవి ద్రుతాంతంబులు.

ఆశీ ఉ. శ్రీరాముఁడు ప్రసన్నుఁ డయ్యెడును. మీకు జయంబగుతన్. శాపమునకు ఉ మీరు వంధ్య లయ్యెదరు గాతన్.

సంప్రార్థనంబునకు, ఉ. లక్ష్మి నన్నుఁ గటాక్షించెడున్.

ఆశీరాదులనఁగా ఆశీస్సు - శాపము - సంప్రార్థనము - విధి. వీనిని 'లోట్టు' అందురు.

సూ॥ 3౧, ఆశీరాద్యర్థంబునఁ 'గాక' యను నవ్యయంబు నగు.

ఉ. నీకు మేలు గలిగెడుఁ గాక. కలుగుఁగాక. ఇది కళ.

సూ॥ 3౨. విధ్యర్థంబున నెడు త-లకు మాఱుగ నుగాగమ పూర్వకంబయిన 'యది' యగు.

ఉ. నీవు రేపు వచ్చునది.

సూ॥ 33 ఎడు త-ల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారం బగు.

ఉ. నీకు జయం బయ్యెడు మని. నీకు మేలగుత మని. (అయ్యెడున్ + అని = అయ్యెడుమని. అగుతన్ + అని = అగుతమని.)

సూ॥ 3౪. ఆశీరాద్యర్థక మధ్యమపురుషంబున ము డుఁజు లగు.

అనఁగా ఆశీరాదులందు మధ్యమపురుషైక వచనంబున 'ము' బహు వచనంబున 'ఁడు' అగును.

ఆశీస్సు. నీవు భాగ్యవంతుఁడ వగుము. మీరు భాగ్యవంతులరగుఁడు.

శాపము. నీవు వంధ్య వగుము. మీరు వంధ్యల రగుఁడు.

సంప్రార్థనము. నాకీకార్యముఁ జేయుము. నాకీకార్యముఁ జేయుఁడు.

విధి. నీవు వెడలిపొమ్ము. మీరు వెడలిపొండు.

సూ॥ ౩౫. ఉభయప్రార్థనంబున 'దు', 'ద' యగు.

మన మిద్దఱము కలిసి యొకకార్యముఁ జేయుద మనుకొనుట తెలుపు నది యుభయప్రార్థనార్థకము. అందు ౨౭-వ సూ. ప్ర. వచ్చు 'దు,' 'ద యగు.

ఉ. వండుదము - తినుదము - పోదము.

సూ॥ ౩౬. వ్యతిరేకంబున మధ్యమ పురుషంబున 'కు' వర్ణకం బగు.

మధ్యమపురుషంబున చేయుము - చేయుఁడు అని యుండఁగా నీసూత్రముప్రకారము చేయుకుము - చేయుకుఁడు అని యయి ౨౩-వ సూ. ప్ర. చేయకుము - చేయకుఁడు అయ్యెను.

సూ॥ ౩౭. ప్రార్థనాద్యర్థక మధ్యమమునకు నదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.

ఉ. చేయుము - చేయుమా. చేయుమి - చేయుమీ. అదాదు లనఁగా అ ఆ ఇ ఈ ఎ ఏ ఒ ఓ అమ్మ - అయ్య, ర - రా, ఇత్యాదులు.

సూ॥ ౩౮. ప్రార్థనార్థక మధ్యమపురుషంబున నదాదు లనుప్రయుక్తంబు లగుచో ము డుఙ్డులకు వు - రు లగు.

అదాదులందు ఎ మొదలుకొని యుండునవి ఎదాదులు.

ఎ ఏ ఒ ఓ అన్న-అయ్య, అమ్మ-అప్ప, ర-రా ఇత్యాదులు ఎదాదులు.

ఉ. చేయుము + ఎ=చేయువు + ఎ = చేయవు + ఎ (సూ. ౨౩.) = చేయవె. ఇట్లు చేయవే - చేయవొ - చేయవో - చేయవన్న - చేయవయ్య - చేయవమ్మ - చేయర - చేయరా ఇత్యాదులు. చేయుమి+అయ్య = చేయుమయ్య అనునదియు సాధువని తోఁచెడి. (సంధి. ౭ వ సూ.) వినురా - కనురా - చేయురా యిత్యాదు లసాధువులు.

సూ॥ ౩౯. వ్యతిరేకప్రార్థనంబున నన్నాదు లనుప్రయుక్తంబు లైనపుడు వు రు లు రావు.

ఉ. త్రిప్పకుమన్న - చెప్పకుమన్న - తప్పకుమన్న - అనకుమయ్య.

సూ॥ ౪౦. ప్రార్థనంబునఁ గద - కదవు లన్నాదిపరకంబు లయి యుండు.

ఆది శబ్దముచే ఎ ఏ - లును గ్రహింప నగు

ఉ. చెప్పఁగదె - చెప్పఁగదవె - చెప్పఁగదన్న - చెప్పఁగదవన్న - మొద.

సూ॥ ౪౧. ప్రార్థనాదులం దిమ్మునకు నీ విభాష నగు.

ఉ. చేయనిమ్ము - చేయనీ - రానిమ్ము - రానీ - పోనిమ్ము - పోనీ

సూ॥ ౪౨. టవర్ణకంబు భావార్థకంబునం దగు.

ఉ. చేయుట - వచ్చుట. ధాత్వర్థము భావము.

సూ॥ ౪౩. పూర్వాదులు పరంబులగుచో భావంబున వ్యతిరేకక్త్వార్థకరూపంబు విభాష నగు. ఉండు దీని కనుప్రయుక్తం బగుటయుఁ గలదు.

ఉ. చేయుటకుఁ బూర్వము - చేయకపూర్వము.

పూర్వము - మున్ను - ముందు - మునుపు - తొల్లి ఇవి పూర్వాదులు.

ఉ. తోయజమిత్రుఁడు గ్రుంకకముందు మున్న - గ్రుంకకమున్న.

సూ॥ ౭౭. కొఱకు - కంటె - పొంటెలు పరంబు లగు నపుడు భావ టవర్ణకంబునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. చేయుటకొఱకు - చేయుకొఱకు, చేయుటకంటె - చేయుకంటె- చేయుటపొంటె - చేయుపొంటె.

సూ॥ ౭౮. వ్యతిరేకభావార్థంబున 'మి' (మిజ్) యగు.

ఉ. చేయు+మి=చేయుమి (సూ. ౬౩.)

సూ॥ ౭౯. ఇవర్ణకంబు క్త్వార్థంబున నగు.

ఉ. చేసి - వచ్చి - కొట్టి.

ఒక యాశ్రయమే గలక్రియలలో ముం దేదిజరిగియుండుట తెలుపునో దానిఁ దెలుపు క్రియకుఁ గ్త్వార్థకమని పేరు. అది 'ఇ' వర్ణాంతముగ నుండు. హనుమంతుఁడు సముద్రముదాఁటి లంకఁజొచ్చెను. ఇచ్చట దాఁటుట యనుక్రియ యొక్కయు చొచ్చుట యనుక్రియ యొక్కయు, వ్యాపారమున కాశ్రయమైనవాఁడు హనుమంతుఁడు. ఈరెండు కార్యములలో ముందు దాఁటుట యనుకార్యము చేయఁబడెను. కావున ఆ 'దాఁటు' ధాతువునకు 'ఇ' వర్ణకము వచ్చెను. రాఁగా 'దాటి' యని యయ్యె.

భీమునిచేఁ గర్ణుఁడు కొట్టంబడి పరువెత్తె. ఇచ్చటఁ గొట్టుట యను కార్యమొనర్చినవాఁడు భీముఁడు అయినను కొట్టుపడుటకును-పరువెత్తుటకును - ఆశ్రయమైనవాఁడు కర్ణుఁడు. ఈరెంటిలో ముందు జరగినది కొట్టఁబడుట. కావున దానికి 'ఇ' వచ్చి 'కొట్టఁబడి' యయ్యె. వాఁడు గుఱక వెట్టి నిద్ర పోవుచున్నాఁడు ఇది యపవాదము. నిద్రపట్టినపిమ్మట నే గుఱుక వెలువడును,

సూ॥ ౪౭. (కజీ) కవర్ణకంబు వ్యతిరేక క్త్వార్థకంబునం దగు.

ఉ. చనక - వినక. (సూ. 33.)

సూ॥ ౪౮. "ఇనన్" చేదర్థంబునం దగు;

ఉ. వాఁడు వచ్చినన్ నేను బోయెదను. 'ఏని' యనునర్థము కలది చేదర్థము. 'వచ్చినన్' అనఁగా వచ్చెనేని యని యర్థము.

సూ॥ ౪౯. ఆనంతర్యంబున డు న్వర్ణకం బగు.

ఉ. చేయుడున్ - అనుడున్. చేయుడున్ అనఁగాఁ జేసిన యనంతరము (=పిదప.)

సూ॥ ౫౦. భావటవర్ణకంబునకు 'న' శబ్దం బనుప్రయుక్తం బయి యానంతర్యార్థకంబు కొండొకచో నగు.

ఉ. వాలి యిట్లు చెప్పుటయు, అనఁగాఁ జెప్పిన యనంతరము.

సూ॥ ౫౧. తుమున్నాద్యర్థకమునకుఁ 'గన్-గాన్' పరమై యానంతర్యార్థక బోధకంబు నగు.

ఉ. ఇట్లు చెప్పఁగన్ - చెప్పఁగాన్.

సూ॥ ౫౨. చున్ వర్ణకంబు శత్రర్థంబునం దగు.

ఉ. వచ్చుచున్ (పోవుచున్. దీనికిఁ గ్రియతో నన్వయము. ఉ. చూచుచుం బోవుచున్నాఁడు. చూచుచుం బోయెను. చూచుచుంబోవఁ గలఁడు

సూ॥ ౫౩. తద్ధర్మాద్యర్థక విశేషణంబున నెడి-యెడు లగు.

ఉ. వీనికి లోపంబు బహుళంబు. ఉ. వచ్చువాఁడు. వచ్చెడివాఁడు-(ఎడి) వచ్చెడువాఁడు (ఎడు)

సూ॥ ౫౪. 'ఉన్న' వర్తమానార్థక విశేషణంబున నగు.

ఉ. వచ్చుచున్నవాఁడు (చూ. సూ. ౧౬.)

సూ॥ ౫౫. 'ఇన' భూతార్థక విశేషణంబున నగు.

ఉ. వచ్చిన రాముఁడు.

సూ॥ ౫౬. (కలజీ) 'కల' భవిష్యదర్థక విశేషణంబున నగు.

ఉ. చూడఁగల పురుషుఁడు.

సూ॥ ౫౭. 'ని' వ్యతిరేకతద్ధర్మార్థక విశేషణంబున నగు.

ఉ. చూడని వస్తువు.

సూ॥ ౫౮. (పడుఀజీ) పడ్వనుబంధము కర్మార్థకంబున నగు.

ఉ. చూడఁబడుచున్నాఁడు - చూడఁబడుచున్నది. చూడఁబడుట - చూడఁబడని మొ॥ (చూ. సూ. ౨౨.)

సూ॥ ౫౯. లఘువు లయి, యకారాంతములుగాని యేకస్వర ద్విస్వర ధాతువుల కించుగ్వక్రంబులు పరంబు లగునపుడియుడాగమంబు విభాష నగు.

ఉ. వచ్ దీనియం దొక యచ్చుమాత్రమున్నందున నేకస్వరధాతువు.

నగు. దీనియం రెండచ్చులున్నందున నిది ద్విస్వరధాతువు. వచ్. దీనియందు గురువులు లేవు*. యకారము గడపటలేదు. కావున దీనికి ఇంచు (ఇంచుక్) పగ్రముకాఁగా వచ్ + ఇంచు = వచించు అని యయ్యె.

---

*వచ్. ఇచట వకారము చ్ పొల్లుతోఁ గూడియున్నందున గురువని తలంపరాదు. దీర్ఘాక్షరములును బిందు సంయుక్త పరకంబులును నిందు గురువులు. ఇచ్చట గ్రహింపవలసినది పూర్ణాక్షరము 'వ' మాత్రమే.

ఇయుట్ ఆగమముగ రాఁగా వచ్ + ఇయు + ఇంచు = వచియించు అని యయ్యె. సంస్కృతధాతువులకు వక్రంబులు (ఎ ఏ ఒ ఓ-లు) పరములు గావు.

† తెగు. ఇది రెండుస్వరములు గలధాతువు. దీనికి ఇంచుపరముకాఁగా ఇయు ఆగమముగ రాఁగా తెగు + ఇయు + ఇంచు = తెగియించు అనియు ఆగమము రానపుడు తెగు + ఇంచు = తెగించు అనియు రూపంబులు. 'లఘువు' లని చెప్పినందున యాచ్ - అర్థ అనుధాతువులు యాచించు - అర్థించు అని మాత్రమే యగును గాని యాచియించు అర్థియించు అని కావు.

'యకారాంతములుగాని' యన్నందున నయ్ - నయించు అని మాత్రమే యగు.

'ఏకస్వరద్విస్వరంబు' లనుటచే ఒనరు=ఒనరించు అని మాత్రమే యగు. ఇందు మూఁడు స్వరములున్నవి.

ఈ యియుఁడాగమంబు కొండొకచోఁ బ్రాదియోగంబున నగు. ఉ. పరిత్యజియింపక. (భోజరాజీయము.) సన్నుతియింపక. (చిన్నయ్య సూరి నీతిచంద్రిక.)

కొండొకచో ననుట ప్రయోగవైరళ్యంబు సూచించు.

సూ॥ ౬౦. పడ్వాదుల 'నిన' వర్ణకంబున కత్వంబును గడ హల్లునకు ద్విత్వంబును విభాష నగు.

ఉ. పడు+ఇన=పడిన; పడు + అ = పడ = పడ్డ. ఇట్లు ఇడ్డ - చెడ్డ - తగ్గ - అన్న - కన్న - కొన్న - తిన్న - మన్న - చన్న - విన్న.

పడు - ఇడు - చెడు - తగు - అను - కను - కొను - తిను - మను-విను - చను ఇవి పడ్వాదులు.

---

† వక్రములు పరమైనపుడు తెగె - తెగియె నని రూపంబులు.

క్రియలు పరస్మైపదములని యాత్మనేపదములని రెండు విధములు.

సూ॥ ౬౧. క్రియాఫలము కర్తనుగాక యితరునిఁ జెందుచోఁ బరస్మైపదం బగు.

ఉ. వండుచున్నాఁడు. అనఁగా వంటకమును వండినవానికిఁ గాక యితరులకని యర్థము. ఇట్లు తన్నుచున్నాఁడు తట్టుచున్నాఁడు.

సూ. ౬౨. క్రియాఫలము కర్తను జెందుచో నది యాత్మనేపద మనఁబడును. ఆత్మనేపదమందుఁ గొనుధాతు వనుప్రయుక్త మగు.

ఉ. వండుకొనుచున్నాఁడు. వంటకము చేసినవాఁడే తినువాఁడని యర్థము. ఇట్లు తన్నుచున్నాఁడు తన్నుకొనుచున్నాఁడు భేదముగ్రహించునది.

సూ॥ ౬౩. కొనుధాతువు పరంబగునపుడు యకారాంత ధాతువులకు నిత్యంబుగను, దదన్యంబులకు వైకల్పికంబుగను ఇగాగమం బగు.

ఉ. తీయు+కొను=(ఇ ఆగమము రాఁగా) తీయు + ఇ + కొను= ('యు' 'సు' కాఁగా) తీయు + ఇ +కొను = తీసికొను. ఇట్లే వ్రాసికొను - చేసికొను - మూసికొను ఇత్యాదులు. చేసుకొను - మూసుకొను - తీసుకొను ఇట్టి రూపంబులు సాధువులు గావు.

అడుగు+కొను=అడుగుకొను, అడిగికొను. చూచుకొను - చూచికొను; పోషించుకొను - పోషించికొను, ఇత్యాదులు యకారాంతధాతువులుగావు గనుక రెండు రూపంబులు. చేసికొని - తన్నుకొని యిత్యాదులందలి 'కొని' కి 'క' వర్ణాదేశంబును, ఉ. తన్నుక; ధాతువునందలి యాకు సకారంబును, ఉ. చేసుక - ఆధునిక ప్రయోగంబులఁ గాన నగు.

సూ॥ ౬౪. ఇకార వక్రంబు లందలివి పరంబు లగుచో యాకు సకారం బగు.

ఇంతకుఁ బూర్వము చెప్పఁబడిన సూత్రముల ప్రకారము ఇకారము గాని, వక్రములనఁగా ఎ ఏ ఒ ఓ-లుగాని యకారంబునకుఁ బరంబైనపుడు ఆ యకారము సకారముగ మాఱును. చేయు ఇది యకారాంత ధాతువు. దీనికి 'ఇ' కారము పరముకాఁగా చేయు+ఇ అయి యది చేసు+ఇ యయి యది చేసి యనియగును. ఇట్టులే చేయు + ఎను = చేసు + ఎను = చేసెను. ఇట్లు చేసిరి - చేసెను - చేసెడిని - చేసికొను ఇత్యాదులు.

సూ॥ ౬౫. చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వ లోపంబేని నుస్థానంబున బిందువేని విభాష నగు

అను - కను - కొను - తిను - మను - విను ఇవి అన్వాదులు. వీనికి వర్తమానార్థక 'చు' వర్ణకము పరమగునపుడు ఈ శబ్దంబుల కడనుండు 'ను' వర్ణమందుండు ఉత్వమునకు లోపమువచ్చి 'న్' అని యగును. అను+చు= అన్ + చు = అన్చు అని యగు. లేక 'ను' వర్ణము పూర్ణబిందువుగ మాఱి 'అంచు' అని యగును. ఈ రెండురూపంబులు వచ్చిన రావచ్చును. రాక పోయెనేని అనుచు ననియే యుండవచ్చును. మానుచు మాంచు అనియుఁ గలదు.

సూ॥ ౬౬. ఉన్న శబ్దంబు పరంబగునపు డుండుధాతువు నకు లోపం బగు.

ఉండునకు 'ఉన్న' పరమై దానికి ఆఁడు - అది లోనైనవి చేర్పఁ బడును. అప్పుడు ఉండుధాతువునకు లోపము.

| | | |
|---|---|---|
| ఉండు+ఉన్న+ఆఁడు | ఉన్న+ఆఁడు | ఉన్నాఁడు. ఇట్లు |
| ప్రథమపురుషమున | ఉన్నాఁడు | ఉన్నారు. |
| | ఉన్నది | ఉన్నవి. |

మధ్యమపురుషమున ఉన్నావు ఉన్నారు.
ఉత్తమపురుషమున ఉన్నాను ఉన్నాము.

ఉన్నవాఁడు - ఉన్నవారు - ఉన్నయది - ఉన్నయవి - ఉన్నాఁడవు. ఉన్నారరు - ఉన్నాఁడను - ఉన్నారము. అనియు రూపంబులు.

"చావులేకుండ నున్నారు దేవదేవ" యను హరివంశ ప్రయోగంబునఁ జావులేకుండన్+ఉన్నారు అని పదచ్ఛేదము. చావులేకుండ నట్లున్నారనియే యర్థము.

ఉండు+ఆఁడు=ఉండాఁడు అని తెనుఁగున రూపములేదు.

సూ॥ ౬౭. చేదాద్యర్థనాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాష నగు.

ఉండుధాతువునకుఁ జేదాద్యర్థక ప్రత్యయము 'ఇనన్' బరముకాఁగా ఉండు+ఇనన్=ఉండినన్ అని యగు. ఇందుఁ జేదాద్యర్థనాంతంబయినది 'ఉండిన' అనునది. దీనికి 'ఉన్న' ఆదేశముకాఁగా ఉండిన + న్ =ఉన్న+ న్ = ఉన్నన్ అని యగును. ఇది విభాషకావున ఉండినన్ - ఉన్నన్ అని రెండు రూపంబులు.

సూ॥ ౬౮. తి దు ట-లు పరంబు లగునపు డన్వాదులను స్థానంబున నున్నయు నుండు డులోపంబును విభాష నగు.

అన్వాదు లింతకుఁ బూర్వమే చెప్పఁబడినవి. (చూ. సూ. క్రియ. ౩౫.) వానికి 'తి' గాని 'దు' గాని 'ట' గాని పరమైనపుడు ఆశబ్దములయందు 'ను' అను నక్షరమునకు మాఱుగ నిండుసున్న వచ్చును. ఉండుధాతువున కివి పరమైనపుడు 'డు' లోపించును.

అను + తిరి = అనితిరి = అంతిరి. ('ని' మాఱుగ నిండుసున్న.)
అను + దురు = అనుదురు= అందురు.
అను + ట = అనుట = అంట.

ఉండు + తివి = ఉండ్డితివి = ఇందు 'డ్డు' లేదు.

ఉండు + దురు =ఉండ్డుదురు=ఉందురు. (డు లోపించెను.)

ఉండు + ట =ఉండ్డుట = ఉంట. ఇత్యాది.

సూ॥ ౬౯. ఇట బిందువుమీఁది త ద-లకు నిత్య వైకల్పికము లయి ట డ లగు.

అనితివి - అంటివి, అనుదురు - అందురు - అండురు.

ఇట మీఁది సూత్రము ప్రకారమేర్పడిన అంతిరి - అందురు లోనగు శబ్దంబులందుఁ గల 'ంతి' లోని 'తి' కి మాఱుగ నిత్యముగ 'టి' వచ్చును అనుటచే అనితిరి యనుదానికి అంటిరి యని రూప మేర్పడునుగాని అంతిరి యనురూపము లేదు.

'అందురు' అనుదానిలోని 'దు' కుమాఱుగ 'డు' వర్ణము వైకల్పికముగ వచ్చుననుటచే అందురు - అండురు అని రూపంబులు.

ఇట్లుకే ఉంటివి - ఉండితివి - ఉందురు - ఉండురు.

సూ॥ ౭౦. ముజ్ఞు పరంబగునపుడు 'కొను'నకు మాఱు 'కో' శబ్దంబు బహుళంబుగ నగు.

కొనుముబలి - కొనుబలి - కోబలి; అందుకొనుము - అందుకో; చేసికొనవిమ్ము - చేసికోనిమ్ము; చేసికొనఁడు - చేసికోఁడు; చేసికొనఁగల - చేసికోఁగల; చేసికొనని - చేసికోని ఇత్యాదులందును నగు.

మధ్యమపురుషమందు వచ్చు 'ము' 'ఁడు' లు 'ముజ్ఞు' అనఁబడును. బహుళమనుటచే బలికో అని 'చేసికొనుఁడు' అనుదానిని 'చేసికోఁడు' అని కాదు.

సూ॥ ౭౧. ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, ముదర్శకంబునకు మాముడియు నగు.

మీఁదిసూత్రము ప్రకారము 'కో,' వర్ణంబునకు మధ్యమపురుష 'ము-ఁడు' లు పరమైనపుడు 'కో,' 'కొ' యయి మువర్ణకంబునకు — ౘ మావత్తు వచ్చును. ఉ. కో+ము = కొ+మ్ము = కొమ్ము. కొండు - కొనుఁడు.

సూ॥ ౭౨. రువర్ణకంబు పరంబగునపుడు నున్న మీఁది త ద డ లయుత్వంబునకు లోపంబు విభాష నగు.

పోషింతురు అను పదంబున 'రు' పరమైయున్నది. దానిముందు నున్న మీఁది 'తు' వర్ణమున్నది. ఈ 'తు' లోనుండు 'ఉ' లోపింప పోషింతురు= పోషింత్ రు=పోషింత్రు అని యగు. విభాష కావున పోషింతురు అనియుఁ గలదు. ఇట్లు కొందురు - కొంద్రు - కొండురు - కొండ్రు.

## ఇంచుక్ప్రకరణము.

సూ॥ ౭౩. సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు.

అనఁగా సంస్కృతధాతువులకును, దెనుఁగు, అంగల మొదలయినవానికి 'ఇంచు' వచ్చి తెనుఁగున ధాతువు లగు. సంస్కృతమున పచ్ధాతువునకుఁ దెనుఁగున 'ఇంచు' ఆగమమయి 'పచించు' అని యేర్పడిన రూపము తెనుఁగున ధాతువు. ఇట్లు వచించు - త్యజించు - భజించు - సేవించు లోనైనవి. అంగల దీనికి 'ఇంచు' ఆగమము కాఁగా 'అంగలించు' అనునది ధాతువగు. ఇట్టులే అడక - అరగ - అవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల - జాడ - తిలక తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - ఆల యీ మొదలైన శబ్దముల మీఁదను 'ఇంచు' ఆగమముగా వచ్చిన నవి ధాతువు లగు. తెనుఁగున సాధారణముగ 'ఇంచు' ప్రేరణార్థంబున వచ్చు. ఈ శబ్దంబులపై నట్లు గాదని యెఱుంగునది.

సూ॥ ౭౪. ఇ ఉ ఋ-ల కించుక్కు పరంబగునపు డయు గవు గరుక్కు లగు.

అయు గవు గరుక్కులు=అయుక్+అవుక్+అరుక్ అనఁగా అయు-అవు అరులు వరుసగా ఇ ఉ ఋ-లకు ఇంచు పరమైనపుడు వచ్చును.

సంస్కృతధాతువులు ఇకారాంతములయినచో వానికి ఇంచు పరమగునపుడు ఇకారమునకు మాఱు అయ్ ఆదేశముగా వచ్చును. జి = జి + ఇంచు = జ్ + ఇ + ఇంచు = ఇంచు 'ఇ' కి మాఱు 'అయ్' రాఁగా జ్ + అయ్+ఇంచు = జ్ అ+య్ఇం+చు = జయించు అని యయ్యె. ఇట్లు 'నీ' ధాతువు నయ్ అయి 'ఇంచు'తోఁ జేరి 'నయించు' అని యగు.

ధాతువు కడపట ఉకారముండిన 'అవ్,' ఋకారముండిన అర్ ఆదేశముగ వచ్చును.

'ద్రు' ధాతువు ఉకారాంతము. ద్రు+ఇంచు = ద్ + ర్ + ఉ + ఇంచు. ఇందు 'ఉ' మాఱు అవ్ రాఁగా ద్ + ర్ + అవ్ + ఇంచు = ద్+ర్ అ+వ్+ఇంచు = ద్+ర+వించు = ద్రవించు అని యగు. ఇట్టులే లూ = లవించు; ధృ = ధరించు; తౄ = తరించు అని యగును.

సూ॥ ౭౫. నిర్జి, నామంబుల కయుగాగమంబు గలుగదు.

నిర్జి యను ఇకారాంతధాతువునకును, నామధాతువులకును మీఁది సూత్రమునఁ జెప్పఁబడిన 'అయ్' కలుగదు. నిర్జి+ఇంచు = నిర్జించు అని యగును గాని నిర్జయించు అని కాదు.

నుతి - స్తుతి ఇత్యాదులు వీనికి ఇంచు పరమైనపుడు అయుక్ రాదు. నుతి+ఇంచు=నుతించు. స్తుతి+ఇంచు = స్తుతించు అని యగు.

ఇట్టులే నామంబులకు ధాతుత్వవివక్షయందు 'ఇంచు' వచ్చును. శయనించు-పయనించు. శయన(ము) పయన(ము) నామములు.

సూ॥ ౭౬. సంస్కృతంబునకు లఘూపధంబునకు నించుకు పరంబగునపుడు గుణం బగు.

సంస్కృతశబ్దంబునందుఁ గడపటియక్షరమునకు ముందటియక్షరము లఘువుగా నుండెనేని ఇంచు పరమగునపుడు దానికి గుణంబగు (సంధిపరిచ్ఛేదము సంస్కృత సంధిప్రకరణము సూ. ౭. చూడుఁడు.) ఏ ఓ అర్. ఈ మూఁడును గుణంబు లనఁబడును. ఇకారముయొక్క గుణము ఏ. ఉకారమునకు ఓ., ఋకారమునకు అర్, గుణములని యెఱుంగునది.

ఉ. ఛిద్. ఇది సంస్కృతధాతువు. కడపటియక్షరము ద్. దానికి ముందక్షరము (ఛ్+ఇ=ఛి) ఇ. దీని గుణాక్షరము ఏ. కావున ఛిద్ - అనుదానికి ఇంచు పరముకాఁగా ఛిద్+ఇంచు; ఛి (ఛ్+ఇ) ఇ ఏకాఁగా ఛే (ఛ్+ఏ) అయి ఛేద్+ఇంచు = ఛేదించు అని యగు. ఇట్లు భిద్+ఇంచు = భేదించు.

ఘుష్+ఇంచు = ఘోషించు. (ఉకార ముపధగావున 'ఓ' వచ్చెను.) పుష్+ఇంచు = పోషించు.

వృష్+ఇంచు = వర్ష్+ఇంచు = వర్షించు. (వ్+ఋ = వృ ఋకారమునకు అర్ రాఁగా వ్+అర్ = వర్ అయ్యె. వర్ష్+ఇంచు=వర్+షించు = వర్షించు అయ్యెను.)

హృష్+ఇంచు = హర్షించు. కుచ్+ఇంచు = (సం) కోచించు.

సూ॥ ౨౭. స్పృశికి గుణంబు విభాషనగు.

స్పృశ్ అను ధాతువున ఉపధ లఘువైనను గుణాక్షరము విభాషగ వచ్చును. స్పృశ్+ఇంచు=స్పృశించు. (గుణమురాలేదు) స్పర్శించు (గుణము వచ్చెను.)

సూ॥ ౨౮. లిఖ, భుజ, రుచ, కృశంబులకు గుణంబు లేదు.

లిఖ్, భుజ్, రుచ్, కృశ్ అను ధాతువులందు ఉపధలఘువైనను గుణాక్షరములు రావు.

లిఖ్ + ఇంచు = లిఖించుఅని యగునేకాని మీఁది ౭౬-వ సూత్రము ప్రకారము లేఖించు అని కాదు. ఇట్లు భుజ్ + ఇంచు = భుజించు. రుచ్ + ఇంచు = రుచించు. కృశ్ = కృశించు.

సూ॥ ౭౯. సృజికి నిర్మితిని గుణంబు లేదు.

సృజ్ ధాతువునకు విడుచుటయనియు, నిర్మించుటయనియు రెండర్థములు కలవు. అందు నిర్మించి యను నర్థమున ఇంచు పరమైనపుడు గుణంబులేదు. సృజించు=సృష్టించు. 'విడుచు' అను నర్థమున ఇంచు పరమైనపుడు గుణంబు వచ్చును. (వి)సర్జించు అనఁగా విడుచు అని యర్థము.

సూ॥ ౮౦. సర్వంబునకుఁ బ్రేరణంబున కించు క్కగు.

అన్ని ధాతువులకు అనఁగా ౭౩-వ సూత్రంబునఁ జెప్పఁబడినటువంటి ధాతువులకుఁ గాని తక్కిన తెనుఁగు ధాతువులకుఁగాని ప్రేరణార్థంబున ఇంచు చేర్పఁబడును. ఉ. పచించు ధాతువునకు వండు అని యర్థము. దీనికిఁ బ్రేరణార్థమున ఇంచు చేర్పఁబడును. పచించు + ఇంచు = పచించించు అగును. ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగునని యింక ముందుచెప్పఁబడు సూత్రముచొప్పున పచించు+ఇంచు = పచింపు + ఇంచు = పచింపించు అని యగు. అనఁగా వండించు = వంటచేయించు అని యర్థము ఇట్లు పచింపించు - ఆవులింపించు - వండించు - పండించు.

సూ॥ ౮౧. రంజాదుల యించుక్చకారంబునకు సబిందు కంబున క ప్రేరణంబున ద్విరుక్త లకారం బగు.

రంజ్ +ఇంచు='రంజించు' అనుపదంబునందలి 'ఇంచు'లోని సబిందుకము 'పూర్ణబిందు పూర్వకమయిన చు' అనఁగా 'ంచు' నకు 'ల్లు' వచ్చి రంజిల్లు అనియు నగు. ప్రేరణార్థంబున వచ్చిన ఇంచు కాకుండిననే 'ల్లు' వచ్చును. ఇట్లు భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు మొదలయినవి. ఇట్లు సంపతిల్లు - సంతసిల్లు - పెల్లగిల్లు - పిక్కటిల్లు పల్లటిల్లు సన్నగిల్లు లోనైనవి.

ఈ 'ఇంచు'న కాదేశముగ వచ్చిన 'ఇల్లు' భివ్ లోనగు కొన్ని ధాతువుల అకర్మకంబులుగఁ జేయును.

ఉ. రాముఁ డొక యస్త్రంబున వాలి యురంబును భేదించెను.

ఈ వాక్యమునందు భేదించు సకర్మకము. దేనిని భేదించెను?

ఉరమును అని యుత్తరము పుట్టుచున్నది.

రాముని యస్త్రముచే వాలి యురము భేదిల్లె.

ఇందు ఏది భేదిల్లెనని ప్రశ్నయే కాని దేనిని భేదిల్లె నని ప్రశ్నపుట్టదు. కావున 'భేదిల్లె' అకర్మక క్రియ. ఇట్లు కంపిల్లు - సంధిల్లు - ఘటిల్లు.

'ఇల్లు' నందు 'ల్లు' ద్విత్వములేకయుఁ బ్రయోగములు గలవు. భేదిలె - సంధిలె - సంఘటిలె - కంపిలె లోనైనవి.

సూ॥ ౮౨. ఇల్లుక్ పరంబగునపుడు తేజః ప్రజ్వాలలకు రేఫం బగు.

ఉ. తేజరిల్లు - ప్రజ్వరిల్లు.

సూ॥ ౮౩. ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపం బగు.

ఇది మీఁదిసూత్రంబునఁ జెప్పఁబడిన లకారమున కపవాదంబు.

ఉ. రంజించు - భేదించు - సంధించు.

సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు నను ౭౩-వ సూత్రము ప్రకారము 'రంజించు' అనునది యాంధ్రంబున ధాతువయ్యె. సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు నను ౮౦-వ సూత్రముప్రకారము రంజించు యొక్క ప్రేరణార్థకము రంజింపించు కావలసియుండఁగా నీ సూత్రము చొప్పునఁ బొలుతటి 'ఇంచు' లోపించి ప్రేరణార్థంబున 'రంజించు' అనియే

యయ్యెనని యర్థము. రాముఁడు ప్రజల రంజించెననఁగా రాముఁడు ప్రజలు రంజిలునట్లు చేసెను అని యర్థము.

సూ॥ ౮౪. చుగాగమం బొచ్ఛికంబున కసంయుక్త న ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు.

అచ్చతెనుఁగు పదముగానుండి దాని కడపట సంయుక్తముగాని న ల డ ర-లలో నేదైన నుండినచోఁ బ్రేరణార్థంబున బహుళంబుగ చువర్ణము ఆగమముగ వచ్చును.

పూను ఇది అచ్చతెనుఁగు శబ్దము. దీని కడపట నకారమున్నది. అది మఱి యేయక్షరముతోడను సంయుక్తముగాలేదు. కావునఁ బ్రేరణార్థంబున 'చు' వర్ణమాగమముగ వచ్చిపూనుచు అనియగు. పూను ధాతువునకుఁ బ్రేరణార్థంబున పూనుచు అని రూపము. బహుళముగావున మీఁది ౮౦-వ సూత్రము ప్రకారము ఇంచువచ్చి పూనించు అనియు నగు.

| | | | | |
|---|---|---|---|---|
| ఇట్లు | తేలు | తేలుచు | తేలించు. | (లకారము కడపటనున్నది.) |
| | మగుడు | మగుడుచు | మగిడించు. | (డకారము కడపటనున్నది.) |
| | కుదురు | కుదురుచు | కుదిరించు. | (రకారము కడపటనున్నది.) |
| | విను | వినుచు | వినిపించు. | ఇందలి పకారము క్రింది ౮౮-వ సూత్రము ప్రకారము వచ్చెను. |
| | అను | ,, | అనిపించు. | ప్రేరణంబున చుగాగమము లేకుండుట బహుళగ్రహణముచే నని యెఱుంగునది. |
| | తిను | ,, | తినుపించు. | |
| | కను | ,, | కనిపించు. | |
| | | | కానిపించు. | |

సూ॥ ౮౫. అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు.

అట్లు మీఁది సూత్రమున చుగాగమము వచ్చునని చెప్పినట్లు మాన్వాదులకు మాను మొదలగుధాతువులకు 'పు' వర్ణమును ఆగమముగ వచ్చును.

మాను మానుచు మానుపు మానిపించు.

ఉ. ఆదరణీయయోక్తుల మానిపించిపలికెం దావారితో వెండియుఁ॥ భాస్క॥

మను మనుచు మనుపు బహుళ గ్రహణముచే నీ శబ్దంబునకు ఇంచురాదు.

**సూ॥ ౪౬. చుక్ప్వర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు.**

బిగియు దీనికిఁ బ్రేరణంబున 'చు' గాగమము రాఁగా బిగుచు అని యగు. అగుచో 'గి' యందలి ఇకారము ఉకారముగ మాఱి 'గు' అయ్యెను.

కలియు దీనికి 'పు' వర్ణమురాఁగా 'లి,' 'లు'గా మాఱి కలుపు అని యయ్యెను. 'యు'కారములు క్రింది సూత్రము ప్రకారము లోపించును. ఇట్లు తడియు - తడుపు.

**సూ॥ ౪౭. అట్లు చుక్ప్వాగమంబు లడంగ్వాది మా య్వాదుల కగు. అగుచో వాని కడవ్రాలు లోపించు.**

చుక్ప్వాగమంబులు చువర్ణము పువర్ణము ఆగమముగా వచ్చుట. అడఁగు లోనైనవి అడంగ్వాదులు. మాయుమొదలైనవి మాయ్వాదులు.

అడఁగు దీనికి 'చు' వర్ణ మాగమముగ రాఁగా అడఁగుచు అయ్యెను. 'చు' ఆగమముగ రాఁగానే అడఁగు అనుదానిలోని కడయక్షరము 'గు' లోపించును. లోపింపఁగా అడఁచు అని రూపమేర్పడును.

| | | |
|---|---|---|
| అడఁగు | అడఁచు | అడఁగించు |
| కరఁగు | కరఁచు | కరఁగించు |
| కలఁగు | కలఁచు | కలఁగించు |
| నలఁగు | నలఁచు | నలఁగించు |

ఇత్యాదులు అడంగ్వాదులు.

| | | |
|---|---|---|
| మాయు | మాపు | మాయించు |
| ఉడుగు | ఊడుపు | ఉడిగించు |
| కడచు | కడపు | కడపించు |
| కుడుచు | కుడుపు | కుడిపించు |
| బిగియు | బిగుచు | బిగియించు - బిగించు |

ఇత్యాతులు మాయ్యాదులు.

| | | | |
|---|---|---|---|
| ఆఁగు | ఆఁచు | ఆఁపు | ఆఁగించు |
| రేఁగు | రేఁచు | రేఁపు | రేఁగించు |
| పాయు | పాచు | పాపు | |
| విఱుగు | విఱుచు | | |
| చూచు | | చూపు | |
| నేరుచు | | నేరుపు | |
| మేయు | | మేపు | |
| లేచు | | లేపు | |
| కలియు | | కలుపు | |
| తడియు | | తడుపు | |
| తెలియు | | తెలుపు | |

ఇత్యాదులు ఆఁగు ప్రభృతులు ఉభయగణంబులు.

బహుళమనుటచేతఁ గొన్నింటికి రెండు రూపంబులు. కొన్నింటికి మూఁడు కొన్నింటికి నాలుగురూపంబు లని యెఱుంగవలయు.

సూ॥ ౮౮. ఇంచు క్పుక్పుగాగమంబులు పరంబు లగు నవు డాగమాదేశలోపంబులు పెక్కు తెఱంగులఁ గానంబడి యెడి.

ఇంచుక్ చుక్ పుగాగమంబులు. ఇంచు చు పువర్ణంబులు. ఇవి పరంబు లగునపుడు ఆగమము - ఆదేశము లోపము అనునవి పలుతెఱంగుల నయ్యెడి.

| | | |
|---|---|---|
| అస | కావించు | |
| వచ్చు | రావించు | రప్పించు |
| విన్నపము | విన్నవించు | |
| కేఁక | కేఁకరించు | |
| పలవ | పలవరించు | పలవించు |
| మోఁకాలు | మోఁకటించు | మోఁకారించు |
| ఆల | ఆలించు | ఆలకించు |
| ప్రక్క | ప్రక్కలించు | |
| నొచ్చు | నొంచు | నొప్పించు |
| ఉండు | ఉనుచు | ఉంచు |
| నిండు | నినుచు | నించు |
| డిగు | డించు | డిగించు |
| పెరుఁగు | పెనుచు | పెంచు |
| తునుఁగు | | త్రుంచు |
| మునుఁగు | మునుచు | ముంచు |
| మొగుడు | మొగుడుచు - మొగుచు | మోడుచు - మొగిడించు |
| చొచ్చు | చొనుపు | చొప్పించు |
| చినుఁగు | చించు | చింపు |
| త్రెగు | త్రెంచు | త్రెంపు |

| | | |
|---|---|---|
| తిరుగు. | త్రిప్పు. | |
| చచ్చు | చంపు | |
| నిలుచు | నిలుపు | నిలువరించు |
| కొను | కొలుపు | |

పోవు - పుచ్చు - పనుచు - పంచు - పనుపు - పంపు.

అనుచు - అంచు - అంపు - అనుపు.

అనుప్రయుక్తం బగు పోవునకు 'పుచ్చు' మాత్రంబ యగు. మోసపోవు ఇచ్చట పోవు అనుబంధముగఁ జేర్పఁబడినది గావున పోవుయొక్క అన్ని రూపంబులు రావు. పుచ్చుమాత్రము వచ్చి మోసపుచ్చు అని యగు.

సూ॥ ౮౯. అన్వాదుల కించిక్కు పరంబగునపుడు పుగాగమం బగు. మానునకు విభాష నగు.

అను - అను+ఇంచు = అను+పు+ఇంచు = అనుపించు. ఇట్లు కను - కనుపించు - తినుపించు - వినుపించు అని రూపము లేర్పడి యివి యిఁకమీఁద జెప్పంబడు "ఇత్వంబుకాని ఎత్వంబుకాని కూడుచో" నను ౯౪-వ సూత్రము ప్రకారము అనిపించు - కనిపించు - తినిపించు - వినిపించు నని యగు. మానునకు పువర్ణాగమము వైకల్పికము గాన మానించు - మానిపించు అని రెండు రూపంబులు. వినిపించు - వినుచు అని రెండురూపంబులు.

సూ॥ ౯౦. అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు. అప్పాదులకు విభాష నగు.

అడ్డము + ఇంచు = అడ్డము+గు + ఇంచు = అడ్డ+గు + ఇంచు = అడ్డగించు, మువర్ణకమునకు లోపము.

ఇట్లు ఓర - ఓరగించు; చిత్తము-చిత్తగించు; పంతము - పంతగించు; పెల్ల - పెల్లగించు; బోర - బోరగించు; గోరము - గోరగించు; మట్టము - మట్టగించు; మేళము - మేళగించు, ఇత్యాదులు అడ్డాదులు.

అప్ప - అప్పగించు - అప్పించు, అప్ప - ఒప్ప - పల్లము. ఇత్యాదులు అప్పాదులు. (తత్స) కోపము - కోపించు - కోపగించు ననియు నగు.

సూ॥ ౯౧. ఆడోడుకూడుల డకారంబునకుఁ జుక్కు పరం బగునపుడు రేఫం బగు.

ఆడు - ఓడు - కూడు అను శబ్దంబుల కడపటనుండు డకారంబునకు 'చు' పరమైనపుడు రువర్ణము ఆదేశముగ వచ్చు. ఇంచుపరమైనపుడు రాదు.

ఆడు + చు = ఆరుచు - ఆడించు.

ఓడు + చు = ఓరుచు - ఓడించు.

కూడు + చు = కూరుచు - కూడించు.

సూ॥ ౯౨. చెడునకుం జుక్పుగాగమంబులును డాకు నలఘు రేఫంబు నగు.

చెడుధాతువునకుఁ బ్రేరణంబున చు పు-లు రెండును వచ్చును. అపుడు డు' ఱుగా మారును.

చెడు + చు = చెఱుచు; చెడు + పు = చెఱుపు.

సూ॥ ౯౩. పడునకుం జుక్కును డాకు నలఘు రేఫంబు నగు.

పడు + చు = పఱుచు. భయపడు ఇత్యాదులందలి యను ప్రయుక్తమైన పడునకుఁ బ్రేరణంబునఁ బఱుచు ననియే యుండవలయు. సూరకవి యొక్కచోఁ బఱచు అని ప్రయోగించెను.

సూ॥ ౯౪. శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాష నగు. అగుచో డాకు లఘురేఫం బగు.

వెలువడు ఇది శబ్దపల్లవము. (చూ. సూ. ౧౨౮.) పడు అనునది వడు అయ్యెను. దీనికి ఇంచు పరము కాఁగా వెలువడు+ఇంచు 'డు' 'రు' గా మాఱి వెలువరు+ఇంచు అనియయి వెలువరించు అనియయ్యె. మీఁది సూత్రము చొప్పున 'చు' పరమైనపుడు వెలువఱుచు అని యగు.

సూ॥ ౯౫. ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేదు.

ప్రేరణార్థంబున వచ్చిన ఇంచుమీఁద మరల ఇంచురాదు.

ప్రేరణార్థంబున వచ్చిన మఱియే ప్రత్యయముమీఁదనైన ఇంచు వచ్చును.

నొచ్చు - నొంచు - నొప్పించు. నొంచు అనునది ప్రేరణార్థక రూపం బయినను ఇంచురాలేదు గాన మరల ఇంచువచ్చి నొప్పించు అని యయ్యె. ఇట్లు చచ్చు - చంపు - చంపించు.

సూ॥ ౯౬. ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యం బయిన యుత్వంబున కిత్వం బగు.

ఒక శబ్దంబునఁ గడపటి రెండక్షరములపై ఉత్వముండెనేని దానికి క్రియాపరిచ్ఛేదము ప్రకారమగు ప్రత్యయముల ఇ ఎ లు పరమైనపు డా రెండు ఉత్వములును ఇత్వములుగా మాఱును. మొదటియక్షరమున 'ఉ' ఉండిన అది 'ఇ' గా మాఱదు.

మునుఁగు ఇందు కడపటి రెండక్షరములమీఁద 'ఉ' కారములున్నవి. దీనికి క్త్వార్థకమైన 'ఇ' రాఁగా మునుఁగు+ఇ = మునిఁగి యని యగు.

మొదటియక్షరము 'ము' మీఁద ఉత్వముండినను దానికి ఇత్వముకాదు. మునుఁగు+ఎ = మునిఁగె.

నిగుడు నిగిడి నిగిడె. మగుడు మగిడి మగిడె.
ఉడుఁగు ఉడిగి ఉడిగె.

ఇకార ఎకారములేకాక ఇకార ఎకారము లాదియందుఁ గల ప్రత్యయములు పరమైనపుడు నిత్యమగు. ఉ. నిగిడించు. పందురు - అలఁదురు శబ్దములుమాత్రము పందురి - అలందురి యనియే యన్నిప్రతులఁ జూపట్టు.

**సూ॥ ౯౭. ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగు.**

పచించు-ధాతువునకుఁ బ్రేరణంబున ఇంచురాఁగా పచించు+ఇంచు = పచించించు అనికాఁగా నీ సూత్రముప్రకారము ధాతువు కడపటనుండు చకారము పకారమై పచింపు+ఇంచు = పచింపించు అని యగు. ఇట్లు వచించు - వచింపించు; పిలుచు - పిలిపించు; వలచు - వలపించు.

హెచ్చునకు పత్వంబు రాదు. హెచ్చించు.

మెచ్చునకు వైకల్పికము. మెచ్చించు - మెప్పించు.

**సూ॥ ౯౮. ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.**

ముజ్+జీత్తులు = ముజ్జీత్తులు. ఇందు ముజ్ అనునది మధ్యమపురుష 'ము ఁడు' లకు సంజ్ఞ.

లజీ వ్యతిరేకార్థకము.

కలజీ భవిష్యదర్థకమైన 'కల' వండఁగల.

పడుజీ అనుబంధమైన 'పడు' వండఁబడు.

మిజీ వ్యతిరేకభావార్థంబున వచ్చు 'మి' వండమి.

కజి వ్యతిరేక క్త్వార్థకంబు 'క' వండక.

నుజి తుమున్నాద్యర్థకమైన 'ను' వండను.

నిజి ప్రతిషేధమందు వచ్చు 'ని' వండనివాఁడు.

ఇన్నిటికి జిత్తు లని పేరు.

సూ॥ ౯౯. ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు ప వ లగు.

అనఁగా ద్విత్వముగాని యాగమచకారమునకు ముత్తు పరంబగునపుడు 'ప' వచ్చుననియు, ద్విత్వముగాని యన్యచకారమునకు ముత్తు పరంబగునపుడు 'వ' వచ్చుననియు నర్థము. పచ్ ధాతువునకు ఇంచు ఆగమముగవచ్చి పచించు అని యయ్యె. ఇందులోని 'చు' ఆగమచకారము. దీనికి ముత్తు పరమైన వ్యతిరేకార్థంబున పచింపఁడు అని యగు. ఎట్లనఁగా,

పచించు+ఁడు=అని డుజ్ పరముకాఁగా రూపము.

పచించ+ఁడు=అని జిత్తు పరంబగునపుడు ధాతువు ఉత్వంబునకు అత్వంబగునను ౨౩-వ సూత్రము ప్రకారము 'చు' 'చ' యయ్యెను.

పచింప+ఁడు=పచింపఁడు. ఈ సూత్రము ప్రకారము 'చ' కారమునకు పకారము వచ్చెను.

మధ్యమపురుష మువర్ణకము పరమైనపుడు పచింపుము. ఇచ్చట 'ము' జిత్తులోఁ జేరలేదు గనుక 'ప' యని కాదయ్యె. ఇట్లు పచింపఁగల-పచింపఁబడు - పచింపమి - పచింపక - పచింపను - పచింపనివాఁడు - పచింపుఁడు అని తక్కిన ముత్తులు పరంబగునపుడు రూపంబులు.

అడఁపఁడు - అడఁపుము. ఇదియును ఆగమచకారము పకారమైనందున కుదాహరణము అడఁగు ధాతువు.

అన్యమునకు ఉ. పిలుచు ధాతువు. ఇందలి చకారము ఆగమముగా వచ్చినది గాదు గనుక అన్యమనఁబడియె. దీనికి ముత్తుపరమైనపుడు చకారమునకు వకారము వచ్చును. పిలువుము - పిలువఁగల - పిలువఁడు లోనైనవి.

సూ॥ ౧౦౦. ఖండబిందువుమీఁది సిద్ధ చకారంబునకు ముత్తు పరంబగునపుడు 'ప' కారంబు ప్రాయికంబుగ నగు.

తలఁచు - త్రేఁచు - తోఁచు ఇత్యాదులు ఖండబిందువుమీఁద నుండు సిద్ధచకారము గలవి. (ఆగమచకారము గాదనుట) దీనికి ముత్తు పరంబైనపుడు పకారంబు ప్రాయికంబుగ వచ్చును. తలఁచు వ్యతిరేకక్త్వార్థంబున తలఁపక. ఇట్లు త్రేఁపక - తోఁపక లోనైనవి. తలఁచక - తోఁచక అసాధువులు.

ప్రాయికమనుటచే ఏఁచునకు వైకల్పికము ఏఁచక - ఏఁపక. నోఁచు - వాఁచులకుఁ గలుగదు. నోఁచక - వాఁచక అనియే రూపంబులు.

సూ॥ ౧౦౧. ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దానికి దుర్కు పరంబగునపుడు 'ప' కారంబు విభాషనగు.

ఆకర్ణించు. ఉ. మీఁదఁజెప్పినట్లు ఇందలి 'చ' కారముఆగమచకారము. దీనికిముందు నెఱసున్నయనఁగా నిండుసున్నయున్నది. దీనికి 'దురు' పరమయి ఆకర్ణించుదురు అయ్యెను. ఇందలి చకారమునకు 'ప'కారము వచ్చిన ఆకర్ణింపుదురు అని రూపమగు. విభాషయనుటచే 'ప'కారము రానియప్పుడు ముందు చెప్పఁబడు ౧౧౯-వ సూత్రము ప్రకారము ఆకర్ణింతురు అని యగు.

ఇట్లు దంచుదురు అనునది దంపుదురు - దంతురు అనియు,

చించుదురు అనునది చింపుదురు - చింతురు అనియు నగును.

సూ॥ ౧౦౨. అగు, వచ్చు, చొచ్చు, చూచులకు ముత్తు పరంబగునపుడు కా, రా, చొరు, చూడు లగు.

ముత్తు పరంబగునపుడు 'అగు' అనునది 'కా' యగు. 'వచ్చు' అనునది 'రా' యగు. 'చొచ్చు' అనునది 'చొర' అగు. 'చూచు' అనునది చూడు అగును. కావున అగు - కాఁడు - కమ్ము; వచ్చు-రాఁడు - రమ్ము, చొచ్చు-చొరఁడు - చొరుము, చూచు - చూడఁడు - చూడుము అని రూపంబులగు.

సూ॥ ౧౦౩. ఇచ్చునకు సర్వంబున కీ యగు.

ఇచ్చునకు ముత్తు పరంబగునపుడు అన్ని రూపంబుల 'ఈ' యగు. ఇచ్చు + ఁడు = ఈఁడు - ఇమ్ము - ఈని - ఈక - ఈఁగల - ఈఁబడు - ఇచ్చునకు 'ఈయ' యుఁ గలదు. ఈయని - ఈయఁగల ఇత్యాదులు. ఇవ్వక-ఇవ్వని ఇత్యాదులు గ్రామ్యరూపంబు లసాధువులు. చ్చు ద్విత్వము గావున 'వ' రాదు.

సూ॥ ౧౦౪. తే - తేరు - లు తెచ్చున కగు.

తెచ్చు - తేఁడు - తేరఁడు - తెమ్ము - తేరుము.

సూ॥ ౧౦౫. చావు, నోవు, లు చచ్చు, నొచ్చు, ల కగు.

చచ్చు - చావుము - చావఁడు.

నొచ్చు - నోవుము - నోవఁడు.

నొవ్వఁడు అనియు నగు.

సూ॥ ౧౦౬. జీత్తు పరంబగునపుడు వాని 'వు' వర్ణంబు విభాషను లోపించు.

అనఁగా, చావు-నోవులలోని వకారమునకు వైకల్పికముగ లోపము.

చావక - చాక, చావకుము - చాకుము, నోవక - నోక, నోవకుము-నోకుము.

సూ॥ ౧౦౭. అగున, కను, కను-లకు ముజ్జీత్తులు పరంబులగునపుడు కా, నా, కాన-లు విభాష నగు.

అగునకు ముజ్జు పరంబగునపుడు 'క' యును అను - కను-లకు జీత్తుపరం బగునపుడు వరుసగా నా, కాన-లును విభాషనగు.

ఉ. అగు+ము = అగుము - కమ్ము.

పదము మొదటనుండని 'గ' కారమునకు 'వ' కార మను సూత్రము చొప్పున అగుము - అవుము - అనియగును. అది సూ. ౧౧౪-వ ప్ర॥ ఔము అనియగు. అగుము దీని బహువచనరూపము అగుఁడు - కండు - అవుఁడు- ఔఁడు.

అను+ఁడు=అనఁడు - నాఁడు, అనక - నాక.

కను+ఁడు=కనఁడు - కానఁడు.

సూ॥ ౧౦౮. నేరుచునకు లిట్లాట్టులు ముత్తు పరంబులగు నపుడు రు చు-లకు లోపంబు బహుళంబుగా నగు.

అనఁగా 'నేరుచు' అను శబ్దములోని 'రు' 'చు' అను వర్ణంబులకు భూత తద్ధర్మార్థకంబులను ముత్తు పరంబగునపుడును లోపంబు బహుళంబుగా నగు. లిట్టనఁగా భూతార్థకము. లాట్టు=తద్ధర్మాద్యర్థకము.

నేరుచు రేఫమునకు లోపము. భూత - నేర్చెను - నేచెను. తద్ధ. ఉ. నేర్చును - నేచును. నేరవఁడు - నేరఁడు. చకారమునకు లోపము.

సూ॥ ౧౦౯. పోవునకు దుఙ్ముత్తులు, ముజ్జు పరంబులగు నపుడు 'వు' లోపంబును, బొద పద-లును విభాష నగు.

పోవు దీనికి 'దు' పరముకాఁగా పోవుదురు అని యయ్యెను. ఇందలి 'వు' లోపించిన పోదురు అని యగు.

పోవు దీనికి ఁడు ము (ముత్తులు) పరముగాఁగా పోవఁడు - పోవుము అని రూపంబు లేర్పడి వకారలోపంబయి పోఁడు - పొమ్ము అనియయ్యె.

ముజ్జు పరంబగునపుడు పోదము - పదము - పొదఁడు - పదఁడు అని రూపంబులు.

సూ॥ ౧౧౦. అగు, పోవు-ల కడవ్రాల కిద్వక్రంబులు పరంబునగునపుడు యకారం బగు.

అగు - పోవు అను నీ రెండు శబ్దంబుల కడపటనుండు నక్షరములకు (గు - వు) హ్రస్వమైన ఇకారముగాని ఎ ఏ ఒ ఓ-లు గాని పరంబు లగు నపుడు యకారం బగు.

అగు + ఇ = అయు + ఇ = అయి. (క్త్వార్థకమున)
పోవు + ఇ = పోయు + ఇ = పోయి. ,,
పోవు + ఎను = పోయు + ఎను = పోయెను.
పోవు + ఎడు = పోయు + ఎడు = పోయెడు.
'అయి' యనునది ౧౧౪-వ సూ. ప్ర. ఐ యగు. అయిరి = ఐరి.

సూ॥ ౧౧౧. అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు.

అగు + ఎను = అయు + ఎను = ఆయు + ఎను = ఆయెను.
అగు + ఎడు = అయు + ఎడు = ఆయు + ఎడు = ఆయెడు.
ఆయెను - ఆయెడు అనునవి సూ॥ ప్ర॥ అయ్యెను - అయ్యెడు నని యగు.

సూ॥ ౧౧౨. పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగు నపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు.

| | | |
|---|---|---|
| పిలుచు | వ్యతిరేకార్థకమున | పిలువఁడు. |
| | చకారము లోపింపఁగా | పిలఁడు (పిలు+అఁడు.) |
| | ప్రార్థనార్థకము | పిలువుము. |
| | చకారము లోపింపఁగా | పిలుము. |

ఇట్లు పిలుచు - నిలుచు - తలఁగు లోనైనవి. లేచునకు ముజ్జు పరం బగునపుడు 'చు' లోపం బగు. లేచు - లెమ్ము - లెండు.

సూ॥ ౧౧౩. లాఁతిచో సహితము కాదేశాదులు కానం బడియెడి.

లాఁతిచో = ఇదివఱకుఁ జెప్పినట్టు ముత్తు పరమగునపుడేకాక యితర సందర్భములందును.

కాదేశాదులు=కకారాదేశము వర్ణలోపము లోనైనవి గలవు.

అగుట = కావుట. భావార్థక ప్రత్యయమయిన 'ట' ముత్తులలోఁ జేరలేదు. ఇట్లే తక్కినవి చూచునది.

కావుతను - కాతను; అగుదును - కావుదును;

కావునను - కానను; అనవుడును - అనుడును - నావుడును; ఇత్యాదులు. కానన్ ద్రుతప్రకృతికమే కాని కళగాదు.

సూ॥ ౧౧౪. అచ్ఛికంబులం దయి, యవు-లకు వక్రతమంబులు బహుళంబుగా నగు.

అచ్చతెనుఁగు శబ్దంబులఁ గల 'అయి' కి 'ఐ', 'అవు'నకు 'ఔ' బహుళముగా నగు.

అయిదు - ఐదు; అయిరేని - ఐరేని; అవుడు - ఔడు; గవుసెన = గౌసెన; అయినన్ = ఐనన్; కయి = కై ఇత్యాదులు.

సూ॥ ౧౧౫. కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగు నపుడు కల యగు.

కలుగు శబ్దమునకు నానార్థములుగలవు. అందు 'ఉండు' అనునర్థంబునందు (లట్) వర్తమానంబున 'కల' యగు.

ప్ర. పు. కలఁడు - కలరు - కలదు - కలవు.

మ. పు. కలవు - కలరు.

ఉ. పు. కలను - కలము.

సూ॥ ౧౧౬. త్ర్యర్థంబునం గలాదేశంబు విభాష నగు.

త్ర్యర్థము = తృ + అర్థము.

ఈ యర్థంబున కలుగునకు 'కల' వైకల్పికముగ నాదేశమగును.

కలుగువాఁడు - కలవాఁడు. కలాదేశంబు వచ్చినపుడు సూత్రంబునఁ జెప్పఁబడిన ఎడి - యెడులకు నిత్యముగ లోపంబు. కలెడివాఁడు - కలెడు వాఁడు అని రూపంబులు లేవు. ఉ. కలుగఁడే నాపాలి కలిమి సందేహించి కలిమిలేములు లేక కలుగువాఁడు.

సూ॥ ౧౧౭. అస్త్యర్థంబునకు లజ్, మి, క, ని, వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు.

ఉండు అను నర్థముగల యపుడు కలుగునకు

| | |
|---|---|
| వ్యతిరేకార్థంబున | ప్ర. లేఁడు - లేరు - లేదు - లేవు. |
| | మ. లేవు - లేరు. |
| | ఉ. లేను - లేము. |
| వ్యతిరేక భావార్థక 'మి' పరమైనపుడు | లేమి. |
| వ్యతిరేక క్త్వార్థకంబున | లేక. |
| వ్యతిరేక తృవర్ణకార్థంబున ని | లేని. |
| 'వడి' పరమైనపుడు | లేవడి. |

అని యీ ప్రకారము 'లే' వచ్చును.

సూ॥ ౧౧౮. వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాష నగు.

వ్యతిరేకార్థంబున 'వలచు' అనుదానికి 'ఒల్ల' యనునది వైకల్పికముగ నగు.

ప్ర. వలవఁడు - ఒల్లఁడు, వలవరు - ఒల్లరు, వలవదు - ఒల్లదు

మ. వలవవు - ఒల్లవు, వలవరు - ఒల్లరు.

ఉ. వలవను - ఒల్లను, వలవము - ఒల్లము.

ఒల్లమి - ఒల్లఁబాటు (ఒల్లనిపాటు) అని కన నయ్యెడి.

సూ॥ ౧౧౯. చువర్ణంబుతోడ దుగ్గకారంబు తకారం బగు.

చువర్ణంబుతోడ దుగ్గకారమనఁగా ధాతువులోని 'చు'+దు, తకారం బగు=తువర్ణముగా మాఱును. నిలుచుదురు = నిలుత్తురు. ఇట్లు పిలుతురు - అఁతురు - కడతురు - చింతురు - పెంతురు - పచింతురు - వచింతురు చేతురు - కోతురు ఇవి అసాధువులు. ఏలనఁగా ధాతువునందు 'చు'వర్ణము లేదు. చేయుదురు - కోయుదురు. యుదులకు 'తు'రాదు. భారతమందలి త్రోతురు - పాతురు అనునవి త్రోచుదురు - పాచుదురు వలన నైనవి.

సూ॥ ౧౨౦. పడుఙీ, కొను లోకానోకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు.

చొచ్చు-చొరఁబడు. పడు అనునది కర్మార్థంబునను వచ్చును. ఇచ్చట అటుగాదు. చొచ్చున కేమియర్థమో చొరఁబడునకా యర్థమే. ఇట్లు,

నిలుచు - నిలువఁబడు, కూడు - కూడఁబడు, పండు - పండుకొను మ్రొగ్గఁబడు - కూలఁబడు ఇత్యాదులు.

సూ॥ ౧౨౧. తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్త బగు. అగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారం బగు.

అగ్వాదులు = అగు మొదలైనవి. వీనికే 'తెంచు' ధాతువు చేర్పఁ బడును. అగు+తెంచు. ఇట్లు చేరునపుడు తెంచునకుఁ బూర్వమున 'ఉ'

ఉండినచో తెంచులోని 'తె,' 'దె'గా మాఱును. ఉ. అగు+తెంచు = అగుదెంచు, నెగయు+తెంచు = నెగయుదెంచు, పోవు+తెంచు = పోవుదెంచు.

తెంచునకుఁ బూర్వము ఉకారముగాక మఱి యే యచ్చైన నుండిన 'తె' 'దె' గా మాఱదు. ఉ. చొచ్చు+తెంచు = ౧౨౩-వ సూత్రము ప్రకారము 'చు' లోపింపఁగా 'చొ' మిగిలెను. ఇది ఉకారాంతము గాదు గనుక 'చొత్తెంచు' అనియే రూపంబు. ఇట్లు పుచ్చు+తెంచు = పుత్తెంచు.

తోఁచు+తెంచు=తోఁతెంచు, నడచు + తెంచు = నడతెంచు.

పఱచు +తెంచు= పఱతెంచు, మొలచు+ తెంచు = మొలతెంచు.

వీచు +తెంచు= వీతెంచు ఇత్యాదులు.

సూ॥ ౧౨౨. అభ్యాగతి నరుగాద్యుల కయ్యది యను ప్రయుక్తం బగు. అగుచో గువర్ణంబు విభాషను లోపించు.

వచ్చు అను నర్థమున అరుగు మొదలగు ధాతువులకు 'తెంచు' అనునది చేర్పఁబడును. అట్లు చేర్చునపుడు ధాతువుకడపట 'గు' వర్ణముండిన వైకల్పికముగ నది లోపించు.

చను + తెంచు = చనుదెంచు.

అరుగు+ తెంచు = అరుగుదెంచు - అరుదెంచు ('గు' లోపము.)

ఏగు + తెంచు = ఏగుదెంచు - ఏతెంచు.

సూ॥ ౧౨౩. అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు.

'తెంచు' పరమైనపుడు ధాతువుకడను 'చు' వర్ణముండిన లోపించును.

ఉ. చొచ్చు + తెంచు = చొత్తెంచు, పుచ్చు + తెంచు = పుత్తెంచు తోఁచు + తెంచు = తోఁతెంచు.

సూ॥ ౧౨౪. అద్దానికి ముత్తు పరంబగునప్పుడు తే, తేరు లగు.

తెంచు అనుదానికి ముత్తు పరమైనయెడ నది 'తే' గాని 'తేరు' గాని యగు.

అగుడెంచు ఇది వ్యతిరేకార్థమున అగుదేరఁడు అని కాని అగుదేఁడు అనికాని యగు. ఉ. అగుదెమ్ము - అగుదేరుము.

సూ॥ ౧౨౫. భూతంబున లజీకి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తం బగు.

లజీ - వ్యతిరేకార్థము. లిడంతంబగు 'అగు' ధాతువు అనఁగా 'అయ్యెను' లోనైన రూపను లిట్+అంతము = లిడంతము - లిట్ అనునది భూతకాలమునకు సంజ్ఞ, వాఁడు రాఁడయ్యెను. రాఁడు వ్యతిరేకార్థము. దీనికి భూతకాలంబున అగుధాతువు రూపము. 'అయ్యెను' పరమై రాఁడె య్యెను అని యయ్యె ఇట్లు.

వారు రారైరి - అది రాదయ్యెను - అవి రావయ్యెను - నీవు రావయి తివి - మీరు రారయితిరి - నేను రానయితివి - మేము రామయితిము. ఈ సూత్రమువలన నేను జేయనైతి యనుటకుఁ జేయఁగనైతి ననుటతప్పు. చేయను అయితి అనుచో చేయను అనునది వ్యతిరేకార్థమును బోధించునుగావున దానికి అయితి చేర్పవచ్చును.

'చేయఁగను+అయితి' అనుచో చేయఁగను అనునది వ్యతిరేకార్థమును బోధింపదు గావున అయితి చేర్చుట తప్పు.

సూ॥ ౧౨౬. నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేష ణంబుల కనుప్రయుక్తంబగు నుజీకి విభాష నగు.

కాను ఇది నుజే అంతంబగు అగు ధాతువు రూపంబు. అగు ధాతువు నకు, 'కా' వచ్చునని యింతకుమున్నే చెప్పఁబడినది. ఆ 'కా' కు 'ను' చేర్పఁగా 'కాను' అయ్యెను. దీనియందుఁ గడపట 'ను' ఉండుటచేతను దీనికిఁ బూర్వము 'ఁ' వచ్చుటచేతను నుజే యనఁబడియె.

సూ॥ ౧౨౭. దానికి హ్రస్వంబు విభాష నగు.

తెప్పగాను - తెప్పగను; న్యాయ్యముగాను - న్యాయ్యముగను. కాను అనునది నుజే యయినచో తెప్పఁగాను న్యాయ్యముఁగాను అని యుండవలదా యని సందేహింపరాదు. తెప్ప - న్యాయము అనునవి కళలుగావున అర సున్న రాకపోయినను దానివలన జగగవలసిన కార్యము అనఁగా 'క'కారము 'గ' కారముగ మాఱుట జరగి కాను అనునది గాను అని యయ్యెను. తెప్పకను- తెప్పకాను అనుట తప్పు.

చూడఁగాను - చూడఁగను - చూడను ఇట హ్రస్వంబులేదు. అనఁగా చూడనుగాను - చూడనుగను అని రూపంబులు రావు.

సూ॥ ౧౨౮. ఉన్న, కల, న, పడ్డలమీఁది తచ్ఛబ్దవకారం బునకు లోపంబు విభాష నగు.

వాఁడు-వారు-లోని 'వా' మీఁదనుండు 'వ' తచ్ఛబ్దవకారము. ఉన్న, కల, న, పడ్డలకు 'వాఁడు' గాని 'వారు' గాని చేరినపుడు 'వ' విభాషగ లోపించును. వండుచున్నవాఁడు 'వ' లోపింపఁగా వండుచున్న ఆఁడు. అత్తునకు సంధి బహుళముగాన నిటనిత్యంబు. వండుచున్నాఁడు అని యగునే కాని వండుచున్నయాఁడు అని కాదు.

ఇట్లు వండుచున్నవాఁడు - వండుచున్నాఁడు - వండుచున్నవారు - వండుచున్నారు. వండుచున్నవాఁడవు - వండుచున్నాఁడవు - వండుచున్న వారరు - వండుచున్నారరు - వండుచున్నవాఁడను - వండుచున్నాఁడను. వండు

చున్నవారము - వుండుచున్నారము. ఇట్లు వుండఁగలవాఁడు - వుండగలాఁడు-వుండినవాఁడు - వుండినాఁడు. పడ్డవాఁడు - పడ్డాఁడు, పడ్డవారు - పడ్డారు ఇత్యాదులు.

బిడ్డలకు బుద్ధిచెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొండిదిపైఁ, డ్డానఁడని; కింకం దానొకరుండ గెల్చుఁ గడిమిం గీర్తింపఁ బడ్డాఁడు. అని ప్రయోగంబులు.

సూ॥ ౧౭౫. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబు లగు నీ యవి శబ్దపల్లవంబులు నాఁబడు.

ధాతువులు లోనగువానికి ధాతువులు చేరి ప్రత్యేకార్థము గలవగునవి శబ్దపల్లవంబు లనఁబడు.

కూరుచు+ఉండు = కూరుచు అను ధాతువునకు ఉండు అను ధాతువు చేర్పఁగా నేర్పడిన కూర్చుండు అను శబ్దమునకు ఆధాతువుల యర్థంబునకంటె భిన్నమైనయర్థమున్నది కావున కూరుచుండు అనునది శబ్దపల్లవము. 'కూర్చొను' అనునది యపశబ్దము.

మేలుఁకొను అనుచోట మేలు అనునది ధాతువుగాదు. మెలుకొను అనునది భిన్నార్థముగలదై శబ్దపల్లవ మయ్యెడి. ఇట్లు నిలుచుండు-పరుండు - పన్నుండు-ఆఁకొను-ఈఁకొను-ఈయకొను-ఇయ్యకొను-రకొ...ను-త్రెక్కొను-మేకొను-మయికొను-మేలుఁకొను-మేలుకను-మేలుకాంచు-అలవడు-ఏఋపడు-చొప్పడు - వెలువడు - తలపోయు - వాసపోవు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయంచేయు - విజయముచేయు - విచ్చేయు - వేంచేయు - అందిచ్చు లోనైనవి శబ్దపల్లవంబులు.

## సూ॥ ౧౩౦. చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు.

లృట్టు = భవిష్యత్కాలమును దెలుపునది. లిట్టు = భూతకాలమును దెలుపునది.

చేదర్థంబున భవిష్యత్కాలమును దెలుపు రూపమునకు మాఱుగ భూతకాలమును దెలుపురూపము వచ్చును.

ఉ. ఆ ఋషీశ్వరుఁడు వచ్చెనా ఫలించుఁ గార్యముల్.

ఆ ఋషీశ్వరుఁడు వచ్చినఁ జో ఫలించుఁ గార్యము లని యర్థము.

వచ్చినఁజో అను నర్థమునందే వచ్చెనా అను రూపము ప్రయోగింపఁబడెను. వచ్చినఁజో అనునది రాఁబోవుకాలమును దెలుపును. వచ్చెను+ఆ = వచ్చెనా భూతకాలమును దెలుపును.

వాఁడు రేపు వచ్చెనేని నీవు కార్య మారంభింపుము.

వచ్చెనేని యనునది వచ్చునేని యనుదానికు మాఱు ప్రయోగింపఁబడినది.

## సూ॥ ౧౩౧. ఆత్మార్థంబు కర్తృపదంబైనచో దాని లింగ వచనంబులె విశేషణ క్రియలకు నగు.

ఆత్మార్థములు తాను-తాము. ఇందేది కర్తృవాచకముగ నుండునో దాని లింగము దాని వచనంబె విశేషణంబునకును గ్రియకును నగు.

ఉ. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితం బుగఁ బుష్పకారూఢుండై సాకేతంబున కేతెంచె.

ఈ వాక్యమునందు తాను కర్తృపదము. తాను అనఁగా రాముఁడు. ఇది పుంలింగము కావునఁ బుష్పకారూఢుండను విశేషణము పుంలింగమందదయున్నది. తాను ఏకవచనము కావున 'ఏతెంచె' అనుక్రియయు నేకవచనంబున నున్నది. సీతారాములు తా మభిమానించినవారికి దయాళుర్రై సకల

సౌఖ్యంబు లొసఁగూర్తురు. ఇక్కడ తాము బహువచనంబున నున్నది. కావునఁ గ్రియయు బహువచనంబున నున్నది.

సూ॥ ౧౩౨. ప్రాదు లుపసర్గంబులు.

ప్ర-పరా - అప - సమ్ - అను - అవ - నిర్ - నిస్ - దుర్ - దుస్- వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి- ఉప. ఇవి సంస్కృతంబున నుపసర్గంబులు. ఇవి మాటలకు మొదటఁ జేర్పఁబడును. ఈ శబ్దములకు మొదట 'ప్ర' యున్నది కావునఁ బ్రాదులనఁబడు. ప్ర+ఆది=ప్రాది.

ప్రభవించు - ఆవిర్భవించు - ఉపచరించు - సంస్కరించు లోనైనవి.

సూ॥ ౧౩౩ వలయు లోనగు క్రియలకుఁ గర్తయగు భావంబునందు నుఙీ యగు.

నుఙీ యన అగు ధాతువుయొక్క అన్నంతరూపము కఙ - కాఙ - (చూ. సూ. ౨౨) ఉ. వాఁడు చూడవలయు. ఇందు 'వలయు' క్రియ ఏదివలయు? 'చూచుట' వలయు అని యుత్తరము. చూచుట అనునది చూచు ధాతువుయొక్క భావము. ధాతువుయొక్క యర్థమే భావము. ఈ ధాతువు యొక్క తుమున్నర్థకరూపమే చూడఙ. దీనికి 'కఙ' గాని 'కాఙ' గాని చేర్పఁబడును. చేర్పఁగా 'వాఁడు చూడఁగవలయు - వాఁడు చూడఁగా వలయు' అని రూపంబులు. ఇట్లే వారలు చూడవలయు - వారలు చూడఁగ వలయు - వారలు చూడఁగావలయు - నీవు చూడవలయు - మీరు చూడ వలయు - నేను జూడవలయు-మేము చూడవలయు - మనము చూడవలయు.

వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును - చెల్లదు - తగును- తగదు - వచ్చును - రాదు ఇత్యాదులు వలయ్వాదులు.

సకర్మకంబునకు స్వరూప ప్రేరణార్థంబుల రెండును, కొను పడ్వను బంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచో నగునవి యాఱునుం గూడ నెనిమిది రూపంబు లయ్యె.

### సకర్మకమునకు స్వరూపార్థంబున కర్త్రర్థకము.

మైత్రుఁడు వంటకమును వండెను.

'వంటకమును' కర్మము గనుక సకర్మకము.

### ఆత్మనేపద కర్త్రర్థకము. కొను అను బంధము గలది.

మైత్రుఁడు వంటకమును వండుకొనియెను.

కర్మార్థకము పడు అను బంధము గలది.

మైత్రునిచేత వంటకము వండఁబడియెను.

ఆత్మనేపదకర్మార్థకము కొను - పడు రెండును అను బంధములుగఁ గలది.

మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను.

సకర్మకము - ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను. వండించు ప్రేరణార్థకరూపము.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము కొను అను బంధముగలది.

చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను.

ప్రేరణకర్మార్థకము పడు అనుబంధము గలది.

చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపఁబడియెను.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము కొను-పడు రెండును అను బంధములుగఁ గలది.

చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను.

సూ॥ ౧౩౭. గతి, బుద్ధి, ప్రత్యవసానార్థ, శబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మం బగు.

గత్యర్థకము - బుద్ధ్యర్థకము - ప్రత్యవసానార్థకము - శబ్దకర్మము - అకర్మకము. వీనికి అప్రేరణంబున నెయ్యది కర్తయగునో ప్రేరణంబున నదియే కర్మ మగు.

పొందు మొదలైనవి గత్యర్థకంబులు. తెలియు మొదలైనవి బుద్ధ్యర్థకంబులు. కను - దీని పర్యాయపదంబులుఁ బుద్ధ్యర్థకంబుల వాడఁబడు.

తిను మొదలైనవి ప్రత్యవసానార్థకంబులు. (ప్రత్యవసానము = భోజనము) విను - చెప్పు - చదువు మొదలైనవి శబ్దకర్మంబులు. కర్మవాచకములేనిది యకర్మము.

మైత్రుఁడు గ్రామంబుం బొందెను. అప్రేరణము. గత్యర్థకము ఇందు మైత్రుఁడు కర్తృపదము.

చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను. ప్రేరణము. గత్యర్థకము. ఇందు 'మైత్రుని' కర్మవాచకము.

సూ॥ ౧౩౮. అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు.

ఉ. రాముఁడు మిథిలం గనియె. ఇందుం గనుట అను కార్యము చేసిన వాఁడు రాముఁడు గనుక రాముఁడు అను పదము కర్తృపదము.

రామునకు మిథిల గనంబడియె. ఇందును గనుట అనుకార్యము చేసిన వాఁడు రాముఁడే. ఆ పదమున కీ వాక్యమునందు 'కు' షష్ఠి యయ్యెను.

రామునిచే మిథిల గనంబడియెను. ఇందుఁ గర్తృపదమునకు తృతీయా ప్రత్యయము 'చే' యయ్యెను.

ఇట్లు మైత్రుఁడు తత్త్వంబుఁ దెలిపెను. చైత్రుఁడు మైత్రునకుఁ దత్త్వంబుఁ దెలిపెను.

సూ॥ ౧౩౬. కన్వాది యోగంబునఁ బ్రయోజ్య కర్తకు షష్ఠి నిత్యంబు.

అనఁగా కనులోనైనవి (ఆ యర్థము కలవి) కూడినపుడు ఆకార్య మొనర్చినవానిఁ దెలుపు కర్తృపదమునకు షష్ఠియే యగును.

విశ్వామిత్రుఁడు రామునకు మిథిలఁ గానిపించెను. కనినవాఁడు రాముఁడు. ఆ పదమునకు షష్ఠి.

కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను. చూచినవాఁడు అర్జునుఁడు గావున ఆ పదమునకు షష్ఠి.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపద కర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుఁగునది.

కర్త్రర్థకము.

మైత్రుండు బ్రదికెను.

ప్రేరణ కర్త్రర్థకము.

చైత్రుండు మైత్రుని బ్రతికించెను.

ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము.

చైత్రుండు మైత్రుని బ్రతికించుకొనియె.

ప్రేరణ కర్మార్థకము.

చైత్రునిచే మైత్రుఁడు బ్రతికింపఁబడియె.

ప్రేరణాత్మనేపద కర్మార్థకము.

చైత్రునిచేత మైత్రుండు బ్రతికించుకొనఁబడియె.

## కృదంతపరిచ్ఛేదము.

సూ॥ ౧. ధాతువులవలనఁ గలుగు నామవాచకములు కృదంతములు.

అఁగుధాతువు. దీని కృదంతరూపము నామవాచకము అఁక.

సూ॥ ౨. ఈ నిమిత్తమై ధాతువులకుఁ జేర్పఁబడు ప్రత్యయములు కృత్తులు.

ఇందు 'ఁడు' లోనైనవి చేరవు. అఁగు + క = అఁక. ఇచట 'క' కృత్తు.

సూ॥ 3 ఇట్లు కృత్తులయిన క గ త ప వ ఇవి పరమైనపుడు ధాతువుల కడపటనుండు క గ చ య వ-లకు లోపంబగు.

సూ॥ ౪. కవర్ణకం బలుగ్వాదుల కగు.

అలుగు లోనగు ధాతువులు నామవాచకము లగునపుడు 'క' ప్రత్యయము వచ్చును.

| | | | |
|---|---|---|---|
| అలుగు | అలుక. | కాఁగు | కాఁక. |
| అఁగు | అఁక. | తునుఁగు | తునుక. |
| ఎఱుఁగు | ఎఱుక. | నడచు | నడక. |

ఇట్లు కొన్నిశబ్దంబులందు బిందువు లోపంబగు.

| | | | |
|---|---|---|---|
| కడఁగు | కడఁక. | నలఁగు | నలఁక. |
| కలఁగు | కలఁక. | పోవు | పోక. |

| | | | |
|---|---|---|---|
| మడఁగు | మడక. | క్రను | క్రానిక. క్రానుక. క్రానుపు. |
| మలఁగు | మలక. | | |
| మునుఁగు | మునుక. | | |
| మూఁగు | మూఁక. | కను ధాతువునకు ఇక క పు-లు. పరమైనపుడు 'క' కు దీర్ఘంబగు. | |
| మొలచు | మొలక. | | |
| (వచ్చు) రా | రాక. | కినియు ముదియులకు ఉత్వంబగు. | |
| వంగు | వంక. | | |
| వీఁగు | వీఁక. | కినియు | కినుక. |
| | | ముదియు | ముదుక. |
| కడచు | కడక కడాక. | | |

సూ॥ ౫౭. ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| కలుగు | కలిమి. | ఒడ్డు | ఒడ్డిమి. |
| ఓరుచు | ఓరిమి. | తాలు | తాలిమి. |
| కూరుచు | కూరిమి. | ముదియు | ముదిమి. |
| నేరుచు | నేరిమి. | బడియు | బడిమి. |
| వేలుచు | వేలిమి. | బ్రదుకు | బ్రదిమి. |

సూ॥ ౬౮. తజ్వర్ణకంబు చేయ్వాదుల కగు.

తజ్ అనఁగా 'ఁత' చూ. సంజ్ఞా. సూ. ౨౭.

| | | | |
|---|---|---|---|
| చేయు | చేఁత. | పూయు | పూఁత. |
| అలయు | అలఁత. | పోయు | పోఁత. |
| కూయు | కూఁత. | మూయు | మూఁత. |
| కోయు | కోఁత. | మేయు | మేఁత. |

| | | | |
|---|---|---|---|
| గీయు | గీఁత. | మ్రోయు | మ్రోఁత. |
| రోయు | రోఁత. | వ్రాయు | వ్రాఁత. |
| లాయు | లాఁత. | వ్రేయు | వ్రేఁత. |

సూ॥ ౭. కువ వర్ణకం బడఁగ్వాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| అడఁగు | అడఁకువ. | మఱచు | మఱకువ. |
| ఎఱుఁగు | ఎఱుఁకువ. | మెలఁగు | మెలఁకువ. |
| కలఁగు | కలఁకువ. | లోఁగు | లోఁకువ. |
| నలఁగు | నలఁకువ. | వేగు | వేకువ. |
| పెనఁగు | పెనఁకువ. | పొలయు | పొలకువ. |

సూ॥ ౮. టవర్ణకం బాడ్వాదుల కగు. అగుచో సంత లోపం బగు.

ఆడు లోనగు శబ్దంబులకు 'ట' వర్ణకంబు వచ్చునపుడు పదాంతమున నుండు 'డు' లోనగు వర్ణంబులు లోపించు.

| | | | |
|---|---|---|---|
| ఆడు | ఆట. | తివురు | తివుట. |
| ఊరు | ఊట. | తేలు | తేట. |
| ఊఱడు | ఊఱట. | త్రిమ్మరు | త్రిమ్మట. |
| ఏఁకరు | ఏఁకట. | పండు | పంట. |
| ఓడు | ఓట. | మండు | మంట. |
| పాడు | పాట. | వండు | వంట. |
| వేసలు | వేసట. | | |

ఆటశబ్దము మఱియొక శబ్దమునకుఁ జేర్చి చెప్పునప్పు డది ప్రాయికం బుగఁ గ్లీబసమం బగు. అనఁగా ఆటము అనియు నగు. కోలాటము - పోరా

టము - మంద్రాటము - ప్రాయికమనుటచే కొట్లాట - గుద్దులాట అని 'ము' లేకయు నుండు.

సూ॥ ౯. టువర్ణకంబు పడ్వాదుల కగు. అగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు.

పడు దీనికి 'టు' వర్ణకము చేర్పఁగా పడు+టు అని యయ్యె.

ఇట్లు 'టు' వర్ణకము రాఁగా శబ్దమునందు మొదటియక్షరము తప్పఁ దక్కినవన్నియు లోపించు. మొదటియక్షరము దీర్ఘంబును నగు. పడు + టు = ప + టు = పాటు.

| | | | |
|---|---|---|---|
| చెడు | చేటు. | వయిచు | వాటు. |
| అడుచు | ఆటు. | ఏయు | ఏటు. |
| కఱచు | కాటు. | ఓడు | ఓటు. |
| పొడుచు | పోటు. | వ్రేయు | వ్రేటు. |

సూ॥ ౧౦. పము వర్ణకంబు తిరియ్యాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| తిరియు | తిరిపము. | మురియు | మురిపము. |
| కలయు | కలపము. | సొలయు | సొలపము. |
| పొలయు | పొలపము. | వలియు | వలిపము. |

సూ॥ ౧౧. తవర్ణకం బావులించు లోనగువాని కగు.

| | | | |
|---|---|---|---|
| ఆవులించు | ఆవులింత. | కసిలించు | కసిలింత. |
| ఇగిలించు | ఇగిలింత. | కొక్కరించు | కొక్కరింత. |
| ఓకిలించు | ఓకిలింత. | కొప్పరించు | కొప్పరింత. |
| కుళ్లగించు | కుళ్లగింత. | గిలిగించు | గిలిగింత. |

లోనైనవి.

సూ॥ ౧౨. పువర్ణకంబు మాయ్వాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| మాయు | మాపు. | త్రేఁచు | త్రేఁపు. |
| మేయు | మేపు. | త్రోచు | త్రోపు. |
| అడుచు | అడుపు. | పూఁచు | పూఁపు. |
| జడియు | జడుపు. | పెనుచు | పెనుపు. |
| వెఱచు | వెఱపు. | పొలుచు | పొలుపు. |
| ముడుచు | ముడుపు. | ప్రోచు | ప్రోపు. |
| ఇంచు | ఇంపు. | మెచ్చు | మెప్పు. |
| ఏఁచు | ఏఁపు. | మోచు | మోపు. |
| కను | కానుపు. | వలచు | వలపు. |
| కాచు | కాపు. | వాఁచు | వాఁపు. |
| | | రాచు | రాపు. |
| చూచు | చూపు. | పఱచు | పఱపు. |
| తలఁచు | తలఁపు. | మొలుచు | మొలుపు. |
| తోఁచు | తోఁపు. | పిలుచు | పిలుపు. |
| నడచు | నడపు. | తుడుచు | తుడుపు. |
| కఱచు | కఱపు. | ఊరుచు | ఊరుపు. |
| ఆరుచు | ఆరుపు. | ఆఱచు | ఆఱపు. |

సూ॥ ౧౩. ఇఁక వర్ణకం బంజ్వాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| అంజు | అంజిక. | అరయు | అరయిక. |
| అమరు | అమరిక. | అలయు | అలయిక. |
| ఆడు | ఆడిక. | తూను | (తూఁగు) తూనిక. |
| ఓడు | ఓడిక. | ముగియు | ముగియిక. |

| | | | |
|---|---|---|---|
| ఓపు | ఓపిక. | తోఁచు | తోఁపు-తోఁపిక. |
| కను | కానిక. | నమ్ము | నమ్మిక. |
| కూడు | కూడిక. | పొందు | పొందిక. |
| కోరు | కోరిక. | పోలు | పోలిక. |

సూ॥ ౧౪. అప్పాదులకు నజీ యగు.

| | | | |
|---|---|---|---|
| అప్ప | అప్పన. | పాట | పాటన. |
| ఉజ్జ | ఉజ్జన. | మన్న | మన్నన. |
| ఒప్ప | ఒప్పన. | వీచు | వీవన. |
| గట్ట | గట్టన. | దట్ట | దట్టన. |
| గడ | గడన. | దీవ | దీవన. |

సూ॥ ౧౫. బడి యేలాద్యుల కగు.

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులఁబడి - తీరుబడి - పెట్టుబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

సూ॥ ౧౬. గడ చేర్వాదుల కగు.

చేరుగడ తిరుగడ తీఱుగడ తేఱుగడ త్రేగడ.
మనుగడ విడుగడ వీడుగడ పన్నుగడ.

సూ॥ ౧౭. ఇకి కోర్వాదుల కగు.

కోరు + ఇకి = కోరికి; పూనికి - పోలికి - మనికి - వినికి - (చూచునకు చూడు) చూడికి. కోర్కి— కోరికె అపశబ్దంబులు.

సూ॥ ౧౮. వువర్ణకంబు మన్వాదుల కగు.

| | | | |
|---|---|---|---|
| మను | మనువు. | నొచ్చు | నోవు. |
| కాచు | కావు. | పూచు | పూవు. |

| | | | |
|---|---|---|---|
| కొలుచు | కొలువు. | ప్రుచ్చు | ప్రువ్వు. |
| చచ్చు | చావు. | ఉలియు | ఉలివు. |
| తడయు | తడవు. | నిలుచు | నిలువు. |

సూ॥ ౧౯. అవర్ణకంబు గీర్వాదుల కగు.

గీఱు + అదులు = గీర్వాదులు - గీఱు లోనైనవి.

గీఱు - ఊఁద - ఎండ - కాయ - చదియు - తునియు - పరియు - పాయు - పిడుచ - మీట - మడియ - వదర - వ్రయ్య.

సూ॥ ౨౦. అకవర్ణకంబు మార్వాదుల కగు.

మాఱు లోనగు శబ్దంబులకు 'అకము' అగు.

| | | | |
|---|---|---|---|
| మాఱు | మాఱకము. | అంపు | అంపకము. |
| అమ్ము | అమ్మకము. | దంచు | దంపకము. |
| నమ్ము | నమ్మకము. | పంచు-పంపు | పంపకము. |
| వండు | వంటకము. | అద్దు | అద్దకము. |

ఇందు 'డ' కారమునకు 'ట' కారము. పెంచు - పెంపకము.

త్రోము త్రోమకము.

సూ॥ ౨౧. డువర్ణకం బార్వాదుల కగు. అగునపుడు 'ప'కారంబు చ య ల కగు.

ఆఱు లోనగు శబ్దములకు 'డు' వర్ణకం బగు. అట్లగునపుడు చ య వర్ణములకు 'ప' కారం బగు.

ఆఱు+డు=ఆఱుడు, దోఁచు+డు=దోఁపుడు.

మాయు+డు=మాపుడు; అమ్ము - అమ్ముడు, అల్లు - అల్లుడు.

ఎక్కు - ఎక్కుడు; క్రమ్ము - క్రమ్ముడు; చోపు - చోపుడు.

త్రొక్కు - త్రొక్కుడు; త్రోచు - త్రోపుడు; దంచు - దంపుడు.

దాఁచు - దాఁపుడు; దిగు - దిగుడు; పెంచు - పెంపుడు - ప్రేఁపుడు; ప్రాఁకు - ప్రాఁకుడు; రాచు - రాపుడు ఇత్యాదులు.

సూ॥ ౨౨. ఉవర్ణకం బడుక్వాదుల కగు.

అడుకు - అంటు - ఒప్పు - ఒఱుగు - ఒసఁగు.

సూ॥ ౨౩. వడిలోనైన విశ్లేషలుంగునది.

వడి - కొలువడి - గెలువడి - నడవడి వ్యతిరేకంబున లేవడి.

మిడి - లేమిడి.

వి - తనవి - తెలివి - విరివి.

అవు - తగవు - నగవు - ఊఱవు.

ఇ - చేయి - వ్రాయి; దప్పి - డప్పి - నొప్పి - వుప్పి. ఈ కడ నాలిగింటి యందలి య చలకుఁ బవర్ణం బగు.

కలి - కనుకలి - వినుకలి.

ఇడి - రాయిడి.

ఎన - ఈర్చు - ఈర్పెన; ఉబ్బు - ఉప్పెన; కంచు - కంచెన; దువ్వు - దువ్వెన; వడ్డించు - వడ్డెన - వడ్డన.

పురము - దాఁచు - దాఁపురము; కాఁచు - కాఁపురము; దాచు - దాపురము.

మతి - ఎక్కు+మతి=ఎగుమతి; దిగు+మతి=దిగుమతి.

వలి - కాచు+వలి=కావలి. పీచు+వలి=పీవలి.

ఆధునిక కృతుల అరగింపు - ముగింపు లోనగు ఇంపు ప్రత్యయాంతములు కానవయ్యెడి. ఈ 'ఇంపు' సాళగింపు - నళింపు అనుచోఁ దత్సమ క్రియలఁ దోఁచెడి.

---

సూ॥ ౧. పదాద్యంబులు, ఋ ఌ వర్ణంబులు, ర ల తుల్యంబులు.

మాటకు మొదటనుండు ఋవర్ణము రకారముతోను, ఌవర్ణము లకారముతోను సమానములు. అనఁగా ఋ ఌ అచ్చులైనను అచ్చులకుఁ బరములైనవు డచ్చులవలె సంధి లోనగు కార్యములు జరుపరాదనియు హల్లులైన ర ల-లు పరమైనవు డెట్టికార్యము జరుపఁబడునో యట్టులే జరుపఁబడు ననియు నర్థము.

ఉదా. అతఁడుఋషి సంధి. సూ. ౧౦ ప్రకార మిట సంధి గలియదు.
ఆ ఋషి సంధి. సూ. ౧౩ ప్రకారము యడాగమము లేదు.
వచ్చె ఋషి సంధి. సూ. ౨౯ ప్రకారము ద్రుతమునకు లోపము.
వచ్చెఁ ఋషి సంధి. సూ. ౩౮ ప్రకారము సంశ్లేషను వచ్చెనృషి.
వచ్చెను ఋషి సంధి. సూ. ౩౮ ప్రకారము స్వత్వము.

సూ॥ ౨. ఆచ్ఛికపదంబులం దుత్తమంబులగు, రు లు డు ముందటి యేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు.

అచ్చ తెనుఁగు పదంబులఁ గడపటి వర్ణము రు లు డు-లో నేదైన నుండినయెడల దానికి ముందున్న ఏకారము హ్రస్వమైన ఎకారమగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గన్నేరు | గన్నెరు. | పల్లేరు | పల్లెరు. | ఆడేలు | ఆడెలు. |
| కోనేరు | కోనెరు. | పెన్నేరు | పెన్నెరు. | కుందేలు | కుందెలుఁ. |
| నల్లేరు | నల్లెరు. | మానేరు | మానెరు. | తోడేలు | తోడెలు. |

| | | | |
|---|---|---|---|
| నాఁగేలు | నాఁగెలు. | నేరేడు | నేరెడు. |
| | | మారేడు | మారెడు. |
| | | పూరేడు | పూరెడు. |
| | | తంగేడు | తంగెడు. |

సూ॥ 3. ఊయేల, యూయాలల చాఁపుల నొండొం టికిం గుఱుచ యొండెనగు.

ఊయేల - ఊయాల అను శబ్దంబులఁ గల దీర్ఘాక్షరముల కొక్కొక్క దానికి హ్రస్వరూపము వైకల్పికముగ వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| ఊయేల | ఉయేల | మొదటి యక్షరము హ్రస్వము. | | |
| | ఊయెల | రెండవ | ,, | ,, |
| ఊయాల | ఉయాల | మొదటి | ,, | ,, |
| | ఊయల | రెండవ | ,, | ,, |

ఉయ్యేల - ఉయ్యెల - ఉయ్యాల - ఉయ్యల.

ఇవి యకార ద్విత్వముతోఁ గూడిన రూపంబులు. (చూ. సంజ్ఞ. సూ. ౪౭.)

సూ॥ 4. పయ్యెద పయ్యద.

(సంజ్ఞా. సూ. ౪౭) పయ్యెదకు రూపాంతరము పయ్యద.

సూ॥ 5. ఊ యేలాదులం దొలి యచ్చుమీఁది హల్లు నకు ద్విర్వచనం బొండెనగు.

ఊయేల ఇందుఁ దొలియచ్చు 'ఊ' దీని మీఁద హల్లు 'యే' దానికి వైకల్పికముగ ద్విత్వము. ద్విత్వము వచ్చినపుడు పూర్వాక్షరము హ్రస్వ మగును. ఊయేల - ఉయ్యేల ఇట్లు దీవియ - దివ్వియ. ఊయేల - ఊయెల - ఊయాల - ఊయల. ఆయె - ఏలిదము - ఓయు - ఓయారము. కోపు (వింటి

కొన) జాజర - తీనియ - తీయము - తేప (కట్టుమ్రాఁకు) తేమ - తోయలి - నూవు - నోవి - నోవు - పూవు - పేయ - మోక (మొలక) మోటిక - మోవు- వీయము ఇత్యాదులు.

సూ॥ ౬. ఱకారంబుక్రింది ఱకారంబునకుం, దుది ను లు ర క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు.

అఱ్ఱు - అఱు; కఱ్ఱ - కఱ (మఱక) కఱ్ఱి - కఱి, గొఱ్ఱియ - గొఱియ, మొఱ్ఱ - మొఱ, కన్ను - కను, నన్ను - నను, దున్ను - దును, పల్లు - పలు, కల్లు - ముల్లు - విల్లు లోనైనవి.

సూ॥ ౭. అక్కటాదుల జడ్డ కు లోపంబు విభాష నగు.

అక్కట - అకట. ఇట్లు అగ్గపాటు, అట్టిక, అట్టు, అట్టె, అయ్యో, అయ్యారే, అవ్వారి, ఇట్టిక, ఉప్పవసము, ఉమ్మి, ఎక్కసక్కియము, ఎక్కసెక్కియము, ఎక్కిరింత, ఎడ్డ, ఎన్నిక, ఎమ్ముక, కజ్జాయము, కట్టా, కట్టిక, కప్పురము, కమ్మటము, కమ్మతము, కువ్వాడము, కొట్టిక, కొమ్మ, కొయ్యగూర, గయ్యాళిము, గిజ్జిగాఁడు, గుజ్జరాతి, చిట్టి, చిన్న, చిమ్మట, చెన్నఁటి, చెప్పము, చేప్పాఁడు, చెమ్మట, చెల్లియలు, జవ్వాజి, జాబిల్లి, తమ్మటము, తమ్ములము, తల్లి, తుమ్మికి, తువ్వర, తెల్ల, దవ్వు, దివ్వియ, నవ్వు, నిద్దుర, నివ్వరి, నివ్వాళి, నువ్వు, నెట్టిక, నెమ్మలి, పవ్వళించు, పిన్న, పుల్లియ, పువ్వు, పెవ్వ, పొట్టి, పొట్టేలు, ప్రాకెన్న, ప్రెగ్గడ, బెగ్గడు, బొమ్మ, బొమ్మికము, బొమ్మిడికము, బొమ్మిడీకము, మజ్జ, మత్తాబు, మల్లారము, ముక్కు, ముద్దియ, మెట్టిక, మొక్కసము, మొగ్గరము, మొల్లాము, రడ్డి, లొట్టిపిట్ట, వట్టి, వయ్యాళి, సన్నియ, సవ్వడి, సివ్వంగి, అట్టు, ఇట్టు, ఎట్టు, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, మమ్ము, మిమ్ము, తమ్ము, అమ్మ, అక్క, అన్న;

అవ్వ, అయ్య, అప్ప, అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు, అచ్చోటు, ఇచ్చటు, ఎచ్చటు లోనైనవి.

సూ॥ ౮. హాదులయు, నీలుగు లోనగువాని తొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు.

హాకారము మొదటఁగల శబ్దంబులయొక్కయు, నీలుగు మొదలైన శబ్దములయొక్కయు మొదటి హల్లు బహుళంబుగ లోపించు. అనఁగా అచ్చులాదియందుఁ గలవగు.

| | | | |
|---|---|---|---|
| హాడపము | అడపము. | ఇవి హాములు. | |
| హరిదళము | అరిదళము. | | |
| హాలఁది | అలఁది. | | |
| నీలుగు | ఈలుగు. | పొనరు | ఒనరు. |
| నెగయు | ఎగయు. | పూను | ఊను. |
| పొందు | ఒందు. | పొదవు | ఒదవు. |

సూ॥ ౯. ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.

ఆరాటము మొదలైన శబ్దములందు మొదటి యక్షరముగాక తక్కిన యక్షరములలో దీర్ఘాక్షర ముండెనేని యది వైకల్పికంబుగ హ్రస్వమగు.

ఆరాటము-అరటము. ఇట్లు కక్కూఁతితి - కేళాకూళి - కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెండారము - బంగారము - జేహారము - వీటతాటము - సంతోసము. ఇంగిలీకము - అటాటవికటము - అంకాపొంకములు. ఎడపా దడపా.

సూ॥ ౧౦. ఓయారాదులందొలి దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.

ఓయారము - ఒయారము, ఓయారము - కేళాకూళి - కోలె - గూడారము - గోరువంక (పక్షి) జోహారు - నీలుగు - పేఁడ - బేహారము - (బెహారము) మాఱు - మూలుగు - మోఱకు - వీటతాటము - వీడియము - సోఁడుకోను ఇత్యాదులు.

సూ॥ ౧౧. అడంగ్వాదుల 'డా'కు 'ణ'కారంబు విభాష నగు.

అడఁగు - అణఁగు, అడఁగు కడఁగు, చిల్లాడము, తడగము, నాడెము, పోఁడిమి, మిడుఁగు, వడఁకు, మిడుఁగురు ఇవి యడంగ్వాదులు.

సూ॥ ౧౨. దక్కులోనగు వానికి 'దా'కు 'డ'కారంబు విభాష నగు.

దక్కు - డక్కు; దక్కు, దగ్గఱు, దాఁగు, దాకలి, దిగు, దిగ్గియ, దూయు, దెంచము, దెప్పరము, దెప్పు, దొంగ, దొప్ప, దబ్బఱ, దాయు, దప్పి, దాపల ఇత్యాదులు.

సూ॥ ౧౩. ఏతాదులకు ముపర్ణకంబు పరం బగునపుడు దీర్ఘంబు విభాష నగు.

ఏతము - ఏతాము, ఏతము, కళ్లము, గాలము, గుడ్డము, గోణము, గోతము, జాజము, జుంజము, జోతము, తణగము, బొండ్లము, ముండము, లాతము, వీణము ఇత్యాదులు.

సూ॥ ౧౪. పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

మాటకుఁ గడపటనుండి సంయుక్తంబులు గాని ను లు రు లు-లోని ఉకారము బహుళంబుగ లోపించు.

ఇందు సు రు - లకు ఉకారలోపంబు ప్రాయికంబుగ హల్లులు పరమ్మై నప్పు డగు.

ఉ. మ్రానుపడె - మ్రాన్పడె, మినువడె - మిన్వడె, వత్తురు వారు - వత్తుర్వారు, కారుకొనియె - కార్కొనియె, రాములు - రాముల్, వనములు - వనముల్.

సూ॥ ౧౫. చుక్పరక రువర్ణంబునకు ముందఱి దువర్ణంబునుత్వంబునకు లోపంబు విభాష నగు. అగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు.

ఒక శబ్దము కడపట చువర్ణముండి దానికి ముందు రువర్ణముండి దానికి ముందు దువర్ణముండినచో దువర్ణంబుమీఁది ఉకారమునకు విభాషగ లోపంబు అనఁగా నొకశబ్దము కడపట 'దురుచు' ఉండెనేని అందలి 'దు' ద్ గానయి 'రు' తో సంయుక్తమగు అదురుచు 'అద్రుచు' నగు. ఇట్లయినపుడు 'ద్రు' కు ముందున్న యకారము చంధశ్శాస్త్రము ప్రకారము గురువు కాదు. సంయుక్తాక్షరమునకు ముందఱి యక్షరము గురువు అను ఛందశ్శాస్త్ర సూత్రమున కిది యపవాదము. ఇట్లు అదురుచు - అద్రుచు, ఎదురుచు - ఎద్రుచు, పదురుచు - పద్రుచు, విదురుచు - విద్రుచు, గదురుచు - గద్రుచు, కుదురుచు - కుద్రుచు, ఇందు ద్రు కు ముందున్న వర్ణములేకాక ఇగ్రుచు - చిద్రుపలు అను శబ్దములందును సంయుక్తాక్షరమునకు ముందుండు నక్షరములు గురువులు గావు. ఉ.

చ. ఎద్రిచిన కాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం
బద్రిచినవారు మన్నిశిత బాణ పరంపరలై మిడుంగులుల్
విద్రుపఁగఁ దత్ఫలంబుల చవిం జవితార్థులుగా శరీరపుం
జిద్రుపలుచేయుఁ దత్సుతులచేతులఁ గాకకులంబువాతులన్. ఉ. హరి.

ఇగ్రుచు కొక్కులఁ దనడెంద మివతళింప. కవికర్ణ. 3 ఆ. ఈ విషయంబు మదీయ ఛందోదర్పణంబునం బ్రపంచింపఁబడియె.

సూ॥ ౧౬. జూదాదుల దాకు జకారంబు విభాషనగు.

జూదము - జూజము; అవుదు - జవాది - జాది - జాదు - విరవాది.

సూ॥ ౧౭. నిందయందామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘములకు గి, గీ లగు.

రావణుఁడు - గీవణుఁడు; కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు. నిందయం దొకమాటనే రెండుమార్లు చెప్పునపుడు రెండవపదముయొక్క మొదటి యక్షరము హ్రస్వమైనచో 'గి' యును దీర్ఘమైనచో 'గీ' యును నగు. మాట మొదటి యక్షరము. గి - గీ లుగా నున్నచో నీ సూత్ర మన్వయింపదు.

---

Vidya Venkata Ramraju
## వాక్యపరిచ్ఛేదము.
AYURVEDA PRACTIONER

సూ॥ ౧. విషయబోధక పదరచన వాక్యంబు.

విషయమనఁగాఁ దెలియఁ దగినట్టిది. అట్టిదాని నితరు లెఱుఁగునట్లు చేయఁగలది విషయబోధకము. అట్టి పదములఁ గూర్చిన వాక్యమగును.

కొన్ని విషయములు సైఁగలచేత మూఁగలవలెం దెలుపవచ్చును. అట్టి సైఁగలు వాక్యములుగావు. నోరనుండి వచ్చుధ్వనులన్నియుఁ బదములు గావు. మూఁగలు శిశువులు సైఁగలచేఁ దమ యభిప్రాయము వెలిపుచ్చినను అవి వాక్యము లనిపించుకొనవు.

సూ॥ ౨. అర్థవంతమై, యన్వయ యుక్తమై, ప్రయోగార్హంబైనది పదంబు.

i. పదమునకు నొక యర్థము ఉండవలయును. భమ్ము - (నక్షత్రము) ఖమ్ము - (ఆకాశము) నభమ్ము - (ఆకాశము) నఖమ్ము - (గోరు) లోనైనవి.

ii. ఒక పదముతోడ మఱియొక పదమున కన్వయము సరిపడి యుండవలయు. అన్వయ మనఁగా నొక పదమునకు మఱియొక పదమునకుఁ గల పరస్పరసంబంధము. ఉ. ఇంద్రియంబులందుఁ గన్నులు ప్రధానములైనవి. పక్షు లెగిరెను.

iii. ప్రయోగయోగ్యము. ఉ. రాముఁడు - మంచివాఁడు - వీనిని 'రాము - మంచివా' యని చెప్పుట సరిగాదు.

ఇట్లు విషయమును బోధించుపదమునకు లేక పదసముదాయమునకు 'వాక్యమని పేరు.

ఒకఁడు మఱియొకనిఁ జూచి 'పో' యని చెప్పిన నది వాక్యమే యగు. ఏలన! పో యనునది యర్థముగల పదము ప్రయోగయోగ్యము. అన్వయము సందేహింపఁ బనిలేదు. పో యనునది మధ్యమపురుషము గావున 'నీవు' అనునది అధ్యాహార్యము. 'నీవు పో' యని వాక్యము. కావున 'నీవు' అను కర్తృపదముతో నన్వయించును. ఇట్టులే తే-రా లోనైనవి. ఇవి యొంటొంటి పదములు.

పక్షు లెగురును. రాముఁడు రావణుఁ జంపెను. ఇట్టివి పదసమూహముచే నగు వాక్యంబులు. ఇవి యొక పదార్థము గుఱించి యొక విషయము బోధించెను.

వాఁడు వచ్చెనా! నేను బోదునా! ప్రశ్నించుటయం దిట్టి రూపంబులగు. ఇట్టులును విషయంబు బోధపడునుగాన నిట్టివి వాక్యంబులే యగును.

శ్రీరాముఁడు నన్ను రక్షించునా! నే నంతటి యదృష్టవంతుఁడనా! నేను గడతేఱుదునా! నే నెన్నఁడు సుఖముగాంతునో! నీవు బుద్ధిమంతుఁడవగుదువా? ఇట్టివి మనస్సులోని కోరికల బయలఁబెట్టును. కావున వాక్యము లే. పదము లర్థవంతములై ప్రయోగార్హములయ్యు దేనితో నేది యన్వయించునో యవి చేరియుండవలయును. అన్వయసంబంధము గల రెండు పదముల నడుమ సంబంధములేని వేఱుపదము రారాదు.

కృష్ణుఁడు వెన్న దొంగిలఁ దల్లి ఱోలఁ గట్టెను. ఇది వాక్యము.

తల్లి వెన్నఁ దొంగిలఁ గృష్ణుఁడు ఱోలఁగట్టెను. ఇది విరుద్ధార్థము గలిగించుచున్నది గాన సరియైన వాక్యము గాదు.

కృష్ణుఁడు దొంగిలఁ దల్లి వెన్నఱోలఁ గట్టెను.

కట్టెను వెన్న దొంగిల ఱోలఁ గృష్ణుఁడు తల్లి.

ఇట్టివి వాక్యము లనఁబడవు.

కృష్ణుఁడు వెన్న మెక్కెను. శంకరుఁడు నంది నెక్కెను. అను వాక్యములను.

కృష్ణుఁడు నంది నెక్కెను శంకరుఁడు వెన్న మెక్కెను.

కృష్ణుఁడు వెన్న నెక్కెను శంకరుఁడు నంది మెక్కెను.

వెన్న నంది మెక్కెను కృష్ణుఁడు శంకరుఁ డెక్కెను.

ఇట్టి యర్థహీనంబులు వాక్యంబులు గావు.

ఎవ్వఁడైనను విషయము తనకు బోధపడకుండినఁ దా నొకనికి బోధపఱుపలేఁడు కావున బుద్ధిమంతుఁ డగువాఁడు తానుజెప్ప నుద్దేశించిన విషయమును బోధించు పదముల నెట్లెట్లు మనస్సునఁ గుదుర్చుకొనునో యా విధముగ నితరులకుఁ జెప్పవలయును. అటుగాక మఱియొకవిధముగఁ జెప్పినఁ దాను గలవరపడుటయే గాక యెదుటివారిని గలవరపెట్టును. ఇట్టు లన్వయమపేక్షించు పదార్థంబులఁ జేర్చుటను లాక్షణికులు ఆసత్తి యందురు.

పిత్రాజ్ఞ శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతోడ నరణ్యమునకుఁ బోయెను.

ఈ వాక్యమును శ్రీరాముఁడు పిత్రాజ్ఞ సీతాలక్ష్మణులతోడ నరణ్యమునకుఁ బోయెను.

శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతోడఁ బిత్రాజ్ఞ నరణ్యమునకుఁ బోయెను.

శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతోడ నరణ్యమునకుఁ బిత్రాజ్ఞఁ బోయెను.

అని యీ వాక్యమునం దేపద మెచ్చటనుంచినను నర్థము చెడదు గావున నన్నియు సరియైన వాక్యంబులే. (చూ. కారక. ౪౩ సూ.) వాక్యమునందుఁ గల యొక పదార్థమునకు మఱియొక పదార్థమునకుఁ గల సంబంధమునకు బాధ కలుగరాదు.

ఉ. వాఁడు మంచుచేఁ గొంపఁ గాల్చెను. మంచుచేతఁ గాల్చుట పొసఁగదు గావున నిది సరియైన వాక్యముగాదు.

ఇట్టి పదార్థ పరస్పర సంబంధమునకు యోగ్యతయని పేరు. ఒకఁడొకమాట చెప్పఁగానే వినువారికి దాని విషయమై యింకను వినవలయునని యపేక్ష కలిగినయెడలఁ దరువాత వచించుమాట లట్టియపేక్షఁ దీర్చునదిగా నుండవలయును. ఒకఁడు ఆవుపాలు అని చెప్పఁగానే వినువారి కావుపాల విషయమై యేమిచెప్పునో యని వినఁగోరిక కలుగును. ఆవుపాలు దేహమునకు నారోగ్యకరము అని చెప్పినయెడల ఆవుపాలగుఱించి చెప్పఁ దలఁచినవాఁడు చెప్పఁ దలఁచినది వినఁ గోరువా రెఱింగినవారైరి. రాముఁడు చంపెను. ఎవనిని? అని వినఁ గోరిక కలుగును. వచ్చిరి అనిన ఎవరు అని తెలియఁ గోరిక కలుగును. వాఁడు వచ్చుచు అనిన వచ్చుచు ఏ[illegible]చేసెను అని వినన పేక్ష గలుగును.

ఇట్టి యపేక్షాసంబంధమునకు ఆకాంక్షయని పేరు.

క్రియ వినఁగోరిన క్రియాకాంక్ష యగు.

కావున ఆసత్తి యోగ్యత ఆకాంక్షకలవియే వాక్యంబులు. ఇవి చక్కఁగ నుండునట్లు పదములం గూర్చినచే విషయంబు బాగుగ బోధపడును.

**సూ॥ ౩. పదములు, i. నామములు, ii. క్రియలు, iii. అవ్యయములు, iv. విశేషణములు, v. సర్వనామములని ౫ విధంబులు.**

i. నామములనఁగా వస్తువులపేర్లు దెలుపు శబ్దములు.

రాముఁడు శివుని విల్లు విఱిచెను. ఇచ్చట రాముఁడు విల్లు నామవాచకములు. శివుఁడు అనునదియు నామమే. దాని షష్ఠీవిభక్తి రూపము శివుని. విఱిచెను అనునది యొక వస్తువు పేరుగాదు గనుక నది నామముగాదు. నామములు కర్తలుగాను కర్మములుగాను ఉండును. నామములే సందర్భానుసారముగ కర్తలు కర్మములు నగును.

ii. క్రియలు.

ఒక కార్యము వ్యాపారము జరుగుట దెల్పుపదము క్రియ యనఁ బడును.

'ఎగిరెను' అని నీవు మఱియొకనితోఁ జెప్పితి వనుకొమ్ము. దానివలన వాఁడేమి గ్రహించును? ఎగురుట యనుకార్యము ముగిసినట్లు గ్రహించును గాని యేది యెగిరెనని నీ వుద్దేశించితివో యది వాఁడు గ్రహింపఁజాలక యేది యెగిరెనని వినఁగోరును. పక్షులు ఎగిరెను అని నీవు చెప్పినఁ జెప్పవలసిన విషయము పూర్తిగఁ జెప్పినవాఁడవైతివి. ఇట్లు విషయము కొఱఁతలేనట్లు చెప్పు క్రియలు సమాపక క్రియలు. (చూ. క్రియ. సూ. ౮.) పక్షులు ఎగిరి అని నీవు చెప్పినయెడలఁ బక్షులగుఱించి నీవు చెప్పవలసినదంతయుఁ జెప్పినవాఁడవు కావు. ఎగిరి పక్షు లేమయ్యెనో యని యింకను వినువానికి మనసునఁ గొఱఁతయుండును. ఇట్లు కార్యము పూర్తియయినట్లు చెప్పని క్రియలు అసమాపక క్రియలు. (చూ. క్రియ. సూ. ౫.) క్త్వార్థకము వ్యతిరేక క్త్వార్థకము - శత్రర్థకము - తుమున్నర్థకము - చేదాద్యర్థకము - అనంతర్యార్థకము లోనైనవి అసమాపక క్రియలు. వీని లక్షణములు క్రియాపరిచ్ఛేదంబునఁ జూచునది.

'చంపెను' అని నీవు చెప్పిన వినువాని మనస్సులో నెవఁడు చంపెను అని యొక ప్రశ్నపుట్టును గదా. రాముఁడు చంపెను అని చెప్పితి వనుకొమ్ము. దీనివలన 'చంపుట' అను కార్యముచేసినవాఁడు రాముఁడు అని యేర్పడియె. కార్యముచేసిన వానిని లేక దానిని దెలుపు పదమునకుఁ గర్తృవాచకము కర్తృపదము కర్త యని పేర్లు.

సూ॥ ౮. వ్యాపారావబోధకము క్రియ.

'చంపెను' అనునది యొక వ్యాపారమునుగుఱించి బోధించును గనుకఁ గ్రియ యని యేర్పడియెను.

సూ॥ ౫. ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త.

రాముఁడు చంపెను. ఇందుఁ 'జంపెను' క్రియ. చంపెను అనఁగాఁ జచ్చునట్లు చేసెను అని యర్థము. కావున 'చంపెను' అనునది చచ్చుధాతువు నుండి వచ్చినది. కనుక చచ్చునట్లు చేసెను అనునది చచ్చు ధాత్వర్థవ్యాపారముఁ దెలుపును. చచ్చునట్లు చేయుట అను వ్యాపారము ఎవనిని నాశ్రయించి యున్నది? అనఁగా చచ్చునట్లు చేసినవాఁడు ఎవఁడు? అనిన నేమని చెప్పెదవు? రాముఁడని చెప్పెదవు కావున 'రాముఁడు' కర్త.

సూ॥ ౬. కర్త పదముమాత్రము. వస్తువ్యాపారము క్రియ.

ఉ. పక్షు లెగిరెను. ఇచ్చట 'కర్త' పక్షులను మాటయేకాని యాకాశమునఁ బోవు పక్షు లను జీవజంతువులుకావు. ఎగిరెను అనునది పక్షులను మాటయొక్క వ్యాపారమును దెలుపదు. ఆ మాటచే నెఱుఁగఁ గల వస్తువు లనఁగా నాకాశమున నెగిరెడు జీవజంతువుల వ్యాపారమును దెలుపును. పక్షు లనుమాట యెగురఁ గలదా? వాచ్యము=ఱెక్కలుగల జీవజంతువులు. వాచకము=వానిని దెలుపు పక్షులను పదము. ఈ రెంటికి నభేదము.

సూ॥ ౭. ధాత్వర్థ ఫలాశ్రయము కర్మము.

'కృష్ణుఁడు తినెను' అన్నప్పుడు కృష్ణుఁడు 'తినుట' యను నొక కార్యము చేసెనని తెలిసెను గాని తినుట కొక పదార్థమేదైన నుండవలయునే యా పదార్థమేది? దేనిని తినెను అని తెలిసికొను కోరిక కలుగును. కృష్ణుఁడు వెన్నను దినెను. అని చెప్పినయెడల నా సందేహము తీఱును. ఇట్లు దేనిని ఎవనిని అను ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మేదియగునో యది కర్మము. కర్మమునకుఁ గ్రియకుఁ గల సంబంధము చూతము. తినెను - క్రియ - తినుధాతువు. తినుట - ధాత్వర్థము. 'తినుట' అను వ్యాపారమునకు ఆశ్రయుఁడు గావునఁ గృష్ణుఁ డనుపదము కర్తయయ్యె. తినుట అను కార్యఫలమునకు

ఆశ్రయమైనది కావున 'వెన్న' కర్మ మనఁబడును. ఇట్లు కర్మమును గోరు క్రియలు సకర్మకములు. కర్మమును గోరనివి అకర్మకములు. (చూ. క్రియ. సూ. ౨-౩.)

సూ॥ ౮. క్రియచేఁ గర్త చెప్పఁబడిన నది కర్తరిప్రయోగము.

ఉ. వానరులు సేతువును గట్టిరి.

ఇందుఁ గ్రియ 'కట్టిరి' ఎవరు కట్టిరి? వానరులు. కావున వానరులు కర్త. ఇందుఁ గ్రియ కర్తను జెప్పుచున్నది కావున నిది కర్తరిప్రయోగము.

సూ॥ ౯. క్రియచేఁ గర్మము చెప్పఁబడునేని యది కర్మణి ప్రయోగము.

ఉ. వానరులచే సేతువు గట్టఁబడెను.

వానరులు సేతువును గట్టిరి యను విషయమే మఱియొక విధముగ నిట్లు చెప్పఁబడెను. కట్టఁబడెను అనునది క్రియ. ఏదికట్టఁబడెను అను ప్రశ్నకు సేతువు అని ప్రత్యుత్తరము. వానరులు సేతువు కట్టిరి. అనునప్పుడు ధాత్వర్థవ్యాపారమునకు నాశ్రయమైనవారు వానరులు కావున ఆ పదము కర్తయనియు ధాత్వర్థఫలమునకు నాశ్రయమగుట సేతువు కర్మమనియుఁ దెలిసి కొంటిమి. మాటలు మార్చినంతమాత్రమున విషయము మాఱదు గదా. కావున నెట్లు చెప్పినను 'సేతువు' కర్మమే. క్రియయైన 'కట్టఁబడెను' అనునది కర్మమును బోధించును గావున వానరులచే సేతువు కట్టఁబడెను. అనునది కర్మణి ప్రయోగము. ఆంగ్లేయ భాష నేర్చిన విద్యార్థులకు 'వానరులచే సేతువు గట్టఁబడెను' అను వాక్యమునందుఁ గర్తృపదము తెలిసికొనుటయందుఁ గొంత కష్టము కలదు. ఆంగ్లేయవ్యాకరణము చొప్పున నిందు సేతువు కర్త. సంస్కృ

తాంధ్ర వ్యాకరణముల ప్రకార మట్లు చెప్పరాదు. కట్టుట వ్యాపారమగును గాని కట్టఁబడుట వ్యాపారమగునా? 'తినుట' యొక్క కార్యమగును గాని 'తినఁబడుట' యొక్క కార్యమా? 'చంపుట' యొక్క కార్యమగునుగాని చంపఁ బడుట' యొక్క కార్యమా? మాటలు మార్చినంత కార్యముచేసినవాఁడు మాఱి పోవునా? 'వానరులచే సేతువు కట్టఁబడెను' అనునపుడు కర్త వానరు లను పదమే. కర్మము సేతువే. (చూ. కారక సూ. ౬ క్రియ సూ. ౧౩౮.)

అవ్యయముల గుఱించి తత్సమ సూ. ౧౭. చెప్పఁబడియె.

సూ॥ ౧౦. సమాపక క్రియ గల వాక్యంబు సంపూర్ణ వాక్యంబు.

ఉ. రాముఁడు పితృవాక్యముఁ బరిపాలించెను.

సూ॥ ౧౧. అసమాపక క్రియ గల వాక్యంబు అసంపూర్ణ వాక్యంబు.

రాముఁడు పితృవాక్యముఁ బరిపాలింప సీతాలక్ష్మణులతోడ నడవి కేగి యనేక కష్టముల సహించుచు సంచరించుచు. ఇందు నన్నియు నసమాపక క్రియలే కాని సమాపక క్రియలేదు గనుక నసంపూర్ణవాక్యము. ఇట్టి వాక్యము లందుఁ గర్తకుఁ దద్విశేషణములకును గర్తకుఁ గ్రియకును గల సంబంధాదులును, దనపవాక్యంబులును ముందే సూత్రంబులఁ జెప్పఁబడినవి. పూర్వము చెప్పఁ బడని విషయంబులు కొన్ని యిందుఁ జెప్పంబడును.

సూ॥ ౧౨. ఏకపదంబునను, ధాతూపసర్గములందును, సమాసంబులందును, సర్వత్ర సంధి నిత్యము.

ఏకపదమనఁగా విడఁదీయుటకు వల్లపడకుండునట్లు సంధి గూడిన పదము. ఉ. గోవెఁడు ఇది గో ని ఎఁడు అని విడఁదీసి వ్రాయరాదు.

ధాతువు ఉపసర్గము కలియునపుడును విసంధిగ వ్రాయరాదు. ఉ. ప్రాప్తి అనుదాని ప్ర ఆప్తియని వ్రాయరాదు. ప్రత్యక్షమనుదాని ప్రతి అక్షము అని వ్రాయరాదు. ప్రాప్తించె అనుదాని ప్రాప్తి ఇంచె అని వ్రాయరాదు. సమాసంబులందును విసంధి కారాదు. ఉ. దశరథాత్మజులు దీని దశరథ ఆత్మజులు అని వ్రాయరాదు.

సర్వత్ర యనుటచే గద్యంబులందును బద్యంబులందు నిది నియతము.

**సూ॥ ౧౩. గద్యంబున నుచ్చారణ శ్రవణ పారుష్య విరహితంబుగ యథాయోగ్యత వక్త యిచ్ఛకొలఁది సంధి విడఁదీయ నగు.**

ఇట్టి విసంధి వక్తయొక్కయు శ్రోతయొక్కయు సామర్థ్యము ననుసరించి యుండవలయును. స్వభావ విరుద్ధముగ నుండరాదు. వక్తయు శ్రోతయుఁ బ్రౌఢులేని విసంధి దుష్టము. శ్రోత బాలుఁడేని సర్వత్ర సంధి గలిపి చెప్పుటయు సమంజసము గాదు. గ్రహింపఁగలిగినంత సంధి కలిపి చెప్పవచ్చును. నీ వెవ్వఁడవు. అతఁ డిప్పు డెందున్నాఁడు. ఇట్టి స్వభావసిద్ధములైన చోటుల విసంధిగ వ్రాయరాదు.

వాక్యాంతమందును, సంధి కలిపినచో సందిగ్ధ దోషమున కాకరమగు నేనియు, శబ్దస్వరూపముఁ జెప్ప నెడలను, అతి దీర్ఘములైన వాక్యముల నడుమను, పెక్కు ద్రుతంబు లొక్కచోఁ గలియు నెడను, సంధి గలిపిన నశ్లీలామంగళ వ్రీడాదోషంబులు కలుగు నేనియు, గద్యంబులంద విసంధిగ వ్రాయుట దోషంబుగాదు. నీవు మధ్యాహ్నముండవా? వానికొక గుద్దిమ్ము ఇత్యాది. ఇట్టి పదము లొకచోఁ జేర్చుటే దోషము. తక్కిన సందర్భముల సంధి గలుపవలయును.

**సూ॥ ౧౪. ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు మహాప్రబంధంబులందు సకృత్తుగఁ గానఁబడెడి.**

ఇది సంధి ౭౫-వ సూ॥ నకు అపవాదము. ఈ సూత్రంబు ద్రుత మున కచ్చు పరమైనపుడు ద్విత్వము మహాకావ్యంబులఁ బస్యంబుల సకృత్తుగఁ బ్రయోగింపఁబడుట తెలిపెడి. ఇట్లు తఱచు ప్రయోగింపరాదు.

దళవాటికి న్ననుపమ రత్నపేటికి మనః ప్రమదావహ వస్తుకోటికిన్. భీమ. 6 ఆ.

అన్నిష్టసఖినూఁది యున్నదాని. ఎన్నఁడుస్నేని. భారత. ఆది.

అను+ఇష్టసఖి=అను+నిష్టసఖి (సంధి. సూ. ౪౮.)

అన్+నిష్టసఖి (ప్రకీర్ణక సూ. ౧౪.) అన్నిష్టసఖి యయ్యె ననియు, ఏని శబ్దపర్యాయంబుగ హాలాది 'స్నేని' యను పదము గలదనియు వీనికిఁ గొందఱు సమాధానము చెప్పెదరు.

సూ॥ ౧౫. సమూహార్థకంబైన మహచ్ఛబ్దం బమహచ్ఛబ్ద రూపంబుం బోలియుండినను దద్విశేషణ, క్రియలు వైకల్పికం బుగ మహాద్వాచకంబులయి యుండు.

ఉ. పడ నడుతురు విన్నుఁ గన్నఁ బ్రమథ గణంబుల్.

సూ॥ ౧౬. నీచత్వంబునఁ బుంలింగంబున, నేకవచనం బునఁ గొన్ని సంజ్ఞావాచకంబులకు 'గాఁడు' చేరుచోఁ బ్రాతి పదిక మికారాంత మగు.

ఉ. రాము - నీ చార్థంబునఁ బుంలింగంబుల నేకవచనంబున రామి గాఁడు. ఇట్లు సుబ్బిగాఁడు - పాపిగాఁడు - శేషిగాఁడు - రంగిగాఁడు - సూరిగాఁడు - నారిగాఁడు లోనైనవి. కాఁడు అనునది యిట్లయ్యెనని యెఱుంగునది.

సంబోధనంబున డుజ్జునకు లోపంబు నిత్యంబు. గకారంబునకు హ్ర స్వంబు వైకల్పికంబు. ఉ. రామిగా - రామిగ లోనైనవి.

సూ॥ ౧౭. తెలుఁగు స్త్రీసమంబుల కడపలఁ గొన్నింటి కేకవచనంబునఁ బూజ్యతయందు 'గారు' శబ్దంబగు. ద్వితీయైక వచనరూపంబుమీఁద గారు వారును నగు.

ఉ. అన్నగారు - అక్కగారు - అమ్మగారు - అవ్వగారు - తల్లిగారు - తండ్రిగారు - అత్తగారు - శెట్టిగారు - రాజుగారు - రాణిగారు లోనైనవి. తెలుఁగు ననుటచే శాస్త్రిగారు - తమ్ముఁడుగారు - ప్రభువుగారు - అల్లుఁడు గారు - నాయఁడుగారు - సోమయాజిగారు - నన్నయభట్టుగారు - దేవిగారు లోనగు రూపంబులును గలవు.

రాయనిగారు - రాయనివారు అని రెండు రూపంబులు.

సూ॥ ౧౮. తత్సమ దుమంతంబులకుఁ గొన్నింటికి ద్వితీయా బహువచనంబు మీఁదఁ బూజ్యతయందు వారగు.

శ్రీరాములవారు - రామానుజాచార్యులవారు - శంకరాచార్యులవారు - వాల్మీకులవారు - వ్యాసులవారు - రాయలవారు - అయ్యవార్లవారు - స్వాముల వారు లోనైనవి.

అర్థవిశేషంబున నేకవచనము మీఁదను గొన్నియెడలఁ గాన నగు. ఉ. అయ్యవారు - అమ్మవారు - దేవరవారు.

సూ॥ ౧౯. పూజ్యతయందు నామవాచకంబులకును, వాఁడు - వీఁడు - నా - నీ శబ్దంబులకును నేకవచనంబునకు బహువచనం బొక్కెడ నగు.

అగుచోఁ క్రియయు సంబోధ్యవాచకం బేకవచనాంత బగుటయుఁ గలదు.

ఉ. శ్రీరాముఁడు-శ్రీరాములు. మా గురు విట్లు చెప్పెను. మా గురువు లిట్లు చెప్పిరి. ఇచ్చట 'మా' యనునది సంబంధంబున బహువచనము. గురువులు పూజ్యార్థంబున బహువచనము.

వారు మహానుభావులు వారికేమి కొఱఁత.

మీ దయ యెట్లు వచ్చిన నట్లు చేయుఁడు. ఇందు నీ దయ యనుటకు మీ దయ. మా మాట జవదాఁటువాఁడెవ్వఁడు సుఖించును.

నెయ్యఁపు టొజ్జలు పైపై నెనయింపసాగె. వ॥ చ॥

ఇచ్చటఁ బూజ్యార్థంబున ఒజ్జలు బహువచనము. క్రియ ఏకవచనము. అనఘా! మీయట్టివారి యాశ్రితుఁ డిట్టులుండ నొప్పరికింపఁదగవా. శ్రీరాములు నన్ను రక్షించునా? ఆర్యులారా! మీ యుత్తరం బందెను.

సూ॥ ౨౦. సంబోధ్యవాచకంబు బహువచనాంతంబ య్యుఁ గ్రియలమీఁది యమ్మాదు లేకవచనాంతంబుల యగు.

మిత్రులార నాకు మీరు తోడ్ప డెదరయ్య.

మల్లికలార! మీ పొదల మాటునలేఁడుగదమ్మ చెప్పరే.

సూ॥ ౨౧. పూజ్యతాతిశయంబున మీరునకుఁ దాము - తమ రగు.

తాము వ్రాయించిన పత్రిక, తమ రంపిన గ్రంథము, తమ యోగ క్షేమములు. తన తన వాహనము లాయుధము లెల్లజనంబును ననువుసేసి కొనుఁడు. భార.

సూ॥ ౨౨. సంబంధంబున 'నీ - నా' లకు బహువచన రూపం బొక్కెడ నగు.

మీ యూరు, మా తల్లి.

సూ॥ ౨౩. ప్రశ్నాదుల కిమర్థక శబ్దంబులు బహువచనాంతంబులు నగు.

ఉ. నీ వెవ్వఁడు? నీ వెవ్వరు?
మీ తల్లి యెవతె? మీ తల్లి యెవరు? } ప్రశ్న.
నీ పేరెది? నీ పేరెవరు?
ఎవరక్కడ? తెలియని వస్తువు నుద్దేశించి ప్రశ్న.
నన్నుఁ బిలిచిన దెవరు? నా జననియా జనకుఁడా?
నిన్నుఁ బిలిచిన దెవరని తలఁచితివి?
నీవు నన్నెవ రనుకొంటివి?
నీవు నన్నెవరిఁగ భావించితివో యట్టివాఁడ నేఁగాను.

కొన్నియెడల నెవ్వరు 'అది' పూర్వకంబయి యుండును. ఉ. నన్నుఁ బిలిచిన దెవ్వరు? ఇచ్చటఁ బిలిచినది స్త్రీయో పురుషుఁడో నిర్దేశింప రాకుండుటను బిలిచినవా రొక్కరే యగుటను 'అది' ముందుగఁ జేర్పఁబడియె.

సూ॥ ౨౪. స్త్రీపురుషుల నిర్దేశింపరానియెడను, నిర్దేశించినను వారిలో నొకరినే గ్రహింపవలసినయెడను 'ఒక్కఁడు' బహువచనాంతం బగు.

ఉ. కట్టుఁబాటు లేనియింట నొకరు చెప్పినట్టు మఱియొకరు వినరు. సీతారాములయం దొకరి కీసరము నొకరి కీసరము నర్పింపుము.

సూ॥ ౨౫. i. సస్య లోహవాచక శబ్దంబులును,
ii. కొన్ని సంభార ధాన్యవాచకశబ్దంబులును,
iii. గుణరస వాచకములు సమానార్థకములునైన దేశ్యవిశేషణ శబ్దంబులును,

iv. కేల్యాదులును,
నిత్యైకవచనాంతములు.

ఉ. i. సస్యము అనఁగా పైరు. వరి - కంది - సెనగ - ఆరుగ - జొన్న - పెసర - మినుము - ప్రత్తి మొదలైనవి.

లోహములు. ఇనుము - రాగి - విత్తళి - వెండి - బంగారు - కంచు మొదలైనవి.

ii. సంభారములు - సంబారపుదినుసులు. నూనె - ఆముదము - నెయ్యి - చమురు - ఉప్పు - ఇంగువ - చింతపండు - పసుపు లోనైనవి. కొన్ని యనుటచే ఆవలు - ఆవాలు - దనియాలు - మెంతులు ఇవి బహువచనాంతంబులు.

ధాన్యములు - బియ్యము - జీలకఱ్ఱ లోనైనవి.

iii. గుణవాచకమైన విశేషణము. కాకులు నలుపు, హంసలు దెలుపు, చిలుకలు పసుపు లోనైనవి.

సమానార్థకములు - సరి - సాటి - ఈడు - జోడు - ఎన - ఉద్ది - దీటు. ఉ. సీతారాములతోడ నెవరు సరి - సాటి - యీడు - జోడు లోనైనవి.

iv. కేలు; ఇరులు; అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు; అక్కడ-ఇక్కడ-ఎక్కడ; అచ్చట - ఇచ్చట - ఎచ్చట ఇవి యన్నియు నిత్యైకవచనములు. వీనికి బహువచనంబున రూపములు లేవు.

అట్టులు - ఇట్టులు - ఎట్టులు.

సూ॥ ౨౫. అవ్యయంబులందుఁ గొన్ని బహువచనాంత తుల్యంబులు నగు.

సూ॥ ౨౭. క్రీడావిశేషవాచకశబ్దంబులును, పెక్కు ధాన్యవాచకశబ్దంబులును, అందఱు లోనైనవియు నిత్యబహువచనాంతంబులు.

క్రీడావిశేషమనఁగా ఒక మాదిరియాట. అమ్మనబంతులు - డాఁగురు మూఁతలు - ఆలంకులు - గుంటచాళ్లు - గుడి గుడి గుంచాలు - గీఁచ గిఁజలు. గుజ గుజ రేకులు - చల్లుడు పిచ్చెలు. గుజ్జన గూళ్లు - గొబ్బిళ్లు - ఓమన గుంటలు - అచ్చన గాయలు లోనైనవి.

ధాన్యవాచక శబ్దంబులు. వడ్లు - పెసలు - కందులు - మినుములు - సెనగలు - అళ్లు - జొన్నలు లోనైనవి.

అందఱు - ఇందఱు - ఎందఱు - పెక్కండ్రు - పెక్కురు - గుగ్గిళ్లు - కురులు - అక్షతలు - పులకలు - అగచాట్లు - అవరులు - పేలలు - పేలాలు లోనైనవి.

సూ॥ ౨౮. నామ పునర్గ్రహణంబునఁ దత్పర్యాయంబుగఁ దచ్ఛబ్దబోండె నగు.

ఉ. రాముఁడు భక్తవత్సలుఁడు. అతని భక్తులకుఁ బరాభవంబు లేదు. ఒండె ననుటచే మరల నామంబె యొండొకచోఁ బ్రయోగింప నగు.

సూ॥ ౨౯. కర్తృబహుత్వంబునఁ దన తనకుఁ దమ తమయు నగు.

ఉ. ఆ యోధులందఱుఁ దను తమ ప్రాణంబుల దెస నాసలు మాని పోరిరి.

సూ॥ 3౦. సంఖ్యాపూరణార్థక విశేషణంబు నందలి 'అవ' కు 'అగు' నగు.

ఏడవ పర్వము - ఏడగు పర్వము. (చూ. తత్సమ. పుట ౭.)

సూ॥ ౩౧. కొన్నియెడల మహాద్వాచకంబునకు విశేష ణంబయిన సంఖ్యావాచకం బమహద్రూపంబు కలదియు నగు.

ఉ. రాక్షసులు పదివేలు - పదివేవురు రాక్షసులు. ఒక మున్నూఱు దెచ్చిన చాపంబు.

సూ॥ ౩౨ ఊరు - చోటు - మేనులకుఁ దృతీయయం దత్వ ము లేదు.

ఈ శబ్దములకు సప్తమీవిభక్తియందు ఊరన్ - చోటన్ - మేనన్ అని యగు. ఆచ్ఛికపరిచ్ఛేదము ౭౧-వ సూత్రము ప్రకారము తృతీయకు నట్లే కావలసియుండఁగా నీమూఁడు శబ్దముల కట్టులు అత్వమురాదు.

సూ॥ 33. కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు.

ఉ. రాముఁడు రక్షించిన భృత్యుఁడు లోకోత్తర చరితుఁ డగును.

రాముఁడు రక్షించిన భృత్యుఁడను చోట రాముఁడు కర్త. భృత్యుఁడు కర్మము. రామునిచే రక్షింపఁబడిన భృత్యుఁడని యర్థము. ఈ కర్మవాచకమైన భృత్యుఁడు అను పదమునకుఁ బ్రాధాన్యము చెప్పవలసియున్నది. అది (అగు నను క్రియకు) కర్తగాఁ జేయఁబడినది. రక్షించిన యనునది దీని విశేషణము క్రియాజన్యము. కావున భృత్యుఁడను కర్మముతో నన్వయించెను. రక్షించిన ఎవరు రక్షించిన? రాముఁడు అని కర్తతో నన్వయించెను. కర్మాదులనఁగాఁ గర్మము - కరణము - సంప్రదానము - అపాదానము - అధికరణము.

ఉ. రాముఁడు వాలి నేసిన బాణము. (కరణము). రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు. (సంప్రదానము). రాముఁడు వెడలిన వనము. (అపా దానము). రాముఁడు వసించినచోటు (అధికరణము).

సూ॥ ౩౮. భావద్వంద్వంబునఁ దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు. టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణము.

భావార్థక వ్యతిరేక భావార్థక శబ్దములు ద్వంద్వసమాస మగునపుడు మొదటి పదంబునందలి టవర్ణకంబునకు లోపం బగు

అవుట + కామి = అవుగాములు.

చెల్లుట + చెల్లమి = చెల్లు సెల్లములు.

వచ్చుట + రామి = వచ్చు రాములు.

వినుట + వినమి = విని వినములు. (ఇందు వినుటయొక్క కృదంత రూపమైన వినికి యందలి 'కి' వర్ణమునకు లోపము.)

సూ॥ ౩౯. సమాసంబునందలి పూర్వపదంబు వ్యవహితంబైన యుత్తరపదంబుతోడ నన్వయించు.

ఉ. రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె.

రాహుకంఠము సమాసము. ఇందలి తొలుతటి పదము రాహువు. అది వ్యవహితంబైన దేహముతోడ నన్వయించును.

పరులధనమునకు విద్యకు బలమునకు దుఃఖపడువాఁడు = పరులధనమునకుఁ బరులవిద్యకుఁ బరులబలమున కని యన్వయము.

సూ॥ ౩౧౦. కర్తృబహుత్వంబున బహువచనక్రియ యగు.

ఉ. సీతా రామలక్ష్మణు లడవి కేగిరి. (సమాసము.) సీతయును రాముఁడును లక్ష్మణుఁడును నడవి కేగిరి. (వ్యస్తము.)

సూ॥ ౩౭. కర్త లనేకంబు లున్నచోఁ గ్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబు లగు.

ఉ. రాముని రాజ్యంబున మనుష్యులు పశుపక్ష్యాదులు సుఖముగ జీవించెను.

రాముని రాజ్యంబునఁ బశుపక్ష్యాదులు మనుష్యులు సుఖముగ జీవించిరి.

సూ॥ ౩౮. ఒండె - కాని - లేకాది వ్యవహితంబులయిన కర్తృపదంబులన్నియు నేకవచనంబున నున్నఁ గ్రియయు నేక వచనమంద యుండు. భిన్నవచనంబులైనచో సమీపకర్తృ వచ నంబ యగు.

ఉ. రాముఁడుగాని లక్ష్మణుఁడుగాని యుద్ధమున వెనుదీయువాఁడు కాఁడు.

లక్ష్మణుఁ డొండె సీతారాము లొండె నాడితప్పువారు గారు.

సూ॥ ౩౯. క్రియాకార్యంబు విశేషణ నామవాచకంబు లచే నొండె నగు.

కార్యము ముగిసినట్లు చెప్పుటకు సమాపక క్రియయే యుండవలయునని నియతిలేదు. ఆ కార్యము నామవాచకముచేనైనను విశేషణముచేనైన నగు. ఇట్టిచో అగు - కల - ఉండు క్రియారూపంబు లధ్యాహార్యంబులు.

ఉ. రాముఁడు సుగుణాభిరాముఁడు. సుభృత్యుఁడు దుర్లభుఁడు - సంపద యాపదలకు నెలవు. ఇం దధ్యాహార్యములైన క్రియలు కర్తతోడనే యన్వయించును.

సూ॥ ౪౦. పెక్కువిశేష్యంబులతో నన్వయించు విశేష ణంబునకు బహువచనంబ యగు.

విశేష్యంబులు స్త్రీ పుంలింగంబుల నున్నచో విశేషణంబు పుంలింగ రూపమె వహించు. స్త్రీ, పుం, నపుంసకలింగంబు లైనచో నపుంసక లింగంబె యగు

దయావంతులు సీతయు రాముఁడును భక్తులఁ బరిపాలింతురు. విశేష్యములు రెండుంటచే విశేషణము దయావంతులు బహువచనంబున నున్నది. విశేష్యములు సీత రాముఁడు స్త్రీలింగమందును బుంలింగమందు నుండుటచే దయావంతులని విశేషణము పుంలింగరూపమే కలదయ్యెను. (దయావతులు స్త్రీలింగరూపము.)

స్త్రీలు పురుషులు పశువులు పక్షు లన్యోన్య ప్రీతి పాత్రములు. కొన్ని యెడల నెక్కువసంఖ్య విశేష్యముల లింగంబె విశేషణంబున కగు. వృద్ధులగు తల్లిదండ్రులును బతివ్రతయగు భార్యయు శిశువు నూ అకార్యములఁ జేసియైన భరణయోగ్యులని మనువు చెప్పెను.

ఇందు విశేష్యములు స్త్రీ పుం నపుంసక లింగంబులందున్నను రెండు విశేష్యముల గ్రహించి వాని లింగంబె విశేషణంబునకుఁ గూర్పఁబడియె.

**సూ॥ ౪౧ అవ్యవహిత భవిష్యత్తునకు వర్తమానభూతము లగు.**

అప్పటికి జరగకున్నను వెంటనె యుత్తరకాలంబున జరగఁ గలదానిని వర్తమానముచే సూచింప నగు.

ఉ. ఇదె పోవుచున్నాను, వచ్చె సుదర్శనాయుధుఁడు.

ఆ పని చేసితివా? ఇదో చేసితిని. హా! చచ్చితిని - చచ్చితిని.

**సూ॥ ౪౨. అవ్యవహిత భూతంబునకు వర్తమాన మగు.**

నీ వూరినుండి యెప్పుడు వచ్చితివి? ఇప్పుడె వచ్చుచున్నాను.

**సూ॥ ౪౩. ప్రబంధముల భూతమునకు వర్తమాన మగు.**

ఉ. మూర్ఛిల్లిన లక్ష్మణుఁజూచి రాముఁ డిట్లు దుఃఖపడుచున్నాఁడు ఎవఁడు అన్నదానము చేయునో వాఁడు స్వర్గమునకుఁ బోవుచున్నాఁడు. ఈ మూఁడును విశేష విధులు.

**సూ॥ ౪౪. ఏకదేశి సమాసంబు లాంధ్రంబునను గలవు.**

తన - నా - నీ - ఆ - ఈ - ఏలు లోనైనవి సిద్ధసమాసగతపదంబు తోడ నన్వయించు.

తన యశోవిశదముక్తాహారి. 'తన' యను తెలుఁగుపదము సిద్ధసమాసంబులోని యశస్సు అను పదముతో నన్వయించు.

నీ కంఠార్పిత కాలపాశము మొదలైనవి.

లోనైన వనుటచే 'అఖండితరూప విలాస సంపదకు వంచిత పంచ బాణుఁడగువాని' అనుచో సంపదకు అనునది వంచిత శబ్దముతో నన్వయించును. ధృతరాష్ట్రజాధము నశేషసుహృత్స్వతబంధు దాహాసూచకమయి.

**సూ॥ ౪౫. ఉపమేయము ప్రథమాంత మగునపుడు 'అట్లు' పరంబైనచో నుపమానంబులగు నామ తదస్మ ద్యుష్మదాత్మార్థములకు షష్ఠియగు.**

ఉ. రాముఁడు తన శరంబులచే సహస్రకరునట్లు వెలింగెను.

ఇందు రాముఁడు ఉపమేయము. సహస్రకరుఁడు ఉపమానము నామ వాచకము కాన దానికి 'అట్లు' పరముకాఁగా సంధి సూ. ౪౭ ప్రకారము 'సహస్రకరునట్లు' అని యయ్యె. ఇది షష్ఠీతత్పురుష సమాసము.

తదర్థకము. దానియట్లు దీనియట్లు వానియట్లు.

అస్మదర్థకము. నాయట్లు మాయట్లు.

యుష్మదర్థకము. నీయట్లు మీయట్లు.

ఆత్మార్థకము. తనయట్లు తమ యట్లు. ఇట్లు కరణి మొదలుగాలును గ్రహించునది.

సూ॥ ౮౩. పోలె, బలె, లు పరంబులగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు, నస్మద్యుష్మదాత్మార్థములకు ద్వితీయయు నగు.

నామము అమృతము వోలె. తామరపాకు నీరుబలె

తచ్ఛబ్దము వాఁడువోలె - వాఁడుబలె. ప్రథమలమీఁది పోలె - బలె - పోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు నగు. అమృత ధారాపాతంబును బోలె లోనైనవి.

అస్మదర్థకము లోనైనవి నన్నుఁబోలె - నిన్నుఁబోలె - తన్నుఁబోలె.

'ప్రథమాంతమగు నుపమేయమునకు' అనునది యధ్యాహార్యము. ఇట్లు క్రింది సూత్రమునను గ్రహించునది.

సూ॥ ౮౭. వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలం దేదియే నొకటియు నగు.

నామము. రామునివలె తచ్ఛబ్దము వానివలె.

అస్మదర్థకము. నావలె నన్నువలె.

యుష్మదర్థకము. నీవలె నిన్నువలె.

ఆత్మార్థకము. తనవలె తన్నువలె.

సూ॥ ౮౮. ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబులకు నుపమేయ విభక్తుల యగు.

ఉ. మమ్ము ఖీరులఁబోలె వెఱపించెదవు లోనైనవి.

సూ॥ ౪౯. ఉపమానంబు లనేకంబులగుచో నుపమావాచకంబు కడదాని కొక్కటియ కొన్నియెడలఁ గన నగు.

ఉ. శారదనీరదము చంద్రబింబము కర్పూరమువలె నీ యశస్సు ధవళము.

సూ॥ ౫౦. శబ్దపల్లవాదులగు క్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు.

చల్లు పోరాడి యాడి - చల్లు పోరాడి పోరాడి. తలపోసి పోసి - తలపోసి తలపోసి. తూఁటాడి యాడి.

అదిశబ్దముచే నిట్టూర్చి యూర్చి యిట్టిప్రయోగంబులు గ్రాహ్యంబులు.

సూ॥ ౫౧. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబగుచోఁ గ్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.

ఉ. నరసఖుఁడ! నీవు సఖుఁడును నరలోకమునఁ జనించి పీడ లుడుపుము. భార.

ఆలుం గొడుకును గోడలు నీవు నెక్కుము.

సూ॥ ౫౨. మహద్వాచకంబులైన కర్త లనేకంబులు సముచ్చయ వ్యవహితంబు లగుచోఁ గ్రియకుఁ దఱచు బహువచనంబ యగు

తఱచుగ ననుటచే

క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు చెప్పుమని యడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము చె
ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్.

అనియునుండును. పడుఁగా అను ఏకవచన క్రియకు చెప్పనివాఁడును, సత్యము చెప్పనివాఁడును అను మహద్వాచకంబులు కర్తలు. చెప్పనివాఁడును నరకపంకమునఁ బడుఁగా సత్యముఁ జెప్పనివాఁడును నరకపంకమునఁ బడుఁగా అని వేఱువేఱ అన్వయింపవలయును. క్రియ బహువచనంబునందు నుండ నగు. ఈ పద్యమునందు వాఁడు అనుటకుఁ నాఁడు అనునది యాధునిక కల్పిత పాఠము.

సూ॥ ౫౩. జాతిని దెలుపుటయం దేకవచనంబు నగు.

అడవిమృగములలో సింహము శ్రేష్ఠము.

అడవి మృగములలో సింహములు శ్రేష్ఠములు.

ప్రాణికోటిలో మనుష్యు డుత్తముఁడు.

ప్రాణికోటిలో మనుష్యు లుత్తములు.

ఇచట సింహములు మనుష్యులు జాతిని దెలుపు బహువచనంబులు.

సూ॥ ౫౪. జంట - జోడు - జత లోనగు ద్వంద్వంబుల కేకవచన క్రియ యగు.

ఉ. జంట సరిగానున్నది. జోడు కుదిరినది మొ॥

సూ॥ ౫౫. గ్రంథకర్తలు - పత్రికాధిపతులు - ఉత్తము - లుత్తమపురుషమందు నేకవచనమునకు మాఱు బహువచనము ప్రయోగింతురు.

సూ॥ ౫౬. నామంబు బహుత్వంబున గోత్రార్థకం బగు.

రఘువులలో రాముఁడు మేటి. రఘువులలో ననఁగా రఘువంశమునఁ బుట్టినవారిలో రాముఁడు మేటి యని యర్థము.

సూ॥ ౫౭. ఆత్మనే పదం బనిత్యంబు.

ఉ. పట్టముగట్టి యేలుము మముఙ్ - కట్టికొని యనుటకుఁ గట్టియని ప్రయుక్తము.

సూ॥ ౫౮. క్త్వార్థక ద్వంద్వంబున నర్థవిశేషంబునఁ బూర్వపదంబునకు దీర్ఘము విభాష నగు. దీర్ఘము రానిచో సముచ్చయ మధ్యాహార్యంబొండె నగు.

ఉ. నమ్మీ నమ్మక - నమ్మియు నమ్మక - నమ్మి నమ్మక.

క్త్వార్థకము - వ్యతిరేకక్త్వార్థకము=క్త్వార్థక ద్వంద్వము.

సూ॥ ౫౯. న్యూనవచో వాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు.

న్యూనవచనంబులు ఐన - ఏని - ఏ - ఓ.

ఉ. ఎట్టులు ధర్మము సేయవలయు. ఎటులైన ధర్మము సేయవలయు. ధర్మము తలఁగాచును - ధర్మమె తలఁగాచును.

ఏవాని బంధుమిత్రులు జీవధనంబులును దప్పిఁ జెందును. దప్పిఁ జెందునో.

సూ॥ ౬౦. కొన్నియెడలఁ గర్తృ కర్మక్రియ లధ్యాహార్యంబు లగు.

కొన్నియెడల ననఁగా సందర్భమునుబట్టి స్పష్టముగఁ దెలియునెడ నని యర్థము.

ఉ. నన్నుఁజూచి నగరె. కర్త లోకులు అధ్యాహార్యము.

వాఁడు నిద్రపోయినాఁడా? పోయినాఁడు. నీవా పండును తింటివా? తింటిని. కర్తృ కర్మము లధ్యాహార్యములు.

వాకిట నెవఁడున్నాఁడు? ద్వారపాలకుఁడు. క్రియ అధ్యాహార్యము.

సూ॥ ౬౧. కిమర్థక పూర్వంబయిన తుమున్నాద్యర్థక శబ్దము తద్వ్యతిరేకార్థ వ్యంజకంబగు.

బల మిఁక నేమిచెప్ప - ఆదిశబ్దముచే ఏమి చెప్పుదుం గురునాథా.

సూ॥ ౬౨. శ్లేషయందు సబిందుక నిర్బిందుకములకును లఘ్వలఘు రేఫములకు మేళనంబు కొందఱి మతంబు.

ఉ. పొంగరాఁ+గల - పొంగు+ఱాఁగల = పొంగురాఁగల.

ఒప్పి+సగు రూఢాపూర్వ సత్కీర్తితోఁ.

ఒప్పెసఁగు+ఱూఢాపూర్వ సత్కీర్తితోఁ.

ఒప్పెసగురూఢాపూర్వ సత్కీర్తితోఁ.

సూ॥ ౬౩. ఐ యొకానొకచోఁ గలయర్థంబున నగు.

ఉ. కృష్ణుని సారథ్యమునై - వెడలుపు. టురమునునై.

సూ॥ ౬౪. తుమున్నంతముమీఁది 'వలయు'నకు 'వలె' బహుళంబుగ నాదేశం బగు.

కావలెనంచు - భా - ఉద్యో. సుస్థిరుండవు కావలె. ఆశ్వ. కావలె నన్నచోట ఉ. హరి.

సూ॥ ౬౫. వినీతి నుత్తమపురుషంబునకుఁ బ్రథమపురుష మొక్కెడ నగు.

ఉ. కవివరుం డిట్లనియె. (నే నిట్లంటి ననుటను) భార. ఆది.



AYURVEDA PRACTIONER

శ్రీరామచంద్రాయనమః.

# సులభవ్యాకరణము.

## వ్యాసపరిచ్ఛేదము.

### వ్యాసలేఖనము.

#### 1. వ్యాసలేఖన మన నేమి?

ఒకవిషయమునుగుఱించి విస్తరించి వ్రాయుట వ్యాసలేఖన మనఁబడును. ఇట్లు విస్తరించి వ్రాయఁబడినగ్రంథము వ్యాసము (Essay) వ్యాసమున నాద్యంత మొకవిషయమే వివరింపఁబడును. అప్రస్తుతవర్ణనము లకుఁ గథలకు నిందు నెడము కలుగదు. వివిధములగు పెక్కుఁగథలు గల నికివిగ్రంథము వ్యాస మనఁబడదు. ఉపన్యాసము (Lecture) తోలంత వాగ్రూపముగ వెలువడును. వ్యాసము లిఖితమై యుండు. వ్యాసలేఖన మునకుఁ గొన్ని నియమములు కలవు. విద్యార్థులు వానిఁ దప్పక యెఱుంగ వలయు.

#### 2. అభ్యాస మావశ్యకము.

వ్యాసలేఖనమున నేర్చుకొనఁ దగిన దేమున్నది? మనస్సునఁ దోఁచినది చేతితో వ్రాయుటయే కదా యని కొందఱుబాలు రందురు. జ్ఞానముగలవా రట్లు లనరు. యుద్ధముచేయుట యనఁగా నేమి? యుద్ధభూమియందు నిలఁ బడుట, యెదురుగా వచ్చినవానిని గొట్టుట యనుట యెట్లో, చిత్రలేఖన మనిన రంగులను తూలికతోఁ దీసికొని కాగితముపైఁ బూయుట యనుట

రెట్లో, వీణ వాయించుట యన వ్రేలితో వీణెయతంత్రుల మీటుట యను రెట్లో, గోడపెట్టుట యన రాతిపై రాతిని బేర్చుట యను రెట్లో, వ్యాసలేఖన మన మనస్సునం దోంచినది వ్రాయుట యనుటయు నట్లే. వస్తుతత్త్వజ్ఞాన ము-పూర్వాభ్యాసము-బుద్ధి యివి లేక యేవిద్యయందెట్టివాండైనం బ్రవీణుండు గాండు. కావున వ్యాసలేఖకునకు నివి యత్యావశ్యకములు.

## 3. వ్యాసలేఖన మొకశిల్పము.

కమ్మరపని-కమసాలపని-వడ్రంగిపని-చిత్తరువువ్రాయుట - లోనగు శిల్పములవలె వ్యాసలేఖన మొకశిల్పమే. అన్నిశిల్పములకువలె నీశిల్పమునకును బదార్థము - రూపము - మిగుల నావశ్యకములు. వడ్రంగికిం గొయ్యలవలె - లోహకారునకు లోహములవలె - వ్యాసలేఖకునకు మాటలు ప్రధానపదార్థములు. లోహములచే లోహకారుండును-దారువులచే వర్ధకియు రూపములం గల్పించునట్లు వ్యాసలేఖకుండును దనభావంబునకు మాటలచే నాకారమును గల్పించుచున్నాండు. మంచిపదార్థములచే శిల్పి మంచి రూపములం గల్పించు నట్లె మేలి మాటలచేత వ్యాసలేఖకుం డుత్తమవ్యాసమును లిఖించుచున్నాండు.

శబ్దము శైలి యను నీరెంటిలో శబ్దము ప్రధానము. అట్టులయ్యు శైలి మనోహరముగా నుండమి గొప్పపండితులు వ్రాయువ్యాసము లుత్తమపదముల నిండియుండినను జనులచేం దఱచు చదువంబడవు. రమ్యమైన శైలి గలిగివినుట కింపయిన మాటలు ముద్దుగం గూరుపంబడినవ్యాస మపండితునిచే వ్రాయం బడిన దయ్యు నిస్సారపదభూయిష్ఠం బయ్యుం బెక్కురచేం బఠింపంబడును. అసమర్థుం డగు కమసాలిచేం జేయంబడిన భూషణము పదియాఱవ వన్నెబంగారము గలదయ్యు నేత్రానందకరముగామి సర్వజనశ్లాఘ్యము గా నేరదు గదా? రంగులు మంచివయ్యు నందముగలేని ప్రతిమ నెవ్వ రాశింతురు? కావున రత్నభూషణంబున జాతిరత్నములవలె నర్థవంతము లగుపదంబులం

వదుచితస్థలంబుల నెలకొల్పి సారవంతముగను బఠనశ్రవణాదుల హృదయా హ్లాదకరంబుగను నుండు శైలిని వ్యాసమును రచింపవలయును. జ్ఞానమధిక మగు కొలఁది నాలోచన మెంం డగుచుండును. స్వతంత్రించి యాలోచించు శక్తి గలుగును. కావున జ్ఞానసంపాదనము ప్రథమకర్తవ్యము.

## 4. జ్ఞానము లభించు టెట్లు?

జ్ఞానము కష్టైకసాధ్యము. అది సులభోపాయములచే లభ్యపడదు. ప్రతిమనుష్యుఁడు జ్ఞానము సంపాదింపఁ బ్రయత్నింపవలయును. జ్ఞానహీనుఁడు పశుసమానుఁ డని పెద్ద లందురు. ఓర్పు, పట్టుదల, యభ్యాసమనెడి యీ మూఁడుగుణములు గలవాని కెట్టిదుష్కరకార్యమైనను సుకరమే. ఉత్తమ వ్యాసలేఖకుఁడుగాఁ గోరువానికి,

i. బహుగ్రంథపఠనము. అనేకపుస్తకములఁ జదువుట.

ii. వివేకము. చదువునప్పు డితరచింతలేక విషయంబున మనస్సుంచి యేయేపద మెట్లు గూర్పఁబడినదో, యాశబ్దస్వారస్య మెట్టిదో, విషయ మెట్లు పొంకముగ బోధింపఁబడినదో, తెలిసికొనుచుఁ నప్పుడప్పుడు విచా రించుట.

iii. మననము. చదివి పుస్తకము మూసినతరువాతఁ దాము చదివిన విషయము నంతయు మరల మరల మనస్సునకుఁ దెచ్చుకొని యీవిషయము తాము చదివినమఱియే గ్రంథమునన్నైన మఱియేవిధముగనైనఁ జెప్పఁబడియుం డినయెడల, దానిని దీనిని నవలోడనము చేయుట యివి యనివార్యములు.

మొదటిదానికన్న రెండవది కష్టము. రెండవదానికన్న మూఁడవది కష్టము. కొందఱిల్లెగిరిపోవునట్లు బిగ్గఱగాఁ జదువుదురు గాని మీరేమి చదివితి రనినఁ జెప్పజాలరు కన్నొకచోట మనస్సు మఱియొకచోట నుండినఁ నేమిఫలము.

చదివినతరువాతఁ గొంతకాలమున కావిషయమై యెవరైనఁ బ్రశ్నించినఁ గొందఱు చెప్పఁజాలరు. మూఁడవగుణము లేమియే యట్టి శక్తిహీనతకుఁ గారణము. మననముచే జ్ఞప్తి దృఢపడును.

### ౫. బహుగ్రంథపఠనము.

బహుగ్రంథపఠన మనుటచే నాంధ్రప్రపంచమునఁ గలగ్రంథము లన్నియుఁ బ్రతివిద్యార్థియుఁ జదువవలయునని యభిప్రాయము గాదు. ఆయాతరగతికిఁ దగునట్లు పాఠశాలయందుఁ దాను జదువు పుస్తకములు గాక యట్టి యితరపుస్తకములు కొన్ని యుత్తమములైనవి ప్రతివిద్యార్థియుఁ జదువవలయును. ప్రయోజనముమాలిన పుస్తకము లెంతయెక్కువగఁ జదివిన నంత హానికలుగును.[1]

---

[1] "They (bad books) monopolise the time, money and attention which really belong to good books and their noble aims; they are not only useless, but they do positive harm. Literary newspapes, since they print the daily smatterings of commonplace people, are especially a cunning means for robbing from the æsthetic public the time which should be devoted to the genuine productions of art for the furtherance of culture. Hence, in regard to our subject. the art of *not* reading is highly important. This consists in not taking a book into one's hand merely because it is interesting the great public at the time—such as political or religious pamphlets, novels, poetry, and the like, which make a noise and reach perhaps several editions in their first and last years of existence. Remember rather that the man who writes for [illegible]ls always finds a large public: and only read for a [illegible] and definite time exclusively the works of great

నాలుగవ తరగతియం దుండువారు చిన్నయ్యసూరిగారి నీతిచంద్రిక, లోనగునవి చదువవచ్చును. 5, 6 తరగతులవారు భర్తృహారినీతిశతకము

---

minds, those who surpass other men of all times and countries and whom the voice of fame points to as such. These alone really educate and instruct.

In order to read what is good one must make it a condition never to read what is bad; for life is short, and both time and strength limited.

Incredible are the folly and perversity of a public that will leave unread writings of the noblest and rarest of minds, of all times and all countries, for the sake of reading the writings of commonplace persons which appear daily and breed every year in countless numbers like flies; merely because these writings have been printed to-day and are still wet from the press." Schopenhauer.

"It is also of the greatest importance to you, not only for the art's sake but for all kinds of sake, in these days of book deluge, to keep out of the salt swamps of literature, and live on a little rocky island of your own, witn a spring and a lake in it pure and good. I cannot, of course, suggest the choice fo your library to you; every several mind needs different books; but there are some books which we all need, and assuredly, if you read Homer, Plato, Æschylus, Herodotus, Dante, Shakespere, and Spenser, [2] as much as you ought, you will not require wide enlargement of shelves to right and left of

---

[2] నన్నయభట్టు - తిక్కన్న - ఎఱ్ఱాప్రెగడ - బమ్మెరపోతన - శ్రీనాథుఁడు - రామరాజభూషణుఁడు - భర్తృహారి - ముక్కుతిమ్మన - శంకరఃవి -

them for purposes of perpetual study. Among modern books, avoid generally magazine and review literature. Sometimes it may contain a useful abridgement or a wholesome piece of criticism;[1] but the chances are ten to one it will either waste your time or mislead you. If you want to utnderstand any subject whatever, read the best book upon it you can hear of, not a review of the book. If you don't like the first book you try, seek for another, but do not hope ever to understand the subject by a reviewer's help. Avoid especially that class of literature which has a knowing tone; it is the most poisonous of all. Every good book, or piece of book, is full of admiration and awe; it may contain firm assertion or stern satire, but it never sneers coldly nor asserts haughtily and it always leads you to reverence or love something with your whole heart. It is not always easy to distinguish the satire of the venomous race of books

అనంతామాత్యుఁడు - కేశన - కృష్ణదేవరాయలు - నాచనసోమన - సూరన రామకృష్ణుఁడు పెద్దన వీరికృతులు కాళిదాసభవభూతికృతులు మృచ్ఛకటిక.

[1] ఇట్టిది తెనుఁగు భాషయందు దుర్లభము. ఇంతవఱకీభాషయందుండు కృతివిమర్శనములను పేరఁ బిలువఁబడు గ్రంథములు బంతుబూతుల స్తోత్రములు రామాయణ, భారత, భాగవతాదులపై సంస్కార చికీర్షువులు వ్రాయు గ్రంథములయందు దబ్బఱలు, నపలాపములు నుండు గావున వానిని బుద్ధిమంతుఁడు చదువకుండుటమేలు. కేవలవిమర్శనములు నచ్చిన ననర్థము తప్పదు. చదువఁ బూనినచో మూలగ్రంథమునంతయుఁ బఠించి సత్యాసత్యము తెలియంగవలయును.

శ్రీమత్. గట్టుపల్లి శేషాచార్యులవారి శ్రీమదాంధ్రమహాభారతరత్నములు బోధగునవి పఠింపవచ్చును. ఇవి సటీకములు నున్నవి. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రుల వారి గ్రంథములు బ్ర॥ శ్రీ॥ శతఘంటము వేంకట రంగశాస్త్రులగారి వచనమహాభారతము బ్ర॥ శ్రీ॥ నాగపూండి కుప్పస్వామయ్యగారి భారతసారము రావుబహాదర్ కందుకూరి వీరేశలింగముగారి నీతిచంద్రిక మ-రా-శ్రీ, చిలకమర్తి లక్ష్మీనృసింహముగారి నవల లనుకథలపుస్తకములు

---

from the satire of the noble and pure ones; but in general you may notice that the cold-blooded, crustacean and Batrachian books will sneer at sentiment; and the warm blooded, human books, at sin......

Read little at a time, trying to feel interest in little things, and reading not so much for the sake of the story as to get acquainted with the pleasent people into whose company these writers bring you. A common book will often give you much amusement, but it is only a noble book which will give you dear friends. Remember, also, that it is of less importance to you in your earlier years that the books you read should be clever than that they should be right. I do not mean oppressively or repulsively instructive; but that the thoughts they express should be just and the feeling they excite generous......

Certainly at present, and perhaps through all your life, your teachers are wisest when they make you content in quiet virtue and that literature and art are best for you which point out, in common life, and in familiar things, the objects for hopeful labour, and for humble love'. Ruskin.

బ్ర॥ శ్రీ॥ మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులవారి నీతిచంద్రికలోనగువచనగ్రంథములను బ్ర॥ శ్రీ॥ గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారి చిత్రరత్నాకరము చదువవచ్చును. వీనివలన శైలిభేదము, నెట్టిశైలి మనోజ్ఞమో యెట్టిదిగర్హ్యమో యెఱుఁగవచ్చును. అనేకవిషయములందు జ్ఞానము కలుగును. పద్యకావ్యములయందు భోజరాజీయము, దశకుమారచరిత్రము మొల్లరామాయణములోనగునవి చదువవచ్చును. భాస్కరశతకము, సుమతిశతకము వీనిని నాలుగవతరగతికిఁ దక్కువతరగతిబాలురు చదువవచ్చును. ఇవి యన్నియు నీతిని బోధించునవిగను, భాషాజ్ఞానాభివృద్ధికిఁ దోడుపడునవియునై యున్నవి ఇవిగాక భారతభాగవతములలోని యుపాఖ్యానములు రుక్మిణీ కల్యాణము, గజేంద్రమోక్షము, అంబరీషోపాఖ్యానము, వామనచరిత్రము, ప్రహ్లాదచరిత్ర, నలోపాఖ్యానము, సావిత్ర్యుపాఖ్యానము, శకుంతలాచరిత్రము, కుచేలోపాఖ్యానము లోనగునవియును, జదువవలయును. ఈగ్రంథముల నన్నిటిని జదువుటవలన భాషాభివృద్ధియు, జ్ఞానాభివృద్ధియుఁ గలుగును. ఆఱవతరగతి దాఁటినపిమ్మట ధారాళముగ శ్రీరామాయణ భారత భాగవతములను మనుచరిత్రాదికావ్యములను విద్యార్థులు చదువవలయును. రామాయణాదులు మతగ్రంథములని వాని నేల చదువవలయు నని తలంపరాదు.[3] అట్లనువారు దీని

[3] "There is nothing that so greatly recreates the mind as the works of the old classic writers. Directly one has been taken up, even if it is only for half an hour, one feels as quickly refreshed, relieved, purified, elevated, and strengthened as if one had refreshed oneself at a mountain stream. Is this due to the perfections of the old languages or to the greatness of the minds whose works have remained unharmed and untouched for centuries? Perhaps to both combined. This I know, directly we stop learning the old languages (as is at

యనుబంధము చదువవలయును. ఈ గ్రంథము లేవియు నేమతమునుదూషించునవి కావు. నీతినిబాయుమనునవికావు. ఇవే జ్ఞానము, సార్థక పదప్రయోగశక్తి, నీతిరక్తి, దేవగురుమతప్రభుశక్తి, గలిగించునవి. మాతృదేవోభవ - పితృదేవోభవ - ఆచార్యదేవోభవ - నా విష్ణుః పృథివీపతి యనియు, నృపాలుండు దేవాంశసంభూతుండు

ఉ. "కావునఁ జంపరాదు క్షితికాంతునిఁ దిట్టఁగ రాదు విప్రియం
బేవిధి నాడరాదు పరిహేళనముం బచరింపరాదు త
ద్భావిభుఁ డొండుచెప్పఁ బనిఁబూని తిరస్కృతు రాడరా దిలన్
దేవతలే నరాకృతిని ద్రిమ్మరుచుందురు ధర్మరక్షకై."

'సత్యేనలోకాన్ జయతి' యని బోధించునవి చదువరాని గ్రంథములా? ఇట్టి పుస్తకములను బాలురచేఁ జదివింపక "ప్రతిమనుజుఁడు బాలుఁడైనను వాని వాని యంతఃకరణము చొప్పునఁ బ్రవర్తింపవలయును. తనయంతఃకరణమునకు విరోధముగాఁ దలిదండ్రులు చెప్పినను వినరాదు. ఆవశ్యకమైనచో వారిని విసర్జింపవచ్చును. దృష్టాంతము ప్రహ్లాదుఁడు. భారతము సారాయము త్రాగుటకుఁ బ్రేరించును. ఉదాహరణము భగవద్గీతయందు 'సోమపాః పూతపాపా' యని కలదు. శ్రీ భాగవతము దబ్బఱలాడుటకు నేర్పును.

---

present threatening) a new class of literature will spring up, consisting of writing that is more barbaric, stupid, and worthless than has ever yet existed; that in particular, the German language, [1](*the Telugu language*) which possesses some of the beauties of the old languages, will be systematically spoilt and stripped by these worthless contemporary scribblers, until, little by little, it becomes impoverished, crippled, and reduced to a miserable jargon." Schopenhauer.

---

[1]Italics are mine. V. S.

"వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణవిత్తమానభంగమందుఁ జకితగోకులాగ్ర జన్మరక్షణమందు బొంకవచ్చు నఘము బొందఁ డధిప, యని యందుఁ గలదు." అనుపిచ్చిపిచ్చి వ్రాఁతలు గలపుస్తకములను జదివించువారు భాషఁ జెఱుచుటయే గాక బాలురను విపరీతజ్ఞానవంతులఁ జేసి చెఱుచుచున్నారు.

ఆంధ్రలోకముచే నాంధ్రభోజుఁ డని నేఁటికాలమునఁ బిలువఁబడు నొకగొప్పజమీందార్ గారు చెన్నపురిరాజకీయ సర్వకలాపాఠశాల కాంధ్రము నందలి యభిమానముచే వచ్చుచుండినకాలములో బి. ఏ. తరగతియందుఁ జదువు నొక విద్యార్థి తనయుపాధ్యాయునిఁ జూచి "భారతము వ్రాసినవా రెవరు? రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులవారు, రాయదుర్గము నరసయ్య శాస్త్రులవా రను వారలా? వేమూరు వేంకట కృష్ణమసెట్టి వారలా? టైటిల్ పేజిలో నిరువుర పేర్లులు గలవే" యని జిజ్ఞాసు వయియే యడిగెను.

ఎఫ్. ఏ. తరగతిలోఁ బఠించుచు నామిత్రునింటఁ గాఁపుర ముండిన యొకవిద్యార్థి "వాలిని జంపినది వాల్మీకియా వ్యాసులా" యని నామిత్రునే యడిగెను.

పట్టపరీక్షకుఁ జదువుచుండిన యొకవిద్యార్థి పరీక్షాపత్రమునందు "భారత యుద్ధమైనపిమ్మటఁ బాండవులు కృష్ణుని రాయభార మంపిరి. అప్పుడు సభలో నంద ఱుండిరి. సంధి కుదురనందునఁ గృష్ణుఁడు విదురునింటిలో భోజనము చేసెను." అని వ్రాసెను. ఇట్టివి పెక్కులు గలవు. హిందూవిద్యార్థులయం దిట్టివి సహ్య మగునేమో యుదారబుద్ధు లాలోచింతురుగాక.

భాషాసౌష్ఠవమునందు దృష్టిలేక విశృంఖలములుగ వ్రాయఁబడు నవలలు పత్రికలు నుబుసుపోకకుఁ గాలము వ్యర్థపఱుపఁ జదువఁ దగినవే కాని యుత్తమగ్రంథముల యొద్ద నుంచఁ దగవు. ఏభాషయందైన నుత్తమ జనుల యభిప్రాయ మిట్టిదే యైయుండు.

## 6. పదసామగ్రి.

సంభాషణమున నుపయోగపడుశబ్దములు వ్యాసరచనకుఁ జాలవు. సంభాషణశైలియు గ్రంథరచనయం దుపయోగింపరాదు.[1] ఇదియొక యాంధ్రంబుననే కాక సర్వభాషలయందు నియతము. మనస్సులోని యభిప్రాయముల

---

[1] "It is a mistake to attempt to write exactly as one speaks. Every style of writing should bear a certain trace of relationship with the monumental style, which is indeed, the ancestor of all styles, so that to write as one speaks is just as faulty as to do the reverse, that is to say to try and speak as one writes. This makes the author pedantic and at the same time difficult to understand."

"In almost every age, whether it be in literature or art we find that if a thoroughly wrong idea, or a fashion or a manner is in vogue, it is admired. Those of ordinary intelligence trouble themselves inordinately to acquire it and put it in practice. An intelligent man sees through it and despises it, consequently he remains out of the fashion. Some years later the public sees through it and takes the sham for what it is worth; it now laughs at it, and the much-admired colour of all these works of fashion falls off like the plaster from a badly-built wall and they are in the same dilapidated condition. We should be glad and not sorry when a fundamentally-wrong notion of which we have been secretly conscious for a long time finally gains a footing and is proclaimed both loudly and openly. The falseness of it will soon be felt and eventually proclaimed equally loudly and openly

నన్నిటిని జక్కఁగ బయలుపెట్టుటకుఁ బదసామగ్రి వలయును. శబ్దములు సార్థకముగఁ బ్రయోగించుటకును, బ్రయోగింపఁబడినవాని స్వారస్యమెఱుంగుటకును, శబ్దములయర్థము దెలిసియుండవలయు. నామలింగానుశాసనంబున సమానార్థకములగుసంస్కృతపదంబులును, నాంధ్రనామసంగ్రహాంధ్రనామశేషాదుల సమానార్థకములగు తెలుఁగుపదంబులును గలవు. కొన్నిసంవత్సరముల క్రిందటివఱకు మనజాతీయపద్ధతి నిర్వర్తింపఁబడుకాలములో నాంధ్రనామసంగ్రహము, నామలింగానుశాసనములలోని పద్యములను శ్లోకములను విద్యార్థుల వయశ్శక్తులకొలఁది దినమున కొకటి, రెండుదినముల కొకటి,విశ్రాంతిదినముల నొకటి రెండిట్లు బాలురు పఠించువారు. దానివలన వారు సంస్కృతపదమునకుఁ దెనుఁగుమాటను భేద మెఱిఁగినవారై యేగ్రంథమునైన స్వతంత్రించి చదివి దానియర్థము గ్రహింపఁ జాలియుండిరి. ఇప్పుడాయాచారము పోయినది. దానితోడ బాలురకు శబ్దజ్ఞానము క్షీణించినది. శబ్దజ్ఞానము నర్థజ్ఞానమనుసరించెను. అర్థజ్ఞానహీనతవలన స్వభాషాగ్రంథపఠనము సమసెను. దానివలన స్వభాషానీతిమతవిషయజ్ఞాన మడుగంటెను. వెంటనే యజ్ఞాన మడుగుపెట్టెను. అహంకారము కన్నులఁగట్టెను. స్వమతభాషాదూషణాంకురముపుట్టెను. అది పెరిఁగి మిన్నుముట్టెను. ఫలము ప్రత్యక్షము.

పరీక్షోత్తరణముననె ధన్యంమన్యమానసులగువారలా గ్రంథములఁ బఠింప వలనుపడదు. కావున నాంధ్రనామసంగ్రహము నామలింగానుశాసనము వంటిగ్రంథములు లేనియాంగ్లేయములు చేయునట్లె పరీక్షలకై పఠించు హిందూబాలురను జేయవలసియుండును. తాము పఠించుగ్రంథములఁ గలశబ్దములకు నానార్థములున్నచో వానిని, సమానార్థకపదములను వేఱుగ వ్రాసి యుంచు

---

It is as if an abscess had burst." Schopenhauer. ఇది గ్రామ్యవాదమునకు ముఖచపేటము.

కొని ముఖస్థములఁ జేయవలయు. అటుచేయకున్న భోజనకాలమున సైంధవముఁ దెమ్మనిన గుఱ్ఱముఁ దెచ్చువాఁ డగును. చోరుఁడు దండమున కర్హుఁడనఁగా దొంగవాఁడు నమస్కారమున కర్హుఁ డనియు, జనకుఁడు దండమున కర్హుఁ డనఁగా శిక్ష కర్హుఁ డనియుఁ, జెప్పువాఁడగును. గంగడోలనఁగా గంగెద్దు డోలనియుఁ, బాలవెల్లిలో రసగుండు కట్టినట్టు శుక్రుఁ డుదయించె ననఁగాఁ బాలసముద్రములోఁ బాదరసపుగుండు కట్టినట్టులనియు వ్రాసినవారును గలరు. అల్పవిద్య యనర్థకారిణి యనుటకు దృష్టాంతముగా రామశబ్దము పుంలింగమో స్త్రీలింగమో తెలియనివారు శాస్త్రములపైఁ బూర్వపక్షముల జల్పించుచున్నారు గదా.

సమానార్థకపదములు వాగ్వైభవముకై యుండనియెడఁ "బాడినదే పాటరా దాసరి" యన్నట్టు వ్రాసినపదమునే పలుమారు వ్రాయవలసి వచ్చును. అది వినువారికిఁ జదువువారికి రుచింపదు.

సమానార్థకపదములను వాని ప్రయోజన మెఱిఁగి ప్రయోగింప వలయును.[2] స్త్రీ సీమంతిని శబ్దములు సమానార్థకములు అటులని "పాండురాజమరణానంతరము కొన్నిదినములకు సీమంతినీరత్న మగుకుంతీదేవి తన తనయులఁ దోడ్కొని హస్తినాపురికి వచ్చె" నని వ్రాయరాదు. కుంతీదేవి

---

[2] "The real number of synonyms, or words having precisely the same signification, is in any language very limited. In general the terms so called merely approximate without coinciding: there are shades of difference between them. The exactitude of an author's style is greatly determined by his appreciation of those differences; by his making use of the precise word which in the cricumstances is the fittest, *i.e.*, which will best express his thoughts." Nichol.

యీ ప్రస్తావకాలమునఁ బతిహీన కావున ముత్తైదువులందు మాత్ర ముపయోగింపఁ దగిన సీమంతినీశబ్దము కుంతీదేవిపట్ల వాడరాదు.

ఉషస్సు - ప్రాతఃకాలము సాధారణముగా సమానార్థకపదములైనను "వాఁడు ప్రాతఃకాలంబున లేచి యథావిధి యుషఃకాలకృత్యంబులఁ దీర్చె" ననుట సరిగాదు. దినమున 55-వ గడియకాలమున కుషస్సని పేరు. 58-వ గడియకాలమునకుఁ బ్రాతఃకాల మని పేరు. 58-వ గడియకాలమున నిద్ర లేచినవాఁడు 55 గడియ లప్పుడు చేయఁదగుకార్యముల నెట్లు యథావిధి చేయఁ గలఁడు.

వధూవరుల నాశీర్వదించునపుడు "సర్వమంగళా సమేతుఁడు శంకరుఁడు మీకుఁ గల్యాణముఁ గలిగించుఁ గాక" యనిన బాగు గాని చాముండాసమేతుఁడయినకపాలధరుఁడు రుద్రుఁడు మీకు శివముఁ గలిగించు నని చెప్పవచ్చునా? అర్థభేదమె లేకున్నను గొన్ని పరుషములుగ నుండును. నీతండ్రి బాగున్నాఁడా యనుటకు నీయమ్మమగఁడు బాగున్నాఁడాయనవచ్చునా? నెత్తిమీఁద పాగా పెట్టుకొని పోయె ననుటకు నెత్తిమీఁద గుడ్డవేసికొని పోయెవాఁ డనవచ్చునా? వానికి సందేహనివృత్తియయిన దనవచ్చునుగాని శంకానివృత్తి యయిన దన లోకులు నవ్వరా? కావున సమానార్థకశబ్దముల నెఱుంగుటేకాక వాని ప్రయోజన మెఱింగి మెలఁకువతో సందర్భముకొలఁదిఁ బ్రయోగింపవలయును.

తనకు స్పష్టముగ నర్థము తెలియనిపదములఁ బ్రయోగింపరాదు.

"మనుచరిత్రయందు వరూధినియొక్క మాయలలోఁ బడకుండఁ బ్రవరాఖ్యుఁడు హవ్యవాహనుని నన్ను గృహమునకుఁ జేర్పు మని వేఁడుకొనిన పద్యమందుఁ దన సౌజన్యముమీఁద నొట్టు పెట్టుకొనియెఁ గదా, అట్టి సద్గుణపుంజ మగుటం బట్టియె పాకశాసనుఁడు భక్తునికిఁ బ్రత్యక్షం బై కాపాడుటకు వలను పడెను."

పాకశాసనుఁ డనఁగా నింద్రుఁడు. అగ్నిహోత్రుఁ డను నర్థమున వ్రాయఁ బడినది.

"ప్రస్తావన యనునది నాందిభార్య." నాటకమున మొదటిపద్యము నకు నాంది యని పేరు. దానికిఁ దరువాత సూత్రధారుఁడు నట్యాదులతోఁ జేయుసంభాషణము ప్రస్తావన. ఈ రెంటికిని దాంపత్యము కుదిర్చిన బి ఏ.తరగతి విద్యార్థి బుద్ధి చమత్కృతి నే మనవలయును.

'ఒకచేఁప పంచవర్ణములు గలిగి మిణుకరించును.'

మిణుకరించుట యనఁగా దిక్కు దోఁపక భ్రమ చెందుట. మినమిన లాడుట యని విద్యార్థిహృదయము.

'కపిలగోవుపాలు త్రిదోషకరము' త్రిదోషహర మని యుండవలయు.

ఒకవిద్యార్థి "యీదినము పట్టణములోఁ బాదరక్షా పట్టాభిషేక మాడెప" రని చెప్పి తోడివారిచేఁ బరిహసింపఁ బడెను.

"వనమాలిక యనఁగా నడవులలో నుండు వందుచె" ట్టని యొక విద్యార్థి చెప్పెను. వనమూలిక యని భ్రమ.

శబ్దార్థ మూహించి వ్రాయరాదు. ఉచితము కానిది యనుచిత మైన ట్లులే కదా యని యుత్తమము గానిది యనుత్తమ మని వ్రాయరాదు. అనుత్తమ మనఁగా మిక్కిలి యుత్తమము. అంతకంటె నుత్తమమైనది లేని దని యర్థము. ఇట్టులే యఘోర మనునది. అఘోర మనఁగా నతిఘోర మని యర్థము కాని ఘోరము గాని దని యర్థము కాదు.

శబ్దార్థజ్ఞానము లేనివాఁడు తె న్నెవఁడైనం దిట్టినను శ్లాఘించినాఁ డనియే యెంచుకొనును. ఈబాలుఁడు పండితపుత్రుఁ డనఁగాఁ బండితునికొడుకు గావునఁ దండ్రివలె వీఁడును విద్యావంతుఁ డని యర్థము గాదు. శుంఠుఁ

డని యర్థము. ఇట్టులే ఖట్వారూఢుఁడు, గేహేశూరుఁడు, పుణ్యజనులు, గ్రామసింహము లోనగునవి నిందయం దుపయోగింపఁబడు.

ఇంతియకాక వ్యాసలేఖకుఁ డేది సంస్కృతశబ్ద మైనది, యేది తెలుఁగుమాట యైనది, యెఱింగి యుండవలయు. ఎఱుంగకున్నఁ బెక్కుఁ దప్పులు వ్రాయవలసి వచ్చును. అట్టితప్పులు మఱియొకచో నీగ్రంథమునఁ దెలుపఁబడినవి. శంకాటంకము, శుద్ధతప్పు, అనేకమంది, తెప్పోత్సవము, దేహాలంపట, ఘులి యన్నియు దుష్టములే. పశుసమూహమును బోధించుసమజశబ్దము సమాజపర్యాయముగను, జూదగాండ్రను బోధించుసభికశబ్దము సభ్యపర్యాయముగను వాడుట ప్రశస్తము గాదు. ఆర్య మతసంస్కారసమజసభికులారా యని దూషించునపుడు చెప్పవలయుఁ గాని భూషించునపుడు చెప్పరాదు. సమాసములు కల్పించి వ్రాయునపుడు నపార్థమున కెడమీయకుండ వ్రాయవలయును. ఉ. విద్యార్థికల్పభూజము. ఇది యొకపత్రిక పేరు. విద్యార్థికిఁ గల్పభూజమని వ్రాసినవాని యభిప్రాయము. విద్యార్థికి నల్పభూజమని యర్థ మగును. ఇన్ని కారణములచేత శబ్దముల సరియైన యర్థముల నెఱుంగుట యావశ్యక మని యేర్పడుచున్నది. ఇట్టియెఱుక సద్గ్రంథపఠనమునఁ గాని చేకూఱదు.

## 7. సంస్కృత పదజ్ఞానము.

ఆంధ్రభాష నుజ్జీవింపఁ జేయునది సంస్కృతము. సంస్కృతసాహిత్యము లేనిచే నాంధ్రభాష శోభింపదు. సాధారణముగా మనము మాటలాడుటయం దెన్నియోసంస్కృత శబ్దములను, నవి సంస్కృతశబ్దము లను జ్ఞానము లేకయే వాడెదము. కావున నట్టిభాషయందలిశబ్దముల స్వరూపముఁ గొంచెమైనను విద్యార్థు లెఱింగి యుండవలయుఁ. కేవలము తెలుఁగుపండితుఁడును, కేవల సంస్కృతవిద్వాంసుఁడును, నాంధ్రగ్రంథము రచింపఁబూనినను, వానికర్థము చెప్పఁబూనినను, మిణకరింపవలసి వచ్చును. తెలుఁగు పండితుఁ

దజ్ఞానముచే సంస్కృతపదములను దెలుఁగుఁబలుకు లని ప్రయోగించి యావి యపశబ్దములైనచోఁ బరిహసింపఁబడును. కొందఱు సంస్కృతపండితు లాంధ్రగ్రంథముల కర్థము చెప్పునెడ నాంధ్రవ్యాకరణజ్ఞానము లేమి, నచ్చ తెలుఁగు మాటలు రామిఁ, దద్భాషాసంప్రదాయ మెఱుంగమిఁ బ్రసంగించి విజ్ఞులకు నవ్వు పుట్టింతురు. ఉభయభాషలు వేఱు వేఱు. వ్యాకరణములు భిన్నములు. సంప్రదాయములు ప్రత్యేకములు. కావున నవి రెండుఁ గలిపి వ్రాయునెడఁ దత్తత్సంప్రదాయమునకు భంగము కలుగకుండునట్లు చూడవలయును. ఏది సంస్కృతపదము, తెలుఁగుపదమేది, యనికనుఁగొనుటే విద్యార్థులకుఁ బ్రథమ కష్టము. నామలింగానుశాసనము లోనగునిఘంటువులయం దుండునవి సంస్కృత పదములని, యాంధ్రనామసంగ్రహములోనగునిఘంటువుల నుండునవి యాంధ్ర పదము లని, పూర్వులు చెప్పిరి. ఇప్పుడు ఆంగ్లపాఠశాలలయందుఁ బఠించు వార లనేకు లాగ్రంథములపేరైన విని యుండరు. ఇఁక గతి యేమి? దీనికిఁ గొన్నికొన్ని గుర్తులు మొదటిభాగమున సంజ్ఞాపరిచ్ఛేదము ౭౨ సూత్రమున వ్రాయఁబడి యున్నవి. కొన్ని శబ్దము లావిధులకు లోపడవు. అవి గ్రంథములు చదువుటచేఁ దెలియవలసినవే. చదువనివా రిట్లు వ్రాయుదురు.

| బాలుర వ్రాయురూపములు. | సరియైన రూపములు. |
| --- | --- |
| దారిఢ్యము, దారుఢ్యము. | దార్ఢ్యము. |
| ఆఙ్ఞ. | ఆజ్ఞ. |
| స్త్రిలు, శ్రీలు, | స్త్రీలు. |
| శిశ్రూష. | శుశ్రూష. |
| శాశ్వితము. | శాశ్వతము. |
| పుస్తుకము. | పుస్తకము. |

ఇట్టివి పెక్కు లీగ్రంథముకడపట నపశబ్దముల పట్టికయందు సవరింపఁబడి యున్నవి.

ముఖ్య + ఉద్దేశము. = అత్తున కచ్చుపరం బగునపుడు సంధి బహుళము గాన ముఖ్యుద్దేశ మనియు

తెప్ప + ఉత్సవము = అ + ఉ = ఓ. గుణసంధి యని తెప్పోత్సవ మనియు వ్రాయువారును గలరు. గ్రంథపతనమునఁ గాక సంస్కృతాంధ్రపదజ్ఞాన మెట్టు లలవడెడినో.

## 8. విషయనిర్ధారణము.

రెండుమూఁడు విషయము లిచ్చి వానిలో నేదైన నొక దానిని గుఱించి వ్యాసము వ్రాయు మనినచో నీ కేవిషయము చక్కఁగాఁ దెలియునో, యేవిషయమునుగూర్చి యెక్కువగఁ జదివి యుంటివో యావిషయమును గుఱించి వ్రాయుము. అంతియకాని వెనుక ముం దాలోచింపక తటాలున నేదియో యొకటి వ్రాయఁ బ్రారంభింప వలదు. నిర్ధారించు కొన్న పిమ్మటఁ గొంత వ్రాసి మరల నది వల దని మఱియొకటి వ్రాయ మొదలుపెట్టవలదు. విషయము నిశ్చితము కాఁగానె నియమితకాలములోఁ గొంతభాగము విషయవిభజనయందు వినియోగింపవలయును. నిశ్చితవిషయముఁగూర్చి నీ వేమేమి వ్రాయఁ దలఁచెదవో చక్కగ నాలోచించుకొని దానినంతయుఁ బ్రకరణములుగ విభజించి యాప్రకరణములనెల్ల నొకపట్టిగ వ్రాయుము. తరువాత నాప్రకరణములయందు నేది ముందుగఁ జెప్పవలయునో, యేది వెనుకఁ జెప్పవలయునో, చూచి యావరుసన యుండునట్లు సవరించి వ్రాయుము. అటు పిమ్మటనొక్కొక్క ప్రకరణములో నంతర్భాగము లేవైన నున్న యెడల వాని నాప్రకరణమునకుఁ బ్రక్కనకాని, యాప్రకరణమునకును దానితరువాతి ప్రకరణమునకును నడుమఁ గాని, వ్రాయుము. ప్రతివిషయము వ్రాయునపుడు తాను వ్రాయునది యీ విషయము నెంతయు నెఱుంగనివారికై యనితలఁచి వ్రాయ మొదలుపెట్టవలయు. అప్పటికే యాదిమొదలంతము దాఁక నేర్పఱుపవలసిన ప్రకరణములు తెలియును. ఈ యంతర్భాగములకు నక్షరసంజ్ఞం గాని, i. ii.

iii. యిట్టిగుర్తులుగాని, యుంచుము. ఎట్లనఁగా నీవు వ్రాయ నిశ్చయించుకొనినవిషయము విప్రవినోదుల గుఱించి యగు నేని విషయవిభజన మిట్లు సేయవలయు.

## విప్రవినోదులు.

1. ఈ పేరువచ్చుటకుఁ గారణము.
2. వీరియుత్పత్తి.
3. వీరివేషములు, భాష.
4. వీరుచేయు వినోదములు.
   - i. హస్తలాఘవము.
   - ii. అభ్యాసము.
   - iii ఒళవరితోడ్పాటు.

5. ఈవృత్తియందుండు నితరదేశములవారికి వీరికిఁ గలతారతమ్యము.

ఇట్లు విభజనచేయుటకై వినియోగించుకాలమును దుర్వ్యయ మొనర్చిన ట్లెంచకుము. ఇట్లు విభజించుటచే నే యే విషయ మెంతెంత వ్రాయవలయునో తెలియుటే కాక, యప్రస్తుతప్రశంసయందుఁ గాలము గడపుటకు వలనుపడదు. అభ్యాసముగుఱించి వ్రాయునపుడు దొమ్మరవాండ్రయభ్యాసమునకు వీరియభ్యాసమునకుఁ గలభేదము వ్రాయవచ్చును గాని దొమ్మరులచేష్టలన్నియు వ్రాయుటయందుఁ గాలవ్యయము చేయరాదు.

ఈ విధముగానే సర్వధర్మములకు సత్యము ప్రాణ మనువిషయమై వ్రాయు మనిన "హరిశ్చంద్రుఁ డనురాజుగలఁ" డని ప్రారంభించి యతని చరిత్రముతోనే వ్యాసము ముగించుట సరిగాదు. "క్రికె" ట్టనునాటగుఱించి వ్రాయు మనిన నొకఁడు రణజిత్ సింగు జీవితమును వ్రాసెను. విషయవిభజనము చేసినపిమ్మట వ్యాసము మంచిశైలిని వ్రాయఁ బ్రారంభింప వలయును.

## ౯. శైలి.[1]

శైలి యనఁగా మనమనస్సునఁ గలయభిప్రాయమే మఱియొకరిమనస్సునను బుట్టించుటకై భావబోధకము లగుశబ్దములను వాక్యపరంపరఁగాఁ గూర్చుట. ఉత్తరములశైలియు నుపన్యాసశైలియు, వ్యాసశైలియుఁ, గావ్యశైలియుఁ, బురాణశైలియు వేఱువేఱువిధములయి యుండును. కోపమున

[1] "Style should be as natural as dress, and fit the time, the place, and the person as a glove fits the hand. But there are limits to this variety. Manners and conduct fortunately differ, or we should be wearied by every one behaving in the same way: but there are rules of civil discipline, of good conduct, and good manners, laws that bind and laws that ought to bind us. So it is with style: the rules of Grammar are its imperative laws—it must be accurate; the canons of taste its manners—it ought to be strong and graceful.

A preliminary question meets us. *Whence* are the laws of style derived: who enacts them and makes them obeyed: to whom or what are we to refer on difficult or disputed points? Most rhetoricians ancient and modern, have answered that we must be guided by custom,—national, reputable and recent; that is by the practice of the majority of celebrated writers of our own country, who have lived near our own time. This is a very useful and in practice often a decisive test. On many minor points it is perhaps the only test. Custom holds a real, and within limits, a legitimate sway over such questions as the naturalization of foreign or the acceptance of new words," Nichol.

మాటలాడువిధముగా సంతోషసమయమున మాటలాడము. సంతోష వేళ మాటలాడునట్లు దుఃఖించునపుడు మాటలాడము. కాఁబట్టి శైలియు సందర్భోచితముగఁ గథాపురుషుని యప్పటి చిత్తవృత్తి ననుసరించి యుండవలయు. వీని కన్నిటికిఁ బ్రత్యేకవిధులు గలవు. లోకమున నాచారవ్యవహారములు భిన్నభిన్నము లయ్యు నయ్యవి వానిని శాసించువిధులకు లోఁబడి నియతి చెడకయుండునట్లె పలువిధములైన శైలులును దత్తద్విధులకు లోఁబడి సురక్షితములై యున్నవి. ఆచారవ్యవహారములను ధర్మశాస్త్రమువలె శైలిని వ్యాకరణాలంకారశాస్త్రములు శాసించును. వ్యాకరణ మపశబ్దాదిదోషములు లేకుండఁ జేయును. అలంకారశాస్త్ర మలంకరింపఁ జేయును.

కం. తను వగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
దనరుగుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్. నరసభూ.

కావ్యలక్ష్మికి శబ్దార్థంబులు దేహము. దేహము తొలుత రోగపీడితము గాక యుండునట్లు కాపాడవలయును. దోషములే రోగములు. వ్యాకరణ శాస్త్రమే వైద్యశాస్త్రము. కావున నాశాస్త్రసాహాయ్యముచే శైలియందు దోషములు లేకయుండఁ జేయవలయును.[2]

---

[2] "No expression can form part of a good composition unless it be constructed in accordance with the laws of the language to which it belongs. An inaccurate expression may be clearly intellegible, but the habit of inaccuracy is sure to result in confusion.

Every sentence is inaccurate which gives wrong forms of the part of speech, or violates the rules of Syntax. These rules are laid down in .....Grammars." Nichol.

## 10. దోషములు.

### i. శబ్దదోషములు.

వర్ణవైరూప్యము. కొందఱు బాలురు వర్ణాకారములను వికారములు చేయుచున్నారు. వర్ణసమూహముచే బద మగుటవలన వర్ణశుద్ధిలేక శబ్దశుద్ధి గలుగదు. సాధారణముగా విద్యార్థులు పొరపడుచోటు లెవ్వి యనః—

బకారమును భ యని తలకట్టుతో వ్రాయుట. బ-సరి, భ-తప్పు.

ఖ కారమును తలకట్టుతో వ్రాయుట తప్పు.

టువర్గమునందలికొమ్మునకు గుడి యిచ్చి టివర్గమును వ్రాయుట.

ఖకారమునకు భకారము వ్రాయుట.

భ కారమునకు ఖ కారము వ్రాయుట.

శుభమనుచో శుఖ మనియు సుఖ మనుచో సుభ మనియు వ్రాయుట.

ష కారమునకు మాఱు ఘకారమును వ్రాయుట.

మకారయకారము లొక్కరీతిగ వ్రాయుట.

తావత్తు ్త నకుమాఱుగ ై ఐవత్తును, ఐవత్తునకుమాఱు ్త తావత్తును వ్రాయుట. భక్తిని భక్తై యనియుఁ దాసై యనుటకుఁ దాస్తై యనియు వ్రాయుట తప్పు. తకారమును క్రింది వత్తుతోడ వ్రాయుట సరిగాదు. కొందఱు మాకారమును వొ వ్రాసి ప్రక్క కొమ్మిచ్చియు, మోకారమును వోకారము వ్రాసి ప్రక్క కొమ్మిచ్చి యొకరూపముగను మొ వ్రాసి కడ కొమ్మునకు దీర్ఘ మిచ్చియొకరూపముగను వ్రాయుచున్నారు. ఇట్టులే యోకార వోకారలు వ్రాయుచున్నారు. ఒకవిద్యార్థి 'వానితో' నను దానిలో 'తో' నను నక్షరము వ్రాయుటకు 'తె' వ్రాసి దానికిఁ బ్రక్క కొమ్మియ్యవలయునా లేక తలకట్టునకు మాఱుగా నొత్వ మియ్యవలయునా

యనుసందేహము గలిగి యెటు వ్రాయుటకుఁ దోఁపక "వానిtho" యని వ్రాసెను. ఇట్టివారిచే మనభాష యింకముం దుద్ధరింపఁబడవలసి యున్నది కాఁబోలు.

కొందఱు తో యనుటకు మాఱు తే వ్రాసి ప్రక్కఁ గొ మ్మిచ్చుచున్నారు.

కొందఱు జ్ఞకారమునకు జ్ఞ యని వ్రాయుచున్నారు. ఇది యుచ్చరించుట యెట్లో? ఆజ్ఞ యని వ్రాయవలయునే కాని ఆజ్ఞ యని వ్రాయరాదు.

ఖ ఘ ధ యిట్టి వత్త్వక్షరముల నడుగుగీఁతలు లేక ఖ ఛ ద యని వ్రాయ రాదు. చూ. సంజ్ఞాప. గుణితప్రకరణము.

గ్రామ్యము. గ్రామ్యము చ్యుతసంస్కారమనియు నర్ధగ్రామ్యమనియు రెండువిధములు. వ్యాకరణదుష్టమైనపదములు వస్తాఁడు, తెస్తాఁడు, వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు, ఉండడము, పోవడము, వాండ్లు, వీండ్లు, అతను, ఇతను, వాటిని, వీటిని, వాండు, వీండు, ఉండాఁడు, ఉండాను, కండ్లు, తోటివారు (తోడివారనుటకు) పూడ్చినాఁడు, పోయిడిచినాఁడు, చేసుట, తీసుట, వస్తూపోతూ యీ మొదలైనవి శాస్త్రవిరుద్ధపదంబులు చ్యుతసంస్కారమున కుదాహరణంబులు. వీనిఁ బ్రయోగింపరాదు. వీనికి సాధురూపములు మఱియొకచో వ్రాయఁబడి యున్నవి.

అర్ధగ్రామ్యము. ఇదిపామరభాష, నాగరకతలేనివారి మాటలు. ఉ. రుక్మిణీమహాదేవి గౌరీపూజకుఁ బోవునెడ నామెజనయిత్రి లోనగునుత్తమ రాజరాజవదనలు జుట్టులోఁ బూలు పెట్టుకొని, కంటికిఁ గాటుక పెట్టుకొని, చెవులలోఁ గమ్మలు పెట్టుకొని, మెడలో ముత్తెములదండలు వ్రేలఁ బండ్ల కాంతులు వెన్నెలఁబోలఁ, జెంపకొప్పులతోఁ గాలిమీఁదఁ గాలిడుకొనుచుం గూడ బోఁయిరి.

ఈ వాక్యమున లక్షణవిరుద్ధపదములు లేవు గాని, యుత్తమస్త్రీల వర్ణించుటయందు యోగ్య మగుపదములు ప్రయోగింపఁబడలేదు. జుట్టు కన్ను చెవులు, మెడ, చెంపలు, పండ్లు, పాదములు వాడుపదము లిచ్చట నుచితములు గావు. రాజవదనలు కురుల విరులు ముడిచి, కందోయిఁ గాటుక దిద్ది వీనులఁ గమ్మలు మెఱుంగులు గ్రుమ్మరింపఁ, గంఠంబున ముత్యాల సరంబులు వ్రేలఁ బలువరుసలు వెన్నెల లీనఁ, గ్రొమ్ముడులు చెక్కుల నొక్కచుండ నడుగున నడు గిడుచుఁ గూడఁ బోయిరి యని చెప్పనగు. పల్లెటూరి స్త్రీలఁ జెప్పునప్పుడు చెంపఁగొప్పులు, పండ్లఁగప్పులు, కాళ్లఁ జెప్పులు, నోటఁ బప్పులు, గలిగి మడ్డితనపుసింగారంబుల రెడ్డిసానులు రోస్టైలవంటి బట్టలతో జాతర చూడ నడచి రని చెప్పుట దోషము గాదు.

చ్యుతసంస్కారదోషము. ఇది పెక్కురీతుల నగు. అందు

## సంధిదోషములు.

ఉత్వసంధి. ఉ. రాముఁడు+అనుబాలకుఁడు. దీనిని రాముఁ డను బాలకుఁ డని వ్రాయవలయునే కాని రాముఁడు అనుబాలకుఁ డని కాని, రాముఁడు యనుబాలకుఁ డని కాని వ్రాయరాదు. చూడు. సంధి. సూ. ౧౦. అట్టు లయ్యు నన్యదేశపదముల యథార్థస్వరూపముఁ దెలుపవలసినచోటుల సంధికలుపక వ్రాయ వచ్చును. ఉదా. "గ్రీన్‌లాండ్" అనుదేశ మనియు గ్రీన్‌లాండను దేశ మనియు వ్రాయవచ్చునుగాని గ్రీన్‌లాండు యనుదేశ మని వ్రాయరాదు ఇట్టులే 'రాబర్ట్స్' అనునాతఁడు 'క్రికెట్' అనునాట లోనైనవి. సంధి. సూ. ౮౪ చెప్పిన గ్రీన్‌లాండ్డని వ్రాయరాదు. తెలుఁగున సను స్వారమునకు ద్విత్వము పరముగ నుండదు. అంమ్మ, అంన్న, పెంణ్డ్లి, కంన్నులోనయినవి యసాధువులు. అన్యదేశ్యశబ్దముల కడపటి హల్లునకు ననుకరణము పరమైనప్పుడు ద్విత్వ మీకుండుటచే కొన్నియెడల శ్రవ్యము.

కానబియాంక - క్రిస్ యానిటీ, అబ్బేయిట్టిశబ్దముల కచ్చుపర మైనపుడు యడాగమము వచ్చుచే బాగు.

ఇత్వసంధి. ఉ. తలఁచి + ఉండి = తలఁచుండి యనుట తప్పు. తలఁచి యుండి యనుట సాధువు. క్త్వార్థకేత్వమునకు సంధి లేదు. కావునఁ దలఁచి యను క్త్వార్థమునకు నచ్చుపరము కాఁగా యడాగమము వచ్చి తలఁచి యుండి యయ్యెను. సూ. సంధి. సూ. ౯. మొదటిభాగము.

అత్వసంధి. ఉదా. అమ్మ + అడిగెను. సంధి. సూ. ౨. చూడుఁడు.

ద్రుతప్రకృతిక సంధి. ఉ. వచ్చెన్ + అతఁడు = వచ్చె నతఁ డనిమాత్ర మగును గాని వచ్చెన్నతఁడు, వచ్చెతఁడు, వచ్చతఁడు, కానేరదు. వచ్చెన్ భూతార్థక క్రియ, ఏకవచనము కావున నిది ద్రుతప్రకృతికము. ద్రుత ప్రకృతికమున కచ్చు పరమైనపుడు సంధి లేదు, సంశ్లేషము లేదు. సంధి. సూ. ౨౯.

కళలకు ద్రుతముగూర్చుట. ఉదా. ఏల నన, ఇది యసాధువు. ఏల యనునది కళ. ఏల+అన=ఏలన, ఏల యన నని యగును గాని, 'ఏలనన' నని కాదు. ఇట్టులే, లేకన్, గాకన్, చూడకన్, అట్టులన్, ఇట్టులన్, ఇతఁడేనా, అట్టులనే యిత్యాదు లసాధువులు.

దోషప్రకరణమున నుదాహరించి వ్రాసినవన్నియు దుష్టములే. అక్కడ నవరించి యుండువిధము మనస్సున నుంచుకొని యట్టిసందర్భములనెల్ల విద్యార్థులు చక్కఁగ వ్రాయుదురు గాక.

నేయార్థము. తా నేదియో దేనికో సంకేతించి యట్టిదానిని వ్రాయరాదు.

నూరయ్య యనుటను సదాపశ్యంతయ్య లోనైనవి.

అప్రసిద్ధము[1] గ్రంథములయందుఁ గానరాక, యాంధ్రదేశంబున నేదే నొకభాగంబున మాత్రము వాడుకలో నుండి, తక్కిన భాగములవారికిఁ దెలియ రానిది. ఉ. పూసాటు. దీనికిఁ దేరకని యర్థము. ఉత్తరమండలములవారి కెవ్వరికిని నీమాట కర్థము దెలియదు పీతలు, దీనికి నెండ్రకాయ లని యర్థము ఇది నెల్లూరు, కడప, కర్నూల్, బళ్లారి, అనంతపురము, చిత్తూరు మండలముల వారు విని యెఱుఁగరు. ఆయామండలములందు మాత్రము వాడుకలో నుండు శబ్దములు సర్వాంధ్రదేశమున కుపయుక్త మగు నుత్తమగ్రంథములఁ బ్రయోగింప రాదు.

అప్రతీతము. ఆయాశాస్త్రములందును బురాణములందును మాత్రమే ప్రసిద్ధములగు పదములు. ఉ. ప్రమాణంబు నిన్ను రక్షించును గాక. ప్రమాణము విష్ణునామపర్యాయంబుగ విష్ణుసహస్రనామశ్లోకంబులఁ గలదు. పైదాని వలె నిదియు నెల్లరకు సుబోధము గామియే నిషేధించుటకుఁ గారణము.

దూరాన్వయము. 'వీఁడు నామేనబావ యల్లుఁ' డనుటకు వీఁడు నాతల్లి తోడబుట్టిన వానికొడుకుకూఁతు మగఁ డనిచెప్పుట.

ఈతఁడు మారపుబంధు వని తోఁపఁజేయుటకై యిట్లు చెప్పుట గుణమే యగు. అట్టియుద్దేశము లేకుండిన దోషము.

---

[1] "Provincial or even Slang Words and Phrases are sometimes tolerable in conversation, where the least objectionable are a useful check on formality. The natural language of a writer is always the best. But the forced assumption of a dialect is an affectation to be carfeully avoided. Slang terms must be used, if at all with great discretion, they should rarely find a place in serious compositions." Nichol.

ఇట్టివే కాక మహాకవులచేఁ బూర్వకాలంబున వాడఁబడిన వయ్యు, నీకాలమునఁ వాడుకయందుఁ దద్విరుద్ధ మగునర్థంబు గలపదములను వాడుట బాగు గాదు. ఉ. "కుసుమతతులు తొల్లియట్ల తమకంపు విడువక" యనుచోఁ గంపుశబ్దము మంచివాసన యనునర్థమున భారతంబునఁ బ్రయోగింపఁబడినది. కాలక్రమమున నాయర్థము మాఱి యిప్పుడు దుర్గంధమునందే యాపద ముప యోగింపఁ బడెడు. పన్నీరుపు వ్వెంతమంచికంపు కొట్టుచున్నదనిన లోకులు నవ్వుదురు. తిక్కనకాలమునఁ జీర సామాన్యవస్త్రపర్యాయముగ వాడఁబడు చుండెడిది. కావున "ద్రోణుని తలచీర" యని తిక్కన ప్రయోగించెను. ఇప్పు డీపదము స్త్రీలకట్టువస్త్రంబునన యుపయోగింపఁబడెడి. "తహశీల్ దారుగారు తలకుఁ జీర చుట్టుకొనుచున్నా" రనుట సరిగాదు. నారచీర సర్వత్ర సాధువు. ఇట్టివి మఱికొన్నిశబ్దములు గలవు.

సందిగ్ధము. ఒకశబ్ద మీపదముతో నన్వయించునా, యాపదముతో నన్వయించునా, యను సందేహము కలుగునట్లు వ్రాయరాదు. ఉ. లక్ష్మణుఁడు రాముని యింటికిఁబోయెను. అతఁడు మిక్కిలిసుకుమారుఁడు. అతఁడనఁగా రాముండా లక్ష్మణుఁడా యనుసందేహము కలుగు చున్నది.

ఇది బహుజనులు చూడ నపేక్షించుచిత్రవస్తు ప్రదర్శనశాలలోని ప్రతిమ బహుజనులు చూడ నపేక్షించునది యేది? శాలయా ప్రతిమయా?

ఇది చిత్రవస్తుప్రదర్శనశాలలో నుండు బహుజనులు చూడనపేక్షించు ప్రతిమ. 'ప్రదర్శనశాలలోనుండు' ననునది బహుజనులకు విశేషణమా? ప్రతిమకు విశేషణమా?

తిక్కనసోమయాజి గొప్పకవి, భాస్కరరామాయణ మనుగ్రంథమును రచియించినమంత్రిభాస్కరుఁ డీతనితాత. అతనితండ్రి కొమ్మన్న.

అతనితండ్రి, ఎవనితండ్రి? దిక్కనతండ్రియా భాస్కరుని తండ్రియా?

సందిగ్ధవాక్యములు వ్రాసి చదువువానిని నీయభిప్రాయము కనుఁగొను టకై కష్టపెట్టుటకంటె నీవే కొంచెముకష్టపడి చక్కఁగా వ్రాయుట మేలు. పరీక్షకులు నీ వ్యాసముల వంటి వ్యాసములఁ గ్లుప్తకాలములో నెన్నియో చదువ వలయును కావున నీ సందిగ్ధార్థములఁ బరిష్కరించువిరామము వారి కుండదు. వారికిఁ జదువంగానే భావము స్ఫురింపకపోయిన వ్యాసము బాగులేదని నున్న యిట్టురు.

అప్రయుక్తము. ఉ. ఆపత్కాలంబున నా యిష్టదైవతుఁడు నన్నుఁ గాచును. దైవతశబ్దమునకుఁ బుంలింగరూపములేదు. దైవతమని చెప్పవల యును. ఇష్టదైవమునికాని యిష్టదేవతయనికాని చెప్పవలయును. ఇట్టులే సురలు అనుదానికి నేకవచనము కల్పించి సురఁడు అనికాని దేవుఁడు అను దానికి బహుత్వము కల్పించి దేవులు అనికాని వ్రాయరాదు.

అసమర్థము. హనుమంతుఁడు జలధరమును లంఘించెను. జల ధరము=మేఘము. జలమును ధరించునది అని వ్యుత్పత్తి. ఇచట జలధి యను టకు మాఱు జలధరము ప్రయోగింపఁబడినది. జలమునకు స్థానమైనది జలధి. ఇందలి నీరెన్నఁటికిని వట్టిపోదు. ఇంతటిపూర్ణమైన యర్థముకల శబ్దమునకు బదులుగ నర్థము కొంతఁ దెగలశబ్ద ముపయోగించుట దోషము.

అపసంస్కృతము. దర్శనము స్పర్శనము అను శబ్దములను దరిశ నము స్పరిశనము అని వ్రాయరాదు. సంస్కృతశబ్దములందలి సంయుక్తవర్ణ ములను విడదీసి వ్రాయుటతప్పు. నైవేద్యము అనుదానిని నయివేద్యమనరాదు.

అశ్లీలము. వాఁడు వారిని గుద్దలిమ్మని యడిగెను. ఇచట గుద్దలి+ ఇమ్ము అని వ్రాసిన వాని యభిప్రాయమైనను అశ్లీలార్థము తోఁచుచున్నది. వాఁడు గుహ్యకేశసమానుఁడు. గుహ్యకేశుఁడు = కుబేరుఁడు (గుహ్యక + ఈశుఁడు.) అయినను గుహ్య + కేశ యనునర్థము ఝటితిస్ఫురించును. ఇట్టులే

చాముండకొండుకు-గోపీజార-కోటిపల్లిగ్రామసింహాసనస్థుఁడు-నీవు వాని ముట్టుకోక ఇత్యాదులు దుష్టములు.

విరుద్ధము. కువలయ వికాసము చేలఁగ మిత్రుఁడుదయించెను. కువలయము=(1) కలువ (2) భూచక్రము. మిత్రుఁడు=(1) సూర్యుఁడు (2) స్నేహితుఁడు. సూర్యుఁడుదయింపఁగాఁ గలువలు వికసించుట యస్వభావము. ఇచ్చట మైత్రికిఁ గారణము చెప్పలేదు. కావున విరుద్ధము.

## ii. వాక్యదోషములు.

అక్రమము. మొదటి వరుసను దప్పించి దానికి భిన్నముగఁ దరువాత వ్రాయుట. రామభరతలక్ష్మణశత్రుఘ్నులు కైకేయీసుమిత్రాకౌసల్యా నందనులు. ఇట్లు క్రమము దప్పించి వ్రాయరాదు. రామభరతలక్ష్మణశత్రుఘ్నులేవరుసఁ జెప్పఁబడిరో యావరుసన వారితల్లులపేర్లఁ జెప్పవలయును. ముందు వెనుక చెప్పుటచేఁ గ్రమము భంగమయ్యెను. రామభరతలక్ష్మణశత్రుఘ్నులు కౌసల్యాకైకేయీ సుమిత్రానందను లని చెప్పవలయును.

పునరుక్తి. చెప్పినమాటనే నిరర్థకముగ నదేయర్థమున మరలఁ జెప్పుట. "ఇప్పుడు సేనాపతి రెండుమైళ్లదూరములోఁ దనగుడారములోఁ గూర్చుండి తనకు రెండుమైళ్లదూరమున నుండుసేనకు సైన్యానాయకుఁడాజ్ఞ యిచ్చుచున్నాఁడు" ఇందు రెండుమైళ్లనుమాట రెండుమార్లు వృథా ప్రయోగింపఁబడినది. ఇది శబ్దపునరుక్తి. సేనాపతి సైన్యనాయకుఁడు సమానార్థకములు కావున నర్థపునరుక్తి.

హిమాచలపర్వతము. అగ్గినిప్పు. తలశిరోభారము, మధ్యపతివారివీథిస్ట్రీట్, కిరోసిన్ అయిల్ నూనె యివిసరిగావు. కడపటి రెంటియందు నాంగ్లపదంబులఁ దొలఁగించుట బాగు.

చెప్పినమాటను మరలఁ జెప్పుట కొన్నిస్థలముల గుణమే యగు. ఉ. కమలాక్షు నర్చించుకరములు కరములు. కరములనఁగాఁ జేతు లని యర్థమైనను గమలాక్షు నర్చించుకరములే కరములు గాని యితరకరములు కరములుగా వను నర్థవిశేషము గలదు గాన దోషము గాదు. దీనికే లాటానుప్రాస మని పేరు.

కానరే కానరే కానలోకోత్తరు ననుచు మ్రాని మ్రాని కరిగి యరిగి, యడుగు నడుగు లెండ బుడబుడ బొక్కిన, నిర్ఝరాంతరములు నిలుచుఁ బొలుచుఁ దరుల గిరులయెడల సురుగృహాంతరములఁ, దొంగితొంగి చూచుఁదోయజాక్షి.

చాలుర చాలురా, చాలుఁ బురే జయంత.

రాముఁడు రాముఁడు రాముఁ డని లోకులు కలవరించుచుండిరి. ఇట్టివి దోషయుక్తములు గావు.

అపూర్ణము. వాక్యము క్రియాన్వయంబుల సరిపోనియెడ నపూర్ణము. ఉ. "జనులందఱు పోగై తమ దేశము విదేశీయులఁ బాఱఁదోలునుద్యమము స్వానీయుల పాళెమును ముట్టడించిరి." జనులందఱుఁ బోగై తమ దేశము నుండి విదేశీయులఁ బాఱఁదోలునుద్యమముతో స్వానీయులపాళెమును ముట్టడించిరి. అని వ్రాసినవాని యభిప్రాయము.

కర్తృపదము క్రియాపదము భిన్నవచనముల నుండుట. వారు నివసించుగృహములు మంచుగడ్డలచేతనే చేయఁబడుచున్నది. కట్టఁబడుచున్నవి యని యుండవలయును.

ఒకచోటనుండి మఱియొకచోటికిఁ బోవుటకు లేళ్లుపయోగింపఁబడుచున్నది. ఉపయోగింపఁబడుచున్నవి యని యుండవలయును.

ఏకదేశాన్వయము. వ్యస్తపదము సంస్కృతసమాసములోని యొకపదముతో నన్వయించుట. ఉ. "మానవునకు నిజాప్తు లయినగ్రంథపఠనము నెఱవేర్చుచుంటిని." ఆప్తులేవి? గ్రంథములా, పఠనములా? పఠనములు గావు శాస్త్రగ్రంథములే. వ్రాసియుండువిధముఁ బట్టి పఠన మని యర్థ మగుచున్నది. అది వ్రాసిన వానిహృదయమును గాదు. గ్రంథపఠనము సమాసము. ఆసమాసములోని యొకపద మైనగ్రంథముతో 'ఆప్తులయిన' యను విశేషణ మన్వయించుచున్నది. అట్టు లన్వయింపరాదు. 'అయిన' యనువిశేషణము సమాసాంతపదముతో నన్వయింపవలెను. వ్యస్తపదము=సమాసముగాని విడిమాట.

ఆ, ఈ, ఏ, తన, నా, నీ, యనునవి తెలుఁగుమాట లైనను సంస్కృతసమాసమున నేకదేశముతో నన్వయించును. ఉ. తనయశోవిశదముక్తాసౌధపాళి. నీకంఠార్పిత కాలపాశము లోనగునవి.

వ్యాకీర్ణము. భ్రాంతికరమగు నన్వయము వ్యాకీర్ణము. ఉ. ఆ యింతికి దిద్దుఁడు తిలకము కురులంపుఁ బూలు ముడువుఁడు.

వాచ్యవివర్జితము. అర్థపుష్టికై చెప్పవలసిన మాట చెప్పకుండుట. "అతని చేతికత్తి యమునినైన ఛేదించును" అని చెప్పవలసిన చోట "ఒనక" అను పదము విడుచుట సరిగాదు.

అరీతి రసమునకు నుచితమైన పదములఁ గూర్పమి. ఉ. ఆ యంగన శృంగారము విటజనహృదయగ్రసనాగ్రహాగ్రహిళదృష్టిసమగ్రోదగ్రము. ఇందు వర్ణింపఁబడినది శృంగారరసము. శృంగారరసమునందుఁ గరుణరసమందు మృదువైనపదము లుపయోగింపవలసి యుండఁగ రౌద్రభీభత్సరసములం దుచితమైనపదము లుపయోగింపఁబడినవి.

న్యూనోపమము. ఉపమయందు న్యూనతయుండెనేని న్యూనోపమము. ఉ. పీతాంబరుఁ డైనహరి మేఘనిభుఁడు. మేఘముతోఁ బోల్పఁదగిన

గుణము నీళ్ళర్థము వారియందుఁ జెప్పకుండుటచే నుపమ చాలదు. చంద్రతారాభిరామమై యాకాశము పుండరీకాంకితమైన కాసారఖండమును బోలియుండెను. ఇచ్చట జంద్రునకుఁ బుండరీకమునకు నుపమ చాలునుగాని తారలకు సరిపోలు పదార్థమును జెప్పకుండుటచే నుపమ కొఱఁతపడియె.

**అధికోపమము.** హెచ్చుపదముండిన నధికోపమము. ఉ. ఆ యింతి పూచిన తీఁగవలె నున్నది. ఇందుఁ 'బూచిన' యను పద మెక్కువగా నున్నది. తీఁగ నింతి యుపమానోపమేయములు. ఆ రాజు విరోధులస్త్రీలు వికలముఖులై వాడిన పద్మకుముదములుగల వేసఁగినదులవలె నైరి. పద్మమునకు ముఖమునకు నుపమానోపమేయములు సరిపోఁగాఁ గుముదశబ్ద మధికము.

**సమాప్తపునరాత్తము.** వాక్యము సమాప్తమైన పిమ్మట విశేషణము మరలఁ జేర్చుట. ఉ. శాశ్వతు నభవుని గుణాత్ముఁ గణనాథుని గిరిజాపతి ముక్తికై కొలిచెదను విభుని. ఇందు విభుని అను విశేషణము వాక్యము ముగిసిన వెనుక గ్రహింపఁబడియెఁ గావున దోషము.

**న్యూనపదము.** ఉ. శ్రీరామచంద్రుని శరణు వేఁడమి హతుఁడయ్యెను. ఇందు రావణుఁడను పదము న్యూనము. పదలోపము కొన్నియెడల నపార్థమున కెడమిచ్చును. "పిల్లవాఁడైనను వానికిఁ బెద్దవారికున్నంత యున్నది" ఇందు తెలివి యను పదము లుప్తము.

**అశరీరము.** క్రియాన్వయము సరిపోకుండిన నపూర్ణమగు. ఉ. రాజు పాపాత్ములను వంచకులను ద్రోహులను. ఇందు దండించెనను క్రియ చెప్పమిచే వాక్య మక్రియమయ్యె.

**అధికపదము.** ఉ. యోగియు రణమున నభిముఖుఁడై చచ్చిన వీరుఁడును సూర్యమండలాకారమును భేదించిపోవుదురు. ఇందు "ఆకారము" అధికము. అక్కఱమాలిన పదములఁ జేర్పరాదు.

**ప్రక్రమభంగము.** పూనిన ప్రక్రమమునకు భంగము కలిగించుట. ఉ.

"అతనికి నారచీరలు వస్త్రములు. కూరలు మధురాహారములు. అడవి యిల్లు." తొలుత నన్నియు బహువచనములఁ జెప్పి 'అడవి యిల్లు' అని ఏకవచనమునఁ జెప్పుట ప్రక్రమభంగము.

పతత్ప్రకర్షము. ఉ. ఈ భటుఁడు పులులను - వరాహములను - జింకలను వధించెను. ఇందు ముందుచెప్పినవానికన్న వెనుకటివి బలహీనములు కావున దోషము. పులులను జంపినాఁడని చెప్పినతరువాత జింకలను జంపినాఁడని చెప్పుటయందు సారస్యములేదు.

భిన్నలింగము. ఉ. హనుమంతునిచే రాక్షససేన కూలిరి. 'కూలెను' అని యుండవలయును. స్త్రీని బురుషునితోఁగాని బురుషుని స్త్రీతోఁగాని పోల్చుటయు భిన్నలింగము. ఉ. ఆ భటుఁడు తాటకవలె నెదిరించెను.

ప్రజలను దల్లివోలె దశరథరాముఁడేలెను. పేడివాఁడు స్త్రీవలెఁ బోవుచున్నాఁడు. ఆయింతి పురుషునివలెఁ బలుకుచున్నది. వాఁడు నాకుఁ బ్రాణములు. విద్యలు నాకు సంచితార్థము. అనునవి దుష్టములుగావు.

## అర్థదోషములు.

వ్యర్థము. ఉ. మీరు పెద్దలు-మీకులము పౌరుషము సుప్రసిద్ధములు. మీరు గొప్ప దాతలు. ఇన్నిగుణములు మీయందుండియు మారాజునేల సేవింపరు" ముందుచెప్పినపలుకులు సేవకు హేతువులు గాకుండుటచే వ్యర్థములు. నురుగుతోనిండిన సముద్రమును హనుమంతుఁడు దాఁటెను 'నురుగుతోనిండిన' యనునది వ్యర్థము.

హీనోపమము. గొప్పవానిని నల్పునితోఁ బోల్చుట హీనోపమము. ఉ. రాక్షసులు కుక్కలవలెఁ దఱుముకొనిరాఁగా దేవతలు మృగములవలె బరువెత్తిరి.

అధికోపమము. అల్పుని గొప్పవానితోఁ బోల్చుట. ఉ. "కొలనిలోని

కొంగలు మునివరులం బోలియుండెను." "వాని తలలోని పేను శంకరు శిరస్సునందలి చంద్రునివలె నుండెను."

అసమోపమము. ఉ. బలరాముఁడు మేరుగిరినివోలె నలరెను. బలరాముఁడు తెల్లని వర్ణమువాఁడు. మేరుపర్వతము పసుపువన్నెగలది. కావున నసమోపమము.

అఖ్యాతోపమము. ఉ. "వానిముఖము కుముదమువోలె నున్నది" ముఖమును గలువతోఁ బోల్చుట ప్రసిద్ధముగాదు. కవిసమయవిరుద్ధము.

పరుషము. ఉ. ఈరాజుసౌందర్యమునకు మంటలోఁబడిన మన్మథుఁడేసాటి.

విరుద్ధము. ఉ. ఆ యెడారియం దనేకనదులు కొలఁకులు బాటసారుల దప్పి తీర్చుచున్నవి. ఇది దేశవిరుద్ధము.

"వేసవియందు నెమళ్లులాడెను—ఆర్ద్రపురుగులు నేలమీఁద విశేషముగఁ గానవచ్చెను." ఇది కాలవిరుద్ధము.

"ఏనుఁగు కుంభములలోఁ బ్రవాళములును దున్నపోతుకొమ్ములలో ముత్యములు పుట్టెను." ఇది లోకవిరుద్ధము.

"పులితోలు గప్పుకొని తలనిండ జడలుధరించి శివాలయములో బౌద్ధుఁ డొకఁడు గూర్చుండి జపము చేయుచుండె" ననుట సమయవిరుద్ధము.

విరసము. "ఈరాజు విరోధులభార్య లడవుల దుఃఖించుచుండఁగా శబరులు వారితో పరసమాడఁ జొచ్చిరి." ఇది విరసము.

హేతుశూన్యము. "దమయంతిని జూచుటకుఁ దుమ్మెదలువచ్చెను." కారణము చెప్పకుండుటచే దోషము.

సహచరచ్యుతము. సరిగాని దానిని సరిగాఁజెప్పుట. ఉ. చంద్రునిచేత నాకాశము నురుగుచేత సముద్రము ప్రకాశించెను. చంద్రునితో సమానముగ నురుగుచెప్పుట సరిగాదు. ఇట్టి దోషములు లేకుండ విద్యార్థులే

గాక గ్రంథకర్త లనుప్రతిష్ఠగోరువారును వ్రాయ యత్నింపవలయును. ఇప్పుడు కుక్కగొడుగులవలెఁ బుట్టు పుస్తకములందు నిట్టి దోషములు పెక్కులుగానవచ్చుచున్నవి. శిష్యుఁడు గురువునుజూచి "గురువర్యా నమస్కరించుచున్నాను. దండం దశగుణంభవేత్తని కలదు గదా" యని యన్నట్టు లొక గ్రంథకర్త వ్రాసెను. ఒక పాఠశాలయందలి ప్రథమోపాధ్యాయుఁడు తనపేరునకుఁ గవియను బిరుదముచేర్చికొని యొకగ్రంథమున ప్రహ్లాదుని తండ్రి పేరు హిరణ్యాకశిపుఁడని వ్రాసెను. ఇట్టి గ్రంథములనుజూచి భాషాభిమానులగు విజ్ఞులు నవ్వెదరో యేడ్చెదరో.

బాలురకుఁ దెలియుటకై కొన్ని కవిసమయము లిందు వచింపఁబడుచున్నవి. దేవతలను బాదములనుండియు మానవులను మౌళినుండియు వర్ణించుట సుకవి సంప్రదాయము. సీ. పల్లవవైభవాస్పదములు పదములు కనకరంభాతిరస్కారులూరు "లని ప్రారంభించి జలజనయనముఖము చంద్రసఖము" అని పోతనముగించుట రుక్మిణీదేవి సాక్షాల్లక్ష్మీయనుభావంబుతోనని తెలియునది. వసంతకాలమునందే కోకిలలుకూయును. వానకాలమందే నెమిళ్లాడును. మేఘధ్వని నెమళ్లకు సంతోషకరము, హంసలకు దుఃఖకరము. హేమంతమునందు కమలములు నశించును. జాజిపూలు మొగలిపూలు వర్షాకాలమందే పూయునుగాని వసంతమునం బూయవు. శుక్లపక్షమందన్ని రాత్రులు వెన్నెలరాత్రులే. కృష్ణపక్షమం దన్నిరాత్రులు చీఁకటిరాత్రులే. చక్రవాకదంపతులకు రాత్రియందు వియోగము. వెన్నెలపులుఁగులు (చకోరములు) వెన్నెల భక్షించును. వానకాలమందు హంసలు క్రౌంచపర్వతము బిలములోఁదూఱి మానస సరోవరమునకుఁ బోవును. శరత్కాలమందు (ఆశ్వయుజభాద్రపదమాసములు) మేఘములు శ్వేతములల్పములు. వెన్నెలవిస్తారము. తుమ్మెదలకు–సంపెఁగపూలకు, చిలుకలకు–జవ్వాదికి, కోకిలకు రామశబ్దమునకు విరోధము. చంధనవృక్షములు మలయపర్వతమందుండును. "ఇచ్చటినందనచందనోత్కరం"బని పెద్దన్న చెప్పుట

శృంగారవనము నందనము దేవవనమగుటచే భూలోకమర్యాదలందు వ్యాప్తములు కావని. ముఖములను గలువలతోఁ బోల్పరాదు. మన్మథునకు గాలి తేరు. పుష్పములచేనైనది చాపము. ౫ పుష్పములు బాణములు. చిలుకలు-గుఱ్ఱములు. మకరముగాని-మీనముగాని కేతువు. అల్లెత్రాడు తుమ్మెదలు. చిగురాకు బాకు. సూర్యుఁ డుదయించినఁ గమలములు వికసించును. చంద్రుఁ డుదయించినఁ గమలములు ముకుళించును, కలువలు వికసించును. చాతకములు మేఘములోనుండి పడునీటినిమాత్రమే త్రావును గాని నేల సోఁకిన నీళ్లు త్రావవు. కీర్తి తెలుపు-అపకీర్తి నలుపు. సామాన్యముగఁ బూలు-నీళ్లు-వస్త్రములు తెలుపనియే గ్రహింపఁదగు.

ఇట్టివి కవిసమయములు. ఇవి తెలియక విపరీతముగ వ్రాయువాని వ్రాఁత రోఁత.

ఇదిగాక వ్రాయసకాండ్రు సామెతలను-న్యాయములను నెఱిఁగి సమయోచితముగ నందందుఁ బ్రయోగించుట బాగు. ఆర్యచరిత్రరత్నావళికిఁ జేరిన హరిశ్చంద్రచరిత్రము-రుక్మాంగదచరిత్రము లోనగువానిని బఠించిన యెడలఁ గొన్ని సామెతలు వాని నుపయోగించు సందర్భములు తెలియును. కొన్ని న్యాయము లీ గ్రంథమున మఱియొకచో వ్రాయఁబడినవి. మనోహరముగ వ్రాయఁగోరువారు వీని నెల్ల నెఱుఁగవలయును.

## 11. జాతీయము.

శైలి జాతీయమై యుండవలయును. వ్యాస మన్ని విధముల నిర్దుష్టమైనను, విజాతీయపదములతోఁ గూడియుండిన నందము గాకుండుట యటుండ, రోఁతగా నుండును. కావున విద్యార్థులు మిగుల హెచ్చరికతో విజాతీయపదముల నన్వయముల నిరసింపవలయును. వ్యాసమున విజాతీయములు వచ్చుటకుఁ గారణములు.

1. భాషాగ్రంథములు చదువకుండుట.
2. సామాన్య సంభాషణమందును బరభాషాపదములు కలుపుట.
3. ఆంధ్రభాషాపదజ్ఞానము లేకుండుట.
4. వ్యాసము వ్రాయునపుడు ఆంగ్లేయాద్యన్యభాషల వాక్యముల మనస్సునఁ గుదుర్చుకొని వానిని భాషాంతరీకరించి తెనుఁగున వ్రాయుట.

స్వభాషయందు సంభాషింపక, స్వభాషాగ్రంథములు చదువక, శబ్ద జాలము వశపడదు. దానివలన భాషయందు నిట్టిపదము లున్న వనుజ్ఞానమే కలుగదు. పరభాషాపదములు పెక్కువిధముల వాడుకలోనికి వచ్చుచుండును. అట్టిమాటలకు స్వభాషాపదములు చెప్పవలసివచ్చినపు డీమాటలకు సరియైన తెనుఁగుపదములు లేవని, యొకరి నడుగక, తా మాలోచింపక, తమయజ్ఞాన మును గొందఱు ప్రకటించుకొనుచు బాలురకుఁ దప్పుమార్గములు బోధించు చున్నారు. భాషాజ్ఞాన మేమియు లేకయు, ప్రాజ్ఞంమన్యులై సామాన్య శబ్దములవిషయమందును నట్లు లనుట, మిగుల శోచనీయము. ఇట్టివారు వ్యాసలేఖన బోధకులై యన్యభాషాపదముల నిచ్చవచ్చినట్లు 'దూర్పుఁ' డని బోధించుట యాంధ్రభాషామహాదుర్దశాబలమునఁ గదా? ఆంగ్లేయభాషా గ్రంథములయందు విద్యార్థులు చదివినవిషయములనే వ్యాసలేఖనమునకై యిచ్చు నాచార మీ నాలుగవదురభ్యాసమును బలపఱుచుచున్నది, వాస్త వము విచారింపఁగా విద్యార్థులు పఠించినవిషయమే వ్యాసలేఖనమునకై పరీక్షాకాలమున నిచ్చుట వారికి మేలే. ఏమి వ్రాయవలయునా యని విష యాన్వేషణము చేయు కష్టపుఁబని తగ్గెను. అట్లు లున్నను విద్యార్థు లంతకు

సంతోషింపక యా గ్రంథములఁ దాముచదివినవాక్యములనే స్మరించి సగము మఱచి, పాతికవిడిచి, తక్కినవానిని భాషాంతరీకరింపఁ బ్రయత్నించి, శక్తి చాలక విజాతీయస్వజాతీయపదములతోఁ జేఁడ బెల్లము పిసికినట్లు కొఱమాలినవ్రాఁత వ్రాయుచున్నారు. ఇది విద్యార్థులదోషము గాక మఱి యెవరిది? నేఁడువచ్చినయాచారమే చెప్పవచ్చును. విత్తినమొకటి నాటినఁ జెట్టొకటిమొలవదు. కావుననే కదా పరీక్షలయందుఁ గృతార్థు లయినవారును గొంద ఱిట్టివ్రాఁతలువ్రాయుట. ఇట్టిరచనలు వ్యాపించినచో "a new class of literature will spring up, consisting of writing that is more barbaric,stupid,and worthless that has ever existed" అను వాక్యమునకు లక్ష్యభూతమై విలక్షణమై యపలక్షణమైన భాషయొకటి యుదయమై 'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' "Italian of the East" అను గౌరవమునకుఁ బాత్రము గాక చచ్చీచావని బ్రదుకు బ్రదుకుచుండును. అట్టిభాష వ్రాయఁబడిన గ్రంథములయందు నాంధ్రభాషారుచి వంటచెఱకునఁ గలచెఱకురుచియట్లు యుండును. ఉదా. ఏదేని వైద్యశాలను గాని పుస్తకశాలను గాని స్థాపించునపుడు దానినామమునకు నెవరయిన గొప్ప వారిపేరు తగిలించుట సుప్రసిద్ధము" To attach the name of some great man అనుట కిది తెలుఁగఁట.

ఇప్పటికి రమారమి పదిలక్షల యాష్యములవఱకు సందఁ బడినవి. Collected అనుటకుఁ దెలుఁగు అందఁబడిన వఁట.

5 or 6 సంవత్సరములు. లేక యనుపదము స్ఫురింపక, యయిదాఱు సంవత్సరము లని వ్రాసిన నాయర్థము రాఁగలదని తెలియక, 'వాని tho' అని వ్రాసినవానివలె 5 or 6 అని యొకఁడు వ్రాసెను.

ఈవిషయమై.....మంచిప్రాసంగమిచ్చెను. ఇది Delivered a lecture అనుటకుఁ దెలుఁగఁట.

"మతవిషయమైనవిద్యను పాఠశాలయందుఁ బ్రయోగించుట గుఱించి" Introduce అనుటకుఁ బ్రయోగించుట తెలుఁగఁట.

ఇట్టిమాటలుకూడ రానివారు

"సెలవుదినములందు నేను స్నేహితులతోకూడి park scenery చూచుటకుఁ బోయి యుంటి" నని యింగ్లీషక్షరములతో వ్రాయుచున్నారు. ఇంగ్లీషు వ్యాసములందు "I went to my గ్రామము. There I saw a ఉద్యానము. చెట్లు in it were మిక్కిలి beautiful. There were flower తీఁగెలు full of పూలు" అనివ్రాసిన నింగ్లీషుభాషోపాధ్యాయుఁడు కాగితములు చించి వారి మొగమున వైవఁడా?

"సార్ సార్ వాఁడు నాకు కంటిపీయి పూసినాఁడు సార్" అని చెన్నపురవాస్తవ్యుఁడైన యాంధ్రవిద్యార్థి యనును.

గొప్ప యుద్యోగములోనుండు నొకానొకఁడు "To receive double batta" అనుటకు "ఇరెండుబత్తెము వాంగుటకై" యని స్పష్టమైన తెనుఁగక్షరములతో వ్రాసెను.

"వాఁడు సీజరును నెటువంటిమరణ ముత్కృష్టమైన దని యడుగఁగా నతఁ డాకస్మికమైన చావుదా యని బదులు పలికెను."

దీనిలోని 'దా' తెలుఁగువారిని నవ్వించును.

వాఁడు కూయుచున్నాఁడని యాంధ్రుఁ డనఁడు.

"దీనికంటె నది పదిరెట్లెక్కువ."

దీనికంటె నది పదియంత లని కాని పదిమడుఁగు లని కాని చెప్పవలయును. *Rates* అనుదానికిఁ గొందఱు "రెట్లు" అని వ్రాయుచున్నారు. అంతలు, కొలఁది, మడుఁగు, వంతు, పర్యాయనామంబులు, ఇన్ని యుండఁగా రెట్లనునది లేకున్న భాషకేమి కొఱఁత?

ఇట్టి విజాతీయశైలి పుట్టుటకు మఱియొకకారణముగలదు. అన్యభాషా వాక్యములోని పదముల కన్నిటికిఁ దెలుఁగుమాటలు వ్రాసినఁ దెలుఁగువాక్య మగు నని కొందఱు తలఁచెదరు. ఇది మిక్కిలి పొరపాటు. ప్రతిజాతివారి కిని వేఱువేఱాచారములు సంప్రదాయము లున్నట్టు ప్రతిభాషకును వేఱు వేఱాచారములు సంప్రదాయములున్నవి. మాటకు బదులుమాట వ్రాయుచు వచ్చిన వాక్య మర్థహీనము ననాంధ్రము నగును. "వానికి దినములు నున్నగా జరగిపోయెను", అని యొకవిద్యావంతుఁడు వ్రాసినగ్రంథమునఁ గాన నయ్యెడి. ఇంగ్లీషు smooth తెనుఁగున నున్నయయ్యెను. "పూర్వకవుల మానముఁబట్టి పరిశీలింపఁగా" నని యొక ఎం. ఏ. వ్రాసెను. standard అనుటకు 'మానము' తెనుఁగు. "రాజమండ్రిలో వాడుకచేయుచున్న వకీలు" ఇదియొక వార్తాపత్రికయందున్నది. practice అనుటకు 'వాడుక' తెనుఁగు. "పనులునేర్చుకొని వచ్చుటకు మనవారిలో బుద్ధిశాలురగు యౌవనుల బహి ర్దేశములకుఁ బంపవలయును" అని యొక హైకోర్టువకీ లుపన్యసించెను. ఆంధ్రులకంటెను దనకాంధ్రభాష చక్కఁగఁ దెలియునని యభిమానముగల యొకానొకనికినొకఁడు భాషాంతరీకరింప "Knock and it shall open" అనియు "వాఁడు చెంబు పట్టుకొని పోయినాఁ" డనియు రెండువాక్యముల నిచ్చెను. మొదటిదానికి "గుద్దిచ్చిన అది తెఱచుకొంటుంది" యనియు రెం డవదానికి He went holding a vessel *i. e.*, He walked away with a vessel అనియు వాఁడు చెప్పెను. ఇవి సరియని యేయాంధ్రుఁ డనును? ఇప్పటివిద్యార్థుల భాషాంతరీకరణ మిట్టులున్నది. విద్యార్థు లనేల? ఆంగ్లకళాకుశలులై ఆంధ్రవిద్యావంతులమనుకొను మఱికొందఱివిధ మిట్టిదై యున్నది. అట్టివారు He did good justice to the table. He has an itching palm. Many a mickle makes a muckle. లో నగు ననేక వాక్యములనెట్లు తెలిఁగించెదరో. వాఁడు బల్లకున్యాయము కలి గించినాఁడు. వాఁడు గజ్జిచేయికలిగియున్నాఁడు. చిన్నవి పెక్కులయిన

నొక పెద్దదగునని వ్రాయ వచ్చునా. సామెతలకు సరియైన సామెత లున్న వ్రాయవలయును. Many a mickle makes a muckle అనుటకు "అన గింజలన్ని చేరిన గుమ్మడికాయయగు"నని వ్రాయవలయును. "To close the stable after horse is stolen" దొంగలు చొరఁబడిన యాఱునెలలకుఁ గుక్కలు మొఱిఁగినట్లు, "To rob Peter to pay Paul" కాకులనుగొట్టి గ్రద్దలకువేసినట్లు అని వ్రాయుటబాగు. తగినసామెతలులేవేని కల్పింపవల యును. అంతకు శక్తిలేదేని యాయర్థము వచ్చునట్లు వ్రాయవలయును. అటు గాదేని అయి ల్లంటుకొన్నది. నాలుగుకానులతో వాఁడు చిన్నక్కఁ బెద్ద క్కఁ జేయుచున్నాఁడు. నాకు నీదృష్టి తాఁకినది. అడ్డగోడమీఁది పిల్లి. శ్రీరంగము రోఁకలి. నిన్నంతవానిని నింతవానిఁ జేసినందునకు నిదియా నీవు చేయుబదులు. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభో వీథిపై నంతై. ఉష్ణానిహోమాగ్ని నూఁద నొల్లఁడు కాని. ఆప్రొద్దు పొయి రాఁజనట్టి నిఱుపేద. వాని చేజిడ్డు వదలినది. వానియింటిలో సూర్యచం ద్రులు తాండవమాడుచున్నారు. వానిని బెద్దమ్మ పట్టినది. వీనిని మాటకు మాట సరిపోవునట్లు భాషాంతరీకరింప వచ్చునా? అట్లుచేసిన నాంధ్రుఁ డెవఁడైన నంగీకరించునా? కావున నట్టిపద్ధతి మాని తెనుఁగుజాతీయముల నేర్చుకొని వ్రాయుటబాగు.

Recommendation అనుపదమునకు సి. పి. బ్రౌన్‌దొరగారి నిఘంటువు నందు స్తుతి, శ్లాఘన, శిఫార్సు, అని వ్రాయఁబడియున్నది. శిఫార్సు తురకమాట. పురుషకార మనునది సరియైనపదము. ఇట్టులున్నను వాక్య ములయం దాపద మెట్లు భాషాంతరీకరింపఁబడినదో చూడుఁడు.

You may read this book if you like but I do not recommend it. నీకిష్టమైనయెడల నీపుస్తకమును జదువు. నేను మంచి దనను.

He recommends bathing. స్నానముచేసిన మంచిదని వాఁడంటాఁడు.

Her beauty recommended her to him as a wife. దాని యందమే వానిని దానిని బెండ్లిచేసికొ మ్మనినది.

I followed the course which you recommended. మీరేపని మంచిదనినారో నేను దానినే చేసినాను.

The garden in front recommends the house; it has no other recommendation. ఆయింటికి నెదుటఁ దోఁట యుండు నొక గుణమే తప్ప వే ఱొకగుణమును లేదు.

Do you think that I would recommend you a thief. ఒక దొంగను మంచివాఁడని మీయొద్దఁ దీసికొనివచ్చి విడుతునా?

You recommended them and I bought them. అవి మంచివే కొనవచ్చు నని నీవు చెప్పుటవలన నేను గొంటిని.

You may buy this but I do not recommend it. నీవుకొనినఁ గొనుము నేను మంచి దనను.

He recommends himself to his master by diligence and honesty వానిజాగరూకతవలనను బెద్దమనుష్యనితనమువలనను దన యజమానుని దయ సంపాదించుకొన్నాఁడు.

I shall recommend my son to your care నాకొడుకును మీవశము చేయుచున్నాను.

I recommend my soul to God and my honour to the king. ప్రాణము దేవునికి మానము రాజునకు నర్పించినాను.

Will you recommend me to that gentleman for employment. ఉద్యోగము నాకిచ్చునట్లు లాదొరగారికి నాయోగ్యతను దెలియఁజేసి యొప్పగింతపెట్టుతారా.

I recommend not to do this again. దీని నీవు మరల నిట్లు చేయుట మంచిదికాదు.

వ్రాసుదొర యన్యదేశజుఁ డైనను, నిప్పటి కొందఱవలె, భాషాభిమానము విడక భావము బోధపడునట్లు వ్రాసెను. అన్యభాషయందలి వాక్యము భావమును గ్రహించి యాయభిప్రాయము నాభాష తెలియని యాంగ్లు లెట్లు తమవారితోఁ దాము మాటలాడునపుడు చెప్పుదురో యావిధముగ వ్రాయుట సరిగాని తదితర మేదియుఁ గాదు. భాషాంతరీకరణమందంతయు నిదియే ప్రమాణము. మాటకు బదులు మాటయుండవలసినది విధిగా నెంచుట సరిగాదు.

ఆంధ్రభాషయందు వ్రాయఁబడు వ్యాస మాంధ్రజనోపయోగార్థమనుట మఱవరాదు. కావున నుపమానములుగాని, కథలుగాని చెప్పునప్పుడాంధ్రగ్రంథముల నుండునవి, యాంధ్రు లెఱింగినవిగాఁ జెప్పవలయును. పరదేశకథలఁ జెప్పునప్పుడు వివరించి వ్రాయవలయును. సూచించుట మాత్రము చాలదు. ఉ.

కోడి రామమూర్తి నాయఁడుగారు హెర్క్యులీసు నంతబలము గలవా రనరాదు, భీము నంతబలము గలవా రనవలయు.

కాళిదాసుగుఱించి చెప్పునపుడు హిందూదేశపు షేక్స్పియ రయిన మనకాళిదాసుఁ డనరాదు, షేక్స్పియరును గుఱించి మనము చెప్పునపుడు ఇంగ్లాండుదేశపుఁ గాళిదాసుఁడయిన షేక్స్పియ రని చెప్ప వలయును

“ఇటాలియన్ భాష పశ్చిమదేశపుఁ దెనుఁగు” అనవలయును.

‘చంద్రుఁడు చక్కనిది’ యనియొకఁడు వ్రాయఁగా నేల యిట్లు వ్రాసితివన “Moon Feminine Gender గదా సార్” అనెను.

వీఁడు నమ్మకమునఁ గుక్కవంటివాఁడు, వాఁడు గాడిదవలె నోర్పు గలవాఁ డనరాదు. కుక్కలు గాడిదలు పాశ్చాత్యులకు గౌరవార్హములై కాని హిందువులకుఁ గావు. అన్యదేశవిషయంబుల వ్రాయునపు డా పేరిఁగా యాచారములు వర్ణింప వచ్చును గాని వెంగయ్య గాడిదనెక్కి స్వా

తీయుచుండఁగా నని వ్రాయరాదు. మనదేశవిషయములు వ్రాయునప్పుడైనను యోగ్యతాయోగ్యతలు సమయాసమయము లాలోచించి వ్రాయవలయును.

హరిశ్చంద్రచక్రవర్తిని జూచి చంద్రమతి "నీమొగము తోఁటకూరకాఁడవలె వాడి యున్నదేల" యని యడిగినట్లు చెప్ప రాదు. ఎండకు వాడినకమలమువలె నని చెప్పఁ దగు. పూర్వలాక్షణికు లెంతయు నాలోచించియే కవిసమయముల నేర్పఱిచిరి. అనాలోచితముగ నూతనసృష్టులు చేయువా రిట్టిపొరపాటులు పడ కుండవలయు.

ముద్దునఁ బేరు చెడె నన్నసామెతచొప్పున మంచిమంచిపేరులను నానావికారములుగ మార్చుచున్నారు. అట్టివి నోటిమాటలుగాఁ బోక కాగితములపై నెక్కుచున్నవి. ఉ. కనకమ్మ యనుపేరు కాకమ్మ యని, యుమాచంద్రదేవ శబ్దము నుమాచంద్రదే వని, కనకవల్లిని కాకల్లియని కనకరత్నమును కాకత్తి యని మఱియుఁ బెక్కుశబ్దములరూపములే కొందఱు మార్పుచుచున్నారు. ఇట్టిచేఁతలు గూడవు.

వాక్యములందు మున్ను చెప్పఁబడిన విసంధివర్ణములు గాని, పదదోషములు గాని, యర్థదోషములుగాని యుండరాదు. పదములు మహాకవులు వాడినవియై సార్థకములై యపార్థకములు దుష్టములు గాక యుండవలయు.[1]

---

[1] Purity in the use of words. The words used in good English composition must be classic English words. Every violation of this rule is a **Barbarism**. The most frequent sources of Barbarisms are—

1. The use of obsolete words.
2. The use of Provincial or slang words or expressions.

శైలి జాతీయమై యుండవలయును. ఇట్టులున్నచో శైలి శుద్ధమైన దని చెప్పఁబడును. పదములు సరళములు సుబోధములై యన్వయకాఠిన్యము లేక వ్రాసినవారి యభిప్రాయము తేటతెల్లముగఁ జదువువారికిఁ దెలియున ట్లుండ వలయును. వ్యాసము సంగ్రహముగ నుండవలయును.[2]

---

3. The general use of technical terms.
4. An affectation of foreign phraseology.
5. Coining words unnecessarily.

[2] "With some exceptions, the more briefly a thought is expressed the more clearly is it conveyed. Every word in a sentence which does not do good does harm. It is therefore a rule in composition never to use a suqerfluous phrase. If on revision you find a word that you cannot account for and defend, strike it out." Nichol.

"On the principle of attaining ends at the smallest cost, it is a virtue of language to be brief. If a thought can properly be expressed in five words there is a waste of strength in employing ten." Bain.

"True brevity of expression consists in a man only saying what is worth saying, while avoiding all diffuse explanations of things which every one can think out for himself; that is it consists in his correctly distinguishing between what is necessary and what is superfluous. On the other hand, one should never sacrifice clearness, *to say nothing of grammar*, for the sake of being brief." Schopenhauer.

## 12. సంగ్రహము.

సంగ్రహ మనఁగాఁ జెప్పవలసినవిషయములలోఁ గొన్ని చెప్పి కొని విడిచి కాని, చెప్పినవిషయము లైనను బూర్ణముగఁ జెప్పక కాని, వ్యాసముఁ గుఱుచపఱుచుట గాదు. అట్లు చేయువాఁడు విషయమునంతయుఁ దెలియ వాఁడుగ నైన నుండవలయు, నొండె నాలోచింప శక్తిలేనివాఁడుగ నైన నుం వలయు. వ్యాసమునందుఁ బ్రధానము సారము కాని భారము కాదు కావునఁ బత్రసంఖ్య హెచ్చైనకొలఁది సారవంత మని, తక్కువైనకొలఁది నిస్సార మని తలంపరాదు. చెప్పఁదగినవిషయ మంతయుఁ జెప్పుటయే ముఖ్యము. నిష్ప్రయోజనము లైనమాటలచేఁ బుటలు నింపుటవలన ననావశ్యకముగ వ్యాసము పెద్దదై యుద్దిష్టవిషయము దృష్టికి దవ్వగుట సారహీనమగును. కొందఱు బాలురు వ్యాసము పెద్దదిగఁ దోఁపఁజేయుటకై పెద్ద యక్షరములతో వ్రాయుదురు. అంతమాత్రపుయుక్తి పరీక్షకుఁడు కనుగొనలేఁ డని వారియభిప్రాయము కాఁబోలు. వార్తాపత్రికల నిర్వహించువారు జీతము లిచ్చి యుపవిలేఖకుల నియమించుకొనుట కలదు. ఒకవార్తాపత్రికాశాలయం దొకఁడు నూతనముగ నుపవిలేఖకపదవియందుఁ గుదిరెను. ప్రధానలేఖకుఁడు వాని నొకవిషయము వ్రాసికొని రమ్మని చెప్పెను. ఆప్రకారమే వాఁడు వ్రాసికొని వచ్చెను. దానిని జూచి ప్రధానలేఖకుఁడు దీనిని జాలవిస్తరించి వ్రాసితివి. ఇదంతయు ముద్రించుటకుఁ బత్రికయం దెడము లేదు. దీనిలో సగమైనఁ జాలు ననెను. ఆనూతనోపవిలేఖకుఁడు తక్షణమే తాను వ్రాసినపుస్తకమును నిలువుగ నడిమికి రెండుగఁ జించి యొకసగ మొక చేతను, మఱియొకసగము మఱియొకచేతను బట్టుకొని యేసగము కావలయు నని యడిగె నఁట. మఱునటిదినము నుండి యాయుపవిలేఖకున కావార్తాపత్రికాశాలయం దుద్యోగము లేదని చెప్పవలయునా? సంగ్రహించుట యన నిట్టిది కాదు. నిరర్థకపదములు వ్యర్థవిశేషణములు లోనగునవి తొలఁగించి సంగ్రహింప నొప్పు.

“అనంతర మానరేంద్రనందను లమందానంద కందళితహృదయా రవిందులై విష్ణుశర్మం గని యిట్లనిరి. దేవా తావకం బగుసేవావిశేషంబున నిశ్శేషంబుగ మిత్రభేదమును వినంగని మనంబున ఘనం బగుమోదంబు నొందితిమి. ఇంక విగ్రహంబుం గూడ ననుగ్రహించి మమ్ముఁ గృతార్థులం జేయ వేఁడెదము. వేగిర మీనవకథాసుధారసంబు వెల్లిగొలిపి యాఁకొన్న మాచెవులకు విందు సేయుం డనిన నాయవనీసురసత్తముం డాదరాయత్తచిత్తుం డై యిట్లని వినిపింపం దొడంగె. తొల్లి తుల్యబలవిక్రమంబు లగుమయూరమరాళంబులకు సమీకంబు చేకుఱినతఱి నొకయరిష్టమును నమ్మి యాహంసమ్ము పరాజయమ్ము నొందెను. మీ కక్కథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

దీనికి సంగ్రహ రూపమని దీని నెంచఁదగు. “వెండియుఁ గథారంభ కాలమున రాజపుత్రు లిట్లనిరి. అయ్యా యావిగ్రహంబు విన మాకుఁ గుతూహలంబు గలదు. నా విని విష్ణుశర్మ వారిఁ గని మీకు శ్రోతవ్యం బగు నదియ నాకు వక్తవ్యంబు గాన దాని వాకొనియెద మీరలు సావధానులరై యాఁకొనుఁడు.

సమబలవిక్రమంబు లగుమయూరమరాళంబులకు సంగరంబు పొసంగం గాకమ్ముల నమ్మి చేరువఁ జేర్చికొనుటం జక్రాంగంబుల కపజయంబు కలిగెననుడు ఱేనికొడుకు లది యెట్లన విష్ణుశర్మ యిట్లని యుపన్యసింప నుపక్రమించె.” దీనియందు వ్యర్థపదంబులు గాని దీర్ఘసమాసంబులు గాని దీర్ఘవాక్యంబులు గాని లేవు. ఇట్టులే చిన్నయసూరి నీతిచంద్రికయందు వాక్యములు వ్యర్థపదరహితములు సార్థకపదసహితములు నై సుబోధములైన పదములు గలవై యున్నవి.

“గోదావరీతీరమందు గొప్పబూరుగువృక్షము గలదు. అందు నానా దిక్కులనుండి వచ్చి పక్షులు రాత్రి వసించుచుండును. ఒకనాఁడు వేకువ లఘుపతనక మనువాయసము మేలుకొని రెండవయమునివలె సంచరించుచున్న

కిరాతునిఁ జూచి వఱువాత లేచి వీనిమొగము చూచితిని నేఁ డేమికీడు రాఁగలదో తెలియదు. వీఁడు వచ్చినచోట నిలువఁ దగదు. జాగుచేయక యీచోటు విడిచి పోవలె నని యత్నము చేయుచుండఁగా వాఁ డావృక్షమునకు సమీపమందు నూకలు చల్లి వలపన్ని పోయి చేరువపొదలో దాఁగి పొంచి చూచుచుండెను. అనంతరము చిత్రగ్రీవుఁ డనుకపోతరాజు నింగిని సంచరించుచు నేల మీఁద నూకలు చూచి తనతోడికపోతములతో నిట్లనియె. ఈనిర్జనవనమందు నూకలు రా నిమిత్తమేమి? మన మీనూకల కాశపడరాదు. తొల్లి యొక తెరువరి కంకణమున కాశపడి పులిచేతఁ దగులుకొని మృతిఁ బొందెను. మీ కాకథ చెప్పెద వినుండు." వ్యాసశైలి యిట్లుండవలయు. కొన్నిసందర్భముల సంక్షిప్తవాక్యమునకంటెఁ బెంచివ్రాసినది మనోజ్ఞముగ నుండును.

## 13. స్పష్టత్వము.

వాక్యార్థము స్పష్టముగా నుండవలయును. ప్రత్యయముల విడిచి యిచ్చవచ్చినపదముల నిచ్చవచ్చిన చోట నునిచి పూర్వాపరస్వరాన్వయము చక్కఁగా నున్నదా యని చూడకపోయిన వాక్యము స్పష్టము గాకుండును. సందిగ్ధ దూరాన్వయ దోషములు వాక్యము నస్పష్టముఁ జేయును.[1]

[1] "A good writer ought not only to write so as to convey some sense to his readers, but so as to convey in the clearest manner the exact sense of his thought. We should not be left to grope for the meaning among a maze of words nor be left in doubt between two meanings. Quintilian says "Care should be taken, not that the reader may understand if he will, but that he must understnnd whether he will or not. One important element of clearness is Simplicity. A difficult subject cannot be made

"రాజును జెఱపెట్టుట యసాధ్య మని జనులు తలఁచి యుండినను నట్లు చెఱపెట్టఁ బడినను దమరాజు తప్పించుకొన వెరవు చూచునని తలఁచి యుండిన జనులకుఁ దమదేవాలయమందు క్రైస్తవులు నుండుట నిర్భరముగాఁ

easy by simple words, but we ought to try to express ourselves in the plainest idiomatic English that will fully represent our ideas." Nichol.

"Swift's rule, obvious as it seems, fully and sufficiently describes this plain style, and no other:-"Proper words in proper places make the true definition of a style." Locke, who was pronounced, when people talked and wrote about these things, a great master of the Plain Style, gives his recipe to an opponent. "Your lordship says" he writes to the Bishop of Worcester, "But now, it seems nothing is intelligible but what suits with the new way of ideas," My lord, the new way of ideas and the old way of speaking intelligibly were always, and ever will be, the same; and if I may take the liberty to declare my sense of it herein it consists:—I. That a man use no words but such as he makes the signs of certain determined objects of his mind in thinking, which he can make known to another. 2. Next, that he use the same word steadily for the sign of the same immediate objects of his mind in thinking. 3. That he join those words together in propositions, according to the grammatical rules of that language he speaks in. 4. That he unite those sentences in a coherent discourse." Essays on Social subjects.

దోఁచె. కావున జను లందఱు పోఁగై తమదేశము విదేశీయులఁ బారఁ దోల నుద్యమము స్పానీయుల ముఖామును ముట్టడించిరి. కావున స్పానీయులు దొడ్డిదోలఁబడిన మేకలవలె తప్పించుకొన వెరవులేక చిక్కి వారిలోఁ బెక్కులు హతులైరి.” ఇట్టి వ్రాఁతలు రోఁతలు.

## 14. వాక్యపరిమాణము.

వాక్యములన్నియుఁ గుఱుచలుగా నుండవలయునా నిడుపలుగా నుండ వలయునా యని కొంద ఱడుగుదురు. అన్నియు దీర్ఘములైనను నన్నియు హ్రస్వము లైనను మనోజ్ఞముగ నుండవు. సమర్థుఁ డగువాఁడు సమయోచితముగ రెండు నుపయోగించును. వ్యాసలేఖనము నభ్యసింపఁ బ్రారంభించు నతఁడు కుఱుచవాక్యములు వ్రాయుటే మేలు. అందు దోషములు పెక్కు లుండ వలనుపడదు. అన్వయసౌకర్యమును గలుగు. దీర్ఘవాక్యము లైనచో వాక్యాంతము వ్రాయునపుడా వాక్యము ప్రారంభించినవిధము మఱచి పూర్వోత్తరభాగములకుఁ బొందిక కుదురనీక తికమకలు పట్టించు టగును.

## 15. వాగాడంబరము.

వ్యాసములందు వాగాడంబరము సమ్మతము గాదు. క్లిష్టపదంబులను దీర్ఘసమాసంబులను గూర్చుట తగదు. కావున విద్యార్థులాపోకలఁ బోకుందురు గాక. ఒకవిద్యార్థి వ్రాసిన యీ వాక్యములఁ జూడుఁడు. పూర్వోదాహృతదోషముల కన్నిటికి నిది నెలవై యున్నది.

“సెలవుదినములందు నేను స్నేహితులతో కూడి park scenery చూచుట పోయి యుంటిమి. దృఢసారవంత స్కంధయుతము లగువృక్షశ్రేణులచే మేము తన్మధ్యవిద్యమాన మార్గముల మెఱయుచు త్రోవయందు నేత్రముల కానందించు వింతలను జూచుచు వెళ్లితిమి. చల్లనిగాలిచే తేబడినవాసనలచేత నింపొందుచు park పోయి చేరితిమి. త్రోవయందుమరుస్కంధంబులను దానినుండి వీడి వచ్చు శాఖాసముదయంబులును వీక్షించుచు వెళ్లితిమి.

నుమంబులచేతను, చిగుళ్లచేతను శాఖాసముదయంబులు భారాలంకృతములై యుండె. ఇంత వింతలను గమించుచు park పోయి చేరి నక్కడ మధుర స్వనవిలసనంబు లగు విహంగరత్నంబులును బహుచిత్రవర్ణపక్షవంతములు విదేశానీతము లగుఖగౌఘంబులను వీక్షించితిమి. అక్కడి నానారాష్ట్ర సంపాదిత సమరోపోషిత హర్యక్షవ్యాఘ్ర ముఖ్య మృగచయం జూచి ప్రమోదించితిమి. చతురవచన విలాసగమనరతుల నతిశయిల్లువిహర్తలతోఁ గలసి నేత్రముల కానందించు వింతలకువినోదించుచు ఘనపారవశ్యము చెందింటికి వచ్చితిమి." ఇట్లు వ్రాయువాఁ డెన్ని యేండ్లకునుబోధముగ వ్యాసము వ్రాయఁగలుగునో.

## 16. అన్య దేశ్యములు.

భాష కావశ్యకమై దానికి సరియైన యాంధ్రపదము లేని, సరియైన పదము కల్పింపవలనుపడని యన్యదేశపదము నెచ్చటనైనఁ గ్వాచిత్కముగ వాడిన వాడవచ్చును గాని విచ్చలవిడి వాడరాదు. ఇదియైనను లోకమున నిదివఱకే మాఢిగ వ్యాపించినదియై యుండవలయును.

అనావశ్యకముగ నూతనశబ్దములఁ గల్పింపను రాదు. అన్యదేశ్యంబుల గ్రహింపను రాదు. ఉ. పొగబండి, ధూమశకట మనుపదములు ప్రసిద్ధములై యున్నవి. పొగచేత నడుపఁబడుబండి పొగబండి. మధ్యమపదలోపిసమాసము. పొగయనఁగా నావిరి. ఇట్టులే ధూమశకట మనుపదము. దీనికిమాఱుగ రైల్ బండి యనుట సరిగాదు. దీనికర్థ మినుపకమ్ములబండి యని యగును. ఇట్టులే యంకగణితము క్షేత్రగణితము బీజగణితము గణితశాస్త్ర మనుపదములు ప్రసిద్ధములు కావున వీనికి మాఱుగ నరత్మెట్టిక్కు, జ్యామెట్రి, ఆల్జిబ్రా, మాతమాటిక్సు" అని వ్రాయరాదు. మాతమాటిక్కు లనుటయసహ్యము. ఇంగ్లీషుభాషయందు 'మాతమాటిక్కు' నియేకవచనము రూపము లేదు. కావున మాతమాటిక్కు లనుట యాభాసము. మాతమాటిక్సు లనుట యంతకన్న నసాధువు. Mathematics అనునది సమూహార్థకము, ఏకవచనము. కావున

గణితశాస్త్ర మనుటే సాధువు.[1] ఆంధ్రుఁడుగాఁబుట్టి యాంధ్రభాషాభిమానముగలవాఁ డిట్టి యన్యదేశ్య పదముల గౌరవింపఁడు.

ఆంగ్లశబ్దముల నాంధ్రలిపిని వ్రాయునపు డుచ్చారణము ననుసరించి వ్రాయవలయును. వర్ణక్రమము ననుసరించి వ్రాయరాదు. Rendezvous దీనిని రెండవూ యని వ్రాయవలయును గాని 'రండెవు' అని గాని 'రండజ్వస్' అని కాని వ్రాయరాదు. ఆంగ్లపదము నుచ్చారణము చొప్పునఁ

---

[1] "Foreign words and phrases, though vindicating their introduction when they fill up a gap in the language and supply us with new terms for new foreign things are apt to be used in place of equally expressive English terms. Among intruders in this way we may instance—

Some think that certain distinctions cannot be expressed at all. Coining words contrary to analogy or without sufficient reason is a *vicious kind of forgery*. With new thoughts new forms will force their way into a language, but it should be a rule never to make a word when others ready made can be found to serve the purpose. A young writer should never invent a word at all, nor use any of the following which have been, for the most part of late years foisted upon our tongue......Considerable indulgence is granted to novelists and writers of books on foreign travel in the employment of these and other words and fashion may rule that they be generally adopted; but they should be closely examined on passing? the customhouse." Nichol.

దీనిలోని ఇంగ్లీషను పదముదొలఁగించి యాంధ్రమని చదివిన మన యిప్పటి భాషాస్థితికి సరిపడును.

జక్కఁగ వ్రాసినచో దానిని మరల ఆంగ్లాక్షరములతో వ్రాసి కుండలీక రింపఁబనియుండదు. ఒకఁ డొకపక్షిని చిత్రించి క్రిందఁ జిలుకయని వ్రాసె నఁట. పేరేల వ్రాసితిఁ వనఁ జూచినవాఁడు కాకి యనుకొనునేమో యని చెప్పెనఁట. తెలుఁగు నాంధ్రలిపికి మరల నాంగ్లలిపిని వ్రాయుట యిట్టిద. ఆంగ్లేయులకున్నట్టి నుంకసాల యాంధ్రభాషకొకటి యేర్పడుటబాగు. అటు లేర్పఱుపక ప్రాజ్ఞులగువా రూరక యుపేక్షించినచో నిట్టివ్రాఁతలను గ్రంథములను సహించినవారై భాష రూపుమాయ నిచ్చగించిన వా రగుదురు.

"మా పెద్దలకు జమీన్ దారిణి గారు జారీ చేసియుండే జమీనులు తన పని వాఁడు జాల బడాయి కొట్టుచు లడాయికి వచ్చినాఁడు కాని యవి నాకు వార్సత్వముచే దఖల్ పడినవగుటచే నా పేరనే మిస్స లయినాయి."

"ఇరిగేషన్ కెనాలులో నీస్లు వాంటింగు అయి బొందుపోవు నట్లైన బ్లాస్టుయియర్ వలె కరెంటు యియర్ లో సహా రిమిషన్ యియ్యవలసి యుండును."

ఇట్టియవలక్షణపు వ్రాఁతలు కాఁపులు కరణములు లోనగువారు వ్రాయువ్యవహారపత్రములందే కాక శుద్ధమైనభాష యర్థ మగుచోటను వ్రాయఁబడుచున్నవి. ఇట్టివి కేవలదూష్యములు. నామవాచకములు బిరుదులు యథాస్థితిఁ బ్రయోగింపనగు. ఉ. "ఇంగ్లాండులో 'సాన్ డ్ ఫోర్డు' అను బాలుఁడు కలఁడు" అనియే వ్రాయవలయుఁగాని 'ఎంగిలి భూమిలో ఇసుక రేవు' అను బాలుఁడని వ్రాయరాదు.

## 17. పూర్వకథలు.

పూర్వకథల ననువదించువాఁ డాకథల: జక్కఁగ నెఱింగియుండిన వ్రాయవలయు. తెలియనిదానిని ప్రస్తావింప కుండుటయే మేలు. వేణుగోపాలశతకమునఁ జెప్పఁబడినట్లు 'రామాండ్షకత లెల్ల మే మెఱుంగని పనా

కాటమరాజుకు కన్నుఁ డోడె! బానోతకతలోన బాలరాజొక్కఁడు కుంబ కర్ణునిపట్టి కుత్తసించె."

నని పురాణములు ప్రసంగించుటవలన హానియేకాని మేలులేదు. ఒకానొక విద్యార్థి వ్రాసిన యీవాక్య మేతత్పూర్వమే యుదాహృతమై యున్నది.

"భారత యుద్ధమైనపిమ్మటఁ బాండవులు కృష్ణుని రాయభారమంపిరి. అప్పుడు సభలో నందఱుండిరి. సంధి కుదురనందున కృష్ణుఁడు విదురు నింటిలో భోజనము చేసెను."

## 18. విప్పుడుకథలు.

పురాణములు చదివిన కొందఱు విద్యార్థులు మఱియొకవిధమైన దోషమునకుఁ బాలుపడుచున్నారు.

"కృష్ణార్జునులు పరమమిత్రులు. వీరిసంవాదమే భగవద్గీత యనఁబడునది" యనుటకు మాఱుగ

"ధరాపుత్రవైరియు ధరాపౌత్రవైరియుఁ బరమమిత్రులు. వీరిసంవాదమే యిప్పుడు నానాభాషల నానాదేశములఁ బ్రసిద్ధికెక్కియుండు యోగశాస్త్ర"మని వ్రాయును. ఇట్టివారి సంఖ్య కేవల మల్పము.

ధరాపుత్త్రుఁడు = నరకాసురుఁడు. ధరాపౌత్త్రుఁడు = భగదత్తుఁడు. నరకాసురవైరి కృష్ణుఁడు. భగదత్తుఁ జంపినవాఁ డర్జునుఁడు.

పరీక్షయందుఁ గడతేఱుటే తనకుఁ బరమార్థమనువిషయము మఱచి పరీక్షకుల కిట్టి విప్పుడుకథ లిచ్చువాఁడు కృతార్థుఁడు గాఁజాలఁడు. పరీక్షకున కిట్టిది బోధపడెనా విద్యార్థి దురహంకారము గలవాఁడని యెంచును. బోధపడక పోయెనా సున్నచుట్టను.

## 19 వ్యాససంగ్రహణము.

నీవు వ్రాసినవ్యాసము వ్యాకరణశుద్ధమై నిర్దుష్టమై స్పష్టమై సంగ్రహముగ నుండినచో నది బాగుగ లేదని యెవరనరుగాని యీగుణములుగలదయ్యు

హృదయము నాకర్షింపఁజాలక యుల్లాసకరముగాక బెండునమిలినట్లుగఁగాని కట్టెనమలినట్లుగఁగాని యుండి చదువువారికి రుచింపక పోవచ్చును. చిన్నయసూరిగారి నీతిచంద్రిక, రా॥ శ్రీ॥ రావుబహాదర్ కందుకూరి వీరేశలింగముపంతులవారి నీతిచంద్రిక, బ్ర॥ శ్రీ॥ మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులవారి నీతిచంద్రిక, రా॥ శ్రీ॥ చిలుకమర్తి లక్ష్మీనృసింహముగారి నవలలు, బ్ర॥ శ్రీ॥ వేదము వేంకటరాయశాస్త్రులవారి కథాసరిత్సాగరము, బ్ర॥ శ్రీ॥ గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారి గ్రంథములు, బ్ర॥ శ్రీ॥ శతఘంటము వేంకటరంగశాస్త్రులవారి వచనభారతము, వచనభాగవతము, నూతనముగా వెలువడు నానానవలలు, వీనిలో నొక్కొక దానియందు నొకటి రెండు పుటలవంతుఁ జదువఁగానే తరువాత నింకను జదువుద మను బుద్ధి కొన్ని కలిగించును. ఇఁకఁ జాలు ననుసభిప్రాయము కొన్ని గలిగించును. కాలము వ్యర్థపఱిచితిమను దుఃఖము కొన్ని కలిగించును. శైలికొలఁది రుచి కావున నీశైలి చదువువారిమనస్సుల నాకర్షించుశక్తి గలదై యుండవలయును. వ్యాకరణము నేర్చిన దోషములు లేక వ్రాయవచ్చును. కర్త కర్మ క్రియలను, విశేషణములను, దగుతావుల నుంచిన నర్థము స్పష్టమగు. వ్యర్థవిషయములు వ్యర్థపదములు దొలఁగించిన సంగ్రహమగు. ఏమి చేసిననో వాక్యములు పాఠకహృదయముల నాకర్షింపఁ జాలు నవి నీ వడుగవచ్చును. నీ కట్టిశక్తి కలుగవలయునని కోరికయున్నయెడల బమ్మెరపోతన, తిక్కన, నన్నయభట్టు, శ్రీనాథుఁడు, అల్లసానిపెద్దన లోనగు మహాకవులు రచియించిన గ్రంథములు చదివి, యందు వారు పోయినచమత్కారమార్గములం బోవుటదప్ప వేఱుమార్గము లేదు. ఈనిమిత్తమై నీవు పూర్వమహాకవుల గ్రంథములఁ జదువవలయును. అట్లు చదువునప్పు డేవాక్యమైన నీమనస్సున కింపుగ నున్న నా వాక్యమునం దేమి విశేషము? కర్త కర్మ క్రియలఁ గవి వాని స్థానములనుండి మార్చెనా? ఏమాట నెక్కడనుంచె? నని యారసి తెలిసికొని దానిని జ్ఞప్తియం దుంచుకొనవలయును.

సీ. ప్రాణంబుతోఁగూడ రక్కసచన్నుల
 పాలు ద్రావినప్రౌఢ బాలుఁ డితఁడె — తిక్కన

యనుదానికిని

సీ. పీఁడఁటే రక్కసి విగతజీవగఁ జన్నుఁ
 బాలు ద్రావిన మేటిబాలకుండు — పోతన

అనుదానికిని గలభేదముఁ జూడుఁడు.

'ఇతఁడె' యనుపదమును దిక్కన కడపట వేయఁగాఁ బోతన 'పీఁడఁటే' యని వాక్యాది నుంచెను.

"వచ్చినవాఁడు ఫల్గునుఁ" డనుటకు "ఫల్గునుఁడు వచ్చినవాఁ" డనుటకు మిక్కిలి భేదముగలదు.

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రాదో మద
క్రూరారాతిఖిలమ్మృగావళిం దునుమరో ఘోరాటవుల్ లేవొ మా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయంజేసి యస్మత్సఖీమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా." సారశ్చం.

ఇం దుత్తరార్ధము తొలుతఁ జదివి పూర్వార్ధము తరువాతఁ జదివిన స్వారస్యము చెడుచున్నది.

మఱియు నిట్టియుపాయములు పెక్కులు గలవు.

ఒకరు వ్రాసినట్లు మఱియొకరు వ్రాయుట యనుకరణశక్తిని దెలుపును గాని నైజశక్తిని దెలుపదుగదా యని నీవడుగవచ్చును. ఏశిల్పమైనను బ్రకృతి ననుకరింపఁ బ్రయత్నించును. ఏదియైనను బ్రకృతిపదార్థమును సరిపోలు నట్లు చేయువాఁడే సమర్థుఁ డగుశిల్పి. వాస్తవము విచారించిన స్వభావము ననుసరించి వ్రాసినచే హృదయము నాకర్షించును. ప్రతిరూపములు వ్రాయు

నపుడు ప్రకృతిపదార్థమును బోలునట్లు వ్రాయుచే ప్రతి శిల్పకుని యుద్దేశము. అందఱట్లు వ్రాయుటకే ప్రయత్నింపవలయును. అభ్యాసకాలమునఁ బ్రకృతిపదార్థము లున్న వున్నట్లు వ్రాయ వలనుపడదు. ఏసమయంబుల సమర్థు లగువా రెట్లు వర్తించిరో యెఱుఁగుటకై యావిద్యయందు నిపుణులైన వారికృతులఁ బరిశోధింపవలయును. అది దోషము కానేరదు. స్వారస్యము గ్రహించుశక్తి యుండుట, మంచిగుణము ననుకరించు సామర్థ్యము కలుగుట గుణములే యగు. బహుగ్రంథపఠనము చేతను మఱొక్కనిశైలి యలవడునని నమ్ముటకు లేదు. సహజశక్తి యొక్కటున్నచోఁ బఠనశ్రవణాదులు దానిని మఱింత వృద్ధిచేయును. సహజశక్తి లేనప్పు డెంతపఠించియు నొక్కటే. పఠింపక యొక్కటే. రవంత నిప్పుండినఁ జిదుగులువైచి విసనకఱ్ఱతో విసరి పెద్దమంట చేయవచ్చును. నిప్పులేని పిడకల కట్టెలమీఁద నెంత విసరిన నేమి ఫలము? ముద్రితములైన యక్షరముల మేలుబంతిగా నిడికొని యెందఱు లేఖన మభ్యసించుట లేదు? ఒకని యక్షరములవలె మఱియొకని యక్షరము లున్నవా? మేలిబంతివలెఁ దక్కినబంతు లున్నవా? అటు లని మేలుబంతి చూడకయే వ్రాయవచ్చునా? బమ్మెరపోతనశైలికై ప్రయత్నించినవారు ప్రయత్నించువా రెందఱు లేరు? ఇప్పటికిఁ గనిష్ఠికాధిష్ఠితుఁ డతఁడొకఁడే కదా. లేఖకునిబుద్ధివలె వాని శైలియు నుండునని పాశ్చాత్యులు వ్రాసిన దెంతయు సత్యము.

మనస్సు నాకర్షించువిధముగా వ్యాసముఁ బ్రారంభింపవలయును ముగింపవలయును. ఆలస్యము హానికర మనువిషయమై వ్రాయుచో నాలస్యమమృతం విషమ్మను లోకోక్తితోఁ బ్రారంభింపవచ్చును. స్వభావము దురతిక్రమమనువిషయము వ్రాయునపుడు పుట్టువుతో వచ్చినవి పుడుకలతోఁ గాని పోదని ప్రారంభింపవచ్చును. మైత్రిగుఱించి వ్రాయునపుడు మైత్రి యనఁగా నేమి? మిత్రభావము. మిత్రుఁ డెట్టివాఁడు? అని ప్రారంభించి మైత్రి క్షీరనీరన్యాయముగ నుండవలయునుగాని జలతైల న్యాయముగ నుండ రాదని ముగింపవచ్చును.

## 20 అర్ధానుస్వారము, శకటరేఫము.

ఆంధ్రభాషయందునర్ధానుస్వారము శకటరేఫము బాలురను జిక్కులఁ ద్రోయుచున్నవి. విద్యార్థులు శోధనముచే నభ్యాసముచే సులభముగఁ దెలియనగును. అట్లు చేయుటకు నోపికలేని కొందఱు వానిని విడుచుట బాగని పెడయుక్తులు చెప్పుచుందురు. బుద్ధిమంతులు భాషాభిమానులగువారు వానికిఁ జెవిచెవి నిత్తురు. ఇప్పుడు మన కన్నివిషయముల నాచార్యులుగ నుండు నాంగ్లేయులఁ జూచియైన మనమేల భాషాభిమానము వహింపఁ గూడదు? వారి భాషయందు సాధారణముగాఁ బ్రతిశబ్దము నోట నొకవిధముగా నుచ్చరింపఁ బడును. వ్రాయునపుడు మఱియొకవిధముగా వ్రాయఁబడును. వ్రాఁతయందుఁ గనఁబడి యుచ్చారణమందు లోపింపఁబడు నక్షరములను వారు "సైలెంట్ లెటర్స్" అందురు. చేత "పుయుటి" వ్రాసి 'పుట్' అందురు, 'బియుటి' వ్రాసి 'బట్' అందురు. సి ఒ ఆర్ పి యస్ వ్రాసి కోర్ అందురు. ఆ యక్షరములతో కడపట 'యి' నొకటి చేర్చి కార్ప్స్ అందురు, సి ఎ యమ్ పి, కాంప్ అఁట. అదేమాటపై ముందు ఏబిడియి వ్రాసిన 'ఏడ్ డికాంగ్' అఁట. నోటిమాటకుఁ జేతివ్రాఁతకు సంబంధములేని ఆంగ్లపదముల నన్నిటిని విధిలేక యోపికగ నేర్చుకొనువారికి నోటనెంతో చేతనంతే వ్రాయుచు నెట్టికష్టములేని యాంధ్రములో నేవో కొన్నిమాటలనుండు నర్ధానుస్వారమును శకటరేఫమును జ్ఞప్తియందుంచుకొనుట యేమి కష్టము? నేర్చుకొనవలయు నని మనస్సున్నచో నేకష్టము లేదు. సోమరికి, నిష్టములేని వానికి, నన్నియు నసాధ్యములే. అట్టివారు ఊరకుండక కొందఱు లఘువులను రేఫముల భేదము మేము పాటింపమని వ్రాసి తమయజ్ఞానమును గప్పిపెట్టుచుఁ బైపెచ్చు భాషయందవి యుండనేల యని వాదించుచున్నారు. వాని నిరాకరణముగ రాను లేదు. నిష్ప్రయోజనముగ నుండను లేదు. భాషాశోధనము చేయువారి కవి యెంతో తోడ్పడుచున్నవి. కావున విద్య గ్రహింపకయే

గ్రంథకర్తలు కావలయునని యాశగలవారు భాషను జెఱుపు ప్రయత్నముఁ జేయకుండఁ బ్రార్థితులు. మనయజ్ఞానము మనతోనే సమయుట మేలు. అటులైన భవిష్యద్భాషావిమర్శకులకు మనము సాహాయ్యము చేసినవారమై వారి వందనముల కర్హుల మగుదుము. అర్థానుస్వారవిషయమై బ్ర॥ శ్రీ॥ తా. మి. ఎమ్. ఏ, శేషగిరి శాస్త్రులవారి యర్థానుస్వార తత్త్వము పీఠికయందుఁగల కొంతవిషయము ప్రకృతోపయోగిగ నుండుటచే నుదాహరింపఁబడుచున్నది.

"ఆంధ్రభాషాభిజ్ఞులయిన పండితులు తమ ప్రాచీన సమయాచారాదులఁ బరిపాలించునట్లు తమభాషలను ఇతరుల యథేష్టవ్యవహారములచేఁ జెడక యుండునట్లు రక్షించుకొనుచున్నారు. భాషను జక్కఁగాఁజదువని సామాన్య జనులు వ్యాకరణాది ప్రమాణములు తెలియక విధివ్యవస్థలులేక శబ్దములఁ బ్రయోగించి భాషను బలుమాఱు మార్చుచున్నారు. ఇంగ్లండ నేయే దేశములందు విద్య విశేషముగ వ్యాపించియుండునో ఆయా దేశంబులందుఁ బ్రాచీన గ్రంథములను జదివి వాని ప్రామాణ్యముతో శుద్ధముగా మాటలాడుటచేతను గ్రంథముల వ్రాయుటచేతను భాష మార్పులులేక విశేషస్థైర్యమును బొంది యుండును. తెనుఁగునందు రమారమి వేయి సంవత్సరములకు మునుపు నన్నయ భట్టారకులు వ్రాసిన వ్యాకరణమును ఆంధ్రభారతమును తెనుఁగునకు మూల ప్రమాణములుగా నుంచుకొని వెనుకనుండిన గ్రంథకర్తలు తమతమ గ్రంథములను రచియించినారు. ఇట్లు వేర్వేఱుకాలములలో వేర్వేఱు పండితులచే రచియింపఁబడిన గ్రంథములెల్ల నీ యాంధ్రభాషను నొక పెద్దదుర్గమువలె సంరక్షకములుగానున్నవి. ఈభాషలోని పదవాక్యముల స్వరూపము చక్కఁగాఁ బరిశోధించినవారిచే రచియింపఁబడిన వ్యాకరణములుభాషను జదువఁగోరెడు వారికి నత్యంతోపకారకములయి యున్నవి, భాషాసంబంధమయిన ఒక్కొక విషయము తెలియునట్లు కావలసినవిధులు సూత్రరూపమునఁ జెప్పఁ బడియున్నవి. అట్టి గ్రంథములను జదివినవారును తమ జ్ఞానమును దమ యుపాధ్యాయులకే సమర్పించి విధివ్యవస్థలులేకుండ భాషను వ్యవహరించుచుం

డఁగా, చదువనివారివిషయమై మనమేమి చెప్పవచ్చును? ఇప్పటికి వ్రాయఁబడిన వ్యాకరణములందు అనేకవిషయములను గుఱించి విధాయకములయిన సూత్రములున్నవిగాని అర్ధానుస్వారమును గుఱించి విశేషసూత్రములు లేవు. అర్ధానుస్వారము ఎక్కడ నుండవలయును? ఎక్కడ నుండఁగూడదు? దానికి సామాన్యముగఁ గారణమేమి? అను నిట్టివిషయములను వైయాకరణులు తెలిసికొనకయు గ్రంథములందు వివరింపకయు విడిచిపెట్టిరి. కాఁబట్టి భాషను జదివెడువారలకు అర్ధానుస్వార స్వరూపము దెలిసికొని దాని నుపయోగించుట బహుకష్టమయి యున్నది. విధులచే సాధింపఁబడిన శబ్దస్వరూపములను జక్కఁగాఁ దెలిసికొనక జనులు అపశబ్దములను బ్రయోగించుచుండఁగా శాస్త్రనియమము లేని యీయర్ధానుస్వారముయొక్క స్వరూపము నెట్లు తెలిసికొనఁగలరు? పండితులకే తెలియనివిషయమును పామరులెట్లు తెలిసికొందురు? ప్రాచీనకాలమునందు సహేతుకమయియున్న యర్ధానుస్వారముయొక్కస్వరూపమును దెలిసికొనని పండితులు హేతువులేని చోట్లను అర్ధానుస్వారము నుపయోగించియు, అదియుండవలసినచోట్ల దానిని విడిచిపెట్టియు, లేఖకులఁదలను బెట్టుకొన్నారు. పూర్వమే తెలియకపోయిన ఈ విషయము ఈ తప్పులవల్ల మఱియు దురవగాహమయ్యె. ఇదిగాక అర్ధానుస్వారము లిపియందు చిహ్నరూపముగా నున్నప్పటికిని ఆచిహ్నమునకు లక్ష్యమయిన ధ్వన్యాత్మక వర్ణ మొకటియు లేదు. ఉచ్చారణమునందు లేనివర్ణమునకు చిహ్న మెట్లు వచ్చును? పూర్వము ఈ చిహ్నమునకు లక్ష్యమయిన ధ్వని యొకటియుండి యుండవలయును. అది యెట్టిధ్వనియని విచారించినయెడల నది నకారసదృశమయి యుండుటచేత నది యనునాసికోచ్చారణము గలిగి యుండినదని తెలియవచ్చుచున్నది. ఈ యనునాసికధ్వని ప్రత్యేకమయిన యొకవర్ణము గా నుండినయెడల నది యనుస్వారమయి యుండవలెను. అనుస్వారమును వేఱు అక్షరముగాఁ దెనుఁగువారలు ఉచ్చరించుటచేత, అర్ధానుస్వారమునకు అనుస్వారోచ్చారణము లేదని నిశ్చయింపవలయును. కాఁబట్టి అర్ధానుస్వా

పునకుఁ బూర్వమయిన సర్వమునకు అనునాసికోచ్చారణమె స్వరూపమని తోఁచుఁగవచ్చును. ఈస్వరూపము ఋగ్వేద యజుర్వేదములందలి ఉచ్చారణ విశేషముచేతఁ దెలిసికొనవచ్చును. ఎట్లనఁగా మహాన్ + ఇంద్రః అనునది ఋగ్వేదమునందు నకారలోపమును దానికి పూర్వమయిన ఆకారమునకు అనునాసికత్వమును రాఁగా మహాఁ ఇంద్రః అని వచ్చును. ఈ పదములను ఉచ్చరించునపుడు హాకారమునకు వెనుకవచ్చెడి ఆకారమునుభాగము,నాగము మొదలయిన శబ్దములలో నాకారమును ఉచ్చరించునట్లు ఉచ్చరింపక నాసా స్వారములో నుచ్చరింతురు. ఇట్లే మహారాష్ట్రభాషయందు తేఁ 'అది,' తీఁ 'అవి,' 'హేఁ'ఇది, హీఁ 'ఇవి' మొదలయిన పదములయచ్చులును ఉచ్చరింపఁ బడును. అట్లే తెనుఁగునందు అర్ధానుస్వారము ఉచ్చరింపవలెను. ఈయు చ్చారణము బ్రాహ్మణులలోను చదివినవారలలోను లేకపోయినను ఇతరజను లలోఁ బలుమాఱు వినవచ్చును. కొందఱు వాఁడు కోఁతకు పోయినాఁడు అనియు, మఱికొందఱు వాండు కోంతకుపోయినాండు అనియు చెప్పుదురు. ఈ యుచ్చారణములు పూర్వమునుండి వచ్చినవో వెనుకవచ్చినవో నిశ్చయ ముగాఁ జెప్పుట కష్టము.

ఇట్లు సాధారణముగా గ్రాంథికభాషలోను వ్యావహారికభాషలోను ఉచ్చరింపఁబడని అర్ధానుస్వారమును లిపియందు ఎందుకు వ్రాయవలయు? సంస్కృతపదములు ప్రాకృతమునకు వికృతము లయిరాఁగా లుప్తమయినవర్ణ ములను వ్రాయరు. అది యెట్లనఁగా.

| | |
|---|---|
| ఆణత్తం | ఆజ్ఞప్తమ్ |
| జుత్తం | యుక్తమ్ |
| జావ | యావత్ |
| తావ | తావత్ |
| తా | తత్ |

హిందూదేశములోనుండు అన్నిభాషలయందు నిదియె సంప్రదాయము. కాఁబట్టి తెనుఁగునందుమాత్రము ఉచ్చరింపని ధ్వనిని ఎందుకు వ్రాయవలయునని యనేకులు వాదింతురు. దీనికిఁ బండితులు క్రిందవచ్చునట్లు సమాధానముఁ జెప్పవచ్చును. ఈకారణమువందు మనలనేలెడు ఆంగిలేయులభాషను వ్రాయునప్పుడు ధ్వన్యాత్మకభాషయందు లేని అక్షరములను వ్రాయునప్పుడు ఉపయోగింతురు. ఈ యశాస్త్రీయసంప్రదాయముచేత భాష మిక్కిలి చెడిపోయినదానిచే దానిని నేర్చువారికి అతి ప్రయాసమగుచున్నది. ఇట్లయినప్పటికిని చక్కఁగాఁ జదివిన గుణగ్రాహులైన పండితులును పైఁజెప్పిన మూఢసంప్రదాయమును విడువకయున్నారు.

విల్ (*will*) అనుధాతువునుండి వచ్చిన భూతార్థక పూర్ణక్రియయయిన వుడ్ (*would*) పదములో ఉచ్చరింపఁబడని లకారము ఉండుటచేత, క్యాన్ (*can*) అను ధాతువునుండివచ్చిన భూతార్థక పూర్ణక్రియయయిన (*could*) కుడ్ పదమునందును లకారమును వ్రాయుచున్నారు. ఈ తప్పు మొట్టమొదట బుద్ధిలేని యెవఁడో ఒకఁడు చేయఁగా దానినిజూచి యితరులును ముందరఁబోవు మేఁకను అనుసరించి పోవునట్టి వెనుకనుండు గుంపుమేఁకలవలె ననుసరించి పోవుచున్నారు. సకల విషయములను జక్కఁగాఁ దెలిసి విమర్శించి గుణగ్రహణముఁ జేయునట్టి ఆంగ్లేయశాస్త్రజ్ఞులును ఈ యంధపరంపరా ప్రాప్తమయిన సంప్రదాయమును విడువకయుండఁగా తెనుఁగువారలుమాత్రము ప్రాచీన కాలమునుండి తమభాషలోనుండెడు అర్థానుస్వారమును ఎందుకు విడువవలయును?

అదియునుంగాక అర్థానుస్వారము శబ్దములయొక్క వ్యుత్పత్తులను భిన్న స్వరూపములయిన పదములయొక్క పరస్పర సంబంధములనుం దెలిసికొనుటకును అనుకూలమయియున్నది. ఈ విషయమునుగురించి కావలసిన యుదాహరణములను ఈగ్రంథమునందుఁ జూడవచ్చును.

ఇట్లు అర్ధానుస్వారము ఉచ్చరింపఁబడక పోయినను పలుచెఱంగుల నుపయుక్తమగుటచే దానిని విడుచుట యుక్తముగాదు. ఇది కచ్చేరి కార్ఖానా మొదలయినవానియందు ఉపయోగించుట అనావశ్యకమయినను పండితుల కును విద్యార్థులకును అత్యావశ్యకమగుచున్నది."

భాషాభిజ్ఞులయభిప్రాయ మిట్లుండ నేమియు నెఱుంగనివారి సాహసప్రవ్రాఁత లాదరణీయములు గావు. ఎ ఒ ౘ ౙ అ ఇవి సంస్కృతమున లేక తెనుఁగునందుమాత్రమే యుండునక్షరము లని వ్యాకరణ ములుచెప్పుచున్నవి. ఆంధ్రు లనాదిగ నీదేశమున నుండువారు. వారియుచ్చా రణంబుల నీయక్షరము లుండినవి. తరువాత నాభాషకు సంస్కృతసం పర్కము గలిగెను. ఇట్లు లగునపు డించుక భేదముతో ౘ ౙ వంటి యుచ్చారణముఁగల యక్షరములు సంస్కృతములోను నుండుటచే నార్యులు స్వసంస్కృతమునకు భిన్నముగనుండు భాషయందలి చ - జ-లకు మీఁద ....నిట్టిగుర్తొకటి యిడిరి. దానివలనఁ దెనుఁగుపద మని సూచించుటకై చేందు రుఁడు, జేన్నమని వ్రాసెదము. చంద్రుఁడు, జంతు వని తత్సమపదముల వ్రాసెదము. (ఈ న్యాయము ననుసరించియే మఱియొక సర్వమున కిట్టిగు ర్తిడుట బాగని నే నభిప్రాయపడవలసివచ్చె. వేఁపాకు, తాటాకు, ఈ రెండు శబ్దముల నుచ్చరించునపుడే 'పా' శుద్ధమైన "ఆ" కారముగను టా యనునది కొంచెము భిన్నముగను నుచ్చరించుచున్నాము. ఈ రెంటిభేదము చే చ, జే జ, లకుఁగల భేదమువంటిదే. తాటాకులో 'టా' నెట్లుచ్చరించు చున్నామో యట్లులే యాంగ్లభాషలోని కొన్ని యక్షరముల నుచ్చరించు చున్నాము. ఉ. Plan, Map: కొంద ఱీపదముల ప్ల్యాను ప్లేను మ్యేపు మ్యాపు మేపు అని వ్రాయుచున్నారు. ఇటు వ్రాయుటసరికాదు. ప్లాను, మాపు అని వ్రాయుట సరియని తోఁచుచున్నది.) సంధి. ౭. సూ. సూ చిక చూడుము.

ఈ మాత్రపు భేదమే అ-ర-లకుఁ గలదు గాని లేక పోలేదు. ఈ భేదము లన్నియు ద్విత్వములుగ వ్రాయునపుడు స్పష్టపడుచున్నవి, కచ్చె, ఉచ్చము, గజ్జ, పుజ్జాతి, అరులు, అఱ్ఱులు. రేఫము రెండు విధముల లిపి గలది గావున దానికిఁ బ్రత్యేక చిహ్న ముంచలేదు. తొలుత నుచ్చారణంబున భేదమే లేకున్న ద్విత్వమున మాత్రము భేదము తోఁపఁగలదా. అపుడు, అప్పుడు, ఇందు భేద మేమియుఁ గన్పట్టదు. కావున 'ఱ' కారము భిన్నాక్షరమేకాని యితరముకాదు. ఈ ఱకారములు గలశబ్దము లాంధ్రభాషయందంతయు ౨౦౦ ని మీఱవు. ఇందు ద్విత్వములు శకటరేఫములే కాన జ్ఞప్తియందుంచుకొనుట కష్టముకాదు. మిగిలినశబ్దములలో వాడుకలో ౧౦౦శబ్దములు మించియుండవు. తక్కినవి గ్రంథస్థములు. ఈ శబ్దముల జ్ఞప్తియందుంచుకొనలేనివార లేమిపనిఁ జేయఁగలరు? పూర్వపు మహాకవు లీవర్ణభేదమును జక్కఁగఁ బాటించిరి. జనులకు భాషయందలి పాటవము తగ్గుకొలఁది వర్ణసంకర మారంభమయ్యెను. సార్థబిందువులు నగుపదంబులు విద్యార్థులు జ్ఞప్తియందుంచుకొన ననువుపడునట్లుగ మొదటిభాగంబున వ్రాయఁబడినవి. సబిందువులు నిర్బిందువు లైనచోఁ గలయర్థభేదంబును రేఫభేదంబున నగు నర్థభేదంబును మనస్సున నిడికొనుట యావశ్యకము. 'వాఁడు తెచ్చిన పూలు వాడుచున్నవి. పాఁడి లేనిగొడ్డు పాడి లేనినరుఁడు నొకటి.' తేనెనుండి పడినవాఁడు తేఱికొనినాఁడు. ఇట్లు నర్థము భేదించుచుండును. "నాకు చాల సంకటమైనది" యని యొక విద్యార్థిని వ్రాసెను. ఇది యందఱు వ్రాయుచునేయున్నారు. ఱకారమును లోపించి పదమును సరళముచేయుట యెంత యపార్థమునకుఁ గారణమగునో చూడుఁడు.

## 21. పరీక్షాసమయచర్య.

మీఁదఁ జెప్పఁబడినప్రకారము వ్యాసలేఖన మభ్యసించుటకు విద్యార్థుల కధమపక్షమున రెండుసంవత్సరముల కాలముగలదు. శ్రద్ధగలిగి యభ్య

పంతయు నొకసారి హెచ్చరికతోఁ జదువవలయును.[1] తప్పిపోయిన గుడులు, కొమ్ములు, లోనగునవి గలయక్షరముల సవరింపవలయును. కర్త యేకవచనమున నుండఁ గ్రియ బహువచనమున నుండుట. ఉ. వాఁడు వచ్చిరి, మహ దర్థకవిశేష్యమునకు నమహదర్థక విశేషణము. ఉ. కొన్ని మనుజులు, లోనగు దోషములున్న సవరింపవలయును. పంక్తిమొదట నిండుసున్నగాని యరసున్నగాని విసర్గముగాని పొల్లుగాని యున్నయెడల దానిని గొట్టి పైబంతికడపట వ్రాయుము. వాఁడున్ను, వీనినిన్ని, చేసినను, వాటిని, వాండ్లు, లోనగునవి లేకుండఁ జూడవలయును. సవరింపవలసిన భాగముపై రెండుగీఁతలు గీచి దానికిఁ బైవైపునసరియైనది వ్రాయవలయునుగాని యక్షరముమీఁదనే మరల వ్రాయరాదు. కత్తితో గోకరాదు. రెండువ్యాసములకు నడుమ నంగుళమునకుఁ దక్కువలేక యెడము విడువవలయు. "త్రాగుటకుముందును వ్రాసిన తరువాతను జూడవలయు" ననుసామెత మఱవరాదు. వ్యాసము నంతయు స్థలవిభాగములేక దారమునఁ బూసలు గ్రుచ్చినట్టు లక్షరముమీఁద నక్షరము మాటమీఁద మాట పంక్తిమీఁదఁ బంక్తి కూరిపోసినట్లు వ్రాయరాదు. అక్షరములు విడివిడిగా మాటమాటకు నడుమ నెడ ముండునట్లు వ్రాయవలయును. ఒక్కొక్క-భాగముగాని యంతర్భాగముగాని ముగిసినతోడనె యాపంక్తి నంతటితో ముగించి తరువాతి విషయమును బ్రత్యేకపంక్తిగఁ బ్రారంభింపవలయును. పెక్కువిషయము లొకటిగఁ గలిపి వ్రాయరాదు. అంతర్భాగములకు శీర్షికలు వ్రాయమి దోషముగాదు. ఇట్లు కలములు కలములుగ విభజించి వ్రాసినయెడల వ్రాయువారికిఁ గలవరపాటు లేకుండుటయేకాక చూచుటకురమ్య

[1] After completing the writing out, the writer should carefully revise his essay, paying particular attention to Grammar, carelessness in which so frequently loses a candidate many of the marks which his composition, otherwise good, would have gained. Rowe.

షుగను జదువువారికి విషయము విశదముగను నుండును. ఒకవిషయమైన కొన్ని వాక్యముల సముదాయమును 'కలము' (para) అని యందురు.

## లౌకిక న్యాయములు.

**అంధగజన్యాయము.** నలుగురు గ్రుడ్డివారొక యేనుఁగును జూచిరి. అందొకఁడు తొండమును దాఁకి యేనుఁగు రోఁకలివలె నున్నదనెను. చెవులు తాఁకినవాఁడు చేఁటవలెనున్నదనెను. ఇట్లే తక్కినవారు. అజ్ఞానులు తమకుఁదెలియని విషయముఁగూర్చి యభిప్రాయ మిచ్చునపుడీది యుపయోగింపవలయును.

**అంధపరంపరాన్యాయము.** గ్రుడ్డివాఁడు గ్రుడ్డివారికి మార్గము చూపినట్లు లజ్ఞాని యొకఁడు చెప్పిన చొప్పునఁ దక్కిన మతిహీనులు ప్రవర్తించినపు డిది యుపయోగింపఁబడును.

**అరుంధతీ ప్రదర్శనన్యాయము.** సులభముగ గ్రహింపరాని సూక్ష్మవస్తువును దెలుపవలసిన యెడల ముందు దానివంటి స్థూలవస్తువును దెలిపి యది తెలిసినపిమ్మట సూక్ష్మవస్తువును దెలుపుట. అరుంధతిని జూపువారు తొలుదొల్త నరుంధతిని జూపక ముందుగ దానియంచుననుండు పెద్ద నక్షత్రములను జూపి తరువాత నరుంధతిని జూపుదురు. నిర్గుణబ్రహ్మమును నుపాసించుటకు ముందు సగుణబ్రహ్మమును ప్రతిమార్చారూపముల నర్చించి యందు మనస్సు స్థిరపడినపిమ్మట నవ్యక్తబ్రహ్మమును నుపాసింపవలయును.

**కాకతాళీయన్యాయము.** కాకి యొకతాటిచెట్టు క్రిందికిరాఁగా నా సమయమునకు సరిగ తాటిపండుపడి దానితల పగిలెను. ఆకస్మికముగ జరగినవానియం దిది చెప్పఁబడును.

కాకాక్షిన్యాయము. ఒకపదము ముందుశబ్దముతోను వెనుకశబ్దముతోను నన్వయించునపు డిది చెప్పఁబడును. కాకికి గ్రుడ్డొక్కటేయైనను రెండు ప్రక్కలఁ జూడఁగలదు. దేహళీదీపన్యాయ మిట్టిదే.

కూపమండూకన్యాయము. తన స్థలమువిడిచి కదలకుండుటచే లోకజ్ఞానము లేనివాని విషయమునఁ జెప్పఁబడును.

ఖల్వాటతాళఫలన్యాయము బట్టతలవాఁ డొకఁ డెండకుఁ దాళఁజాలక తాటిచెట్టు క్రిందికిఁ బోఁగాఁ దాటిపండు వాని తలపైఁ బడెను. తల పగిలెను. నిర్భాగ్యుఁ డెక్కడికిఁ బోయిన నాపదలు నక్కడకే పోవును.

గోమయపాయసీయన్యాయము. పేఁడ పాలు రెండును గోవుదేహమునుండి వచ్చుటచే సమానము అని చేయువాదము. తెలివిమాలిన వాఁడు చేయు దుర్వాదమం దిది చెప్పఁబడును.

ఘట్టకుటీప్రభాతన్యాయము. సుంకము తప్పించుకొనుటకై యొకఁడు చీఁకటిలోనే లేచి పయనించెనుగాని దారి తప్పిపోవుటచే సుదయమునకు సుంకరియుండు గుడిసెయొద్దకే వచ్చెను. తప్పించుకొన నుద్దేశించిన కార్యము చేయవలసివచ్చినయెడల నిది చెప్పఁబడును.

ఘుణాక్షరన్యాయము వెదుళ్లను పురుగు తొలిచినప్పు డాగీఁతలను పరిశీలించిన నం దక్షరము లేర్పడును. ఉద్దేశములేక జరగిన దానియం దిది చెప్పఁబడును.

ఛత్రిన్యాయము. ఎక్కువమంది గొడుగులు పట్టుకొని పోవుచుండ నం దొకఁ డూరకపోయినను గొడుగులు పట్టుకొనిపోవువా రనియే నిరూపింపఁబడుదురు. సమష్టిమీఁదఁ జెప్పిన విషయ మేకదేశమున నన్వయింపక పోవచ్చును.

తమోదీపన్యాయము. దీపమును బట్టికొని చీఁకటిని వెదకినట్లు.

దండాపూపికాన్యాయము. అప్పచ్చులు కూర్చిపెట్టిన కట్టెను నెలుకలు తినినపుడు అప్పచ్చులను నెలుక తినెననియే యెంచవలెను.

నష్టాశ్వదగ్ధరథన్యాయము. ఇరువురు రెండు తేర్లపైఁ బ్రయాణముచేయుచో రాత్రి యొక గ్రామమందు దిగిరి. ఆ యూరు కాలిపోయెను. అం దొకని రథము మఱియొకని గుఱ్ఱములు కాలిపోయెను. మిగిలిన గుఱ్ఱములను మిగిలిన రథమునకుఁ గట్టి యా తేరియందే యిరువురు గూర్చుండి పయనించిరి. కష్టసమయమునఁ బరస్పరసాహాయ్యము.

పంకప్రక్షాళనన్యాయము. అడుసు త్రొక్కనేల కాళ్లు కడుగనేల. Prevention is better than cure. పుణ్యము చేయవలయునని ధనాశ వహించుటకంటె, నూరకుండుట క్షేమము.

పంగ్వంధన్యాయము. ఒకఁడు గ్రుడ్డివాఁడు - మఱియొకఁడు కుంటివాఁడు. వీ రొకరి కొకరు సహాయపడి దూరదేశప్రయాణము చేసిరి. గ్రుడ్డివాఁడు కుంటివానిని మోచికొనిపోవుచుండెను. కుంటివాఁడు మార్గము చెప్పుచుండెను. పరస్పరలాభమునకై పరస్పరసాహాయ్యము.

పిష్టపేషణన్యాయము. చర్విత చర్వణము. చెప్పినదే మరలమరల వ్యర్థముగఁ జెప్పుట.

బీజాంకురన్యాయము. చెట్టుముందా విత్తనముముందా - చెట్టులేక విత్తనములేదు. విత్తనములేక చెట్టుపుట్టదు.

మండూకప్లుతిన్యాయము. కప్పదాఁటు. ఇది వ్యాకరణమునఁ బ్రసిద్ధము. ఒకయక్షరము దానిప్రక్కనుండు నక్షరమును దాఁటిపోయినను సూత్రమును దాఁటి మఱియొకసూత్రమునకుఁ బోయినను జెప్పఁబడును.

విషకృమిన్యాయము. వసనాభినిఁ బుట్టినపురుగు వసనాభినిదిని బ్రతికి నట్టు.

విషవృక్షన్యాయము. తాను బెట్టినచెట్టు విషవృక్షమైనను దాను ఖండింపరాదు.

శీర్షేసర్పో దేశాంతరే వైద్యన్యాయము నెత్తిమీఁదఁబాము-దేశాంతరమున వైద్యుఁడు. దాహమైనపుడు బావిత్రవ్వుట.

శ్వశ్రూనిర్గచ్ఛోక్తిన్యాయము. అత్త యింటలేనివేళ నొకకోడలు బిచ్చగానిని బిచ్చములేదని చెప్పిపంపెను. వాఁడు పోవునప్పు డత్త యెదురై వాఁడు చెప్పినమాటవిని కోడలిపైఁ గోపించి యతనిని నింటికిఁ దోడ్కొనిపోయి యీ పెత్తనము నీ కెవ్వరిచ్చిరని కోడలిని దండించి పిమ్మట నోరియిఁకఁబొమ్ము అని యతనితోఁ జెప్పెను.

సింహావలోకనన్యాయము సింహము ముందువెనుకఁ జూచునట్లొక వాక్యమునఁ బదము ముందుపదముతోను వెనుకటిపదముతోను సంబంధించి యుండును.

స్థాలీపులాకన్యాయము కుండెఁడు కూడుడికినదా లేదా యని యొక మెతుకును బట్టిచూచి తెలిసికొనుట. అట్టులే యొక పుస్తకమున నొకటి రెండుపుటలు చదివి గ్రంథవిధము తెలిసికొనుట.

చంద్ర చంద్రికాన్యాయము. చంద్రునకు వెన్నెలకువలె నెడఁబాయని సంబంధము. అవినాభావ సంబంధము.

అజాతపుత్రనామోత్కీర్తనన్యాయము పుట్టనిబిడ్డలకుఁ బేర్లు పెట్టుట

Counting your chickens before they are hatched.

అంధదర్పణన్యాయము. గ్రుడ్డివాని కద్దము చూపినట్టు.

అరణ్యరోదనన్యాయము అడవిలో నేడ్చినట్టు. వ్యర్థప్రార్థనము.

క్షీరనీరన్యాయము. పాలునీళ్లు కలిసినట్లు భేదమెఱుంగనిస్నేహము.

ఖలేకపోతన్యాయము. ఒకకార్యమగుటకునొకకారణమే చాలియుండఁగా కళ్లమున వ్రాలుపావురములవలెఁ బెక్కుకారణము లొక్కసారి గలుగుట.

తిలతండులన్యాయము. నూవులు బియ్యము కలిసినట్లు భేదమెఱుఁగఁబడెడి స్నేహము.

నహినిందాన్యాయము. ప్రతివ్రతము సంకల్పించినపు డదియే వ్రతములలో నెల్లనుత్తమమని చెప్పఁబడుచుండును. ఇట్లు చెప్పుటచేఁదక్కినవి నిందింపఁబడినవని తలఁపరాదు. ప్రస్తుతమగు దాని స్తుతించినంతమాత్రమున దానితో సమానములగు నితరములను దూషించినట్లు తలఁపరాదు.

స్వామిభృత్యన్యాయము. Master & servant.

సికతాకూపన్యాయము ఇసుకలో బావిత్రవ్వినట్లు.

సికతాతైలన్యాయము. అసాధ్యకార్యము చేయ యత్నించుట. ఇసుకలోఁ జమురుదీసినట్లు.

భూలింగశకునిన్యాయము. తా నొకరికిఁ గూడదనిచెప్పిన కార్యము తానే చేయుట.

భ్రమరకీటన్యాయము. ఒక పదార్థమును దీవ్రముగ భావించి దాని యట్లె తాను నగుట.

మార్జాలకిశోరన్యాయము. స్వప్రయత్నము లేకున్నను భగవంతుఁడే రక్షించుననుట.

మర్కటకిశోరన్యాయము. స్వప్రయత్నములేక భగవంతుఁడు కాపాడఁడనుట.

శుష్కస్తనీకంచుకన్యాయము. దేహపుష్టిగల యొకతె తన రవికను శుష్కస్తని యగుదాసి కీయఁగా నది తనకు వదులైనందువఁ దన్నుఁ దిట్టఁ బోనక ఏమిది పాడురవిక యింతవదులు అన్నదఁట.

# ద్వితీయభాగము.

వ్యాసము చక్కఁగ వ్రాయ నుద్దేశముగలవారు మనస్సున నుంచుకొనఁ దగినవిషయము, నభ్యాసవిధము మొదలగునవి పూర్వభాగంబున వివరింపఁ బడినవి. వ్యాకరణ శాస్త్రప్రకార మేసంధులు రూపములు సాధువులో యవి 1-2 సంపుటములఁ బరిచ్ఛేదంబులఁ జెప్పఁబడెను. కేవలవ్యాకరణసూత్రములు నేర్చుటవలనఁ బ్రయోజనము లేదు. ఏయేసందర్భమున నేయేసూత్రము నాధారముగఁ గొని వ్రాయవలయునో యది తెలియుట ముఖ్యము. సూత్రములు తెలిసియుండియుఁ గొందఱు తప్పులు వ్రాయుచున్నారు. వాని నుపయోగించు మార్గము తెలియమియే యట్లు వ్రాయుటకుఁ గారణము. విద్యార్థులు సాధారణముగ వ్రాయుదోషము లిందుఁ బొందుపఱుపఁబడినవి. సాధ్యమైనస్థలములసవరించి దానికిఁ గారణము దెలుపఁబడెను. దీనిని జక్కఁగఁ బలుమఱు చదివి మనస్సున నిలుపుకొనువిద్యార్థి యిట్టితప్పులు మఱల వ్రాయఁడు.

## సంస్కృత శబ్దములు.

## వర్ణదోషములు

### 1. వట్రసుడికిమాఱుగ క్రావడివ్రాయుట.

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| క్రుషి | కృషి |
| త్రిప్తి | తృప్తి |
| ద్రుఢము, ధృడము | దృఢము |
| ద్రుష్టాంతరము | దృష్టాంతము. |
| నైరుతి | నైరృతి-నైర్‌ఋతి |
| నైరుతిదిశ | నైరృతిదిశ-నైర్‌ఋతిదిశ |
| పిత్రు | పితృ |
| బ్రుహస్పతి | బృహస్పతి |

| | |
|---|---|
| భ్రాత్రుత్వము | భ్రాతృత్వము |
| భ్రుత్యుఁడు | భృత్యుఁడు |
| మాత్రు | మాతృ |
| రుజువర్తనము | ఋజువర్తనము |
| సంస్త్రుతము, సంస్కౄతము | సంస్కృతము |
| స్మౄతి | స్మృతి |

ఆకారమును దెలుపు తలకట్టుండు నక్షరములమీఁదఁ దప్పఁ దక్కిన యక్షరములమీఁద వట్రసుడి యుండదు. కృమి–క్రిమియని రెండును గలవు.

అమృతము – అవభృథము – అదృష్టము – ఆవృతము – ఉత్కృష్టము – ఋజువు – ఋత్విజుఁడు – ఋణము – ఋషి – ఋక్షము – కృష్ణుఁడు – కృతాంతుఁడు – కృప – కృపణుఁడు – కృపాణము – కృతము – కృత్యము – గృహము – గృధ్రము – ఘృతము – తృణము – తృతీయము – తృప్తి – దృష్టి – దృక్కు – దృష్టాంతము – ప్రకృతి – పృథ్వి – పృథివి – భృంగము – భృత్యుఁడు – మృగతృష్ణ – మృగము – మృదంగము – మృత్యువు – మృష – మృదువు – మృతి – వికృతము – వృషభము – వృత్తాంతము – వృద్ధుఁడు – వృశ్చికము – వృత్తి – వృక్షము – శృంగారము – సృగాలము – హృదయము ఈ శబ్దములందు వట్రసుడులేకాని క్రావడులు లేవు.

క్రుధ – క్రూరుఁడు – భ్రుకుటి – భ్రూకుటి – భ్రూ. వీనియందుఁ గ్రావడులేకాని వట్రసుడులు లేవు.

## 2. థకారధకారములు విపర్యాసము నొందుట.

| | |
|---|---|
| అర్థము. | అర్ధము. |

అర్ధము అనఁగా సగము. అర్థమనఁగా ద్రవ్యము ప్రయోజనము – వస్తువు లోనైనవి.

| | |
|---|---|
| అతిధి | అతిథి |
| అపధ్యము | అపథ్యము |
| కధ | కథ |

| | |
|---|---|
| తధ్యము | తథ్యము |
| నిశీధము, నిశీధిని | నిశీథము, నిశీథిని |
| ప్రమధులు | ప్రమథులు |
| పధ్యము | పథ్యము |
| యధార్థము | యథార్థము |
| యధావిధి | యథావిథి |
| వీధి | వీథి |
| ధీర్ఘము | దీర్ఘము |
| ప్రాధఃకాలము | ప్రాతఃకాలము |
| మంథరపర్వతము | మందరపర్వతము |
| విధ్యార్థులు | విద్యార్థులు |
| విధ్య | విద్య |
| శబ్ధము | శబ్దము |

ఇట్టులే అస్థి–అథర్వము–అనర్థకము–అర్థము–అర్థి–అవస్థ–అశ్వత్థము–అశ్వత్థామ–అన్యథా–ఆతిథ్యము–ఆస్థ–ఆస్థానము–ఇదమిత్థము–కథ–కంథ–కపిత్థ–కృతార్థుఁడు–గ్రంథము–గ్రంథి–గ్రథితము–తిథి–తీర్థము–నాథుఁడు–పథము–పృథ్వి–ప్రత్యుత్థానము – పథికుఁడు–పరిపంథి–పృతక్కు–పృథుక ములు–ప్రథ–ప్రథమము–ప్రస్థము–ప్రార్థనము–పాంథుఁడు–పాథేయము–పాథోనిధి–పాథోధి–ప్రత్యర్థి–పార్థివుఁడు–భాగీరథి–భగీరథుఁడు–మనోరథము–మిథ్య–మథనము–మిథిల–మైథిలి–మన్మథుఁడు–మథితము–మంథర–మథుర–(కృష్ణుఁ డుండినయూరు.) మంథరుఁడు. (పర్వతము–మందరము) మిథునము–యథాయథలు–యథాతథము–యథార్థము–యథేప్సితము–యూథము–రథము–రథాంగము–రథ్యము–వృథా–వ్యథ–వరూథము–వరూథిని–వితథము–వ్యవస్థ–వ్యర్థము–వైయర్థ్యము–వానప్రస్థుఁడు· శపథము–శిథువు–సారథి–స్వాస్థ్యము–స్వస్థుఁడు–సనాథుఁడు–స్థానము–స్థితి–స్వస్థత–సార్థవాహుఁడు–సమర్థుఁడు–

సామర్థ్యము-స్థలము-సర్వథా-స్థాలీపాకము-స్థపిరుఁడు-స్థావరము-స్థపతి-స్థిరము-స్థూలము-క్షువథువు. ఈ యన్నిటియం దుండునవి తవర్గద్వితీయాక్షరములు. అనుకరణంబునం దప్ప పదాదిని కేవల థకారముండదు. ఉ. థూత్కారము = థూయనుట. సంయుక్తమున నుండును. ఇట్టివి మఱి కొన్ని కలవుగాని వానిని బాలురెఱుఁగ నక్కఱయుండదు. కావున మీఁద వివరించినవి గాక తక్కిన వానియందు ధకారములే యుండునని ప్రాయికముగా వారు విశ్వసింపవచ్చును.

అధమము-అధరము-అధిపుఁడు-అధికారము-అధిపతి-అధీనము-అవధాని-అంధుఁడు-అబద్ధము-అబ్ధి-అర్ధరాత్రము-అవధి-అవధారణ-అభిధానము-ఆధారము-ఆయుధము-ఇంధనము-కబంధము-కంధర-గంధము-గంధర్వుఁడు-గంధమాదనము-నాధుఁడు-నామధేయము-ప్రసిద్ధి-బహుధా-బాధ-బోధము-భాగధేయము-మధురము-మాధవు-యోజనగంధ. (సీత-సత్యవతి) వృద్ధి-శతధా-సిద్ధి-సంధి-సుధ-క్షుధ-ఇత్యాది శబ్దములందన్నిట ధకారమే యుండును.

### ౩ ధర్మధర్మివాచకములు విపర్యాసము నొందుట. &c.

| | |
|---|---|
| అనుగుణ్యము | ఆనుగుణ్యము |
| అసహ్యత | అసహ్యము |
| ఆరోగ్యత | ఆరోగ్యము |
| ఆధిక్యత | ఆధిక్యము |
| దరిద్రము | దారిద్ర్యము |
| దార్ఢ్యత్వము | దార్ఢ్యము |
| ధైర్యత్వము | ధైర్యము |
| నాగరీకము | నాగరకత |
| ప్రాముఖ్యుఁడు | ప్రముఖుఁడు |
| ప్రాముఖ్యత | ప్రాముఖ్యము |

| | |
|---|---|
| ప్రావీణ్యులు | ప్రవీణులు |
| మహాత్మ్యుఁడు | మహాత్ముఁడు |
| సామర్థులు | సమర్థులు |
| సహాయ్యము | సాహాయ్యము |
| సార్థక్యము (విశేషణమున.) | సార్థకము |

## 4. సంయుక్తాక్షరముల విడఁదీయుట.

| | |
|---|---|
| అయికమత్యము | ఐకమత్యము |
| పరియవసానము | పర్యవసానము |
| వయిద్యుఁడు | వైద్యుఁడు |
| స్వాతంత్రియము | స్వాతంత్ర్యము |

## 5. సంస్కృతశబ్దముల ప్రయోగము.

| | |
|---|---|
| అకస్మాత్తుగ | ఆకస్మికముగ |
| క్రమేణ | క్రమముగ |
| కంఠతా (కంఠతః) | కంఠస్థముగ |
| ద్వారా | వలన, మార్గమున |
| దైవవశాత్తున | దైవవశమున |
| బహుంశా (బహుంశః) | అనేకవిధముల |
| ముఖతా (ముఖతః) | ముఖమునుండి (వలన) |
| రీత్యా | రీతిచేత |
| వివాహాత్పూర్వము | వివాహపూర్వము |
| మధ్యాహ్నాత్పరము | మధ్యాహ్నపరము |
| స్వతహా (స్వతః) | స్వయముగ |
| హఠాత్ | తటాలున |

**6. శకార సకారములు విపర్యాసముగ వ్రాయుట.**

| | |
|---|---|
| అభ్యశించు | అభ్యసించు |
| నివసించు | నివశించు |
| ప్రకాసించు | ప్రకాశించు |
| ప్రవేసించు | ప్రవేశించు |
| రస్మి | రశ్మి |
| విసేషంబులు | విశేషంబులు |
| శీత | సీత |
| సిరస్సు | శిరస్సు |
| సీతలప్రదేశము | శీతలప్రదేశము |
| సుద్ధోధనుఁడు | శుద్ధోదనుఁడు |
| సిష్యులు | శిష్యులు |
| సాసనము | శాసనము |
| సూరులు (వీరులనుటకు) | శూరులు |

పండితులను నర్థమున సూరులనియే వ్రాయవలయును.
వసిష్ఠ–వశిష్ఠయని రెండురూపములు గలవు.
సకలము=సమస్తము–శకలము=తునుక.

**7. ఉకారమునకు మాఱు 'వు' కారము వ్రాయుట.**

| | |
|---|---|
| వుష్ణము | ఉష్ణము |
| వుద్దేశము | ఉద్దేశము |
| వుపయోగము | ఉపయోగము |
| వుత్తరము | ఉత్తరము |
| వుత్సాహము | ఉత్సాహము |

సంస్కృతమునఁగాని తెనుఁగునఁగాని 'వు'కారాదిశబ్దములు
(చూడు. సంజ్ఞాపరిచ్ఛేదము. ౪౯.)

| | |
|---|---|
| గౌరవార్హనీయము | గౌరవార్హము |
| ఘూఢ | గాఢ |
| చతుర్ధి | చతుర్థి |
| చారిత్రీకులు | చరిత్రకారులు |
| చికిఛ్ఛ | చికిత్స |
| చెంద్రుఁడు | చంద్రుఁడు |
| ఛిన్నాభిన్నములు | ఛిన్నభిన్నములు |
| తండోపతండములు | దండోపదండములు |
| తత్ధ్యము | తథ్యము |
| దారిధ్యము – దారుధ్యము | దార్ఢ్యము |
| దాసీలు | దాసులు – దాసికలు |
| దుఖము | దుఃఖము |
| దుస్థరము | దుస్తరము |
| దేముఁడు | దేవుఁడు |
| ద్రేహము | దేహము |
| దేశస్తులు | దేశస్థులు |
| నాయకినాయకులు | నాయికానాయకులు |
| నిర్భంధము | నిర్బంధము |
| నిముషము | నిమిషము (నిముసము తెనుఁగుపదము) |
| నిశ్శంకగా | నిశ్శంకముగా |
| నిర్దయ | నిర్దయము |
| నిరాశ | నైరాశ్యము |
| నిశ్చింత | నిశ్చింతము |
| నిశ్చేష్ట | నిశ్చేష్టము |
| నిష్టూరములు | నిష్ఠురములు |

| | |
|---|---|
| పరవాన్నము | పరమాన్నము |
| పున్యము | పుణ్యము |
| పాటశాల | పాఠశాల |
| పాశ్చాత్తులు | పాశ్చాత్యులు |
| పుస్తుకము | పుస్తకము |
| పత్రీయులు | పత్రికాపాఠకులు |
| ప్రాచీనకీర్త్యులు | ప్రాచీనవీరులు |
| పిత్తాపురము | పీఠికాపురము, పీఠాపురము |
| పట్టణము | పట్టనము |
| పూర్వీకులు | పూర్వులు |
| పాపిష్ఠి | పాపిష్ఠుఁడు |
| పరమేష్టి | పరమేష్ఠి |
| పతాన్తాపము | పశ్చాత్తాపము |
| ప్రస్థుతము | ప్రస్తుతము |
| పరిచయులు | పరిచితులు |
| ప్రయాణీకులు | ప్రయాణము చేయువారు పథికులు బాటసారులు |
| పుష్యమి | పుష్యము |
| బాలులు | బాలురు |
| బ్రంహా | బ్రహ్మ |
| బాష | భాష |
| బధ్ర | భద్ర |
| భొజ్యపధార్థము | భోజ్యపదార్థము |
| భవబూతి | భవభూతి |
| భాల్యము | బాల్యము |

| | |
|---|---|
| భ్రష్మపుత్ర | బ్రహ్మపుత్ర |
| మధ్యాన్నము | మధ్యాహ్నము |
| మహత్యము | మహత్త్వము |
| దుస్సాధ్యము | దుస్సాధము |
| దుర్నిరీక్ష్యము | దుర్నిరీక్షము |
| యోచన | యోజన |
| ఉచ్ఛదళ | ఉచ్చదళ |
| మనిషి | మనుష్యుఁడు |
| మాధవకరము – మాధవకవళము | మాధుకరము |
| యవ్వనము | యౌవనము |
| యథేచ్ఛ | యథేచ్ఛము |
| రమణీయకరము | రమణీయము |
| రాజతంత్రికులు | రాజతంత్రజ్ఞులు |
| రాజమండ్రివరము | రాజమహేంద్రవరము |
| రుగ్మత | రుగ్ణత |
| వాదన | వాదము |
| వ్రయము | వ్యయము |
| వరహావతారము | వరాహావతారము |
| వ్యాకర్ణము | వ్యాకరణము |
| వైయాకరణి | వైయాకరుణుఁడు |
| శ్రేష్టము | శ్రేష్ఠము |
| శనేశ్వరుఁడు | శనైశ్చరుఁడు |
| శిశ్రూష | శుశ్రూష |
| శాశ్వితము | శాశ్వతము |
| శ్లాగించు | శ్లాఘించు |

| | |
|---|---|
| షష్ఠివిభక్తి | షష్ఠీవిభక్తి |
| షష్ఠి సంవత్సరములు (60) | షష్టి సంవత్సరములు |
| సింహ్మము | సింహాము |
| సౌహార్ద్రము | సౌహార్దము |
| స్త్రీలు - శ్రీలు | స్త్రీలు |
| సౌందర్యకర్త్తె | సుందరి - సౌందర్యవతి |
| సాయంత్రము | సాయంతనము |
| సంభందము | సంబంధము |
| స్థంభము | స్తంభము |
| స్వతంత్రము | స్వాతంత్ర్యము |
| సైన్యికులు | సైనికులు |
| విరాట్రాజు | విరాటరాజు |
| సముఖమునకు | సమ్ముఖమునకు |
| సాందీపుఁడు | సాందీపని |
| హిరణ్యకశ్యపుఁడు | హిరణ్యకశిపుఁడు |

## ఆంధ్రశబ్దములు.

### 1. అచ్చునకు మారుగ హల్లు వ్రాయుట.

| | |
|---|---|
| వకటి | ఒకటి |
| వడలు | ఒడలు - (దేహము). |
| వద్దో | ఒద్ద |
| వేటవాలు | ఏటవాలు |
| వగరు, ఒగురు | ఒగరు |
| వుప్పు | ఉప్పు } చూ. సంజ్ఞ. సూ. ౪౯. |
| వూరు | ఊరు } చూ. సంజ్ఞ. సూ. ౪౯. |
| వడ్డాణము | ఒడ్డాణము |

2. హల్లునకు మాఱుగ నచ్చు వ్రాయుట.

| | |
|---|---|
| ఒచ్చిన | వచ్చిన |
| ఒంతెన | వంతెన |

3. ద్రుత ప్రకృతికములు కళలుగ వ్రాయుట.

| | |
|---|---|
| చాలా | చాల (౯) |
| కూడా | కూడ (౯) |
| నిండా | నిండ (న్) |
| ఇంకా | ఇంక (న్) |
| చాలని (చాలు౯ + అని) | చాలునని |

4. కళలు ద్రుతప్రకృతికములుగ వ్రాయుట.

| | |
|---|---|
| లేకనే | లేకయే |

లేక వ్యతిరేకక్త్వార్థకము కళ.

| | |
|---|---|
| పైనిఁజెప్పిన | పైనిచెప్పిన, పైఁజెప్పిన |
| ఇతఁడేనా | ఇతఁడా |

ఇతఁడే, ఏవార్థకమైనను ప్రశ్నార్థకమైనను గళయే.

| | |
|---|---|
| ఏలనన | ఏలన |

ఏల ప్రశ్నార్థకము. కళ.

| | |
|---|---|
| అటులనే | అటులే |

అటులు, కళయైన యవ్యయము.

5. క్త్వార్థకేకార సంధి.

| | |
|---|---|
| వచ్చుండఁగా | వచ్చియుండఁగా |

క్త్వార్థకంబైన 'ఇ'కారమునకు సంధిలేదు. సంధిలేనిచో యడాగమం బగు. వచ్చి + ఉండఁగా = వచ్చి + య్ + ఉండఁగా = వచ్చియుండఁగా క్త్వార్థకంబైన ఇకారమున కంతయు నిదియే విధి. (చూ. సంధి సూ. ౯.)

## 6. సముచ్చయమైన న్ను, న్ని

| | |
|---|---|
| రాముఁడున్ను లక్ష్మణుఁడున్ను | రాముఁడును లక్ష్మణుఁడును |
| వానినిన్ని వీనినిన్ని | వానిని వీనిని |
| ఎల్లప్పుడున్ను | ఎల్లప్పుడును |

సముచ్చయార్థకంబున 'న్ను-న్ని' తెలుఁగున లేవు.

## 7. మువర్ణకలోపము.

| | |
|---|---|
| క్షయ | క్షయము |
| మధ్య | మధ్యము |
| క్రమ | క్రమము |
| ప్రాస | ప్రాసము |
| కర్మ | కర్మము |
| జన్మ | జన్మము |

## 8. మువర్ణకమునకు ం వ్రాయుట.

| | |
|---|---|
| క్షేమం | క్షేమము |

## 9. 'వు' వర్ణకమునకు మాఱు 'వ' వర్ణము వ్రాయుట.

| | |
|---|---|
| వస్తువ | వస్తువు |
| జంతువ | జంతువు |
| సెలవ | సెలవు |

## 10. అసాధు బహువచన రూపంబులు.

| | |
|---|---|
| వాండ్లు, వాళ్లు | వారు, వారలు, వాండ్రు |
| కోర్కెలు | కోర్కులు |
| వాటిని | వానిని |
| ఇడుములు | ఇడుములు |

| | |
|---|---|
| వీటిని | వీనిని |
| సెలయేండ్లు | సెలయేఱులు — సెలయేర్లు |
| కండ్లు | కన్నులు |
| పన్నులు | పండ్లు |
| రేపగళ్లు | రేపగలు |
| గాలివానములు | గాలివానలు |
| బాలులు - బాలురులు | బాలురు |
| పేళ్లు (నామములు) | పేర్లు |

## 11. విభక్తిదోషములు.

| | |
|---|---|
| దినమునకి | దినమునకు |

ఉత్తరసర్కారు విద్యార్థులయం దిట్టిదోషములు మెండుగఁ గానంబడి యెడి.

| | |
|---|---|
| వినాయకును పూజ | వినాయకునిపూజ |
| వాఁడి గ్రంథములు | వాని గ్రంథములు |
| ఎక్కడ నుంచి | ఎక్కడనుండి |
| కాళిదాసు యందు | కాళిదాసు నందు |
| కొందఱికి | కొందఱకు |
| అందఱిని | అందఱను |

## 12. ను గాగమ లోపము.

| | |
|---|---|
| చెఱువొడ్డున | చెఱువునొడ్డున |

షష్ఠీ సమాసంబున ఉకార, ఋకారంబులకు అచ్చుపరం బగునపుడు 'ను' గాగమంబగు. ఉ. చెఱువు + యొక్క + ఒడ్డు = చెఱువు + ఒడ్డు = చెఱువు + ను + ఒడ్డు = చెఱువునొడ్డు మా. సంధి. సూ. ౪౯.

### 13. ప్రథమ 'ఁడు' మాఱు 'ను' వ్రాయుట.

| | |
|---|---|
| అతను | అతఁడు |
| ఇతను | ఇతఁడు |

### 14. భూతార్థక క్రియకుమాఱు వర్తమానార్థక క్రియ.

| | |
|---|---|
| ఇప్పుడె వచ్చుచుంటిని | ఇప్పుడె వచ్చుచున్నాను |

ఈ దోషముత్తరసర్కారు విద్యార్థులందేకాక యచటి గొప్పకవులు తప్పఁదక్కినవారు వ్రాయు గ్రంథములయందును విశేషముగఁ గానఁబడి యెడి.

### 15. ద్రావిడ శబ్దములు.

| | |
|---|---|
| వాండు | వాఁడు |
| పూడ్చినాఁడు-పోయివిడిచినాఁడు | పోయినాఁడు |
| కంటిపియ్యి | పుసి |
| ఉంటాఁడు | ఉన్నాఁడు |
| ఉంటాను | ఉన్నాను |
| నత్తిపో | జరగుము, తొలఁగిపో |
| నాఁడుదా | వాఁడే |
| అవదు | కాదు |
| అవలేదు | కాలేదు |
| అవడు | కాఁడు |
| తూక్కొనిపోవు | ఎత్తుకొనిపోవు |
| నేను వినఁబడితిని | నేనువింటిని |

### 16. అర్ధానుస్వార మస్థానమున నుంచుట.

| | |
|---|---|
| భయఁపడు | భయపడు, భయంపడు భయముపడు |

పడ్వాదులు పరంబులగునప్పుడు మువర్ణకంబునకు లోప, పూర్ణబిందు

వ్వలు వైకల్పికంబుగనగు, ననుసూత్రముచే భయంపడు భయపడునని యగునే కాని భయఁపడునని కానేరదు. చూ. సూ. సంధి. ౬౭. ఇట్టులే

| | |
|---|---|
| అన్నిఁటికి | అన్నింటికి, అన్నిటికి |

'టి' లేక 'ంటి' యనునది యాాపవిభక్తికముగాని 'ఁటి' యనునదిగాదు.

| | |
|---|---|
| సరసపుఁ బలుకులు | సరసపుఁ బలుకులు |
| | సరసంపుఁ బలుకులు |

కర్మధారయంబుల మువర్ణంబునకు 'పు' లేక 'ంపు' వచ్చునుగాని 'ఁపు' రాదు; కావున సరసఁపుఁ బలుకులని వ్రాయరాదు. విద్యార్థు లొక్కవిషయము మనస్సున నుంచుకొనవలయును. వ్యాకరణసూత్రంబులందుఁ బూర్ణబిందువు విధించినచోట దానికి మాఱుగ నర్ధబిందువురాదు. పూర్ణబిందువు ఖండబిందు వగుటకు సూత్రములేదు. ఖండము పూర్ణమగును.

| | | |
|---|---|---|
| అనవుఁడు | అనవుడుౝ | |
| ఒనఁగూడు | ఒనగూడు | |
| లోఁబడు | లోపడు | సంజ్ఞ పుట ౨౭. |
| పైఁబడు | పైపడు | |
| తోఁబాటు | తోపాటు | సంధి పుట ౧౨౯. |

**17. ఒక యక్షరమునకు మాఱు మఱియొక యక్షరము.**

| | |
|---|---|
| సామితె | సామెత |
| తృంచి | త్రుంచి |
| చలివెందల | చలిపందిరి |
| పెట్ట | పెట్టె - పెట్టియ |
| బదలు | బదులు |
| క్రవ్వు | కొవ్వు |

| | |
|---|---|
| కూర్చొని, కూర్చుకొని, కూచుకొని, | కూర్చుండి(కూరుచు+ఉండు=కూరుచుండు) |
| కూర్చున్నుండిన | కూర్చుండియుండిన |
| గొళ్లవాఁడు | గొల్లవాఁడు |
| పరుగెట్టుకొని | పరుగెత్తుకొని |
| చేపిడివాఁడు | చేసెడివాఁడు |

తద్ధర్మార్థకమున ఎడి, ఎడు-లు వచ్చునుగాని ఇడి, ఇడు-లు రావు.

| | |
|---|---|
| వద్దు | వలదు |
| కద్దు | కలదు |
| తొట్టతొలుత | తొలుదొలుత |
| పగలి | పగిలి |
| అచ్చరవు | అచ్చెరువు |
| పాటకుఁడు | గాయకుఁడు |
| కొంచము | కొంచెము-కొంచియము |
| ఏనుఁగ | ఏనుఁగు |
| తోటివారు | తోడివారు |

(తోటివారు గ్రామసేవకులు, వీరు మాలమాదిగలుగా నుందురు.)

| | |
|---|---|
| చివురుకొమ్మ, (కొనకొమ్మయనుటకు) | చివరకొమ్మ |
| శెలవు | సెలవు |
| కంసాలి | కమసాలి |
| తగుమైన | తగనైన |
| స్వంతము | సొంతము |
| మాట్కి | మాడ్కి |
| తోట్కొని | తోడ్కొని |

| | |
|---|---|
| గృడ్డి | గ్రుడ్డి |
| అగుపడు | అగపడు |
| ఆట్లాటి | అటువంటి |
| పెళ్లి, పెంళ్లి | పెండ్లి, పెండిలి |
| నలుబది | నలువది |
| వచ్చాడు | వచ్చినాఁడు |
| మాసి | మానిసి |
| దేవుణి మందహాసము | దేవుని మందసము |
| ఆఁడువాఁడు | ఆఁడుది |
| ఎండకాచుచుండును | ఎండకాయుచుండును |
| తఠాలున | తటాలున |
| చేర్చుమని | చేర్పుమని |
| సంశయించక | సంశయింపక |

ప్రార్థనార్థక, వ్యతిరేకార్థక, ప్రేరణార్థకంబులను, అనుబంధము పరమైనపుడును, చకారము పకార మగును. చూ. క్రియాపరిచ్ఛేదము.

| | |
|---|---|
| చెముడు | చెవుడు |
| చెమిటి | చెవిటి |
| లెఖ్ఖ | లెక్క |
| బాగా | బాగుగ |
| వేట్క | వేడ్క |
| మహామ్మదనులు | మహామ్మదీయులు |
| రాయభారము | రాయబారము |

## 18. మహాద్విశేష్యమునకు నమహాద్విశేషణము.

| | |
|---|---|
| కొన్ని మనుజులు | కొందఱు మనుజులు |
| నాలుగు శూరులు | నలుగురు శూరులు |

| | |
|---|---|
| ఎనిమిది సభ్యులు | ఎనమండ్రు సభ్యులు |
| పది కవులు | పదుగురు కవులు |

## 19. గ్రామ్యములు.

| | |
|---|---|
| ఏలాటి | ఎటువంటి, ఎట్టి |
| చూస్తు, చూస్తూ | చూచుచు |
| పోతూ | పోవుచు |
| చేయడము | చేయుట |

వ్రాయడము, చూడడము, వాడడము, ఉంచడము ఇవి వ్రాయుట, చూచుట, వాడుట, ఉండుట యని యుండవలయు, భావార్థకంబగు 'ట' వచ్చునుగాని 'అడము' రాదు.

| | |
|---|---|
| చేసుట, తీసుట | చేయుట, తీయుట |
| చావుటకు | చచ్చుటకు |
| పమిట | పయిట, పైట |
| వణ్ణము | వర్ణము |
| నాన్నగారు | నాయనగారు |
| తతిమ్మా | తక్కిన |
| తెలుసును | తెలియును |
| తెలవక | తెలియక |

## 20. తెనుఁగు శబ్దములకు సంస్కృత సంధులు.

| | |
|---|---|
| అటువంటసహ్యాము | అటువంటి యసహ్యాము |
| తెప్పోత్సవము | తెప్పయుత్సవము |

## 21. సంస్కృతాంధ్రపదములు సమాసముగఁ గూర్చుట.

| | |
|---|---|
| అనేకమంది | అనేక జనులు, పెక్కుమంది |
| యావన్మంది | యావజ్జనము |
| అధిక గారాబము | మిక్కిలి గారాబము |
| బహుకొద్ది | మిక్కిలి కొంచెము |
| బహుగొప్ప | మిక్కిలిగొప్ప |
| దుర్నడత | చెడునడత |
| దురలవాటు | చెడ్డయలవాటు-దురభ్యాసము |
| నూతనయేర్పాటులు | క్రొత్తయేర్పాటులు |
| దేహాలంపట | దేహాయాసము-మేనిలంపట |

సమాసమున మొదటిపదము సంస్కృతముగను రెండవది తెనుఁగుగను నుండరాదు. లంపట, తెనుఁగుపదము. సం॥ మున లంపటుఁడు=ఆసక్తుఁడు.

## 22. తురకమాటలు.

| | |
|---|---|
| సుమారు | రమారమి-ఇంచుమించు |
| జాస్తి | హెచ్చు |
| హోదా | పదవి |
| రోజు | దినము |
| తరఫు | పక్షము |
| అసలు | మొదలు |
| వగైరా | మొదలయిన-లోనైన |
| నకలు | ప్రతి |
| సలహా | బోధము |
| ఖర్చు | వ్యయము-వెచ్చము |
| జమ | రాబడి-వచ్చుబడి-ఆయము |
| జవాబు | ప్రత్యుత్తరము |

## వాక్యములు.

1. వారు నివసించు గృహములు మంచుగడ్డచేతనే చేయఁబడుచున్నది. చేయఁబడుచున్నవని యుండవలయును.

2. లేళ్లు మృదువైన మంచుగడ్డపైఁ బరువెత్తును.
లేళ్లు నునుపైన మంచుగడ్డపైఁ బరువెత్తునని యుండవలయు. మృదువనఁగా మెత్తన, పట్టు ప్రత్తివలె నుండుట. నునుపు అద్దములు మంచుగడ్డ లున్నట్లు కఱకులేకయుండుట.

3. ఒకచోటనుండి మఱియొకచోటికిఁ బోవుటకు లేళ్లుపయోగింపఁబడుచున్నది. ఉపయోగింపఁబడుచున్నవి యని యుండవలయు.

4. మంచు మిక్కిలి మృదువైనదై యుండుఁగావున మంచుమీఁదఁ బోవుట నీటిలోఁ దేలునట్టి సులభముతోఁ బోవచ్చును.
మంచుగడ్డ మిక్కిలి నునుపై యుండుఁగావున దానిమీఁదఁ బోవుట నీటిపైఁ దేలుచుఁ బోవుటవలె సులభము.

5. గ్రీన్‌లాండు దేశపు పడమటిభాగము.
గ్రీన్‌లాండు దేశపుఁ బడమటిభాగము.

6. ఆకాశమునందు మిఱుమిట్లప్పుడప్పుడు ప్రకాశించెను. ఆకాశమునందు మెఱుపు లప్పుడప్పుడు మిఱుమిట్లు గొలుపుచుండెను.

7. ఆ యుద్దేశముతో నారాత్రియంతయు వారిద్దఱు చెట్లుచేమల నడుమనుండి క్రింద రాళ్లనుగాని పైన యెండనుగాని గణింపక నిద్రాహారములు లేకుండఁగఁ ద్వరితముగ నదీముఖముం గూర్చి పరుగులిడి పోయిరి. రాత్రులయం దెండ యుండదు గాన ‘పైన యెండనుగాని’ అను మాటల లోపింపవలయును. రాళ్లను=రాలను అనవలయు.

8. అమెరికాదేశమును బట్టి మనకుఁ గొంచెమైనను దెలియదు.
అమెరికాదేశముఁగూర్చి యని యుండవలయును.

9. ఆమె సౌందర్యశిఖామణి.- ఆమె సుందరీశిఖామణి అనవలయు.

10. ధరాసురాన్వయజాతుఁడు

ధరామరాన్వయజాతుఁ డనుట బాగు. ధరాసురాన్వయమనఁగా భూమియందలి రాక్షసులవంశ మనియు నర్థమగు.

11. ఈ పొరపాటు నేను బుద్ధిపూర్వకముగఁ జేసినది గాదు.

పొరపాటు బదులు 'నేరము' లేక 'దోష'మని యుండవలయు.

12. వినాయకారాధనము సాధారణముగా శ్రావణమాసమునందు జరగును.

వినాయకారాధనము భాద్రపదమాసమునందు జరుగు నని యుండవలయు.

13. వినాయకుఁడు నీలఘంటుని శ్రేష్టపుత్రుఁడు.

వినాయకుఁడు నీలకంఠుని జ్యేష్ఠపుత్రుఁడు.

14. న్యాయ తీర్పులు. న్యాయపుఁ దీర్పులు అనవలయు.

15. పిఠికి చెందినవాఁడు. పిఠికివాఁడు అనవలయు.

16. ఓడిపోయిన నేమవుదుమో. ఎట్టి క్రూరములకుఁ బాలవుదుమో.

ఎట్టి క్రూరశిక్షల కని యుండవలయు.

17. కొన్నివృక్షములు మ్రానుల కడ్డముగాఁ గఱ్ఱలు కట్టఁబడి కిటకిటాలవలెఁ గన్పట్టుచుండెను.

మ్రానులు తప్పు, మ్రాఁకు లని యుండవలయు. కిటకిటాలు, కటకటాలని యుండవలయు. అడ్డముగాఁ గఱ్ఱలు కట్టఁబడిన కొన్ని మ్రాఁకులు కటకటాలవలెఁ గన్పట్టుచుండెను.

18. టెంకాయచెట్టు మిక్కిలి నిడివియైన వృక్షము.

టెంకాయచెట్టు మిక్కిలి యెత్తైన వృక్ష మని యుండవలయు.

19. జనులకు మతాచార విషయములందు బాగుగ కఱపింపవలయును.

'కఱచు' దీనికి (1) నేర్చుకొను, (2) కొఱుకు, రెండర్థములు గలవు. నేర్చుకొనుట యనునర్థమునఁ బ్రేరణార్థకము 'కఱపు' అని యగును.

'కోలుకు' అనునర్థమున "కలపించు" అని ప్రేరణార్థకము. కావున జనులకు మతాచార విషయములు బాగుగఁ గలపవలయును అన వలయు.

20. తమ యిరుగు పొరుగురాజ్యములపై దండెత్తి వారిపైఁ బన్ను దాల్చి తమస్వాధీనము చేసికొనిరి.

వారు తమయిరుగు పొరుగు రాజ్యములపై దండెత్తి జయించి తమస్వాధీనము చేసికొని వానిపైఁ బన్నువైచిరి.
రాజ్యము లమహద్వాచకముగాన 'వారిపై' నని చెప్పరాదు.

21. నేనలతోఁ భలవంతములై కండ్ల కానందము కలిగించెను.
ఫలవంతము భలవంతమెన్నఁడును గానేరదు. ద్రుతప్రకృతికము మీఁది క-చ-ట-త-ప-లను నీ యైదక్షరములు మాత్రమే గ-జ-డ-ద-బ లను నైదక్షరములుగ మాఱునుగాని 'ప' కారము 'బ' కారముగ మాఱినదని 'ఫ' కారము 'భ' కారముగ మాఱదు. కండ్లకు-తప్పు. కన్నులకు-సరి.

22. లేడి స్ట్రాఙ్ హోప్ ప్రభువుగా నుండుటఁ బట్టి యామె యెంత బల శాలి యయినది యూహింపవచ్చును.

'లేడి స్ట్రాఙ్ హోప్ స్త్రీవాచకము, స్త్రీలింగము. ప్రభువు, బలశాలి శబ్దములు పుంలింగములు కావున ప్రభ్వీ బలశాలిని యని యుండ వలయును.

23. మఱునటిదిన మామెయింటికి మంత్రిపోయి మాటలాడునపుడు తన సాహసకృత్యములన్నియు నతనికి నామె విన్నవింపసాగెను.
ఇక్కడ 'ఆమె' యనఁగా లేడి స్ట్రాఙ్ హోప్ అను రాణి. కావున రాణి మంత్రికి విన్నవించెనని చెప్పరాదు. వినిపించెనని చెప్పందగు. గొప్పవారితోఁ గొలఁదివారు విన్నవింతురు, మనవి చేయుదురు.

24. దేహ పరిశ్రమమెత్తుకొను. (To take physical exercise)
దేహపరిశ్రమము గావించు.

25. వంటచేయుచున్న పాటకుఁడు. పాచకుఁడు అని యుండవలయును.

26. బూడిదలోఁబోసిన పన్నీరు. బూడిదలోఁ జేసిన హోమము అన వలయును.

27. నాగరికాగ్ర గణ్యమైన దేశము. నాగరికతా గ్రగణ్యమైన దేశము అనవలయు.

28. బుక్కులు, పేనాలు, ఇంకిబుడ్డి.
పుస్తకములు, కలములు, మసిబుడ్డి.

29. ఘనమైన అయ్యా! ఆర్యులారా (లేక) ఘనతగల యార్యులారా.

## సామెతలు.

1. అంగిట బెల్లము ఆత్మలో విషము. 2. అడవిఁ గాసిన వెన్నెల.
3. అంత్య నిష్ఠురముకన్న ఆది నిష్ఠురమే మేలు. 4. అగస్త్య భ్రాత.
5. అందని మ్రానిపండ్లకు అఱ్ఱులు చాఁచినట్లు. 6. అప్పు ముప్పు.
7. అంద ఱొకయెత్తు, అగస్త్యుఁ డొకయెత్తు, అతని కమండలు వొకయెత్తు.
8. అట్టైన వైద్యునికట్నము యిట్టైన వైతరణీగోదానము. 9. అఱవయేడ్పు
10. అడుగ నేరను, ఊడ్చిపెట్టు మన్నట్టు. 11. అభ్యాసము కూసువిద్య.
12. అడవియుసిరికకాయ సముద్రపుటుప్పు కలసినట్లు. 13. అరణ్యరోదనము
14. అర్థములేనివాఁడు వ్యర్థుఁడు. 15. అనువుకానిచోట నధికుల మనరాదు.
16. అన్నరసముకన్న నాదరణరసము మేలు.
17. అప్పులేనిగంజి దొప్పెఁడేచాలు.
18. అల్పున కైశ్వర్యము వచ్చిన అర్ధరాత్రవేళ గొడుగు తెమ్మన్నాఁడఁట.
19. అవివేకితో స్నేహముకన్న వివేకితో విరోధము మేలు.
20. అమ్మ తానుపెట్టదు అడుగుకొని తిననియ్యదు.
21. అరచేత వెన్నపెట్టుకొని నేతి కేడ్చినట్లు.
22. అయ్యవారిని చేయఁబోయినఁ గోఁతియయినట్లు.
23. ఆత్రగానికి బుద్ధిమట్టు. 24. ఆడఁబోయిన తీర్థ మెదురయినట్లు.
25. ఆరంభ శూరత్వము. 26. ఆపదమ్రొక్కులు సంపద మఱపులు.

27. ఆవులను మరలించినవాఁడర్జునుఁడు. 28. ఆశలేనికూటికి నాఁకలిలేదు.

29. ఆమడలు దూరమైన అంతఃకరణము దూరమగునా?

30. ఆఁకలి రుచి యెఱుఁగదు, నిద్ర సుఖమెఱుఁగదు, వలపు సిగ్గెఱుఁగదు.

31. ఆఁడదాని చేతి యర్థము, మగవాని చేతిబిడ్డ బ్రతుకదు.

32. ఆఁడుది బొంకిన గోడ పెట్టినట్లు, మగవాఁడు బొంకిన తడిక కట్టినట్లు.

33. ఆఁడపిల్లను కన్నవా రయిదు బిరుదులు తెగఁగోసికోవలయును.

34. ఆదాయములేని సెట్టి వఱదఁ బోఁడు.

35. ఆముదము చేఁదే గాని బిడ్డ బ్రతుకదు.

36. ఆలి నొల్లనివానికి యీలకూరలో నుప్పు చాలదు.

37. ఆలివంకవా రాత్మబంధువులు, తండ్రివంకవారు దాయాదులు.

38. ఆవులావులు క్రుమ్ములాడి లేఁగల కాళ్లు విఱిచినట్లు.

39. ఆహారమందు వ్యవహారమందు సిగ్గుపడఁగూడదు.

40. ఇచ్చునప్పుడు కాముని పండుగ, పుచ్చుకొనునప్పుడు దీపావళి పండుగ.

41. ఇనుమునుగూర్చి యగ్నికి సమ్మెట పెట్టు.

42. ఇల్లు అలుకగానె పెండ్లి అయినట్టా.

43. ఇరుబోటుల నిల్లు చెడె వాత నొప్పుల నొడలు చెడె.

44. ఇల్లు కట్టిచూడు పెండ్లి చేసిచూడు.

45. ఇంట గెల్చి రచ్చగెల్వవలయు.

46. ఈఁతకు మించిన లోఁతు బుద్ధికి మించిన పని లేదు.

47. ఉడుతకు నుడుతభక్తి. 48. ఉత్తర కుమారు ప్రజ్ఞలు.

49. ఉత్తరచూచి యెత్తరగంప. 50. ఊఱకుండుట పదివేలు.

51. ఎలుక పిడికెఁడు ధనము. 52. ఎద్దుపుండు కాకికి ముద్దా?

53. ఎద్దీనినదన్నఁ గొట్టానఁ గట్టివేయు మన్నట్లు.

54. కలిమిలేములు కావడికుండలు. 55. కలిమి కులాలమించఁడు.

56. కల్లమైఁడికి గలుకులు మెండు. 57. కోమటిసాక్ష్యము.

58. కాశికిఁబోయినను గర్మము మానదు. 59. కీడెంచి మేలెంచ వలయు.

60. కఱ్ఱలేనివానిని గొఱ్ఱె కఱచును.

61. కుట్టినఁ దేలు, కుట్టకుండినఁ గుమ్మరిపురుగు.

62. కుమ్మరి కొక యేఁడు గుదియ కొక పెట్టు.

63. కఱవుమనినఁ గప్పకుఁ గోపము, విడువుమనిన పామునకుఁ గోపము.

64. గాలికిఁ బోయిన పేలపిండి కృష్ణార్పణము.

65. గోరుచుట్టు మీఁది ఱోఁకటి పోటు.

66. చచ్చినవాని కన్నులు చేరెఁడు. 67. చిలుక ముక్కున దొండపండు.

68. చావుదప్పి కన్ను లొట్టపోయినట్లు. 69. చెఱుపకురా చెడెదవు.

70. చల్లకు వచ్చి ముంత దాఁచినట్లు. 71. చంకదుడ్డు శరణార్థి.

72. చూచిరమ్మనినఁ గాల్చివచ్చినట్లు. 73. చేసినపాపము చెప్పినఁ బోవును.

74. చెఱకా బెల్లము పెట్టు మనినఁ బెట్టునా? 75. తీఁగకుఁ గాయ బరువా.

76. తిట్టు కాదురా తొత్తు కొడుకా.

77. తానుపట్టిన కుందేటికి మూఁడే కాళ్లు.

78. తెడ్డునాకి యుపవాసము చెఱిపినట్లు.

79. తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము.

80. తాఁజెడ్డ క్రోఁతి వనమెల్లఁ జెఱిచినట్లు.

81. తేలుకుఁ బుట్టి చలి చీమ యగునా?

82. త్రాడు చాలకపోయిన నూయి పూడ్చుకొన్నట్లు.

83. తొండముదిరి యూసరవెల్లి అయినట్లు.

84. తిరుగ మరగిన కాలు తిట్ట మరగిననోరు ఊరకయుండదు.

85. దత్త పుత్రశోకము. 86. దాసరి తప్పు దండముతో సరి.

87. దూరపు కొండలు నునుపు, దగ్గరకుఁ బోయిన ఱాలు గుండ్లు.

88. దేవునికైన దెబ్బగురువు. 89. దొంగకుఁ దేలు కుట్టినట్లు.

90. దేవుఁడు వరమిచ్చినను పూజారి వర మియ్యఁడు.

91. నక్కయెక్కడ నాకలోకమెక్కడ. 92. నాగవల్లి నిష్ఠురము.

93. నల్లిని గూర్చి మంచానికిఁ బెట్టు. 94. నిండు కుండ తొణఁకదు.

95. నేతి బీరకాయ సామ్యము. 96. నేల విడిచి సాము చేసినట్లు.

97. నిర్భాగ్యునకు నిద్ర, దరిద్రునకు నాఁకలి.

98. నోరు మంచిదైన నూరు మంచిది. 99. పాము కాళ్లు పామున కెఱుక.

100. పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము. 101. పొంగిన పాలు ప్రొయ్యిపాలు.

102. పీనుఁగునకుఁ జేసిన శృంగారము, రాజులకుఁ జేసిన కొలువు.

103. పుట్టని బిడ్డకుఁ బేర్లు పెట్టినట్లు.

104. పులినిఁ జూచి నక్క వాఁతఁ బెట్టుకొన్నట్లు.

105. పిల్లను చంకఁబెట్టుకొని యూరంతయు వెదకినట్లు.

106. మంచివానికి మరణమే సాక్షి.

107. ముండమోయవచ్చు, నిందమోయరాదు.

108. ముందరవచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాఁడి.

109. రాజు మెచ్చినది రంభ తాను మునిఁగినది గంగ.

110. వ్రతము చెడినను సుఖము దక్కవలయు, కులము చెడినను కూడు పుట్టవలయు.

111. వెదకఁబోయిన తీఁగ కాళ్లఁ దగిలినట్లు.

112. శిష్యున కెక్కడ సందేహమో గురువున కక్కడనే సట్టు.

---

# అనుబంధము.

## మాతృభాష.

ప్రతిమనుజునకు స్వభాష కన్నతల్లివంటిది. ఇది సర్వప్రపంచాభిప్రాయమని యెల్లదేశంబుల నెల్లజాతులవారు తమతమభాషను మాతృభాష యని పిలుచుకొనుచుండుటచేతనే తెలియఁదగు. లోకమంతయు నేకరీతిఁ స్వభాషను స్వమాత యనుటయేల? తనపుత్రులను దల్లి సకలవిధముల నెట్లు రక్షించునో యట్లే భాషయు రక్షించును.

తే. "విద్య యొసఁగును వినయంబు వినయమునను
బడయుఁ బాత్రత పాత్రతవలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు" అని కలదుగదా. తల్లి కుమారుని దేహరక్షణమందేకాక శీలమతాచార ప్రవర్తనలందును గీర్తి ప్రతిష్ఠార్జనమందును గారణభూతురాలు. అట్లే స్వభాషయు. స్వభాషాపఠనంబుననే కదా మనుజుఁడు స్వశరీర రక్షణమునకు వలయు విషయంబులందేకాక యిహపరసాధకములైన శీలమతాచారప్రవర్తనంబులందును నేర్పరి యగుట. కావున స్వభాష కన్నతల్లివలెఁ బూజ్య యనియు స్వభాషాద్రోహి మాతృద్రోహి యనియు సర్వలోకాభిప్రాయమని యుపమానబలంబుచే స్ఫురించు. తక్కిన యందఱు స్త్రీలకంటె స్వమాత యెట్లు సులభురాలో యట్లే తక్కినభాషలకంటె స్వభాష సులభము. అధమపక్షమున ౧౮ సంవత్సరము లాంగ్లభాష పఠించి పట్టభద్రులైనవారును లేఖిన పఠనోచ్చారణంబుల సామర్థ్యం బలవర్చుకొననేరక నగుఁబాటు పాలగుట తటస్థించుచున్నదిగదా. ఆరయ నారయ వీరునేర్చిన విద్య సారమెట్టిదో? ఈవిధముగనే మనసంస్కృతాంధ్రభాషలు స్పష్టముగఁ బాశ్చాత్యు లుచ్చరించుటకును సమర్థులుగారు. ఇది సహజము. జననీతనూజాతులయం దాత్మసంబంధము గలదు. ఆత్మసంబంధమే దృఢమై వాస్తవ మైనసంబంధము. స్వభాషాసంబంధ మట్టిద. అట్టిసంబంధ మన్యంబులందుఁ గానరాదు. ఎట్టి పోఁతపాలైనను దల్లిపాలవలె శిశువునకు దేహమున నిమిడి యారోగ్యముఁ బుష్టి నొసఁగఁగలదా. అన్యకులస్త్రీస్తన్యము శిశువు దేహమన స్తత్త్వంబులను మార్చునట్లే యన్యమతవిద్యలు మార్చును. ఈకారణముచేత నేకదా

కం. వెలయాంధ్రుఁ డెంద లైనను
గులకాంతకు నీడుగారు కువలయమందుఁ
బలువిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా.

యనునది సార్థకప్రశస్తి వహించియున్నది. వైద్యాది విద్యలేమి శిల్పాది కళలేమి వంశపారంపర్యముగ లభించిన సమగ్రంబుగ గ్రహించుట సుకరమైనటు లాపద్ధర్మముగ లభించునవి సుకరము లగునా? 'యః పరః పర ఏవ స' యనునట్లు పరకీయవిద్య పరకీయవిద్యయే.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.
భగవద్గీత. 3-35.

ద్వి. తగ స్వనుష్ఠిత పరధర్మంబుకంటె
విగుణమైనను మేలు స్వీయధర్మంబు
మరణమైనను స్వధర్మంబున మేలు
పరధర్మ మెప్పుడు భయకారణంబు.
ద్విపదభగవద్గీత. ౩౩-౫౦.

అనువాక్యములు భాషావిషయమైకూడ యథార్థంబులని యోజనాపరు లకు. దోపకమానదు.

నీతిమతాచారారోగ్యవిషయంబులు ప్రతిజాతివారి కావశ్యకము లగుట వారివారి గ్రంథముల విధించియుందురుగదా? అవితత్తద్భాషాగ్రంథ ముల వలన నేర్చుకొనరాదా; యేభాషయైన నేమి? యను సందేహము కొం దఱకుఁ గలుగవచ్చును. మీఁది యుపమానము నే యింకను గ్రహింతము. కనుట, పెంచుట, బోధించుట లోనగునవి సర్వస్త్రీసామాన్యగుణములని యే స్త్రీనైన మనతల్లి యనవచ్చునా? అట్లనుకొన్నంత నే యా స్త్రీ కన్న తల్లివలె మనల రక్షించునా? తల్లి సవతితల్లి యను భేదము పుట్టుటకుఁ గారణ మేమి? కొన్నిదినములన్నము పెట్టినంతన పూఁటకూలమ్మ లమ్మ లగుదురా? సత్రములు స్వగృహము లగునా? బాటసారులు బంధువు లగుదురా? కానేరదు. ఈ సందేహము గలవారు నీతిమతాచారాహారారోగ్యవిషయంబులు లోకమునవారి కందఱ కేకరీతిగ నుండమియు దేశజాతిభేదములచే భిన్నంబులై యుండుటయు నాలోచింపవలయును. దేశజాతిభేదముచే మాత్రమే

గాక యాత్మ విద్యయందలి పక్వస్థితిని బట్టియు నవి భేదించియుండును. ఆర్యుల యాత్మ విద్యౌన్నత్యముసర్వదేశములవా రంగీకరించియున్నారు. పాశ్చాత్యులు మనవలె హింస మాంసభక్షణము మాని శాకభుక్కులగుటయే మేలని నేఁడు గ్రహించుచున్నవారు. అట్టివారి నీతిమతాచారాహారములు మనకెల్లు సరిపడఁగలవు? స్వాభిమానంబుచేనెల్లరుఁ దమనీతిమతభాషాదులే యుత్తమము లనుచుందురు. మనము మతహీనుల మని మనకుఁ దమమత ముపదేశింప సాహసించెడు క్రైస్తవమతబోధకు లిప్పుడు మనచే బోధగొను నవస్థదశకు వచ్చియున్నవారు గదా. జ్ఞానహీనతచే నన్యులదేవతల శూరుల నిందించువారు వారికి హితబోధకు లగుదురా? అట్టివారు స్వాభిమానంబున వచించుమాటలు తల్లిమాటలా, సవతితల్లిమాటలా? అట్టిమాటలఁ బాటించుట బుద్ధిపాటవము గలవారికిఁ బాడిగాదు.

ప్రతిమతిమంతుఁడు స్వదేశ–స్వమత–స్వభాషాభిమానంబుల వహించి యుండును.

ఉ. ఉండునె భూమియం దొకరుఁ డొప్పఁగ "నా కిది జన్మభూమి" "నేనుండెడిచోటు" "నాది" యనియుబ్బక ప్రాణముగల్గు పీనుఁగై.

"సుగుణాకర జన్మభూమిసుఖ మెట్టిదియో."

యనియుఁ గలవుగదా. ఈ యభిమానత్రయంబునఁ బ్రధానమె య్యది? తక్కినవానికి బీజభూత మగుటచే స్వభాషాభిమానమే ప్రధానము. స్వభాషాభిమానముగలవాఁడే భాషాగ్రంథములఁ జదివి తత్త్వమెఱింగినవాఁ డగుట స్వమతాభిమానియగు. స్వమత విషయంబులు స్వభాషాగ్రంథముల వలన సులభంబుగ బోధపడిన ట్లన్యభాషాంతరీకృత గ్రంథంబుల వలన బోధ పడఁ జాలవు. సముచిత పదజాలాభావంబునను, మూలగ్రంథతత్త్వార్థ మన్య జాతీయులకు దుర్జ్ఞేయమగుటను భాషాంతరీకృతంబులు విశ్వసనీయం బులుగావు గావున నిఁక నన్యమత గ్రంథములా మనల నుద్ధరించు? ఇది ప్రత్యక్షాను భవసిద్ధము. స్వభాషాగ్రంథము లేక పరభాషనే యాశ్రయించి

యుండువారి కిది తెలియఁ జాలదు. స్వభాషామత ప్రచారముల కనుకూల్య పడుటచే వానిచే స్వదేశాభి మానము గలుగును. ఇతర కారణములచే భ్రష్టు లగువారిమాట యటుండనిండు. స్వమతవైశిష్ట్యంబున మూఢు లగుటచేఁ గదా కొందఱ అన్యహీనమత ప్రవిష్టు లగుట. స్వభాషాభిమానము లేనిచో స్వమతాభిమానము లేదు. స్వదేశాభిమానములేదు. ఒకవేళనుండిన నవి శుద్ధ మైనవికావు. గ్రంథములు స్వయముగఁ జదువశక్తిలేనివాఁడు పరులు చెప్పిన దెల్ల విశ్వసింపవలసియుండును. స్వమతజ్ఞానములేని స్వదేశాభిమాన మనర్థ కరము. ఆర్యమతస్థుఁడై యార్యమతగ్రంథములఁబఠించి "అహింసాపరమో ధర్మ" యను పరమధర్మ మెఱింగినవాఁడు ఘాతుకుఁడై బోయవలె నంచించి స్త్రీబాలవృద్ధుల నిష్కారణంబుగ హింసింపనెంచునా? ఇట్టి యూతతాయి కిహమా? పరమా? బాంబులనఁబడు ప్రాణఘాతిను లెన్నఁడైన మనదేశంబు నఁ గనఁబడెనా? మఱి వినఁబడెనా? ఇది యంతయు స్వమతనీత్యాచారంబుల నీసడించుటచే నైనఫలముగదా? ఈ విషయమై యీ రాష్ట్రము వారిప్పటికి నంధులై వర్తించుట చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతిపిందెలు పుట్టునను సామెత దృఢీకరించుటకేకదా. కావున స్వభాషాభిమానియే నిక్కపుస్వదే శాభిమాని. స్వదేశభాషలకు విముఖులగు ప్రముఖులు మనరాష్ట్రమునందే కలరు. తక్కిన రాష్ట్రములయందలి గొప్పవారు పరస్పర సంభాషణ లేఖనా దుల స్వభాషయందే భాషింతురు. మరణించిన రమేశ చంద్రదత్తుగారి స్వభాషాపాండిత్యముగుఱించి ప్రశంసించుచు 1909 డిశంబర్ నెలలోఁ గూడిన దేశీయమహాసభయందు నగ్రాసనాధిపత్యము వహించిన శ్రీమన్మదన మోహన మాలవీయగారు రిట్లు వాకొనిరి.

"Literature was the best medium for improving the character of a nation and by improving the Vernacular literature they would elevate the whole nation." ఇది సత్య మని ప్రాజ్ఞులకుఁ దోఁపకమానదు.

ఈ యభిమానము మనపూర్వులయం దుండె ననుట నిస్సందేహము. నన్నయ్యభట్టు గారు

శ్లో. “స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః
లోకే బహు మన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ”

అని సూత్రించిరి. దీని నప్పకవి యిట్లు తెలిఁగించెను.

మ. నిజదేశంబుల వేషభాషలపయిన్ నిత్యాభిమానస్థులై,
ప్రజమెచ్చన్ రసలుబ్ధబుద్ధు లగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే,
నిజ మంచుం గొని యన్యదేశములవానిన్ మెచ్చ రెవ్వట్టునన్,
గజరాజావన! ప్రస్ఫుటార్థరసముల్ గావంచు నెల్లప్పుడున్.

స్వభాష పరమార్థసాధక మనుటచేఁ బరభాషలు కేవలగర్హ్యము లని నాయభిప్రాయముగాదు. ఉదరపోషణార్థమై, లోకవ్యవహారార్థమై, సత్యాసత్యపరిశీలనము పొంటె, నెన్నిభాషలైన నేరువవచ్చును. అది దోషముగాదు.

క. క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ
ర్హిత మగు నట్లైన నీధరిత్రిని దానిన్
మతిరోసి విడువఁగూడదు
సతతము వ్యవహారహాని సంధిలుకతనన్. అప్పకవి.

అంతియకాని కడుపుకూటివిద్యలనె ప్రధానముగ నెంచి స్వవిద్యకు విముఖుఁ డగుటయే దోషావహము.

పరస్పరసంభాషణమునకు వలసినంత స్వభాషవచ్చినఁజాలదా యన రాదు. తక్కినయన్నిభాషలయందువలె భాషించుటయం దుపయోగించు గ్రామ్యశబ్దంబు లాంధ్రమునందును గ్రంథములం దుపయోగింపరాదు. గ్రంథస్థభాష యాంధ్రదేశంబునం దెల్ల నొక్కటియ. గ్రామ్యభాషయో యన గ్రామమున కొకటి మండలమున కొకటిగ నున్నది. ఒక మండలమున వాడఁబడు గ్రామ్యపదంబులు మఱియొక మండలము వారికిఁ దెలియవు. కావున నే

గ్రామ్యమే గ్రంథముల గర్హ్యము. ఆంధ్రులకెల్లవారికి నిప్పటి వారికేఁ
రాఁబోవువారికిని దెలియవలసిన విషయంబులు వ్రాసియుంచ వలసిన
మనకై పూర్వులు వ్రాసిన భారత రామాయణాదులవలె నుత్తమభాషయ
వ్రాసియుంచవలెనుగాని నిలుకడలేక, నియమహీన మాటచే నిచ్చకొ
మాఱుచుండు గ్రామ్యంబున వ్రాసినచో నది మఱలఁబుట్టి పుచ్చులో
చును. లోకమునకు నిరుపయోగము నగు. ఉత్తమవిషయంబులు చెప్పు
గ్రామ్యంబున వలసినన్ని పదములు లేవు. అట్టివిషయంబు లశుద్ధభాష
వ్రాయఁబూనినఁ బేఁడయు జెల్లము పిసికినట్లగు. సమ్యగ్భంగి విద్య నే
వాఁడేయుపన్యాసంబులందుఁ దత్తత్సందర్భోచిత పదంబులఁ బురాణగ
నుదాహరించి శ్రోతల మనము నాకర్షింపఁ జాలునుగాని పామరుఁ
చేయఁజాలఁడు గ్రామ్యమే శరణం బనువాఁ డుత్తమగ్రంథంబులఁ జ
శక్తిఁ గలవాఁడగునా? కథలునీతులు మతాచారవిషయంబులు గ్రహి
జాలునా? "మానవాధీశ్వర మణువునాలుకగాఁ" డని చదివి యిట్టివాఁ
డునా యనువాని సందేహము "వినుము విదర్భదేశమున వీరుఁడికుండె
అని పరిహరించువాఁ డెట్లు వివేకికాఁగలఁడు? వాగ్మి యెట్లు కాఁగలఁ
గ్రామ్యమునందుఁగల యనేక దోషంబుల గ్రహించియే పూర్వులు '
శబ్దం ప్రయుంజానో రౌరవం నరకం వ్రజే" త్తని శాసించిరి. ఉపన్యాస
స్వభాషఁ జక్కఁగ నేర్చియుండవలయుననుట గుఱించి రెవరెండువిక
యను క్రైస్తవమతబోధకుఁడు "స్వదేశీయులైనను బరదేశీయులైనను
భాషయందు భాషించు బోధించువారు తగినంతయోగ్యత గలవారు గ
డుట కొకకారణ:మా దేశభాషయొక్క సంపత్తి బలమును మిశ్రముగ గ్రహి
యుండుటే" యనియు, "లాటిన్ గ్రీకుభాషలయందొక పద్య కావ్య
జదువనివాఁ డాభాషయందుఁ దనకు జ్ఞానముగలదని యెట్లనుకొనఁగలఁ" డని
వ్రాసియున్నాఁడు. ఇది నిర్వివాదవిషయము. స్వభాష నలక్ష్యపఱిచి

జే కాలము గడపువారు కొందఱు వ్యవహారదశలలో [illegible]
మానపడుదురో యొకటి రెండు దృష్టాంతములచే [illegible]
కానొక దొరవారియొద్ద కొక రైతు వచ్చి తనచేనికిఁ బో పుత్రోవలోఁ
క్రొత్తగ నిఱుకుమ్రానునాటి పశువులుపోవ నిబ్బంది కలుగఁజేసి
చెప్పుకొనఁగా నాదొరవారదియేమని వారిమునిషీగారి నడిగిరి. ఆము
"Sir, this man complains that the defendant has
planted a kind of tree called Irukumanu in the way
is obstructed his cattle from going to his field
l." వేఁపమ్రాను చింతమ్రానువలె నిఱుకుమా నొకచెట్టనుకొని
చెట్టు నాటినాఁడను భాషాంతరీకరించిచెప్పిరి. దొరవారు, ఇది యఱ
చెట్టునొకఁడు పెఱికికొనిరాఁగలఁడా దానినాటుటకువల్ల పడునా?"
మునిషిగారు "చిన్నచెట్టేమో?" దొరవారు, "చిన్నచెట్టైనఁ జుట్టు
వచ్చును గదా. అది పశువులకడ్డమా?" యన మునిషీగారు దొరవారి
యము రైతుతోఁ దెల్పఁగా రైతు "చెట్టునాటినాఁడని యెవరుచెప్పి
' యనెను. మునిషీగారి యదృష్టవశమున నచటనున్న మఱియొకరు
యమును దొరవారి కెఱింగించిరి. ఇట్టులే మఱియొకరు నిఘ్రాయి
ను తెలియక యవమానపడిరి. [1]ఆంధ్రభాషాకోవిదుల మనుకొనునొకరు
సుదానములో నావులు మేయుచుండఁగా' నని బాలుర కుక్తలేఖ
జెప్పుచో 'దా' మాఱుగ 'థ' నుచ్చరించి పరిహాసపాత్రులయిరి. నేను
యమని వ్రాయ దానిని ఛోత్రియమనిసవరించినట్టియు నా పేరు సుభ
(శుభ సుభలకు భేదము తెలియక సుభయనుటే సాధువని యదియే
మ్రముగ 'సుబ్బ' యనెదరని, తాను శుద్ధముగ వ్రాయువాఁడనని నాకుఁ
గారి) వ్రాయుచుండిన తహాశీలుదారునొద్ద నేను రివిన్యూ ఇన్ స్పెక్టర్

---

[1] ఇట్టులే సన్నజీవము లనఁగా lean animals అనియు అన్నపత్ర
a elder brother's choultry అనియు ననినవారు గలరు.

గుగ నుండికవాఁడను. ఇట్టి ప్రహసనపాత్రము లెన్నియేని గలవు. వీరే స్వభాషాజ్ఞానావశ్యకత్వమును స్థాపించువారు.

కులటయగు మాతకన్నఁ బతివ్రతయగుమాత యెక్కుడుపూజ్యురాలైనట్లు గ్రామ్యభాషకన్న లాక్షణికభాషయే ప్రశస్తమని బుద్ధిమంతు లెల్ల నంగీకరింతురు. అట్టి సలక్షణభాష నుపేక్షించినచోఁ గలుగుననర్థములు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతి సంక్షేపించెదఁ గాని శుద కాంధ్రము నామానశిష్ట మగు. ఎట్టిభాషయైనను దజ్జాతీయులచే రక్షణీయ యగుచుండ "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యని యీదేశంబునను "Italian of the East" అని పరదేశంబులను బ్రసిద్ధిగాంచిన యాంధ్రభాష యవశ్యరక్షణీయ యనుట యేమేధావి నిరాకరించును? 'మదరాసుస్టాండర్డు' పత్రిక యందొకఁ డాంగ్లభాషాపరీక్షలఁ గృతార్థులుగాని కన్యకల కివాహమాడరాదని బాలురకు బోధించెను. మనకన్యలకు నాంగ్లభాషాపరీక్ష లనావశ్యకములు. బాలురకు దేశభాషాజ్ఞాన మావశ్యకము గావునఁ గన్యలంబలు దేశభాషాజ్ఞానము చక్కఁగ లేని పురుషుల నిరాకరించినచో మనదేశ మచిరకాలంబున వృద్ధియగు. విద్యార్థులు దేశభాషల నుపేక్షించుటయందు వారి తల్లిదండ్రులే దూష్యులని నాయభిప్రాయము. తమబాలు రేమి చదువుచున్నారో యెట్లు చదువుచున్నారో వారు విచారించు కొనుచుండిన ననేకానర్థకములు దొలఁగును. పాఠశాలకు బాలురఁబంపినంతనే తమభారము దొలఁగినదని పెద్దవా గనుకొనుట వెఱ్ఱితనము. స్వభాషాగ్రంథమేదైనను స్వతంత్రించి చదివి యర్థము గ్రహించునంతటి శక్తివచ్చునటులు చేయుట పెద్దవారికివిధి. అంత మాత్రము కనిపెట్టినచో ననేక శుభంబులు పొసఁగు; విపర్యయంబైనచో ఫలము విపరీతము." ఆంధ్రపత్రిక, సంపత్సరాది సంచిక.